ఆంధ్రానువాద సహితమ్

# పఞ్చతన్త్రమ్

(మిత్రభేదం, మిత్రప్రాప్తికం చ)

అనువాదకః

శ్రీ జీరెడ్డి బాలచెన్నారెడ్డి

632
R8

భాషా ప్రచార సమితిః

[illegible] -4

4-743, (2వ అంతస్తు)

నాంపల్లి స్టేషన్ రోడ్డు [illegible]

హైదరాబాద్ - 500 001.

Acc. No. 24770 ~~24770~~

శ్రీ విష్ణుశర్మణా విరచితమ్

# పఞ్చతన్త్రమ్

ఆంధ్ర తాత్పర్య సహితమ్

(మిత్రభేదం, మిత్రప్రాప్తికం చ)

73
3-97

అనువాదకః
శ్రీ జీరెడ్డి బాలచెన్నారెడ్డి

భాగ్యనగరే వేంకటరమణ నగర స్థితయా
సంస్కృత భాషా ప్రచార సమిత్యా
ప్రకాశితమ్
1988

సంస్కృత భారతీ గ్రంథమాలా : ద్వావింశతితమం పుష్పమ్

సర్వస్వామ్య సంకలితమ్

891.231
115

ప్రథమ ముద్రణమ్
2000 ప్రతయః

మూల్యమ్ : రూ. 28-00

ప్రాప్తిస్థానమ్ :
సంస్కృత భాషా ప్రచార సమితిః
సంస్కృత భాషా ప్రచార సమితి, హైదరాబాదు.
5-4-743 (2వ అంతస్తు)
నాంపల్లి స్టేషన్ రోడ్డు ఎదురుగా
హైదరాబాద్ - 500 001.

ముద్రణ : ఆర్. కె. ప్రింటర్స్
11-2-1124, నాంపల్లి, హైదరాబాద్-1

శ్రీః

# ప్రస్తావన

భారతీయ వాఙ్మయంలో నీతి కథాశాఖ అతిప్రాచీనమైనది. క్రీస్తు శకానికి పూర్వమే ఇది బహుళ ప్రచారంలో ఉన్నట్లు చెప్పడానికి తగిన ఆధారాలు ఉన్నాయి. క్రీ. పూ. 150 సంవత్సరాల ప్రాంతం వాడైన పతంజలి మహాభాష్యంలో "అజాకృపాణీయమ్" ''కాకతాలీయమ్'' ఇత్యాదిపదాల అర్థాలను స్పష్టీకరించే విధానాన్ని పట్టి చూస్తే ఇలాంటి కథలు ఆ నాటికే చాలా ప్రచారంలో ఉన్నట్లు స్పష్టం అవుతుంది. దురాశ చేత బంగారుగ్రుడ్లు పెట్టే పక్షిని చంపినట్లు వర్ణించే కథనుగూర్చి మహాభారతంలో నిర్దేశం ఉన్నది. కొన్ని నీతులు బోధించడానికి ఉద్దిష్టమైన ఈ కథలు గద్యంలో ఉంటాయి. మధ్యమధ్య, చెప్పిన విషయాలను సమర్థించుకోవడం కోసం రామాయణ భారతాదులనుంచీ, మన్వాది స్మృతులనుంచీ శ్లోకాలను ఉదాహరించడం జరుగుతుంది. ఒక కథ చెప్పుకుపోతూ ఉండగా ప్రసక్తాను ప్రసక్తంగా దానిలో ఎన్నో అవాంతర కథలు వస్తూ ఉంటాయి. ఈ అవాంతర కథలు ప్రధానకథ ప్రతిపాదించే నీతికే సంబంధించి ఉంటాయి. ఈ భారతీయ నీతి కథా సంప్రదాయాన్నే అనుసరిస్తూ ఇతర దేశాలలో కూడా "అరేబియన్ నైట్సు'' వంటి కథలు ప్రచారంలోనికి వచ్చాయి.

రాజ్యానికి సంబంధించిన కార్యకలాపాలలోను, దైనందినవ్యవహారాలలోను, మానవుడు అనుసరించవలసిన నీతిని బోధించడం ఈ కథల ప్రధానోద్దేశ్యం. ఈ కథలలో పశుపక్ష్యాదులు మానవులవలె మాటలాడుకొంటూ, వ్యవహరిస్తూ ఉంటాయి. ఇలాంటి కథలు బౌద్ధుల జాతక కథలలో కూడా చాలా ఉన్నాయి. బౌద్ధమతానికి సంబంధించిన కొన్ని సిద్ధాంతాల ప్రాశస్త్యాన్ని బోధించడం వాటి ప్రధానోద్దేశ్యం.

నీతి కథలలో ముందుగా చెప్పుకోదగినవి పంచతంత్రము హితోపదేశము అనే గ్రంథాలు. పంచతంత్రం అతి ప్రాచీనమైనది. అందు చేతనే దానికి ప్రాంతభేదాలను బట్టి అనేక పాఠభేదాలు ఉన్నాయి. అయితే వీటి కన్నింటికి మూలం ఒకటి ఉండి ఉంటుంది అనీ, అది ఈనాడు లభ్యం కాదనీ విమర్శకుల ఊహ. పర్షియా దేశ

ప్రభువైన నాషిర్వాన్ ఆదేశంచేత అతని వైద్యుడైన బర్జో అనే పండితుడు ఈ మూల పంచతంత్రాన్ని క్రీస్తు శక ప్రారంభ శతాబ్దాలలో పహ్లావీ భాషలోనికి అనువదించాడు. క్రీ.శ. 570 సంవత్సరంలో ఈ పహ్లావీ పంచతంత్రాన్ని సిరియా భాషలోనికీ, 750 సంవత్సరంలో అరబ్బీ భాషలోకీ అనువదించడం జరిగింది. కాలాంతరంలో యూరపుదేశ భాషలన్నింటిలోకీ వచ్చిన అనువాదాలన్నీ ఈ అరబ్బీ అనువాదం మీద ఆధారపడి ఉన్నాయి. క్రీ.శ. 1100 ప్రాంతంలో హెబ్రూ భాషలోనికీ, 1250 ప్రాంతంలో లాటిన్ భాషలోనికీ, 1480లో జర్మన్ భాషలోనికీ, 1552 ప్రాంతంలో ఇటాలియన్ భాషలోకీ, 1678లో ఫ్రెంచి భాషలోకీ, 1080లో గ్రీకు భాషలోకీ, 12వ శతాబ్దంలో పెర్శియన్ భాషలోనికీ పంచతంత్రం అరబ్బీ భాషానువాదం ద్వారా అనువదించ బడింది. మూల పంచతంత్రమూ, దాని పహ్లావీ అనువాదమూకూడా లభ్యం అవడం లేదు. అయితే పహ్లావీ అనువాదం 570లో సిరియన్ భాషానువాదానికి మూలం అవ డాన్ని పట్టి మూల పంచతంత్రం 570కి చాలా శతాబ్దాలకుపూర్వమే ఉండిఉండాలని నిర్ధారణపూర్వకంగా చెప్పవచ్చును. అనగా పహ్లావీ అనువాదం క్రీ.శ. మూడవ శతాబ్దానికి చెందిఉంటుందనీ తన్మూలమైన సంస్కృత గ్రంథం కనీసం దానికి రెండు మూడు శతాబ్దాల పూర్వం ఉండిఉంటుందనీ ఊహించవచ్చును.

మూల పంచతంత్రం కాశ్మీర్‌దేశంలో పుట్టినదనీ కొందరూ, మగధలో పుట్టినదని కొందరూ ఊహిస్తున్నారు. పహ్లావీ పాఠానికి (పంచతంత్రానికి) "కలిలాగ్-దమనాగ్" అనీ, దానినుండి వచ్చిన అరబ్బీ అనువాదానికి "కలిలాహ్ దమ్నాహ్" అనీ పేర్లు ఉండడంచేత మూల సంస్కృత పంచతంత్రానికికూడా "కరటక దమనక" అని పేరు ఉండిఉంటుందని కొందరి పండితుల అభిప్రాయం. మిత్రభేదం అనే మొదటి తంత్రంలో ప్రధాన పాత్రలైన రెండు నక్కల పేర్లు కరకట-దమనకులు. వాటి పేరునుబట్టి మొదటి తంత్రానికి ఆ పేరుపెట్టడం ఉచితమే అయినా మొత్తం గ్రంథానికి ఆ పేరు పెట్టడంలో ఔచిత్యం లేదు. అందుచేత పహ్లావీ అనువాదం మొదటి తంత్రానికి మాత్రమే చేయబడినదని దానినిపట్టి ఊహించవచ్చునేమో. ఏది ఏమైనా బలవత్ప్రమాణాంతరం ఏదీ లేకపోవడంచేత 'పంచతంత్రం' అనేదే దీని ప్రాచీనతమ నామధేయంకూడా అని చెప్పడంలో తప్పులేదు. ఆయా ప్రాంతాలకు అనుగుణంగా ఉండేటట్లు కొన్ని చిన్నచిన్న మార్పులు చేయడంచేత అనేక పాఠాలు లభిస్తున్నా మూల

పంచతంత్రం లుప్తమైపోయినదని చెప్పవలసిన పనిలేదు. దాని స్వరూపాన్ని గూర్చి సిరియా-అరబ్బీ భాషలలోని గ్రంథాలమీదకూడా ఆధారపడనవలసిన పనిలేదు. ఎందుచేతననగా పంచతంత్రంలో ఐదు తంత్రాలు (భాగాలు) మాత్రమే ఉంటే సిరియా పాఠంలో పది భాగాలు అరబ్బీ పాఠంలో ఇరవై రెండు భాగాలు కనబడుతున్నాయి. దీనిబట్టి అనువాదకులు సంస్కృత మూలమునుండి విషయం సేకరించి తమతమ అవసరాలకు అనుగుణంగా విభాగాదులు చేసిఉంటారని అనుకోవచ్చును.

'తంత్ర' శబ్దానికి 'నీతి' లేదా 'విధానము' లేదా 'ఉపాయము' అని అర్థం. పంచతంత్రంలో మిత్రభేదము, మిత్రప్రాప్తికము, కాకోలూకీయము, లబ్ధప్రణాశము, అపరీక్షితకారకము అని ఐదు తంత్రాలు ఉన్నాయి. ఇద్దరు ఘనిష్ఠమైత్రీవంతుల మధ్య విరోధం పుట్టించడం మిత్రభేదములోని విషయం. మిత్రప్రాప్తికంలో సన్మిత్రుడు లభించడంవల్ల కలిగే లాభాలు వర్ణింపబడినవి, ఇద్దరు శత్రువులమధ్యఉండే వైరమూ, దానివల్ల యుద్ధమూ, జయాపజయాలూ మొదలైన విషయాలు సహజ శత్రుత్వంగల కాకులనూ గుడ్లగూబలనూ పాత్రలుగా గ్రహించి కాకోలూకీయంలో వర్ణించడం జరిగింది. ఈ తంత్రానికి 'విగ్రహం' (విరోధము) అనే నామాంతరంకూడా ఉన్నది. మానవుడు తెలివితక్కువతనంచేత లభించినదానిని ఎలాపోగొట్టుకుంటాడో లబ్ధప్రణాశంలో వర్ణింపబడినది. చివరిదైన అపరీక్షితకారకంలో లాభనష్టాలను సరిగా అంచనా వేసుకోకుండా పనులుచేస్తే ఏవిధంగా బెడిసికొడుతుందో వర్ణింపబడింది. ఐదు తంత్రాలలో ఈ ఐదు విషయాలనూ ప్రధానంగా ఉంచుకొని వాటికి తగిన కథలు ప్రసక్తాను ప్రసక్తంగా చేరుస్తూ నీతి ప్రతిపాదకాలైన ఎన్నో శ్లోకాలు ఉదాహరిస్తూ ఈ గ్రంథం రచించబడింది. వివిధ పాఠాలలో ఉన్న భేదం అంతా కొన్ని కథలలోనూ, శ్లోకాలలోనూ మాత్రమే.

ఇపుడు మనకీ గ్రంథం 'తంత్రాఖ్యాయిక' 'పంచతంత్రం' అనే రెండు పేర్లతో, రెండు పాఠాలలో లభ్యం అవుతున్నది. సిరియా భాషానువాదం తంత్రాఖ్యాయికకు చాలా దగ్గరగా ఉంటుంది. తంత్రాఖ్యాయికకు కాశ్మీరదేశం ఆవిర్భావ స్థానం. పంచతంత్రానికి అనేక పాఠాలు ఉన్నాయి. పంచతంత్రానికి సంబంధించిన కథలు కొద్ది మార్పులు చేర్పులతో బృహత్కథామంజరి, కథాసరిత్సాగరాలలో ఉన్నాయి.

క్రీ.శ. 1100 సం॥లో జైనులు రచించిన పంచతంత్రంలో కొన్ని కథలు మార్చడం, క్రొత్తవిచేర్చడం జరిగింది. 1199 ప్రాంతంలో పూర్ణభద్రుడనే జైనపండితుడు తంత్రాఖ్యాయికను, పైన చెప్పిన జైన పంచతంత్రాన్నీ ఆధారంగా చేసుకొని 'పంచాఖ్యానకం' అనే పేరుతో ఒక పంచతంత్రం రచించాడు. 1660 ప్రాంతంలో మేఘవిజయగణి అనే జైనపండితుడు కొన్ని మనోహరమైన క్రొత్త కథలు చేర్చి 'పంచాఖ్యానోద్ధారం' వ్రాశాడు. దక్షిణదేశంలోకూడా కొన్ని పంచతంత్ర పాఠాలు ఉన్నాయి. దీనిలో కాళిదాస-భారవ్యాదుల శ్లోకాలను ఉదాహరించడంచేత ఇవి క్రీ.శ. 600కు పూర్వం రచింపబడిఉన్నాయని చెప్పవచ్చును. నేపాల దేశంలోఉన్న పంచతంత్రం చాలావరకు శ్లోకరూపంలో ఉన్నది. దీనికి దక్షిణదేశంలో 'పంచతంత్రం' అనీ, ఉత్తరదేశంలో 'పంచాఖ్యానకం' అనీ పేర్లు. తరవాత వచ్చిన 'శుకసప్తతి' 'వేతాలపంచవింశతి' మొదలైన కథాగ్రంథాలమీద పంచతంత్ర ప్రభావం అత్యధికంగా కనబడుతుంది. నాలుగు భాగాలలోఉన్న హితోపదేశం పంచతంత్రానికి మరొక రూపమే. ఆధునికయుగంలో పంచతంత్రానికి అన్ని భాషలలో ఎన్ని అనువాదాలు బయలుదేరినాయో చెప్పడం చాలా కష్టమైన పని. అవి అసంఖ్యాకములు. ఈ విధంగా అతిప్రాచీనకాలంనుంచి నేటివరకు అనేక భాషలలోనికి అనూదితమైన ఈ పంచతంత్రం ముద్రిత ప్రతుల సంఖ్యనుబట్టి చూడగా ప్రపంచకంలో దీని స్థానం రెండవదని (వివిధ భాషలలో ముద్రించిన బైబిలు స్థానం ప్రతుల సంఖ్యనుబట్టి మొదటిది) అంటారు.

ప్రస్తుతం బహుళప్రచారంలో ఉన్న పంచతంత్రాన్ని రచించినవాడు విష్ణుశర్మ అనే పండితుడనీ, దక్షిణాపథంలోని మహిలారోప్యనగరానికి రాజైన అమరశక్తి కుమారులకు రాజనీతి నేర్పడానికై ఆ రాజు ప్రార్థనచేత ఈ గ్రంథం రచించినాడనీ కథాముఖంలో చెప్పబడిఉన్నది. అందుచేత ఈ పంచతంత్రం దాక్షిణాత్యపాఠం అని చెప్పవచ్చును. పంచతంత్రం ఇక్కడనే ఆవిర్భూతమై కొన్ని మార్పులు చేర్పులతో విభిన్నరూపాలలో ఇతర ప్రాంతానికి వెళ్ళిఉంటుందని చెప్పడానికికూడా అవకాశం లేకపోలేదు.

లోకవ్యవహారజ్ఞానం కలిగించే మనోహరమైన కథలతో-ఈ కథలలో చాలావరకు మృగపక్ష్యాదులు పాత్రధారులవడంచేత వీటి మనోహరత్వం ఇనుమడించినట్లున్నది-

ప్రాచీనగ్రంథాలనుండి సేకరించిన ఉత్తమమైన నీతి శ్లోకాలతో, పఠితలకు ఆనంద పారవశ్యాన్ని కలిగించడంతోపాటు వారిని ఉత్తమ పౌరులుగాకూడా దిద్దగలిగిన ఈ పంచతంత్రం ప్రతి ఒక్కడూ చదవవలసిన గ్రంథం. దీనిలోని ప్రతి ఒక్క శ్లోకముకూడా కంఠస్థంచేసి ఆజీవితాంతం తొలగిపోకుండా రక్షించుకోవలసిన రత్నం. జీవితంలో ఎదురయ్యే ఏ సమస్యకైనా ఏదో ఒక పరిష్కారమార్గం ఈ నీతి శ్లోకాలలో కనుక్కోవచ్చును. ఇవి స్థిరమైన సంకల్పాన్నీ మనోబలాన్నీ ఇస్తాయి

సంస్కృత భాషలో ఉన్న జనసామాన్యానికి ఉపయోగించే కొన్ని ఉత్తమ గ్రంథాలను తెలుగు అనువాదంతో ప్రచురించాలని ఈ మధ్య సంస్కృత భాషా ప్రచార సమితి నిర్ణయం తీసుకోవడం జరిగింది. తదనుసారంగా అలాంటి గ్రంథాల కోవలో ప్రథమ గణనీయమైన పంచతంత్రాన్ని ప్రచురించాలనే ఉద్దేశ్యంతో తమను కోరగానే మా ప్రార్థనను అంగీకరించి ఈ పంచతంత్రానికి చక్కని తెలుగు అనువాదం నంతరించి ఇచ్చిన ఉత్తమ సంస్కృత పండితులు శ్రీ జీరెడ్డి బాల చెన్నారెడ్డిగారికి సమితి పక్షాన కృతజ్ఞత తెలియపరుస్తున్నాను. కాకోలూకీయం, అపరీక్షితకారకం, లబ్ధ ప్రణాశం అనే మిగిలిన మూడు తంత్రాలతో రెండవ సంపుటం అచిరకాలంలో వెలువడ నున్నది. ఆంధ్రానువాద సహితమైన ఈ పంచతంత్రం తెలుగునాట ఇంటింటా నైతిక జ్ఞానజ్యోతిని ప్రసరింపచేయగలదని ఆశిస్తున్నాను.

పుల్లెల శ్రీరామచంద్రుడు
కులపతి
సంస్కృత భాషా ప్రచార సమితి

హైదరాబాదు.
12-11-1988

# వినతి

పంచతంత్రం-అనే పేరునుబట్టియే ఇందు అయిదు తంత్రాలు గలవని పాఠకులు తేలికగా గ్రహింపగలరు. ఇది సరల సంస్కృతభాషలో విరచితం.

1. గ్రంథప్రశస్తి :-

ఇయ్యది భారతీయ సాహితీజగత్తునందేగాక విశ్వసాహితీ ప్రపంచంలోనే ఒక విశిష్టస్థానంతో విరాజిల్లుతూంది. గ్రీక్-అరబ్బిక్-జర్మన్-ఇంగ్లీషు-ఫ్రెంచ్ మొదలైన ప్రసిద్ధ సభ్యభాషలన్నింటిలోనికి ఇది అనువాదం పొందడమే ఇందుకు నిదర్శనం. వీటిలో జర్మన్-ఫ్రెంచి-ఇంగ్లీషు అనువాదాలు పలుమారులు ముద్రితాలైనట్లు సాహితీ వేత్తలందురు.

2. కథాసాహిత్యం-పంచతంత్రం :-

సంస్కృత భాషలో కథాసాహిత్యానికి ఒక ప్రత్యేకత గలదు. ఋగ్వేదంలోని మను-మత్స్యసంవాదంచే దీని ప్రాచీనత వెల్లడియగుచున్నది. ఇక తర్వాత వచ్చిన బృహత్కథ, కథాసరిత్సాగరం మొదలైనవి దీని విస్తృతరూపాలు అనవచ్చును. ముఖ్యంగా కథాసాహిత్యాన్ని మూడు విధాలుగా విభజిస్తారు. 1. నీతికథలు 2. చారిత్రక కథలు 3. వినోద కథలు.

ఈ పంచతంత్ర కథలలో నీతి, వినోదం రెండూ ఉన్నాయి. గద్య పద్య మిశ్రమంగా ఈ కథలు సాగాయి. గద్యభాగంలో కథనడుస్తుంది. పద్యభాగంలో సామాన్యంగా చిన్నచిన్న ఛందస్సులతోడి శ్లోకాలతో గంభీర నీతివిషయాలు బోధింపబడినాయి. చారిత్రక-పౌరాణిక పాత్రలకంటె భిన్నమైన విశుద్ధ-కాల్పనిక-పాత్రల ద్వారా కథలు నడిచాయి. ఇదియొకవిచిత్ర-కాల్పనిక జగత్తుగా తోస్తుంది. సంఘటనా-వైచిత్ర్యంతోబాటు పాత్ర - వైచిత్ర్యం హాస్య- వ్యంగ్య-వినోద - భరితంగా ఉంది. పాత్రలపేర్లు వాటిగుణాలకు యోగ్యంగా ఉన్నాయి. ఒకనీతివాక్యం నుండి ఇంకొకనీతి వాక్యం, ఒక నీతికథనుండి మఱియొక నీతికథ ఉద్భవిస్తూ రసమయంగా హృదయాన్ని స్పందింపజేస్తున్నాయి. ఇందలి పాత్రలుచాలవరకు పశువులు పక్షులుగానే గలవు. కొన్నియెడల ఆధ్యాత్మిక-విషయాలను సరళంగా బోధించడం జరిగింది.

3. కవి – దేశం – కాలం – పాండిత్యం :–

ఈ పంచతంత్ర రచయిత శ్రీవిష్ణుశర్మ అనియు, అతడు తన ఎనుబది యేండ్ల పరిణత వయస్సులో ఈ గ్రంథం రచించెననియు గ్రంథారంభ పీఠికవలన తెలియుచున్నది.

"అస్తి దాక్షిణాత్యే జనపదే మహిలారోప్యం నామ నగరమ్"– ఇత్యాదిగా పలుమారులు దక్షిణ దేశ ప్రశంస ఉండడంతో ఇతడు దాక్షిణాత్యుడు అని కొందరు అందురు. కాని స్ఫుటంగా దేశనిర్ణయం చేయడానికి తగిన ఆధారం గనబడదు. మహిలారోప్య నగరం ఎచ్చట గలదో తెలియదు.

ఇలాగే కాలాన్ని సైతం ఇదమిత్థంగా నిర్ణయించడానికిని తగిన ఆధారాలు లేవు. ఇందు పేర్కొనబడిన అమరశక్తి భూపాలుడు ఏకాలంవాడో తెలియదు.

"విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తుమసాంప్రతమ్"

"చతుర్థోపాయ సాధ్యే తు రిపౌ సాన్త్వమపక్రియా"

ఇత్యాది కాలిదాస-మాఘాది శ్లోకోల్లేఖాదులవలన వారికంటె అర్వాచీనుడన వచ్చును. ఇతడు ఈ గ్రంథందప్ప వేఱేగ్రంథం రచించినట్లు ఈ గ్రంథంలో ఎచ్చటా సూచింపబడలేదు.

ఇతడు పీఠికలో అమరశక్తి భూపాలుని మంత్రిద్వారా తన యోగ్యతను–

"తదత్రాఽస్తి విష్ణుశర్మానామ బ్రాహ్మణః సకలశాస్త్ర పారఙ్గమః" అని ప్రకటించుకొన్నాడు.

అయితే ఈ గ్రంథం పఠించినవారికి ఇది అతిశయోక్తి గాదనియే తోచును.

శ్లో. యది భిన్తే సూర్యసుతో రోహిణ్యాః శకటమిహ లోకే
ద్వాదశవర్షాణి తదా నహి వర్షతి వాసవో భూమౌ. (మిత్రభేదే-223-శ్లోకః)

ఇత్యాదుల ద్వారా ఇతని జ్యోతిషాదిశాస్త్రపాండితి ప్రకటితం అవుతుంది.

4. సాంఘిక విషయం :–

ఇక ఉపనిషద్యుగం తర్వాత అనగా పౌరాణికయుగం నుండి నేటి ఇరువదియవ శతాబ్దంలోని శ్రీరాజారామమోహనరాయలు, శ్రీకందుకూరి వీరేశలింగంపంతులు గారు మొదలైన సంఘసంస్కర్తలకు ముందుండిన కవులు అందరు స్త్రీని నిందించిన వారుగానూ, స్త్రీని భోగ్యపదార్థంగా భావించినవారుగానూ గనబడుచున్నారు.

"న జానే భోక్తారం కమిహాసముపస్థాస్యతి విధిః"-అని మహాకవి కాళిదాసే అన్నాడు. అట్టియెడ నాటి సాహిత్యంనందువలె, ఇందూ స్త్రీనింద అధికంగా చేయ బడింది.

చేతులు రెండు కలిస్తేనే శబ్దం సంభవిస్తుంది. అట్టియెడ స్త్రీలను మాత్రమే దుశ్శీలతకు నిలయంగా చిత్రించి దూషించడం అంత సముచితంగాదు. అని నేటి విమర్శకులు అందురు.

ఏమైనా నాటిసంఘాన్ని రచయిత ఇందు ప్రతిఫలింపజేశాడు. ఇందుకు అతడు అంతగా బాధ్యుడుగాదని తోచును.

**5. ఆన్ధ్రానువాద విషయం :-**

ప్రపంచంలోని నాగరిక భాషలన్నింటిలోనికి అనువాదం పొందిన ఈ ప్రసిద్ధ గ్రంథం సమగ్రంగా మూలసహితంగా ఆంధ్రానువాదంతో ఇంతవరకు ప్రచురింపబడ లేదు. శ్రీ వరవస్తు చిన్నయసూరిగారు, శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు సంగ్రహంగా వచనరూపంలో కొంత కొంత వ్రాశారు. కానీ వాటివలన సమగ్ర మూల గ్రంథ పరిచయం గల్గదు. అందువల్ల ఈ గ్రంథం సమగ్రమూలగ్రన్థపరిచయంతో బాటు కొంతవరకు సరళమై సంస్కృతభాషను అభ్యసించడానికినీ దోహదం చేయ గలదు.

మహాదాతలు సాహిత్యాభిమానులు అయిన మా బావగారు శ్రీ గుణంపల్లె పుల్లారెడ్డిగారు వారి సతీమణి మా అక్కగారు అయిన చి. ల. సౌ. నారాయణమ్మగారు, వారి అల్లుడు శ్రీ పాలగిరి సుబ్బారెడ్డిగారు నాపై ఎంతో అభిమానంతో సంస్కృత భాషాప్రచారసమితి-హైదరాబాద్ వారికి నన్ను పరిచయంచేసి ఈ అనువాదంచేసే శుభయోగం గల్గించారు. వారికిని మరియు ఈ విషయంలో ఎంతగానో సహకరించిన సంస్కృతభాషా ప్రచార సమితి కులపతి ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడుగారు, కార్య దర్శి బ్రహ్మశ్రీ చి. వెంకట సుబ్రహ్మణ్యంగారికి, ఉపసమితి సభ్యులకు కృతజ్ఞతా పూర్వకమైన ప్రణామములు సమర్పిస్తున్నాను.

ఆంధ్ర సాహితీలోకం దీనిని ఆదరింతురని ఆశింతును.

ఇట్లు
గురుజన విధేయుడు
అనువాదకుడు
(విభవ దీపావళి)
**శీరెడ్డి బాలచెన్నారెడ్డి**

# విషయ సూచిక

## మిత్రభేదమ్

## మిత్రప్రాప్తికమ్

# పఞ్చతన్త్రమ్

# మిత్రభేదమ్

## తత్ర కథాముఖమ్

## మఙ్గలాచరణమ్

శ్లో. బ్రహ్మా రుద్రః కుమారో హరివరుణయమా వహ్నిరిన్ద్రః కుబేర
శ్చన్ద్రాదిత్యౌ సరస్వత్యుదధియుగనగా వాయురుర్వీభుజఙ్గాః.
సిద్ధా నద్యోఽశ్వినౌ శ్రీర్దితిరదితిసుతా మాతరశ్చణ్డికాద్యాః
వేదాస్తీర్థాని యజ్ఞా గణవసుమునయః పాన్తు నిత్యం గ్రహాశ్చ. 1

అనువాదం. బ్రహ్మ శివుడు కుమారస్వామి విష్ణువు వరుణుడు యముడు అగ్నిదేవుడు ఇంద్రుడు కుబేరుడు చంద్రుడు సూర్యుడు సరస్వతీదేవి సముద్రాలు యుగాలు పర్వతాలు వాయుదేవుడు భూదేవి నాగదేవతలు సిద్ధులు నదులు అశ్విని కుమారులిర్వురు లక్ష్మీదేవి దితి అదితిపుత్రులైన దేవతలు చండిక మొదలైన మాతృదేవతలు వేదములు పుణ్యతీర్థాలు యజ్ఞాలు ప్రమథాది గణదేవతలు అష్టవసువులు మునులు గ్రహాలు మమ్ము సర్వదా రక్షించుగాక.

శ్లో. మనవే వాచస్పతయే శుక్రాయ పరాశరాయ ససుతాయ
చాణక్యాయ చ విదుషే నమోఽస్తు నయశాస్త్రకర్తృభ్యః. 2

అ. మనువునకు బృహస్పతికి శుక్రునకు పుత్రుడైన వేదవ్యాసునితో కూడిన పరాశరునికి మహావిద్వాంసుడైన చాణక్యునికి ఇతరులైన నీతిశాస్త్రకర్తలకందరకును నా నమస్కారము.

శ్లో. సకలార్థశాస్త్రసారం జగతి సమాలోక్య విష్ణుశర్మేదమ్
తన్త్రైః పఞ్చభిరేతచ్చకార సుమనోహరం శాస్త్రమ్.

అ. విష్ణుశర్మ ప్రపంచంలో లభించే సమస్త నీతిశాస్త్రాలు పరిశీలించి వాటి కన్నిటికి సారరూపంగా అయిదు తంత్రములతో సుమనోహరరీతిని ఈ శాస్త్రమును రచించెను.

## పఞ్చతన్త్రే—కథాప్రస్తావనా

## గ్రన్థారమ్భః

మూలమ్. తద్యథాఽనుశ్రూయతే- అస్తి దాక్షిణాత్యే జనపదే మహిలారోప్యం నామ నగరమ్.తత్ర సకలార్థికల్పద్రుమః ప్రవర-ముకుట-మణి-మరీచి మఞ్జరీ-చర్చిత-పాదయుగళః సకలకలాపారంగతోఽమరశక్తిర్నామ రాజా బభూవ. తస్య త్రయః పుత్రాః పరమదుర్మేధసో బహుశక్తిరుగ్రశక్తిరనన్తశక్తి శ్చేతి నామానో బభూవుః.

అ. ఇట్లు శ్రవణపరంపరగా వినబడుచున్నది— దక్షిణాపథంలో మహిలారోప్యం అనే ప్రసిద్ధమైన నగరం ఉంది. ఆ నగరంలో సమస్తయాచకులకు కల్పవృక్షం వలె కోరినవన్నీ తీర్చువాడూ- ఉత్తములైన రాజుల కిరీటాలలోనిమణుల కాంతులనెడి పుష్పగుచ్ఛాలచే పూజితమైన పాదద్వయం కలవాడూ సకలకళాప్రవీణుడూ అయిన అమరశక్తి అనే రాజు ఉండేవాడు. అతనికి పరమమూర్ఖులైన బహుశక్తి ఉగ్రశక్తి అనంతశక్తి- అనే ముగ్గురు పుత్రులు ఉండిరి.

మూ. అథ రాజా తాన్ శాస్త్రవిముఖానాలోక్య సచివానాహూయ ప్రోవాచ- 'భోః జ్ఞాతమేతద్భవద్భిర్యన్మమైతే పుత్రాః శాస్త్రవిముఖా వివేకరహితాశ్చ. తదేతాన్ పశ్యతో మే మహదపి రాజ్యం న సౌఖ్యమావహతి.

అ. అంత రాజు,పుత్రులను శాస్త్రపఠనమునందు ఆసక్తిలేనివారినిగా గుర్తించి మంత్రులను పిలిచి ఇలా అన్నాడు—'నా పుత్రులు శాస్త్రవిముఖులూ, వివేకహీనులూ

అని మీరు గ్రహించియే ఉందురు. ఇందుచే ఇలాంటి వీరిని చూస్తూ ఉంటే నాకు ఇంత గొప్ప రాజ్యంగూడ సుఖాన్ని గల్గించడంలేదు.

మూ. అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. అజాతమృతమూర్ఖేభ్యో మృతాజాతౌ సుతౌ వరమ్
యతస్తౌ స్వల్పదుఃఖాయ యావజ్జీవం జడో దహేత్. 4

అ. అందుచేతనే విద్వాంసులు ఇలా లెస్సగా చెప్పారు.—

పుట్టనివాడు- పుట్టి చచ్చినవాడు- పుట్టినవాడు మూర్ఖుడు (అవడం) అనే ఈ మూడు విధాల పుత్రులలో మొదటివాళ్లిద్దరూ కొంతమేలు. ఎందుకనగా- వాళ్లిరువురూ అల్పదుఃఖాన్నే గల్గిస్తారు. మూర్ఖపుత్రుడు మాత్రం యావజ్జీవితం దహిస్తాడు.

శ్లో. వరం గర్భస్రావో వరమృతుషు నైవాభిగమనం
వరం జాతః ప్రేతో వరమపి చ కన్యైవ జనితా.
వరం వన్ధ్యా భార్యా వరమపి చ గర్భేషు వసతిః
న చావిద్వాన్ రూప-ద్రవిణగుణయుక్తోఽపి పురుషః. 5

అ. గర్భస్రావం గల్గడం- ఋతుకాలంలో భార్యను కలియకపోవడం- యేదోవిధంగా సంతానం కల్గినా అదిపుట్టుకతోనే చావడం- కన్యయే పుట్టడం- భార్య గొడ్డుబాలు కావడం- సంతానం గర్భంలోనే ఉండిపోవడం- ఇవి మంచివి. రూపధనాది గుణయుక్తుడైననూ విద్వాంసుడు కాని పుత్రుడు జనించడం మాత్రం మంచిది గాదు.

శ్లో. కిం తయా క్రియతే ధేన్వా యా న సూతే న దుగ్ధదా
కోఽర్థః పుత్రేణ జాతేన యో న విద్వాన్ న భక్తిమాన్. 6

అ. గొడ్డుదీ పాలుయివ్వనిదీ అయిన ఆవుచే ఉపయోగం యేమిగలదు? అలాగే విద్వాంసుడు కానివాడూ భక్తిహీనుడూ అయిన పుత్రుడివల్ల ప్రయోజనం ఏముంది?

శ్లో. వరమిహ వా సుతమరణం మా మూర్ఖత్వం కులప్రసూతస్య
యేన విబుధజనమధ్యే జారజ ఇవ లజ్జతే మనుజః. 7

అ. ఈ ప్రపంచంలో కులీనుడైన పుత్రుడు మూర్ఖుడై ఉండడంకంటె వాడు మరణించడమే తండ్రికి కొంతవరకు మేలు ఏలననగా అట్టి మూర్ఖపుత్రునిద్వారా అనగా వాని దుష్కృత్యాలవలన తండ్రి జ్ఞానులమధ్యన వ్యభిచారిణీసుతునివలె సిగ్గుతో తలవంచుకోవలసి వచ్చును.

శ్లో. గుణిజనగణనారంభే న పతతి కఠినీ ససమ్భ్రమా యస్య
తేనామ్బా యది సుతినీ వద వన్ధ్యా కీదృశీ భవతి. 8

అ. గుణవంతులను గణించే సమయంలో ఎవని పేరు చెప్పగానే చిటికెన వ్రేలు వెంటనే వంగదో, అలాంటి పుత్రుడున్న తల్లికూడా పుత్రవతియే యైనచో ఇక లోకంలో గొడ్డురాలు అంటే ఎవరు?

మూ తదేతేషాం యథా బుద్ధిప్రకాశో భవతి తథా కోఽప్యుపాయోఽను ష్ఠీయతామ్. అత్ర మద్దత్తాం వృత్తిం భుఞ్జానానాం పణ్డితానాం పఞ్చశతీ తిష్ఠతి. తతో యథా మమ మనోరథాః సిద్ధిం యాన్తి తథాఽనుష్ఠీయతామ్'- ఇతి.

అ. అందుచే వీరికి బుద్ధివికాసం గల్గే ఉపాయం ఎదేని చేయండి. ఇచ్చట నేను ఇచ్చిన జీవికను అనుభవించే పండితులు అయిదు వందలు ఉన్నారు. కనుక ఎలా చేస్తే నా మనోరథాలు సిద్ధిస్తాయో అలా ప్రయత్నం చేయండి.

మూ. తత్రైకః ప్రోవాచ 'ద్వాదశభిర్వర్షైర్వ్యాకరణం శ్రూయతే. తతో ధర్మశాస్త్రాణి మన్వాదీని, అర్థశాస్త్రాణి చాణక్యాదీని, కామశాస్త్రాణి వాత్స్యాయనాదీని. ఏవం చ తతో ధర్మార్థకామశాస్త్రాణి జ్ఞాయన్తే. తతః ప్రతిబోధనం భవతి

అ. వారిలో ఒక మంత్రి ఇలా అన్నాడు- 'ప్రభూ! వ్యాకరణశాస్త్రాన్ని అధ్యయనం చేయడానికి పండ్రెండేండ్లు పట్టుతుంది. పిమ్మట మన్వాది ధర్మశాస్త్రాలూ చాణక్యాదులు వ్రాసిన అర్థశాస్త్రాలూ, వాత్స్యాయనాదివిరచిత కామశాస్త్రాలూ ఉన్నాయి. ఇలా వ్యాకరణశాస్త్రం తర్వాత ధర్మార్థకామశాస్త్రాలు చదివిననే బుద్ధి వికాసం ప్రతిభా చేకూరుతాయి.

మూ. అథ తన్మధ్యతః సుమతిర్నామ సచివః ప్రాహ— 'అశాశ్వతోఽయం జీవితవ్యవిషయః. ప్రభూతకాలజ్ఞేయాని శబ్దశాస్త్రాణి. తత్ సంక్షేపమాత్రం కిఞ్చిదేతేషాం చిన్త్యతామ్'— ఇతి.

అ. పిమ్మట వారిలోనుండి సుమతి అనే మంత్రిలేచి యిలా అన్నాడు– 'ఈ దేహం అశాశ్వతం శబ్దశాస్త్రజ్ఞానం (వ్యాకరణశాస్త్రజ్ఞానం) గల్గాలంటే చాలాకాలం పడుతుంది. కనుక వీరికి బుద్ధివికాసం గల్గేందుకు ఏదేని సంక్షిప్తమైన శాస్త్రాన్ని గూర్చి విచారించడం అవసరంగా తోస్తుంది

మూ. ఉక్తఞ్చ యతః—

శ్లో. అనన్తపారం కిల శబ్దశాస్త్రం స్వల్పం తథాయుర్బహవశ్చ విఘ్నాః
సారం తతో గ్రాహ్యమపాస్య ఫల్గు హంసైర్యథా క్షీరమివామ్బుమధ్యాత్.

అ. పెద్దలు ఇలా అన్నారుకూడ. ఏలననగా—

శబ్దశాస్త్రము (వ్యాకరణశాస్త్రము)నకు నిశ్చితమైన అంతంలేదు. ఆయుర్దాయం మిక్కిలి అల్పమైంది. విఘ్నములా బహువిధాలు అందుచె హంసలు నీటినుండి పాలను వేరుచేసి గ్రహించునట్లు నిస్సారమైనదాన్ని వదలి సారమైదనన్ని గ్రహించాలి.

మూ. తదత్రాస్తి విష్ణుశర్మా నామ బ్రాహ్మణః సకలశాస్త్రపారంగమః ఛాత్రసంసది లబ్ధకీర్తిః. తస్మై సమర్పయతు ఏతాన్. స నూనం ద్రాగ్ ప్రబుద్ధాన్ కరిష్యతి'— ఇతి.

అ. అందుచే ఇచ్చట విష్ణశర్మ అనే బ్రాహ్మణుడు ఉన్నాడు అతడు సర్వశాస్త్రపారద్రష్ట. మరియూ శిష్యమండలిలో విశేషకీర్తిగలవాడు. కాబట్టి వీరిని అయనకు అర్పించండి. అతడు తప్పక త్వరలోనే వీరికి జ్ఞానవికాసం గల్గిస్తాడు.

మూ. స రాజా తదాకర్ణ్య విష్ణుశర్మాణమాహూయ ప్రోవాచ— 'భో భగవన్, మదనుగ్రహార్థమేతానర్థశాస్త్రం ప్రతి ద్రాగ్ యథాఽనన్యసదృశాన్ విదధాసి తథా కురు. తదాఽహం త్వాం శాసనశతేన యోజయిష్యామి.

అ. ఆ రాజు దానిని విని, విష్ణుశర్మను పిలిపించి ఇలా అర్థించాడు- 'ఓ పూజ్యుడా! నన్ను కరుణించి నా యీ పుత్రులను అర్థశాస్త్రంలో శీఘ్రంగా సాటిలేని పండితులను చేయండి. అందుకు ప్రతిఫలంగా నూరుగ్రామాలకు మిమ్ము ప్రభువుగా చేస్తాను (నూరు గ్రామాలు మాన్యంగా సమర్పిస్తాను.)

మూ. అథ విష్ణుశర్మా తం రాజానమూచే— 'దేవ, శ్రూయతాం మే తథ్యవచనమ్. నాహం విద్యావిక్రయం శాసనశతేనాఽపి కరోమి. పునరేతాం స్తవ పుత్రాన్ మాసషట్కేన యది నీతిశాస్త్రజ్ఞాన్ న కరోమి తతః స్వనామ త్యాగం కరోమి. కిం బహునా? శ్రూయతాం మమైష సింహనాదః. నాఽహమర్థ లిప్సుర్బ్రవీమి. మమాశీతివర్షస్య వ్యావృత్తసర్వేంద్రియార్థస్య న కిఞ్చిదర్థేన ప్రయోజనమ్. కిను త్వత్ప్రార్థనాసిద్ధ్యర్థం సరస్వతీవినోదం కరిష్యామి. తలిఖ్యతా మద్యతనో దివసః. యద్యహం షణ్మాసాభ్యన్తరే తవ పుత్రాన్ నయశాస్త్రం ప్రతి అనన్యసదృశాన్ న కరిష్యామి తతో నార్హతి దేవో దేవమార్గం సందర్శ యితుమ్.

అ. అంతట విష్ణుశర్మ రాజుతో ఇలా అన్నాడు—'ప్రభూ! నా సత్యవచనం వినండి. వందగ్రామాలు ఇచ్చినా నేను విద్యా విక్రయం చేయను. అయినా మీ యీ పుత్రుల్ని ఆరునెలల్లో నీతిశాస్త్రకోవిదులను చేయకపోతే విష్ణుశర్మ అనే నాపేరు త్యాగం చేస్తాను. (మారుపేరుతో పిలవండి- అని భావం) పెక్కుతేల? నా యీ సింహనాదం వినండి. నేను ధనాపేక్షతో చెప్పడంలేదు. ఎందుకంటే- నా వయస్సు ఎనుబదియేండ్లు విషయవాంఛలు పూర్తిగా నశించాయి. ఇలాంటి నాకు ధనంతో అవసరం ఏముంది! అయినా మీ ప్రార్థనను సిద్ధింపజేయడానికై విద్యావినోదం (సరస్వతీ వినోదం) చేయ దలచాను. కనుక ఈ దినం గుర్తుగా వ్రాయించండి. నేను ఆరునెలలలోపల మీ పుత్రుల్ని నీతిశాస్త్రంలో సాటిలేని విద్వాంసుల్ని చేయకపోతే భగవానుడు స్వర్గసుఖా లకు దూరంగా నన్ను ఉంచుగాక (పుణ్యభ్రష్టుడనై నరకంలో పడుదునుగాక)

మూ. అథాసౌ రాజా తాం బ్రాహ్మణస్యాసమ్భావ్యాం ప్రతిజ్ఞాం శ్రుత్వా ససచివః ప్రహృష్టో విస్మయాన్విత స్తస్మై సాదరం తాన్ కుమారాన్ సమర్ప్య పరాం నిర్వృతిమాజగామ.

అ. అంతట రాజు బ్రాహ్మణుడు చేసిన ఊహింపనలవిగాని ప్రతిజ్ఞను విని మంత్రులతోబాటు ఆశ్చర్యాన్నేగాక అధికమైన ఆనందం సైతం పొందాడు. పిమ్మట సాదరంగా తన ముగ్గురు పుత్రులను ఆ పండితునికి అప్పగించి మిక్కిలి నిశ్చింతతను అనుభవించాడు.

మూ. విష్ణుశర్మణాఽపి తానాదాయ తదర్థం మిత్రభేద-మిత్రప్రాప్తి-కాకోలూకీయ-లబ్ధప్రణాశ-అపరీక్షితకారకాణి చేతి పఞ్చ తన్త్రాణి రచయిత్వా పాఠితాస్తే రాజపుత్రాః. తేఽపి తాన్యధీత్య మాసషట్కేన యథోక్తాః సంవృత్తాః. తతః ప్రభృత్యేతత్ పఞ్చతన్త్రకం నామ నీతిశాస్త్రం బాలావబోధనార్థం భూతలే ప్రవృత్తమ్.

అ. విష్ణుశర్మయు వారిని తనవెంట గొనిపోయి వారికొరకు మిత్రభేదం-మిత్రలాభం-కాకోలూకీయం-లబ్ధప్రణాశం- అపరీక్షితకారకం అనే పంచతంత్రములు రచించి వారిచే పఠింపజేశాడు. వారును వాటిని చదివి ఆరునెలల్లో ప్రతిజ్ఞప్రకారం నీతిశాస్త్రజ్ఞులయ్యారు, అది మొదలు ఈ పంచతంత్రం అనే నీతిశాస్త్రం బాలురకు జ్ఞానబోధకై భూమండలంలో ప్రసిద్ధమయింది.

మూ. కిం బహునా?

శ్లో. అధీతే య ఇదం నిత్యం నీతిశాస్త్రం శృణోతి చ
న పరాభవమాప్నోతి శక్రాదపి కదాచన. 10

అ. అధికమేల !

ఈ నీతిశాస్త్రాన్ని ఎవడు నిత్యం పఠిస్తాడో అతడు దేవతలప్రభువైన ఇంద్రునివలనకూడ ఏనాడును అవమానం పొందడు.

# అథ మిత్రభేదః ప్రారభ్యః

## మిత్రభేదారంభము

మూలమ్. అథాతః ప్రారభ్యతే మిత్రభేదో నామ ప్రథమం తన్త్రమ్ యస్యాయమాదిమః శ్లోకః—

శ్లో. వర్ధమానో మహాన్ స్నేహః సింహగోవృషయోర్వనే
పిశునేనాతిలుబ్ధేన జమ్బుకేన వినాశితః. 1

అ. ఇపుడు మిత్రభేదం అనెడి మొదటి తంత్రం ఆరంభింపబడుతూంది. దానికెడి మొదటిశ్లోకం—

అడవిలో సింహానికి వృషభానికీ మధ్య పెరుగుతూన్న అధికమైన స్నేహాన్ని చాడీలకోరూ ఆశకలదీ అయిన నక్క నాశం చేసింది.

మూ. తద్యథాఽనుశ్రూయతే- అస్తి దాక్షిణాత్యే జనపదే మహిలారోప్యం నామ నగరమ్. తత్ర ధర్మోపార్జితభూరివిభవః వర్ధమానకో నామ వణిక్పుత్రో బభూవ. తస్య కదాచిద్రాత్రౌ శయ్యారూఢస్య చిన్తా సముత్పన్నా — 'తత్ప్రభూతేఽపి విత్తేఽర్థోపాయాశ్చిన్తనీయాః కర్తవ్యాశ్చేతి. యత ఉక్తఞ్చ-

అ. ఇలా జనశ్రుతి గలదు- దక్షిణాపథంలో మహిలారోప్యం అనే నగరం ఉంది. అందు వర్ధమానుడు అనే వైశ్యపుత్రుడు ఉండేవాడు. అతడు ధర్మంగా సంపాదించిన ధనంవల్ల అధికవైభవంతో జీవితం గడిపేవాడు. ఒకనాడు రాత్రి శయనించినప్పుడు అతనికి ఇలా ఆలోచన వచ్చింది- 'ధనం అధికంగా ఉన్నప్పటికీ ధనప్రాప్తికై ఉపాయాలు వెదకాలి, యత్నాలు చేయాలి. అందువల్లనే విద్వాంసులు ఇలా అన్నారు-

శ్లో. నహి తద్విద్యతే కిఞ్చిద్యదర్థేన న సిద్ధ్యతి
యత్నేన మతిమాంస్తస్మాదర్థమేకం ప్రసాధయేత్. 2

అ. ఈ లోకంలో ధనంచే సిద్ధింపనిది యేదీ లేదు. అందుచే బుద్ధిమంతుడు ధనం తప్పక సంపాదించాలి.

శ్లో. యస్యార్థాస్తస్య మిత్రాణి యస్యార్థాస్తస్య బాంధవాః
యస్యార్థాః స పుమాంల్లోకే యస్యార్థాః స చ పండితః. 3

అ- ధనవంతునికే మిత్రులు బంధువులు ఉంటారు. అతడే లోకంలో ఉత్తమ పురుషుడుగాను పండితుడుగాను తలంపబడుతాడు.

శ్లో. న సా విద్యా న తద్దానం న తచ్ఛిల్పం న సా కలా
న తత్ స్థైర్యం హి ధనినాం యాచకైర్యన్న గీయతే. 4

అ. ధనవంతుల్లో యాచకులచే కీర్తింపబడని విద్య విద్యగాడు-దానం దానం గాదు-శిల్పం శిల్పంగాదు-కళ కళగాదు-స్థిరత స్థిరతయునుగాదు. అనగా ధనవంతులయందే విద్యాదిసుగుణాలు (ఉండినను లేకపోయినను)యాచకులచే కీర్తింపబడుతాయి-అనిభావం.

శ్లో. ఇహ లోకే హి ధనినాం పరోఽపి స్వజనాయతే
స్వజనోఽపి దరిద్రాణాం సర్వదా దుర్జనాయతే. 5

అ. ఈప్రపంచంలో ధనవంతునితో పరాయివాడుకూడా బంధుత్వం కల్పించుకొని వ్యవహరిస్తాడు. దరిద్రునితోనైతే కుటుంబసంబంధికూడ శత్రువుగా ప్రవర్తిస్తాడు.

శ్లో. అర్థేభ్యోఽపి హి వృద్ధేభ్యః సంవృతేభ్య ఇతస్తతః
ప్రవర్తన్తే క్రియాః సర్వాః పర్వతేభ్య ఇవాపగాః. 6

అ. పర్వతాలనుండి నిర్గమించిన చిన్నచిన్నవాగులు కలిసి క్రమంగా మహానదులై సర్వార్థ సాధకాలైనట్లు-ఇటునటు పైసలు పైసలుగా సేకరించి వృద్ధిని పొందించిన సంపదలే (లక్షలూ కోట్లు-అయి) సర్వశుభాలు గల్గిస్తాయి

శ్లో. పూజ్యతే యదపూజ్యోఽపి యదగమ్యోఽపి గమ్యతే
వన్ద్యతే యదవన్ద్యోఽపి స ప్రభావో ధనస్య చ. 7

అ. ధనమహిమవల్ల గౌరవాయోగ్యుడు గౌరవార్హుడుగాను,అగమ్యుడు గమ్యుడుగాను,అవంద్యుడు వందనీయుడుగాను గణింపబడుతాడు.

శ్లో. అశనాదిన్ద్రియాణీవ స్యుః కార్యాణ్యఖిలాని చ
ఏతస్మాత్ కారణాద్విత్తం సర్వసాధనముచ్యతే. 8

అ. ఆహారంచే ఇంద్రియాలు అన్నియు శక్తివంతములైనట్లు ధనంచే సర్వ కార్యాలు సఫలం అవుతాయి. అందుచే ధనం సర్వకార్యసాధనంగా స్తుతింపబడుతుంది.

శ్లో. అర్థార్థీ జీవలోకోఽయం శ్మశానమపి సేవతే
త్యక్త్వా జనయితారం స్వం నిస్వం గచ్ఛతి దూరతః. 9

అ. ధనకాంక్షచే మానవుడు రుద్రభూమిని (శ్మశానం)గూడ సేవిస్తాడు. అనగా ధనసాధనాలైన జపతపాదులు అచ్చట చేస్తాడు. కానీ అతడే తనకు జన్మదాతయైన తండ్రి ధనహీనుడైతే అతనిని వదిలేస్తాడు.

శ్లో. గతవయసామపి పుంసాం యేషామర్థా భవన్తి తే తరుణాః
అర్థేన తు యే హీనా వృద్ధాస్తే యౌవనేఽపి స్యుః. 10

అ. వృద్ధులైయుండియు ధనంగలవారైతే యువకులే. అలాగే ధనంలేనివారు యువకులైయున్ననూ వృద్ధులే.

మూ. స చార్థః పురుషాణాం షడ్భిరుపాయైర్భవతి. భిక్షయా-నృపసేవయా- కృషికర్మణా- విద్యోపార్జనేన- వ్యవహారేణ- వణిక్కర్మణా వా. సర్వేషామపి తేషాం వాణిజ్యేనాతిరస్కృతోఽర్థలాభః స్యాత్.

అ. అట్టిధనం మానవులకు ఆరుఉపాయాలతో లభిస్తుంది.అవి 1)భిక్షావృత్తి 2) రాజసేవ 3) వ్యవసాయం 4) విద్యార్జన 5) వ్యవహారం-అనగా వడ్డీవ్యాపారం లేక కోర్టుమొదలగు వ్యవహారాల్లో సాక్షి ఇత్యాదిగా ప్రవర్తిల్లడం 6) వ్యాపారం-అని ప్రసిద్ధాలు. వీటిఅన్నిటిలోనూ వ్యాపారంవల్లనే తప్పనిసరిగ ధనలాభం గల్గుతుంది.

మూ. ఉక్తం చ యతః—

శ్లో. కృతా భిక్షా నేకై ర్వితరతి నృపో నోచితమహో
కృషిః క్లిష్టా విద్యా గురువినయవృత్త్యాఽతి విషమా.
కుసీదాద్దారిద్ర్యం పరకరగతగ్రన్థిశమనాత్
న మన్యే వాణిజ్యాత్ కిమపి పరమం వర్తనమిహ. 11

అ. విజ్ఞులచే ఇలా చెప్పబడింది.

భిక్షచేసేవారు లోకంలో చాలామంది ఉన్నారు. సేవించినను ప్రభువు యోగ్యతకు తగినవృత్తినిగానీ శ్రమకుదగిన ప్రతిఫలంగానీ ఇవ్వడు. వ్యవసాయం ఎంతో శ్రమతో గూడినది. విద్యఅన్నచో గురువులకడ అధికమైన వినయశ్రద్ధలతో పొందదగినది అవడంతో కష్టసాధ్యం.వడ్డీకి ఇవ్వడం మొదలైన వ్యవహారాలవల్ల తన ధనం పరహస్తగతం అవడంతో వారి వంచనాదికంవల్ల పెట్టుబడికే మోసంవచ్చి దారిద్ర్యం సంభవిస్తుంది. ఇందుచే వాణిజ్యాన్నే సర్వశ్రేష్ఠ ధనప్రాప్తిసాధనంగా నేను తలంచుచున్నాను.

శ్లో. ఉపాయానాఞ్చ సర్వేషాముపాయః పణ్యసఙ్గ్రహః
ధనార్థం శస్యతే హ్యేక స్తదన్యః సంశయాత్మకః. 12

అ. ఉపాయాలన్నింటిలో విక్రయయోగ్యాలైన వస్తువులను సేకరించడం అనేది ఒక్కటియే (వాణిజ్యమే) ధనప్రాప్తికి ఉత్తమమైన ఉపాయం. ఇతరములైన వన్నియూ సంశయాత్మకాలు.

మూ. తచ్చ వాణిజ్యం సప్తవిధమర్థాగమాయ స్యాత్.తద్యథా-గాంధిక వ్యవహారః- నిక్షేపప్రవేశః-గోష్ఠికకర్మ-పరిచితగ్రాహకాగమః-మిథ్యాక్రయ కథనమ్- కూటతులామానమ్- దేశాంతరాద్భాండానయనం చేతి.

అ. ధనసంపాదనార్థమైన అట్టివాణిజ్యం ఏడువిధాలుగా ఉంటుంది, అదెట్లనగా—

1. గాంధికవ్యవహారః = సుగంధద్రవ్యాలైన మూలికలు మొదలగు వాటితోటివ్యాపారం.

2. నిక్షేపప్రవేశః=బంగారం మొదలగు వానిని తాకట్టుగా ఉంచుకొని రూపాయలుగాని,ఇతరవస్తువులుగాని వడ్డీకి ఇవ్వడం.

3. గోష్ఠికకర్మ=సంఘాలలో (కంపినీలలో) ఉద్యోగం.

4. పరిచితగ్రాహకాగమః=పరిచితులైన అనగా ప్రసిద్ధులైన విక్రేతలను (ఖరీదుచేసేవారిని) తనవైపు ఆకర్షించడం.

5. మిథ్యాక్రయకథనం=వస్తువులను అమ్మేటప్పుడు తక్కువ ధరకు కొన్నవాటికి ఎక్కువధరను అసత్యంగా చెప్పుట.

6) కూటతులామానం=తూకం మొదలగు వాటిలో మోసం చేయడం.

7) దేశాంతరభాండానయనం = ఇతరదేశాలనుండి తక్కువధరకు సరకుతెచ్చి యెక్కువధరకు అమ్మడం.

మూ. ఉక్తం చ

శ్లో. పణ్యానాం గాన్ధికం పణ్యం కిమన్యైః కాఞ్చనాదిభిః
యత్రైకేన చ యత్క్రీతం తచ్ఛతేన ప్రదీయతే. 13

అ. సప్తవిధ వాణిజ్యలక్షణాలు ఇలా చెప్పబడినాయి—

విక్రయయోగ్యాలైన వస్తువులలో సుగంధద్రవ్యాలైన మూలికాదుల తోటి వ్యాపారం సర్వోత్తమమైంది. ఎలననగా-ఒకరూపాయకు కొనబడిన వస్తువు అవసరాన్ని బట్టి నూరు రూపాయలకును అమ్మబడుతూంది. అలాంటప్పుడు తక్కిన బంగారు మొదలగువాటి వ్యాపారంవల్ల గల్గే లాభం మిక్కిలి అల్పం.

శ్లో. నిక్షేపే పతితే హర్మ్యే శ్రేష్ఠీ స్తౌతి స్వదేవతామ్
నిక్షేపీ మ్రియతే తుభ్యం ప్రదాస్యామ్యుపయాచితమ్. 14

అ. తాకట్టువస్తువు తనభవనం చేరగానే శ్రేష్ఠి తనకులదేవతను ఇలా ప్రార్థిస్తాడు. తాకట్టు ఉంచినవాడు మరణిస్తే నేను తాముకోరే వస్తువు సమర్పించి పూజిస్తాను.

శ్లో. గోష్ఠికకర్మనియుక్తః శ్రేష్ఠీ చింతయతి చేతసా హృష్టః
వసుధా వసుసమ్పూర్ణా మయాద్య లబ్ధా కిమన్యేన. 15

అ. గోష్ఠికకర్మ నియుక్తుడైన శ్రేష్ఠి సంతుష్టచిత్తుడై ఇలా భావిస్తాడు-వసు (ధన) పరిపూర్ణమైన ఈ వసుధ అంతము నేడు నాదై ఉంది. అలాంటప్పుడు నాకు ఇతరంతో పనిఏముంది ?

శ్లో. పరిచితమాగచ్ఛన్తం గ్రాహకముత్కణ్ఠయా విలోక్యాఽసౌ
హృష్యతి తద్ధనలుబ్ధో యద్వత్పుత్రేణ జాతేన.

అ. పరిచితులైన గ్రాహకులు (కొనెడివారు) తనఅంగడికి రావడాన్ని, ఆసక్తితోడను ఉత్కంఠతోడను గాంచి వారిధనంపై కన్నులునిలిపి వ్యాపారి, తనకు పుత్రసంతానం గల్గినంత ఆనందాన్ని అనుభవిస్తాడు.

మూ. అన్యచ్చ-

శ్లో. పూర్ణాపూర్ణే మానే పరిచితజనవఞ్చనం తథా నిత్యమ్
మిథ్యాక్రయస్య కథనం ప్రకృతిరియం స్యాత్ కిరాతానామ్. 17

అ. మరియూ-సరిగానో తక్కువగానో కొలతలు తూకాలువేసి అంగడికి వచ్చేగ్రాహకులను నిత్యం వంచించడం-వెలలు తప్పుగాచెప్పడం-అనేది కిరాణా (కిరాత) వ్యాపారులకు సహజగుణం.

శ్లో. ద్విగుణం త్రిగుణం విత్తం భాణ్డక్రయవిచక్షణాః
ప్రాప్నువన్త్యుద్యమాల్లోకా దూరదేశాన్తరం గతాః. 18

అ. ఆయాప్రాంతాలలో లభించే వస్తువులను ఇతరప్రాంతాలకు తీసికొని అమ్మడంలో నేర్పరులైన వ్యాపారులు రెండంతలుగాను మూడంతలుగాను ధనం సంపాదిస్తారు.

మూ. ఇత్యేవం సమ్ప్రధార్య మథురాగామీని భాణ్డాన్యాదాయ శుభాయాం తిథౌ గురుజనానుజ్ఞాతః సురథాధిరూఢః ప్రస్థితః. తస్య చ మఙ్గల వృషభౌ సఞ్జీవకనన్దననామానౌ గృహోత్పన్నౌ ధూర్వోఢారౌ స్థితౌ. తయోరేకః సఞ్జీవకాభిధానో యమునా కచ్ఛమవతీర్ణః సమ్పఙ్కపూరమాసాద్య కలితచరణో యుగభఙ్గం విధాయ నిషసాద.

అ. ఇలా నిశ్చయించి ఆవ్యాపారి మధురానగరంలో విక్రయయోగ్యాలైన సరకులు సేకరించి యొకానొక శుభదినాన మంచిబండిపై కూర్చుండి ప్రయాణం సాగించాడు. ఇంటిలో పుట్టినవియు శుభలక్షణాలు గలవియు అగు సంజీవక-నందకములు అనే ఎద్దులజంట ఆ బండిని లాగుతున్నాయి. వానిలోనొకటియగు సంజీవకుడు ఆనేఎద్దు యమునాతీరం దిగగానే బురదలో ఇరుక్కొని కాలు విరిగి కాడిదప్పి పడిపోయింది.

మూ. అథ తం తదవస్థమాలోక్య వర్ధమానః పరం విషాదమగమత్ తదర్థం చ స్నేహార్ద్రహృదయస్త్రిరాత్రం ప్రయాణభఙ్గమకరోత్. అథ తం విషణ్ణమాలోక్య సార్థికై రభిహితమ్ - 'భోః శ్రేష్ఠిన్, కిమేవం వృషభస్య కృతే సింహవ్యాఘ్రసమాకులే బహ్వపాయేఽస్మిన్ వనే సమస్తసార్థస్త్వయా సందేహే నియోజితః. ఉక్తఞ్చ-

శ్లో. న స్వల్పస్య కృతే భూరి నాశయేన్మతిమాన్నరః
ఏతదేవాత్ర పాణ్డిత్యం యత్ స్వల్పాద్భూరిరక్షణమ్. 19

అ. ఎద్దు పడేబాధనుగాంచి వర్ధమానుడు మిక్కిలి విషాదం పొందాడు. దాని యెడ దయార్ద్రహృదయుడై (బాగుపడునేమో యని వివిధ చికిత్సలు చేయిస్తూ)మూడు రాత్రులవరకు ప్రయాణాన్ని నిల్పివేశాడు. ఎద్దుకై అతడు అలా దుఃఖితుడగుటచూచి తోటివ్యాపారులు ఇలా అన్నారు-ఓ శ్రేష్ఠీ, ఒక ఎద్దుకై యెందుకిలా సింహాలూ పులులూ మొదలైన క్రూరజంతువులతో నిండినదీ-అనేకమైన ఆపదలతో కూడినదీ అయిన ఈ యడవిలో ఈ వ్యాపారుల గుంపునంతా ఇబ్బందిలో నుంచావు.

విజ్ఞులు ఇలా అన్నారు.

బుద్ధిమంతుడు అల్పమైనదానికై అధికమైనదానిని ఎన్నటికీ నాశం చేసుకోడు. అల్పం వదలి అధికమైనదానిని రక్షించడమే వివేకిలక్షణం.

మూ. అథాఽసౌ తదవధార్య సఞ్జీవకస్య రక్షాపురుషాన్నిరూప్యాశేషసార్థం నీత్వా ప్రస్థితః. అథ రక్షాపురుషా అపి బహ్వపాయం తద్వనం విదిత్వా సఞ్జీవకం పరిత్యజ్య పృష్ఠతో గత్వాఽన్యేద్యుస్తం సార్థవాహం మిథ్యాఽఽహుః

స్వామిన్ మృతోఽసౌ సఞ్జీవకః. అస్మాభిస్తు సార్థవాహస్యాఽభీష్ట ఇతి మత్వా వహ్నినా సంస్కృతః' ఇతి.

అ. అంతట వర్ధమానుడు వారిమాటలను లెస్సగాదలచి సంజీవకునిరక్షకై కొందరు పురుషులను నియమించి, పరివారమంతటితో తోటివ్యాపారులతోడ గదలి పోయాడు. రక్షక పురుషులును – 'ఈ అడవిలో ఉండడం మిక్కిలి అపాయం' అని తలంచి అతడి వెనుకనే గదిలారు. మరునాడు ఆ సార్థవాహునితో ఇలా అసత్యం చెప్పారు– "ప్రభూ, ఆ సంజీవకుడు మరణించాడు 'ప్రభువులకు మిక్కిలి ప్రియమైనవాడు–' అని తలంచి అగ్నిసంస్కారం చేసినాము."

మూ. తచ్ఛ్రుత్వా సార్థవాహః కృతజ్ఞతయా స్నేహార్ద్రహృదయస్తస్యౌర్ధ్వదేహిక క్రియా వృషోత్సర్గాదికాః సర్వాశ్చకార. సఞ్జీవకోఽప్యాయుశ్శేషతయా యమునాసలిలమిశ్రైః శిశిరవాతైరాప్యాయితశరీరః కథఞ్చిదప్యుత్థాయ యమునాతటముపపేదే. తత్ర మరకతసదృశాని బాలతృణాగ్రాణి భక్షయన్ కతిపయైరహోభిర్హరవృషభ ఇవ పీనః కకుద్మాన్ బలవాంశ్చ సంవృత్తః ప్రత్యహం వల్మీకశిఖరాగ్రాణి శృఙ్గాభ్యాం విదారయన్ గర్జమాన ఆస్తే. సాధు చేదముచ్యతే.

శ్లో. అరక్షితం తిష్ఠతి దైవరక్షితం సురక్షితం దైవహతం వినశ్యతి
జీవత్యనాథోఽపి వనే విసర్జితః కృతప్రయత్నోఽపి గృహే వినశ్యతి. 20

అ. దానిని విని వ్యాపారి కృతజ్ఞతతో దయార్ద్రహృదయుడై సంజీవకునికి వృషోత్సర్గాదులగు పరలోక కర్మలన్నింటినీ యథావిధిగా చేశాడు. ఇచ్చట సంజీవకుడును ఆయువు మిగిలి ఉండడంతో యమునాజలాలమీది చల్లని పిల్లగాలులు సోకి కొంత స్వస్థతను పొందాడు. ఏదోవిధంగా లేచి యమునానది ఒడ్డును చేరాడు. అచ్చట మరకతమణులవలె నిగనిగలాడే లేత గడ్డిపరకలను హాయిగాతింటూ కొన్నిదినాలకు బసవేశ్వరునివలె క్రొవ్వుపట్టి ఎత్తైన మూపురంతో బలవంతుడైనాడు. ప్రతిదినం తన కొమ్ములతో పుట్టల శిఖరాగ్రాలను చీల్చుతూ రంకెలు వేస్తూ ఉండేవాడు. అందువల్లనే పెద్దలచే ఇలా చెప్పబడింది–

మానవులు రక్షింపకపోయినా దైవరక్షితం అయిన వస్తువు శుభంగా ఉంటుంది. మానవులు ఎంతశ్రద్ధవహించినా దైవరక్షణ లేకపోతే అది తప్పక నశిస్తుంది.

అడవిలో వదలబడిన అనాథుడును దైవరక్షితుడైనచో జీవిస్తాడు. కాని ఇంట్లో మానవులచే అధిక యత్నంతో రక్షింపబడేవాడును దైవహతుడైనచో నశిస్తాడు.

మూ. అథ కదాచిత్ పిఙ్గలకో నామ సింహః సర్వమృగపరివృతః పిపాసాకుల ఉదకపానార్థం యమునాతటమవతీర్ణః సఞ్జీవకస్య గమ్భీరతరరావం దూరాదేవాశృణోత్. తచ్ఛ్రుత్వాఽతీవ వ్యాకులహృదయః ససాధ్వసమాకారం ప్రచ్ఛాద్య వటతలే చతుర్మణ్డలావస్థానేనావస్థితః. చతుర్మణ్డలావస్థానన్త్విదమ్- సింహః, సింహానుగామినః కాకరవాః, కింవృత్తా ఇతి.

అ. అంతట నొకనాడు ఆ యడవిలో ఉండే పింగళకుడు అనే సింహం సర్వజంతువులతోగూడి దప్పిగొని యమున ఒడ్డుకు చేరి దూరంనుండియే సంజీవకుని గంభీరతరమైన రంకెను వినెను. దానిని విని కలతనొంది తొట్రుపాటుతో (భయంతో) ఆకారాన్ని అచ్ఛాదించుకొని (ఇతరులకు తెలియకుండా భయం తనలో దాచుకొని) మఱ్ఱినీడలో చతుర్మండలావస్థానముగా కూర్చుండెను. చతుర్మండలావస్థానమనగా 1) సింహము 2) సింహానుసారులైన ఇతరమృగాలు, 3) కాకరవాలు, (కింకరులు) 4) కింవృత్తాలు అనగా ఏమివిషయం జరిగింది అని విచారించేవారు.

మూ. అథ తస్య కరటక-దమనకనామానౌ ద్వౌ శృగాలౌ మన్త్రిపుత్రౌ భ్రష్టాధికారౌ సదాఽనుయాయినావాస్తామ్. తౌ చ పరస్పరం మన్త్రయతః. తత్ర దమనకోఽబ్రవీత్- భద్ర, కరటక, అయం తావదస్మత్స్వామీ పిఙ్గళకః ఉదకగ్రహణార్థం యమునాకచ్ఛమవతీర్య స్థితః. స కిం నిమిత్తం పిపాసాఽఽకులోఽపి నివృత్య వ్యూహరచనాం విధాయ దౌర్మనస్యేనాఽభిభూతోఽత్ర వటతలే స్థితః 'కరటక ఆహ- 'భద్ర. కిమావయోరనేన వ్యాపారేణ. ఉక్తంచ యతః-

శ్లో. అవ్యాపారేషు వ్యాపారం యో నరః కర్తుమిచ్ఛతి
స ఏవ నిధనం యాతి కీలోత్పాటీవ వానరః. 21

మూ. దమనక ఆహ-'కథమేతత్? సోఽబ్రవీత్-

అ. అంతట కరటకుడు దమనకుడు అనే రెండు నక్కలు మంత్రిపుత్రులై ఉండికూడ అధికారం పోగొట్టుకొని అతన్ని నిత్యం అనుసరిస్తూ ఉండేవి. (పింగళకుని అవస్థను గాంచి) అవి తమలోతాము ఇలా ఆలోచన చేయసాగాయి. దమనకుడు ఇలా అన్నాడు-'మిత్రమా కరటక? మన ప్రభువు పింగళకుడు నీరుత్రాగడానికై యమునా తీరం దిగియూ అచ్చటనే ఉన్నాడు. కారణం తెలియదు. దప్పికచే తపిస్తూ ఉండియూ నీటిని త్రాగక వెనుదిరిగి సేనను వ్యూహంగా చేసికొని విచారంతో అవమానం పొందిన వానివలె మఱ్ఱినీడను చేరాడు. దానిని విని కరటకుడు ఇలా పల్కాడు—'మనం ఈ అక్కరకురాని విషయాన్నిగూర్చి ఆలోచన చేయడం ఎందులకు? అందువల్లనే పెద్ద లిలా అన్నారు-

'జోలిమాలినపనులు ఎవడు చేయదలచునో, వాడు మేకు పీకిన కోతి వలె మరణిస్తాడు' (21)

'ఆ కథ ఏమి? తెలుపుము'- అని దమనకుడు అడుగగా కరటకుడు ఇలా చెప్పాడు-

## కీలోత్పాటివానరకథా

కస్మింశ్చిన్నగరాభ్యాసే కేనాఽపి వణిక్పుత్రేణ తరుఖణ్డమధ్యే దేవతాయతనం కర్తుమారబ్ధమ్. తత్ర చ యే కర్మకరాః స్థపత్యాదయః, తే మధ్యాహ్నవేలాయాం ఆహారార్థం నగరమధ్యే గచ్ఛంతి. అథ కదాచిత్ తత్రాను షఙ్గికం వానరయూథమితశ్చేతశ్చ పరిభ్రమదాగతమ్. తత్రైకస్య శిల్పినోఽర్ధ స్ఫాటితోఽఞ్జనవృక్షదారుమయ స్తమ్భః ఖదిరకీలకేన మధ్యనిహితేన తిష్ఠతి.

అ. ఒకానొక నగరసమీపంలో ఒకానొక వైశ్యపుత్రునిచే తోటనడుమ దేవాలయనిర్మాణం ఆరంభింపబడింది. అచ్చట పనిచేసే వడ్రంగులు మొదలైనవారు మధ్యాహ్నవేళయందు భోజనానికి నగరం వెళ్లేవారు. అంతనొకనాడు అచ్చటికి ఆనుషంగికంగా (తమజాతి స్వభావంతో) కోతులగుంపు ఇటునటు తిరుగుతూ వచ్చింది. అక్కడ ఒక వడ్రంగిచే సుమారు సగం కోయబడి మధ్యన చంద్రకొయ్య(బిగువుగా) ఉంచబడిన చేవస్తంభం ఒకటి ఉంది.

మూ. ఏతస్మిన్నన్తరే తే వానరాః తరుశిఖరప్రాసాదశృఙ్గదారుపర్య న్తేషు యథేచ్ఛయా క్రీడితుమారబ్ధాః ఏకశ్చ తేషాం ప్రత్యాసన్నమృత్యుశ్చాప ల్యాత్ తస్మిన్నర్ధస్ఫాటిత స్తమ్భే ఉపవిశ్య పాణిభ్యాం కీలకం సఙ్గృహ్య యావ దుత్పాటయితుమారేభే, తావ త్తస్య స్తమ్భమధ్యగతవృషణస్య స్వస్థానాచ్చలిత కీలకేన యద్వృత్తం తత్ ప్రాగేవ నివేదితమ్. అతోఽహం బ్రవీమి. 'అవ్యా పారేషు' ఇతి. ఆవయోర్భక్షితశేష ఆహారోస్త్యేవ. తత్ కిమనేన వ్యాపారేణ'. దమనక ఆహ- తత్ కిం భవానాహారార్థీ కేవలమేవ! తన్న యుక్తమ్. ఉక్తం చ-

అ. ఇంతలో ఆ కోతులు చెట్లకొమ్మలమీద గుడి గోపురం పైనా (వడ్రంగులు పనిచేసే) కఱ్ఱలమీద ఇష్టం వచ్చినట్లు గంతులేయసాగాయి. వానిలో ఒక కోతి చాపుదాపురించినదై సగం కోయబడ్డ స్తంభంమీదికి వచ్చి కూర్చుంది. సహజమైన చాపల్యంతో స్తంభం చీలికమధ్య ఉంచిన కఱ్ఱను రెండు చేతులతో గట్టిగా పట్టుకొని పైకి గుంజసాగింది. కఱ్ఱ కదలి పైకి రాగానే స్తంభం చీలిక నడుమ దాని వృషణాలు పడ్డాయి. ఆ తర్వాత జరిగిన విషయం (వృషణాలు నజ్జునజ్జుఐయి విలవిల తన్నుకుంటూ అదిచావడం) ముందే తెలిపాను. అందుచే 'అక్కరకురాని పనులలో తలదూర్చరాదు' అని చెప్పుచున్నాను. మనకు తినగా మిగిలిన ఆహారం ఉంది. అందుచే ఈ సింహం గొడవ ఎందుకు?' అదివిని దమనకుడు ఇలాఅన్నాడు- ''ఏమి? నీవు ఆహారమే జీవిత పరమార్థంగా తలంతువా? అది యుక్తంకాదు. పెద్దలు ఇలా అన్నారు

శ్లో. సుహృదాముపకారకారణాద్ ద్విషదామప్యపకారకారణాత్
నృపసంశ్రయ ఇష్యతే బుధై ర్జఠరం కో న బిభర్తి కేవలమ్. 22

అ. బుద్ధిమంతులు మిత్రులకు మేలు, శత్రువులకు కీడు చేయడానికై రాజులను ఆశ్రయిస్తారు. కేవలం పొట్టను అయితే ప్రతివాడును ఏదోవిధంగా నింపుకుంటూనే ఉన్నాడు.

మూ. కించ---

శ్లో. యస్మిన్ జీవతి జీవన్తి బహవః సోఽత్ర జీవతు
వయాంసి కిం న కుర్వన్తి చఞ్చ్వా స్వోదరపూరణమ్. 23

అ. మరియూ, ఎవడు జీవించడంతో అనేకులు జీవిస్తారో, వాడే జీవించు గాక. అనగా అతని జీవితం సఫలం అని భావం. పక్షులు కూడ ముక్కుతో తమ పొట్టను నింపుకుంటున్నాయి గదా!

మూ. తథా చ–

శ్లో. యజ్జీవ్యతే క్షణమపి ప్రథితం మనుష్యైః
విజ్ఞానశౌర్యవిభవాదిగుణైః సమేతమ్.
తన్నామ జీవితమిహ ప్రవదన్తి తజ్జ్ఞాః
కాకోఽపి జీవతి చిరాయ బలిం చ భుఙ్క్తే. 24

అ. విజ్ఞానం శౌర్యం ఐశ్వర్యం మొదలైన సద్గుణాలతో గూడినదై ప్రతిష్ఠాయుక్తమైన జీవితం మానవులకు క్షణకాలమైనను చాలు. అలాంటి జీవితాన్నే, సజ్జనులు నిజమైన జీవితంగా ప్రశంసిస్తారు ఇక వ్యర్థంగా కాకియు చాలకాలం జీవిస్తుంది– బలిమెతుకులు తింటుంది.

శ్లో. యో నాత్మనా న చ పరేణ చ బన్ధువర్గే
దీనే దయాం న కురుతే న చ మర్త్యవర్గే.
కిం తస్య జీవితఫలం హి మనుష్యలోకే
కాకోఽపి జీవతి చిరాయ బలిం చ భుఙ్క్తే. 25

అ. ఎవడైతే స్వయంగా గాని, ఇతరులచే ప్రేరితుడై గాని బంధువుల యెడను, దీనుల యెడను, సాటిమానవుల యెడను దయ దలంపడో అలాంటి వాని జీవితానికి ఈ లోకంలో ఉపయోగం ఏముంది?కాకియు వ్యర్థంగా చిరకాలం జీవిస్తుంది. బలిమెతుకులు తింటుంది.

శ్లో. సుపూరా స్యాత్ కునదికా సుపూరో మూషికాఞ్జలిః
సుసన్తుష్టః కాపురుషః స్వల్పకేనాఽపి తుష్యతి. 26

అ. చిన్నవాగు కొద్దివానతో పొంగిపొరలుతోంది. ఎలుకనోరు కొద్దిపాటి ధాన్యపు గింజలతో ఉబ్బిపోతుంది. అలాగే అల్పబుద్ధి, తనకులభించిన అల్పవస్తువుతోనే సంతృప్తి పొందును.

మూ॰ కిఞ్చ—

శ్లో. కిం తేన జాతు జాతేన మాతుర్యౌవనహారిణా
ఆరోహతి నయః స్వస్య వంశస్యాగ్రే ధ్వజో యథా. 27

అ. ఎవడు, జండావలె వంశాగ్రమున విరాజిల్లడో వానిజన్మ నిష్ఫలం. కేవలం తల్లి యౌవనం హరించునదే అగును.

(వంశ=కులము, వెదురుకఱ్ఱ)

శ్లో. పరివర్తిని సంసారే మృతః కో వా న జాయతే
జాతస్తు గణ్యతే సోఽత్ర యః స్ఫురేచ్చ శ్రియాఽధికః. 28

అ. పరిణామశీలమైన ఈ ప్రపంచంలో చచ్చిన ప్రతివాడూ తప్పక పుట్టుతాడు. కానీ ఎవడు అధికసంపదచే దేదీప్యమానుడై ఉంటాడో అలాంటివాని జన్మయే పరిగణింపబడుతూంది.

మూ॰ కించ—

శ్లో. జాతస్య నదీతీరే తస్యాఽపి తృణస్య జన్మసాఫల్యమ్
యత్సలిలమజ్జనాకులజనహస్తాలమ్బనం భవతి. 29

అ. మరియు (అప్రసిద్ధుని జన్మకంటె) నదీతీరాన పుట్టిన ఆ గడ్డి జన్మయు కొంత సఫలం. నదీజలంలో మునుగుతూ (ప్రాణభయంతో) కలతనందిన మానవునికి కొంతవరకు హస్తావలంబనంగానైనా ఉపయోగపడుతుంది.

మూ॰ తథా చ—

శ్లో. స్తిమితోన్నతసఞ్చారా జనసన్తాపహారిణః
జాయన్తే విరలా లోకే జలదా ఇవ సజ్జనాః. 30

అ. అటులనే పైకి క్రిందికి సంచరించునవియూ (అభివృద్ధిదశను అనభివృద్ధి దశను పొందువారును) జనుల సంతాపమును (సంతాప=వేడిమి-దుఃఖము)

పోగొట్టునవియూ అయిన వర్షించే మేఘాలగంటి సజ్జనులు లోకంలో చాల తక్కువగా జనిస్తారు.

శ్లో. నిరతిశయం గరిమాణం తేన జనన్యాః స్మరంతి విద్వాంసః
యత్కమపి వహతి గర్భం మహతామపి యో గురుర్భవతి. 31

అ మహాత్ములకును గురువైన శిశువును గర్భంలో వహించిన తల్లిని సాటి లేని మహిమాన్వితగా విద్వాంసులు స్మరిస్తుంటారు!

శ్లో. అప్రకటీకృతశక్తిః శక్తోఽపి జనస్తిరస్క్రియాం లభతే
నివసన్నన్తర్దారుణి లఙ్ఘ్యో వహ్నిర్న తు జ్వలితః. 32

అ. జమ్మి, మోదుగు మొదలైన కట్టెలలో అగ్ని ఉండినను దానిని త్రొక్కుచున్నారు, దాటుచున్నారుగూడ. అది జ్వలితం అయినచో అలా చేయరు. అలాగే మానవుడు యోగ్యుడై ఉండినను తన శక్తిని ప్రదర్శింపనిచో అవమానాలను పొందుతూంటాడు.

మూ. కరటక ఆహ– 'ఆవాం తావదప్రధానౌ, తత్కిమావయోరనేన వ్యాపారేణ. ఉక్తం చ–

శ్లో. అపృష్టోఽత్రాప్రధానో యో బ్రూతే రాజ్ఞః పురః కుధీః
న కేవలమసమ్మానం లభతే చ విడమ్బనమ్. 33

అ. కరటకుడు ఇలా అన్నాడు– మనం ఇప్పుడు ముఖ్యులం గాదు. అలాంటప్పుడు మనకు ఈ పనితో ఏమి? పెద్దలిలా అన్నారుకూడ–అప్రధానుడై ఉండి అడుగకయే రాజసన్నిధిని సలహాలు చెప్పే బుద్ధిహీనుడు అవమానాన్నేగాక వంచనగూడ పొందును.

మూ. తథా చ–

శ్లో. వచస్తత్ర ప్రయోక్తవ్యం యత్రోక్తం లభతే ఫలమ్
స్థాయీ భవతి చాత్యన్తం రాగః శుక్లపటే యథా. 34

అ. అటులనే! ఉపయోగం ఉండేచోటనే మాట్లాడాలి. తెల్లని గుడ్డపై వేసిన మెరుపురంగు అద్దకం స్థిరంగా ఉండును గదా!

మూ దమనక ఆహ– మా మైవం వద.

శ్లో. అప్రధానః ప్రధానః స్యాత్ సేవతే యది పార్థివమ్
ప్రధానోఽప్యప్రధానః స్యాద్ యది సేవావివర్జితః. 35

అ. దమనకుడు ఇలా అన్నాడు—వద్దు, అలా అనవద్దు. ప్రభువును మెలకువగా సేవిస్తే కొంతకాలానికి అప్రధానుడు ప్రధానుడు అవుతాడు. అలాగే సరిగా సేవింపనివాడు ప్రధానుడై ఉండిననూ అప్రధానుడగును.

మూ. యత ఉక్తం చ–

శ్లో. ఆసన్నమేవనృపతిర్భజతే మనుష్యం
విద్యావిహీనమకులీనమసంస్కృతం వా.
ప్రాయేణ భూమిపతయః ప్రమదా లతాశ్చ
యత్పార్శ్వతో భవతి తత్ పరివేష్టయంతి. 36

అ. విద్యావిహీనుడూ కులహీనుడూ సంస్కారహీనుడూ అయిన మానవునైననూ నిత్యం సమీపంలో ఉంటే అభిమానిస్తారు. సామాన్యంగా ప్రభువులు స్త్రీలు తీగెలు దాపున ఉండేవారిని హత్తుకొనడం సంభవిస్తుంది.

మూ. తథా చ–

శ్లో. కోపప్రసాదవస్తూని యే విచిన్వంతి సేవకాః
ఆరోహంతి శనైః పశ్చాద్ధున్వన్తమపి పార్థివమ్. 37

అ. మరియూ, ప్రభుని కోపానికి అనుగ్రహానికి ఉండే కారణాలను సరిగా అధ్యయనం చేయగల్గే సేవకులు క్రమక్రమంగా ప్రతికూలుడైన ప్రభువుదగ్గరను ఉన్నతపదవి నారోహిస్తారు.

శ్లో. విద్యావతాం మహేచ్ఛానాం శిల్పవిక్రమశాలినామ్
సేవావృత్తివిదాం చైవ నాశ్రయః పార్థివం వినా. 38

అ. అభివృద్ధిని కాంక్షించే విద్వాంసులకూ శిల్పులకూ వీరులకూ సేవ మర్మజ్ఞులకూ రాజాశ్రయం వినా వేఱే ఆధారం దుర్లభం.

శ్లో. యే జాత్యాదిమహోత్సాహా న్నరేన్ద్రాన్నోపయాంతి చ
తేషామామరణం భిక్షా ప్రాయశ్చిత్తం వినిర్మితమ్. 39

అ. తమ జాతివిద్యాది గౌరవాభిమానంచే రాజసన్నిధికి పోనివారికి మరణపర్యంతం భిక్షావృత్తియే ప్రాయశ్చిత్తం. ప్రభువును ఆశ్రయించినవాడు భోగభాగ్యాలతో తులతూగునని భావం.

శ్లో. యే చ ప్రాహుర్దురాత్మానో దురారాధ్యా మహీభుజః
ప్రమాదాలస్యజాడ్యాని ఖ్యాపితాని నిజాని తైః. 40

అ. 'ప్రభువులను సేవించడం చాలకష్టం' అని కొందరు దురాత్ములు పల్కుతూంటారు. అలా పల్కడం ద్వారా వారు తమ అజాగ్రత్తనూ సోమరితనాన్నీ మూర్ఖతనూ మాత్రం ప్రకటిస్తూన్నారు.

శ్లో. సర్పాన్ వ్యాఘ్రాన్ గజాన్ సింహాన్ దృష్ట్వోపాయైర్వశీకృతాన్
రాజేతి కియతీ మాత్రా ధీమతామప్రమాదినామ్. 41

అ. పాములూ పులులూ ఏనుగులూ సింహాలూ మొదలైనవన్నీ యూ ఉపాయాలచే లోబడుతున్నాయి. అలాంటప్పుడు సావధానులైన ధీమంతులకు ప్రభువును లోబఱచుకోడం ఒక లెక్కలోనిది గాదు.

శ్లో. రాజానమేవ సంశ్రిత్య విద్వాన్ యాతి పరాం గతిమ్
వినా మలయమన్యత్ర చన్దనం న ప్రరోహతి. 42

అ. విద్వాంసుడు ప్రభువు నాశ్రయించియే ఉన్నతమైన స్థానం పొందును. చందనవృక్షం మలయపర్వతంలో దప్ప వేఱొకచోట మొలవదు.

శ్లో. ధవలాన్యాతపత్రాణి వాజినశ్చ మనోరమాః
సదా మత్తాశ్చ మాతఙ్గాః ప్రసన్నే సతి భూపతౌ. 43

అ. ప్రభువు సంతుష్టుడైతే మనోహరములైన శ్వేతచ్ఛత్రాలూ ఉత్తమాశ్వాలూ మదగజాలూ మొదలైన భోగభాగ్యాలు అన్నియూ లభిస్తాయి.

మూ॰ కరటక ఆహ— 'అథ భవాన్ కిం కర్తుమనాః'? సోఽబ్రవీత్'— అద్యాస్మత్స్వామీ పింగలకో భీతో భీతపరివారశ్చ వర్తతే. తదేనం గత్వా భయ కారణం విజ్ఞాయ సంధి-విగ్రహ-యాన-ఆసన-సంశ్రయద్వైధీభావానామేక తమేన సంవిధాస్యే.'

అ కరటకుడు ఇలా అన్నాడు. 'అయితే ఇప్పుడు తాము ఏమి చేయదల చారు? దమనకుడు ఇలా బదులుపల్కాడు—'ఇప్పుడు మనప్రభువైన పింగళకుడు పరివారసమేతంగా భయగ్రస్తుడై ఉన్నాడు. అందుచే అతన్ని సమీపించి భయకారణం తెలిసికొని సంధి-విగ్రహం-యానం-ఆసనం - సంశ్రయం - ద్వైధీభావం - అనే ఆరింటితో తగినదాన్ని ఆశ్రయించి వ్యవహరిస్తాను.

సంధ్యాదుల లక్షణాలు శాస్త్రజ్ఞులచే నిర్వచింపబడినాయి—

1 సంధి=శత్రువు బలవంతుడైనచో రాజీ అగుట

2 విగ్రహం=శత్రువు సమబలుడైనచో యుద్ధానికి సిద్ధపడుట లేక-యుద్ధం చేయుట.

3 యానం=యుద్ధప్రయాణం చేయుట.

4 ఆసనం=శత్రువుపై దండయాత్రకు తగిన సమయాన్ని నిరీక్షిస్తూ ఉండడం.

5 సంశ్రయం=శత్రువుకంటె బలవంతుణ్ణి ఆశ్రయించడం.

6 ద్వైధీభావం=ఇద్దరు బలవంతులైన శత్రువులు ఉన్నచో వారికి భేద భావాలు పుట్టించి తాను నిశ్చలంగా ఉండుట.

మూ. కరటక ఆహ—'కథం వేత్తి భవాన్ యద్భయావిష్టోఽయం స్వామీ'! సోఽబ్రవీత్—'జ్ఞేయం కిమత్ర. యత ఉక్తఞ్చ—

శ్లో. ఉదీరితోఽర్థః పశునాఽపి గృహ్యతే హయాశ్చ నాగాశ్చ వహంతి చోదితాః
అనుక్తమప్యూహతి పణ్డితో జనః పరేఙ్గితజ్ఞానఫలా హి బుద్ధయః. 44

అ. కరటకుడు ఇలా అడిగాడు—'ప్రభువు భయపడినాడు' అని తామెలా గుర్తించారు? దమనకుడు అన్నాడు—'ఇందులో తెలియదగినది యేముంది? అందు వల్లనే పెద్దలు ఇలా అన్నారు—

చెప్పిన విషయాన్ని పశువుగూడ గ్రహిస్తుంది. గుఱ్ఱాలూ ఏనుగులూ తోలగానే బరువును లాగుతున్నాయి. పండితుడు తెలుపనిదాన్నిగూడ సందర్భాన్నిబట్టి ఊహిస్తాడు. ఆకారాదులద్వారా ఇతరుల భావాలను గ్రహించడం అనేదే ప్రతిభకు ప్రయోజనం.

మూ. తథా చ మనుః—

శ్లో. ఆకారై రిఙ్గితై ర్గత్యా చేష్టయా భాషణేన చ
నేత్రవక్త్రవికారైశ్చ లక్ష్యతేఽన్తర్గతం మనః. 45

అ. ఆకృతిలోని మార్పులూ, సంకేతాలు, గమనం, చేష్ట, సంభాషణం, చూపులు, ముఖభంగిమలు ఇత్యాదికంచే లోపలిమనస్సు తెలియబడును. అనగా మనస్సులోని భావాన్ని ఊహింపవచ్చును.

మూ. తదద్యైనం భయాకులం ప్రాప్య స్వబుద్ధిప్రభావేణ నిర్భయం కృత్వా వశీకృత్య చ నిజాం సాచివ్యపదవీం సమాసాదయిష్యామి"? కరటక ఆహ— అనభిజ్ఞో భవాన్ సేవాధర్మస్య. తత్కథమేనం వశీకరిష్యసి? సోఽబ్రవీత్— 'కథమహం సేవాఽనభిజ్ఞః? మయా హి తాతోత్సఙ్గే క్రీడతాఽభ్యాగత సాధూనాం నీతిశాస్త్రం పఠతాం యచ్ఛ్రుతం సేవాధర్మస్య సారం తద్హృది స్థాపితమ్. శ్రూయతాం, తచ్చేదమ్—

అ. అందుచే నేడే నేను భయవిచలితుడైన ప్రభువును సమీపిస్తాను—నా తెలివి బలిమిచే అతని భయంతొలిగిస్తాను—స్వాధీనపరచుకొని పోయినమంత్రిపదవిని మరల సంపాదిస్తాను.' అది విని కరటకుడు ఇలా అన్నాడు—'నీకు సేవాధర్మం తెలియదు. అట్టియెడ యెలా అతన్ని లోబరచుకోగలవు.' అందుకు దమనకుడు ఇలా అన్నాడు—'నేను సేవాధర్మం తెలియనివాడను ఎందుకు అగుదును? నేను బాల్యంలో తండ్రితొడపై కూర్చుండి ఆడుకొనేవాడను. అప్పుడు అచ్చటికివచ్చిన సజ్జనులు

నీతిశాస్త్రం పఠించేవారు. (చర్చించేవారు), నేను శ్రద్ధగా విని దానిసారాన్ని హృదయంలో పదిలపఱచుకున్నాను. దానిని తెల్పెదను వినుము—

## దమనకోక్తసేవాధర్మాః

శ్లో. సువర్ణపుష్పితాం భూమిం విచిన్వంతి నరా స్త్రయః
శూరశ్చ కృతవిద్యశ్చ యశ్చ జానాతి సేవితుమ్. 46

అ. శూరులూ విద్వాంసులూ సేవాధర్మవిదులూ-అనే త్రివిధమానవులు-వారు పురుషులైనను స్త్రీలైనను-సువర్ణపుష్పితమైన భూమిని వెదకుతారు. అనగా ఐశ్వర్యసమృద్ధప్రదేశాన్ని అన్వేషిస్తారు-అచ్చటికి చేరుతారు అని భావం.

శ్లో. సా సేవా యా ప్రభుహితా గ్రాహ్యా వాక్యవిశేషతః
ఆశ్రయేత్ పార్థివం విద్వాన్ తద్ద్వారేణైవ నాన్యథా. 47

అ. ప్రభువునకు హితం గూర్చునదియే సేవ అగును. అది విశేషించి ప్రభువాక్యంద్వారానే గ్రహింపదగి ఉంటుంది. అందుచే విద్వాంసుడు దాని (ప్రభువాక్యం) ద్వారానే ప్రభువును ఆశ్రయించాలి. వేఱేమార్గం లేదు.

శ్లో. యో న వేత్తి గుణాన్ యస్య న తం సేవేత్తు పణ్డితః
న హి తస్మాత్ ఫలం కిఞ్చిత్ సుకృష్టాదూసరాదివ. 48

అ. రాజనీతిపండితుడు సేవ్యప్రభు గుణాధికం సరిగా తెలియకపోతే అతన్ని (ఆ ప్రభువును) సేవింపరాదు. చవిటి నేలలోని వ్యవసాయంవలె ఆసేవ నిష్ఫలం.

శ్లో. ద్రవ్యప్రకృతిహీనోఽపి సేవ్యః సేవ్యగుణాన్వితః
భవత్యాజీవనం తస్మాత్ ఫలం కాలాన్తరాదపి. 49

అ. ధనం దుర్గం సేనా మిత్రులూ మొదలైన రాజ్యాంగబలం లేనివాడైననూ ఉత్తమ గుణాఢ్యుడైన ప్రభువు సేవ్యుడే. ఏలననగా-అతనివల్ల కాలాంతరమందైనా జీవనాధారం లభిస్తుంది.

శ్లో. అపి స్థాణువదాసీనః శుష్యన్ పరిగతః క్షుధా
న త్వజ్ఞానాత్మసమ్పన్నాద్ వృత్తిమీహేత పణ్డితః. 50

తె. రాజనీతిజ్ఞుడు విరిగిన మోడువలె (స్థాణువువలె) పడియున్ననూ, ఆకలిచే బహుధాపీడితుడై శుష్కిస్తూ ఉన్నను అజ్ఞానియైన ప్రభువువలన జీవికావృత్తిని కోరరాదు.

శ్లో. సేవకః స్వామినం ద్వేష్టి కృపణం పరుషాక్షరమ్
ఆత్మానం కిం స న ద్వేష్టి సేవ్యాసేవ్యం న వేత్తి యః. 51

అ. ఏ సేవకుడు తన ప్రభువును 'లుబ్ధుడు పరుషభాషణుడు' ఇత్యాదిగా పరుషవాక్కులతో నిందిస్తాడో వాడు వాస్తవానికి తననే నిందించుకొనుచున్నాడు. వడు సేవ్యాసేవ్యవివేకంలేని మూర్ఖుడు.

శ్లో. యస్యాశ్రిత్య న విశ్రామం క్షుధార్తా యాన్తి సేవకాః
సోఽర్కవన్నృపతిస్త్యాజ్యః సదా పుష్పఫలోఽపి సన్. 52

అ ఏ ప్రభువును సేవిస్తూ సేవకులు ఆకలిచే నకనకలాడుతూ విశ్రాంతి నెరుంగరో, ఆ ప్రభువు భోగభాగ్యాలుగలవాడైనా పుష్పఫలపూర్ణమైన జిల్లేడు చెట్టువలె సదా త్యాజ్యుడే.

శ్లో. రాజమాతరి దేవ్యాం చ కుమారే ముఖ్యమంత్రిణి
పురోహితే ప్రతీహారే సదా వర్తేత రాజవత్. 53

అ. రాజమాత, పట్టపురాణి, రాజపుత్రుడు, ముఖ్యమంత్రి, పురోహితుడు-ద్వారపాలకుడు-ఈ ఆరుగురియెడల రాజునందువలెనే ప్రవర్తిల్లాలి.

శ్లో. జీవేతి ప్రబ్రువన్ ప్రోక్తః కృత్యాకృత్యవిచక్షణః
కరోతి నిర్వికల్పం యః స భవేద్రాజవల్లభః. 54

అ. సేవకుడు కృత్యాకృత్యవివేకంతో ప్రభువు పిలువగానే 'ఆయుష్మంతులు విజయం' అని వెంటనే పల్కాలి. తర్వాత అతని ఆజ్ఞను నిస్సంకోచంగా నిర్వహించాలి. అలాంటి సేవకుడే రాజునకు ప్రీతిపాత్రుడౌను.

శ్లో. ప్రభుప్రసాదజం విత్తం సుప్రాప్తం యో నివేదయేత్
వస్త్రాద్యం చ దధాత్యఙ్గే స భవేద్రాజవల్లభః. 55

అ. ప్రభువు అనుగ్రహించిన ధనాన్ని గొప్పగా చెప్పుకొని సంతోషించాలి. ఆతడు ఇచ్చిన వస్త్రాదికముకు ధరించాలి. అట్టి సేవకుడే రాజునకు ఇష్టుడౌను.

శ్లో. అన్తఃపురజనైః సార్ధం యో న మన్త్రం సమాచరేత్
న కలత్రైర్నరేన్ద్రస్య స భవేద్రాజవల్లభః. 56

అ. అంతఃపురవాసులతో, అందును రాజపత్నులతో రహస్యసంభాషణాదికం చేయరాదు. అలాంటి సేవకుడే రాజునకు ప్రీతిపాత్రుడగును.

శ్లో. ద్యూతం యో యమదూతాభం హాలాం హాలాహలోపమామ్
పశ్యేద్దారాన్ వృథాకారాన్ స భవేద్రాజవల్లభః. 57

అ. జూదాన్ని యమదూతగానూ, మద్యాన్ని హాలాహలవిషంగాను సుందరాంగులైన రాజకాంతలను కురూపులుగాను తలంచేవాడే రాజునకు ప్రీతిపాత్రుడౌతాడు.

శ్లో. యుద్ధకాలేఽగ్రణీర్యః స్యాత్ సదా పృష్ఠానుగః పురే
ప్రభోర్ద్వారాశ్రితో హర్మ్యే స భవేద్రాజవల్లభః. 58

అ. ప్రభువునకు యుద్ధకాలంలో ముందుండువాడూ—నగరపర్యటనలో వెనుక అనుసరించేవాడూ—రాజభవనంలో ద్వారంవద్ద ఉండేవాడూ అయిన సేవకుడే రాజునకు ప్రీతిపాత్రుడౌతాడు.

శ్లో. సమ్మతోఽహం విభోర్నిత్యమితి మత్వా వ్యతిక్రమేత్
కృచ్ఛ్రేష్వపి న మర్యాదాం స భవేద్రాజవల్లభః. 59

అ. 'నేను ప్రభువునకు నిత్యం ప్రేమపాత్రుడను'—అని తలచి (గర్వింపక) కష్టములందునూ మర్యాదనుమీఱక ప్రవర్తించే సేవకుడే రాజునకు ప్రీతిపాత్రుడగును.

శ్లో. ద్వేషిద్వేషపరో నిత్యమిష్టానామిష్టకర్మకృత్
యో నరో నరనాథస్య స భవేద్రాజవల్లభః. 60

అ. రాజునకు శత్రువులైనవారిని ద్వేషించేవాడూ—ఇష్టులైనవారు కోరేపనులు చేసేవాడూ అయినవాడే రాజునకు ప్రీతిపాత్రుడౌతాడు.

శ్లో. ప్రోక్తః ప్రత్యుత్తరం నాహ విరుద్ధం ప్రభుణా నయః
న సమీపే హసత్యుచ్చైః స భవేద్రాజవల్లభః. 61

అ. ప్రభువు మాటకు విరుద్ధమైన సమాధానం చెప్పనివాడూ—అతనిదగ్గర బిగ్గరగా నవ్వనివాడూ ప్రభువునకు ప్రీతిపాత్రుడగును.

శ్లో. యో రణం శరణం తద్వన్మన్యతే భయవర్జితః
ప్రవాసం స్వపురావాసం స భవేద్రాజవల్లభః. 62

అ. యుద్ధభూమిని నిర్భయంగా స్వగృహంవలె, పరదేశనివాసాన్ని స్వనగర నివాసంవలె తలంచేవాడే రాజునకు ప్రీతిపాత్రుడౌతాడు.

శ్లో. న కుర్యాన్నరనాథస్య యోషిద్భిః సహ సఙ్గతిమ్
న నిన్దాం న వివాదఞ్చ స భవేద్రాజవల్లభః. 63

అ. రాజకాంతలతో స్నేహంగా ఉండరాదు, వారిని నిందింపరాదు. వారితో వాదులాడరాదు. అలాంటివాడే రాజునకు ప్రీతిపాత్రుడగును.

మూ. కరటక ఆహ— "అథ భవాంస్తత్ర గత్వా కిం తావత్ప్రథమం వక్ష్యతి, తత్తావదుచ్యతామ్." దమనక ఆహ—

అ. కరటకుడు ఇలా అన్నాడు—నరే, తాము అచ్చటికిపోయి మొట్టమొదట ఏమి మాట్లాడెదరో తెలుపండి. అందుకు దమనకుడు ఇలా చెప్పాడు—

శ్లో. ఉత్తరాదుత్తరం వాక్యం వదతాం సమ్ప్రజాయతే
సువృష్టిగుణసమ్పన్నాద్ బీజాద్బీజమివాపరమ్. 64

అ. (ముందుగానే ఇలా అని యెలా చెప్పగలం) సువృష్టికారణంగా ఒక బీజం నుండి సజాతీయమగు వేఱొక బీజం జన్మించునట్లు సందర్భాన్నిబట్టి వాక్య-ప్రతివాక్యాలద్వారా సంభాషణ వృద్ధి చెందుతుంది.

శ్లో. అపాయసన్దర్శనజాం విపత్తిముపాయసన్దర్శనజాఞ్చ సిద్ధిమ్
మేధావినో నీతిగుణప్రయుక్తాం పురస్స్ఫురన్తీమివ వర్ణయన్తి. 65

అ. అపాయ సందర్శనజన్యమైన ఆపద(అజాగ్రత్తచేత గల్గే ఆపద అనియు అందురు) ఉపాయాన్ని గుర్తించడంచే గల్గే కార్యసిద్ధి-ఈ రెంటినీ ప్రతిభాశాలురు నీతి శాస్త్రజ్ఞులవడంతో కన్నులకు గట్టినట్లు వర్ణించి బోధిస్తారు.

శ్లో. ఏకేషాం వాచి శుకవదన్యేషాం హృది మూకవత్
హృది వాచి తథాఽన్యేషాం వల్గు వల్గంతి సూక్తయః. 66

అ. కొందరికి మాటలు చిలుకపలుకులవలె మధురంగా ఉంటాయి. అనగా-హృదయం కాలుష్యయుక్తం అనిభావం. మరికొందరికి హృదయం మూగదై (నిర్మలమై) ఉంటుంది. అనగా వాక్కు కఠినం అనిభావం. ఇకకొందరు తమ సూక్తులద్వారా హృదయంలోనూ మాటలలోనూ-సరళతనూ సహృదయతనూ ప్రకటిస్తారు.

మూ. న చాహమప్రాప్తకాలం వక్ష్యే. ఆకర్ణితో మయా నీతిసారః పితుః పూర్వముత్సఙ్గం హి నిషేవతా.

శ్లో. అప్రాప్తకాలం వచనం బృహస్పతిరపి బ్రువన్
లభతే బహ్వవజ్ఞానమపమానఞ్చ పుష్కలమ్. 67

అ. నేను సందర్భశూన్యంగా మాట్లాడను. ఏలననగా-తండ్రితొడపై ఆడుకొనేటప్పుడే నీతిశాస్త్రం గ్రహించాను.

సందర్భశూన్యంగా మాట్లాడినచో బృహస్పతిగూడ అధికనిరాదరణా పుష్కలమైన అవమానం పొందును.

మూ. కరటక ఆహ-

శ్లో. దురారాధ్యా హి రాజానః పర్వతా ఇవ సర్వదా
వ్యాలాకీర్ణాః సువిషమాః కఠినా దుష్టసేవితాః. 68

అ. సర్పాదిక్రూరసత్వాకీర్ణములూ నిమ్నోన్నత ప్రదేశాలచే సమతాశూన్యాలూ కఠినశిలాయుతాలూ అయిన పర్వతాలవలె దుష్టజనసేవితులూ, సమబుద్ధిశూన్యులూ ఐన రాజులను సర్వదా ఆరాధించడం అసాధ్యం.

మూ. తథా చ-

శ్లో. భోగినః కఞ్చుకావిష్టాః కుటిలాః క్రూరచేష్టితాః
సుదుష్టా మన్త్రసాధ్యాశ్చ రాజానః పన్నగా ఇవ. 69

అ. అటులనే — ఎలాపాములు పడగగలవీ-కుబుసంతో కప్పబడినవీ-వంకర గమనం గలవీ - క్రూరచేష్టలుగలవీ-మిక్కిలిదుష్టములూ అయి ఉండియూ మంత్రాలకు లోబడుతున్నాయో అలాగే రాజులును భౌతికభోగసుఖవిలీనులూ సుందరవస్త్రావృతులూ కపటులూ క్రూరచేష్టలూ మిక్కిలిదుష్టులూ అయిఉన్ననూ నేర్పరులైన మంత్రుల ఆలోచనలకు లోబడుతారు.

శ్లో. ద్విజిహ్వాః క్రూరకర్మాణోఽనిష్టాశ్ఛిద్రానుసారిణః
దూరతోఽపి హి పశ్యంతి రాజానో భుజగా ఇవ. 70

అ. ఎలా పాములు రెండునాల్కలుగలవీ-క్రూరకర్మములూ-అనభీష్టాలూ-తొఱ్ఱలలో ప్రవేశించునవీ దూరంనుండియే చూచేవి అయిఉన్నాయో, అలాగే రాజులును రెండునాల్కలుగలవారూ (మాటనిలకడ లేనివారు) క్రూరకర్ములూ అందువల్లనే అందరికి అనభీష్టులూ దుష్టమార్గానుసారులూ దూరంనుండియే గూఢచారులద్వారా విషయాలు గ్రహించేవారు అయిఉందురు.

శ్లో. స్వల్పమప్యపకుర్వంతి యేఽభీష్టా హి మహీపతేః
తే వహ్నావివ దహ్యన్తే పతఙ్గాః పాపచేతసః. 71

అ. ఎవరేని సేవకులు రాజునకు ప్రీతిపాత్రులై ఉన్ననూ ప్రమాదవశాన మిక్కిలి స్వల్పమైన అపకారం చేయుదురుగాక. ఆ పాపాత్ములు అగ్నిపడిన పురుగుల వలె దహింపబడుదురు.

శ్లో. దురారోహం పదం రాజ్ఞాం సర్వలోకనమస్కృతమ్
స్వల్పేనాప్యపకారేణ బ్రాహ్మణ్యమివ దుష్యతి. 72

అ. సర్వజనవంద్యమైన రాజపదవి మిక్కిలి కష్టంలో పొందబడుతూంది. కాని అది స్వల్పమైన అపకారంచేతనే బ్రహ్మతేజంవలె మలినం అవుతుంది (చిన్న చిన్న రాగద్వేషాలుసైతం బ్రహ్మతేజాన్ని మలినంచేస్తాయి. అనిశాస్త్రం)

శ్లో. దురారాధ్యాః శ్రియో రాజ్ఞాం దురాపా దుష్పరిగ్రహాః
తిష్ఠన్త్యాప ఇవాధారే చిరమాత్మని సంస్థితాః. 73

అ. రాజసంపదలు శ్రమచే ఆరాధ్యాలూ ప్రాప్యాలూ పరిగ్రాహ్యాలూ అగును. కాని అవి ఆధారపాత్రాదికంలోని జలంవలె, సావధానంగా రక్షింప బడినసే తన దగ్గర చిరకాలం నిలుస్తాయి. (అనగా పాత్రనశిస్తే నీరు చెదరిపోవునట్లు రాజ్యాధారమగు అమాత్యాదికం సరిగా లేనిచోట రాజ్యం నిల్వదు.)

మూ. దమనక ఆహ— 'సత్యమేతత్పరమ్. కిన్తు—

శ్లో. యస్య యస్య హి యో భావస్తేన తేన సమాచరేత్
అనుప్రవిశ్య మేధావీ క్షిప్రమాత్మవశం నయేత్ 74

అ. ప్రతివారూ తమతమ భావానుసారం ఆచరింపవచ్చు కాని మేధావి మాత్రం ప్రభుని చిత్తం పూర్తిగా గుర్తించి ప్రవర్తించి అతన్ని లోబఱచుకుంటాడు.

శ్లో. భర్తుశ్చిత్తానువర్తిత్వం సువృత్తం చానుజీవినామ్
రాక్షసాశ్చాపి గృహ్యన్తే నిత్యం ఛన్దానువర్తిభిః. 75

అ. యజమానుని హృదయాన్ని అనుసరించటం, అతనివల్ల జీవనధారం పొందిన సేవకులకు శుభమైనవర్తన. నిత్యం అలా ప్రవర్తించే సేవకులకు రాక్షసప్రకృతి గల యజమానులుసైతం లోబడుదురు.

శ్లో. సరుషి నృపే స్తుతివచనం తదభిమతే ప్రేమ తద్ద్విషి ద్వేషః
తద్దానస్య చ శంసా అమన్త్రతన్త్రం వశీకరణమ్. 76

అ. ప్రభువుకోపిస్తే పొగడడం, అతనికి ఇష్టమైనవారిని ప్రేమించడం, అతని శత్రువులను ద్వేషించడం, అతని దానాన్ని ప్రశంసించడం మొదలైనవి మంత్రతంత్రాలు లేకయే అతన్ని వశీకరించుకొనే సాధనాలు.

మూ. కరటక ఆహ యద్యేవమభిమతం త్వర్హి శివాస్తే పంథానః సన్తు. యథాఽభిలషితమనుష్ఠీయతామ్.' సోఽపి ప్రణమ్య పింగళకాభిముఖం ప్రతస్థే.

అ. కరటకుడు ఇలా అనెను—ఇదే నీకు సమ్మతంగా ఉంటే నీ మార్గాలు శుభంబులు అగుత. తలంచినట్లు చేయుము. దమనకుడును అతనికి ప్రణామంచేసి పింగళకాభిముఖంగా పయనించాడు.

మూ. అథాఽఽగచ్ఛన్తం దమనకమాలోక్య పిఙ్గలకో ద్వాస్థమబ్రవీత్. 'అపసార్యతాం వేత్రలతా. అయమస్మాకం చిరన్తనో మంత్రిపుత్రో దమనకోఽవ్యాహతప్రవేశః. తత్ప్రవేశ్యతాం ద్వితీయమణ్డలభాగీ'-ఇతి. స ఆహ-యథాఽఽవాదీత్ భవాన్'-ఇతి.

అ. అంతటవచ్చే దమనకుని చూచి పింగళకుడు ద్వారపాలకునితో ఇలా అన్నాడు—'వేత్రలత తొలగింపుము. ఈ వచ్చేవాడు మా ప్రాచీనమంత్రి పుత్రుడు దమనకుడు. అతని ప్రవేశానికి ఆటంకం లేదు. అందుచే రెండవరకం అధికారిగా ప్రవేశపెట్టుము'. ద్వారపాలకుడు—'ప్రభువుల ఆజ్ఞానుసారం'-అన్నాడు.

మూ. అథోపసృత్య దమనకో నిర్దిష్ట ఆసనే పింగలకం ప్రణమ్య ప్రాప్తానుజ్ఞ ఉపవిష్టః. స తు తస్య నఖకులిశాలంకృతం దక్షిణపాణిముపరి దత్త్వా మానపురస్సరమువాచ- 'అపి శివం భవతః? కస్మాచ్చిరం దృష్టోఽసి'? దమనక ఆహ- 'న కిఞ్చిద్దేవపాదానామస్మాభిః ప్రయోజనమ్. పరం భవతాం ప్రాప్తకాలం వక్తవ్యమ్. యత ఉత్తమ-మధ్యమ-అధమైః సర్వైరపి రాజ్ఞాం ప్రయోజనమ్. ఉక్తఞ్చ--

అ. అంత దమనకుడు సమీపించి పింగళకునికి నమస్కరించాడు. అతని ఆజ్ఞచే నిర్దిష్టపీఠంపై కూర్చున్నాడు. పిమ్మట పింగళకుడు వజ్రాలవలె నిగనిగమెరసే గోళ్లతోడి తన కుడిచేతిని దమనకుని శిరంపై ఉంచి ఆదరంగా ఇలా అన్నాడు—'శుభమా? ఎందుకు ఇంతకాలం తర్వాత కనబడినారు'? దమనకుడు ఇలా అన్నాడు-'పూజ్యపాదులైన ప్రభువులకు మావలన ఏమియూ ఉపయోగంలేదు. కాని సందర్భాన్ని బట్టి ప్రభువులకు విన్నవింపవలసినది గలదు. ఏలననగా-ఉత్తమ-మధ్యమ-అధములందరితోడనూ రాజులకు ఉపయోగం ఉందని పెద్దలందురు—"

శ్లో. దన్తస్య నిష్కోషణకేన నిత్యం కర్ణస్య కణ్డూయనికేన వాపి
తృణేన కార్యం భవతీశ్వరాణాం కిమంగ వాగ్ఘస్తవతా నరేణ. 77

అ. దంతములనందుల గ్రుచ్చుకొనుటకు-చెవులను గోకుకొనుటకు గడ్డిపరక తోడను ప్రభువులకు ఉపయోగం ఉంది. అట్టియెడ వాగాదిఇంద్రియాలుగల మనుష్యునితో ఉపయోగం ఉండడంలో ఆశ్చర్యం ఏముంది ?

మూ. తథా వయం దేవపాదానామన్వయాగతా భృత్యా ఆపత్స్వపి పృష్ఠగామినో యద్యపి స్వమధికారం న లభామహే తథాపి దేవపాదానామేతద్యుక్తం న భవతి. ఉక్తఞ్చ-

శ్లో. స్థానేష్వేవ నియోక్తవ్యా భృత్యా ఆభరణాని చ
న హి చూడామణిః పాదే ప్రభవామీతి బధ్యతే. 78

అ. మరియూ మేము ప్రభువుల శ్రీపాదాలకు వంశక్రమంగా వచ్చిన సేవకులము. ఆపదలందునూ వెంటనుండేవారం. అయినా ఈ సమయంలో మేము మా అధికారం పొందలేదన్నచో ఇది ప్రభువులకు సముచితంగాదు. పెద్దలు ఇలా అన్నారు-

సేవకులను ఆభరణాలను వాటివాటి స్థానాలందే ఉంచాలి. 'ఇది శ్రేష్ఠం' అని తలంచి చూడామణిని పాదానికి బంధింపం గదా ?

మూ. యతః-

శ్లో. అనభిజ్ఞో గుణానాం యో న భృత్యైరనుగమ్యతే
ధనాఢ్యోఽపి కులీనోఽపి క్రమాయాతోఽపి భూపతిః. 79

అ. ఏలననగా-యజమాని, ధనికుడైనా సత్కులసంజాతుడైనా వంశక్రమంగావచ్చిన భూపాలుడైనా గుణగ్రాహికానిచో అతనికి సేవకులు సరిగాతోడ్పడరు.

మూ. ఉక్తఞ్చ--

శ్లో. అసమైః సమీయమానః సమైశ్చ పరిహీయమాణసత్కారః
ధురి యో న యుజ్యమానస్త్రిభిరర్థపతిం త్యజతి భృత్యః. 80

అ. విజ్ఞులు ఇలా అన్నారు-'అసమానులతో తుల్యంగా చూడబడడం సాటివారితో సమంగా గౌరవం పొందకపోవడం కార్యభారంలో నియమింపబడకపోవడం-అనే ఈ మూడు కారణాలవల్ల సేవకుడు ప్రభువును పరిత్యజిస్తాడు.

మూ. యచ్చావివేకితయా రాజా భృత్యానుత్తమపదయోగ్యాన్ హీనాధమస్థానే నియోజయతి, న తే తత్రైవ తిష్ఠంతి. స భూపతేర్దోషో న తేషామ్. ఉక్తం చ–

శ్లో. కనకభూషణసఙ్గ్రహోచితో యది మణిస్త్రపుషి ప్రతిబధ్యతే
న స విరౌతి న చాపి స శోభతే భవతి యోజయితుర్వచనీయతా. 81

అ. ఒకవేళ రాజు తన అవివేకంవల్ల ఉత్తమస్థానయోగ్యులైన సేవకులను హీనాధమస్థానాలలో ఉంచినట్లైతే ఆ సేవకులు ఆ పదవులందే స్థిరంగా ఉండరు. మరియూ ఇది రాజదోషమే కాని సేవకదోషంమాత్రం గాదు. అభిజ్ఞులిలా అన్నారు–

బంగారు ఆభరణాలలో పొదుగబడదగిన మణి తగరంలో పొదుగబడినంత మాత్రాన అది (మణి) రూపాంతరం పొందదు, కాంతిహీనం గాదు. అలా దానిని కూర్చినవాడే నిందింపబడును.

మూ. యచ్చ స్వామ్యేవం వదతి– 'చిరాద్ దృశ్యతే'– ఇతి. తదపి శ్రూయతామ్–

శ్లో. సవ్యదక్షిణయోర్యత్ర విశేషో నాస్తి హస్తయోః
కస్తత్ర క్షణమప్యార్యో విద్యమానమతిర్భవేత్. 82

అ. మరియు ప్రభువులు-'చాలా దినముల తర్వాత కనబడ్డారు'-అనిఅడిగారు. దానినీ వినండి–

కుడిచేతికి ఎడమచేతికి ఉండే భేదం గుర్తింపబడనిచోట నేర్పరియైన నీతిశాస్త్రజ్ఞుడు క్షణంగూడ ఉండజాలడు.

శ్లో. కాచే మణిర్మణౌ కాచో యేషాం బుద్ధిర్వికల్పతే
న తేషాం సన్నిధౌ భృత్యో నామమాత్రోఽపి తిష్ఠతి. 83

అ. ఎవరిబుద్ధికి గాజుముక్క మణిగాను, మణి గాజుముక్కగాను భ్రాంతిగా తోస్తుందో అట్టి ప్రభువులవద్ద నామమాత్రానికిని సేవకులు ఉండరు.

శ్లో. పరీక్షకా యత్ర న సన్తి దేశే నార్ఘన్తి రత్నాని సముద్రజాని
ఆభీరదేశే కిల చన్ద్రకాన్తం త్రిభిర్వరాటైర్విపణన్తి గోపాః. 84

అ. పరీక్షలు లేనిచోట సముద్రంలోపుట్టిన రత్నాలకైనా విలువ ఉండదు. లోకంలో ఇలా సామెతఉంది-'ఆభీరదేశంలో గొల్లవాండ్రు చంద్రకాంతమణిని మూడు పైసాలకు (గవ్వలకు) అమ్మెదరు, కొనెదరు.'

శ్లో. లోహితాఖ్యస్య చ మణేః పద్మరాగస్య చాన్తరమ్
యత్ర నాస్తి కథం తత్ర క్రియతే రత్నవిక్రయః. 85

అ. కెంపునకు పద్మరాగమునకు (=కొంతతక్కువ ఎరుపుగల మణి) భేదం తెలియనిచోట రత్నవ్యాపారం ఎలా జరుగుతుంది ?

శ్లో. నిర్విశేషం యదా స్వామీ సమం భృత్యేషు వర్తతే
తత్రోద్యమసమర్థానాముత్సాహః పరిహీయతే. 86

అ. ప్రభువు సేవకులందరియెడ సమానంగా ఉండరాదు. అలా ఉంటే సాహసవంతులకు ఉత్సాహం నశిస్తుంది. అనగా సాహసవంతులయెడ విశేషతచూపి ప్రోత్సాహక బహుమతులివ్వాలి అని భావం.

శ్లో. న వినా పార్థివో భృత్యైర్న భృత్యాః పార్థివం వినా
తేషాం చ వ్యవహారోఽయం పరస్పరనిబన్ధనః. 87

అ. సేవకులులేనిచో ప్రభువులేడు. అలాగే ప్రభువులేనిచో సేవకులులేరు. ఇలా ప్రభుసేవక వ్యవహారం అన్యోన్యాపేక్షితమైంది.

శ్లో. భృత్యైర్వినా స్వయం రాజా లోకానుగ్రహకారిభిః
మయూఖైరివ దీప్తాంశుస్తేజస్వ్యపి న శోభతే. 88

అ. సూర్యుడెంతటి తేజస్వి అయినా ప్రపంచానికి బహుధా ఉపకరించే కిరణాలులేనిచో ఎలా శోభిల్లడో, అలాగే ప్రజలకు పెక్కువిధాలుగా సాయపడే సేవకులు లేనిచో ప్రభువు ఎంతటి పరాక్రమి అయినా విరాజిల్లడు.

శ్లో. అరైః సన్ధార్యతే నాభిర్నాభౌ చారాః ప్రతిష్ఠితాః
స్వామిసేవకయోరేవం వృత్తిచక్రం ప్రవర్తతే. 89

అ. (బండిచక్రపు) ఆకులచే నాభి (నడిమితూము-కుండ) ధరింపబడు తూంది. అలాగే నాభిరంధ్రాలలో ఆకులు నిలువబడ్డాయి. ఇలాగే స్వామి సేవకులకు అన్యోన్యాశ్రయరూపమైన వృత్తిచక్రం ప్రవర్తిల్లుతూంది.

శ్లో. శిరసా విధృతా నిత్యం స్నేహేన పరిపాలితాః
కేశా అపి విరజ్యన్తే నిస్నేహాః కిం న సేవకాః. 90

అ. కేశములు శిరోవిధృతాలు స్నేహ(తైల)పరిపాలితాలు అయి రాణిస్తాయి అవి నిస్నేహాలు (తైలసంస్కారరహితాలు) అయితే ఎండుతాయి కఱకుబారుతాయి. సేవకులుగూడ స్నేహ(ప్రేమ) రహితంగా చూడబడితే ఎలాఉంటారో తేలిగ్గా ఊహించవచ్చు!

శ్లో. రాజా తుష్టో హి భృత్యానామర్థమాత్రం ప్రయచ్ఛతి
తే తు సమ్మానమాత్రేణ ప్రాణైరప్యుపకుర్వతే. 91

అ. రాజు సంతుష్టుడైతే సేవకులకు ధనాదికం బహూకరిస్తాడు. సేవకులైతే సన్మానమాత్రంచే ప్రాణాలొడ్డి ఉపకరిస్తారు.

శ్లో. ఏవం జ్ఞాత్వా నరేన్ద్రేణ భృత్యాః కార్యా విచక్షణాః
కులీనాః శౌర్యసంయుక్తాః శక్తా భక్తాః క్రమాగతాః. 92

అ. దీనిని గ్రహించి ప్రభువు విద్వాంసులూ నిపుణులూ సత్కులీనులూ శూరులూ సమర్థులూ భక్తులూ వంశక్రమాగతులూ అయినవారిని మాత్రమే సేవకులుగా ఉంచుకొనాలి.

శ్లో. యః కృత్వా సుకృతం రాజ్ఞో దుష్కరం హి తముత్తమమ్
లజ్జయా వక్తి నో కిఞ్చిత్తేన రాజా సహాయవాన్. 93

అ. ఎవడు రాజునకు శుభమూ కష్టసాధ్యమూ ఉత్తమహితమూ అయిన కార్యంచేసియూ సిగ్గుతో ఏమియుచెప్పడో వాడే సహాయకుడైన సేవకుడు.

శ్లో. యస్మిన్ కృత్యం సమావేశ్య నిర్విశఙ్కేన చేతసా
ఆస్యతే సేవకః స స్యాత్ కలత్రమివ చాపరమ్. 94

అ. ఏ సేవకునిపై కార్యభారముంచి ప్రభువు నిస్సందేహంగా ఉండగలడో అట్టి సేవకుడు ద్వితీయ కళత్రంవలె శుభకరుడు.

శ్లో. యోఽనాహూతః సమభ్యేతి ద్వారి తిష్ఠతి సర్వదా
పృష్టః సత్యం మితం బ్రూతే స భృత్యోఽర్హో మహీభుజామ్. 95

అ. పిలువబడకయు (అవసరంగుర్తించి) దగ్గరకు వచ్చువాడూ నిత్యం ద్వారంవద్ద ఉండువాడూ అడిగినచో సత్యాన్ని పరిమితభాషతో పల్కువాడూ అయిన వాడే రాజసేవకుడగుటకు అర్హుడు.

శ్లో. అనాదిష్టోఽపి భూపస్య దృష్ట్వా హానికరం చ యః
యతతే తస్య నాశాయ స భృత్యోఽర్హో మహీభుజామ్. 96

అ. ఆజ్ఞలేకపోయినను ప్రభువుకు సంభవింపబోయే ఆపదను గుర్తించి తొలగించేందుకు యత్నించేవాడే రాజసేవపదవికి అర్హుడు.

శ్లో. తాడితోఽపి దురుక్తోఽపి దణ్డితోఽపి మహీభుజా
యో న చిన్తయతే పాపం స భృత్యోఽర్హో మహీభుజామ్. 97

అ. ప్రభువు కొట్టినా తిట్టినా దండించినా అతనికి (ప్రభువునకు) కీడుతలంచనివాడే రాజసేవక పదవికి అర్హుడు.

శ్లో. న గర్వం కురుతే మానే నాపమానే చ తప్యతే
స్వాకారం రక్షయేద్యస్తు స భృత్యోఽర్హో మహీభుజామ్. 98

అ. గౌరవానికి గర్వింపక అగౌరవానికి తపించక మానావమానభావాలను ఆకారంద్వారా వ్యక్తంచేయనివాడే రాజసేవకపదవికి అర్హుడు.

శ్లో. న క్షుధా పీడ్యతే యస్తు నిద్రయా చ కదాచన
న చ శీతాతపాద్యైశ్చ స భృత్యోఽర్హో మహీభుజామ్. 99

అ. ఆకలికి నిద్రకు శీతాతపాదులకు చలింపనివాడే రాజసేవపదవికి అర్హుడు

శ్లో. శ్రుత్వా సాఙ్గ్రామికీం వార్తాం భవిష్యాం స్వామినం ప్రతి
ప్రసన్నాస్యో భవేద్యస్తు స భృత్యోఽర్హో మహీభుజామ్. 100

అ. 'యుద్ధం రాబోవుచున్నది' అనే వార్తవిని ప్రభువునకు సాయంచేసేందుకై ప్రసన్నముఖుడైనవాడే రాజసేవకపదవికి అర్హుడు.

శ్లో. సీమా వృద్ధిం సమాయాతి శుక్లపక్ష ఇవోడురాట్
నియోగ సంస్థితే యస్మిన్ స భృత్యోఽర్హో మహీభుజామ్. 101

అ. ఎవడు రాజకార్యనియుక్తుడు కాగానే రాజ్యసరిహద్దులు శుక్లపక్షచంద్రునివలె వృద్ధిపొందునో వాడే రాజసేవక పదవికి అర్హుడు.

శ్లో. సీమా సఙ్కోచమాయాతి వహ్నౌ ప్రక్షిప్తచర్మవత్
స్థితే యస్మిన్ స తు త్యాజ్యో భృత్యో రాజ్యం సమీహతా. 102

అ. ఎవడు రాజకార్యనియుక్తుడుకాగానే రాజ్యసరిహద్దులు అగ్గిలోవేయబడ్డ చర్మంవలె తగ్గిపోవునో అట్టి సేవకుణ్ణి రాజ్యవృద్ధికోరే ప్రభువు పరిత్యజించాలి.

మూ. తథా శృగాలోఽయమితి మన్యమానేన మమోపరి స్వామినా యద్యవజ్ఞా క్రియతే. తదప్యయుక్తమ్. ఉక్తం చ యతః—

శ్లో. కౌశేయం కృమిజం సువర్ణముపలాద్ దూర్వాపి గోరోమతః
పఙ్కాత్తామరసం శశాఙ్క ఉదధేరిన్దీవరం గోమయాత్.

కాష్ఠాదగ్నిరహేః ఫణాదపి మణిర్గోపిత్తతో రోచనా
ప్రాకాశ్యం స్వగుణోదయేన గుణినో గచ్ఛంతి కిం జన్మనా. 103

అ. 'ఇది నక్క' అని తలంచి ప్రభువులు నన్ను తిరస్కరించడంసైతం సముచితంగాదు. ఏలననగా విద్వాంసులిలా అన్నారు-పురుగులనుండిపట్టు, రాతినుండి బంగారం, గోరోమాలనుండి గరిక, బురదనుండి కమలం, సముద్రంనుండి చంద్రుడు, ఆవుపేడనుండి నల్లకలువ, కట్టెనుండి అగ్ని, పాముపడగనుండి మణి, గోపైత్యరసంనుండి (గోవుక్రొవ్వునుండి) గోరోచనం పుట్టుతున్నాయి (ఇందుచే గుణవంతులు తమ గుణగరిమచే ప్రకాశిస్తారేగాని జన్మచేగాదు (అని తెలియుచున్నది).

శ్లో. మూషికా గృహజాతాఽపి హన్తవ్యా స్వాపకారిణీ
భక్ష్యప్రదానైర్మార్జారో హితకృత్ ప్రార్థ్యతే జనైః. 104

అ. ఎలుక ఇంటిలోపుట్టినా అవకారి అవడంతో చంపదగ్గది అవుతూంది. మేలుచేసే పిల్లిని జనులు ఆహారాదిదానంచే ఇంటనుంచగోరుదురు.

శ్లో. ఏరణ్డభిణ్డార్కనలైః ప్రభూతైరపి సఞ్చితైః
దారుకృత్యం యథా నాస్తి తథైవాజ్ఞైః ప్రయోజనమ్. 105

అ. ఆముదంచెట్లు, బెండచెట్లు, జిల్లేడుచెట్లు, బచ్చలిచెట్లు ఇత్యాదులనుఎంత అధికంగా సేకరించినా వాటివల్ల కఱ్ఱసామాను ఒక్కటియు తయారుకాదు. అలాగే మూర్ఖసేవకులెందరు ఉండినా ప్రభువుకు ఉపయోగం ఉండదు.

శ్లో. కిం భక్తేనాసమర్థేన కిం శక్తేనాపకారిణా
భక్తం శక్తం చ మాం రాజన్నావజ్ఞాతుం త్వమర్హసి. 106

అ. సేవకుడు భక్తుడై అసమర్థుడైనా అలాగే సమర్థుడై అపకారియైనా ప్రభువునకు ఉపయోగంలేదు. ఓరాజా ! భక్తుడూ శక్తుడూ అయిన నన్ను అవమానించడం సముచితంగాదు.

పిఙ్గలక ఆహ– 'భవత్వేవం తావత్. అసమర్థః సమర్థో వా చిరన్తనస్త్వమస్మాకం మన్త్రిపుత్రః. తద్విస్రబ్ధం బ్రూహి----యత్కిఞ్చిద్వక్తుకామః' దమనక ఆహ– దేవ, విజ్ఞాప్యం కిఞ్చిదస్తి. పిఙ్గలక ఆహ– 'తన్నివేదయాభిప్రేతమ్'. సోఽబ్రవీత్ –

శ్లో. అపి స్వల్పతరం కార్యం యద్భవేత్పృథివీపతేః
తన్న వాచ్యం సభామధ్యే ప్రోవాచేదం బృహస్పతిః. 107

అ. పింగళకుడు అన్నాడు– 'అటులే అగుగాత, సమర్థుడవైనా, అసమర్థుడవైనా నీవు మాకు చిరంతన మంత్రిపుత్రుడవు. అందువల్ల చెప్పదలచినదేదో నిరాపంకంగా (నిస్సంకోచంగా) తెల్పుము. దమనకుడు ఇలా అన్నాడు– 'ప్రభూ, ఒక

చిన్న విన్నపం. పింగళకుడు పల్కాడు-'నీ అభిప్రాయం నివేదింపుము. అతడు (దమనకుడు) ఇలా అన్నాడు—

"ప్రభూ, బృహస్పతి ఇలా నొక్కిచెప్పాడు - 'రాజకార్యం ఎంతస్వల్పమైనా సభామధ్యంలో తెలుపరాదు.

మూ. తదైకాంతికే మద్విజ్ఞాప్యమాకర్ణయన్తు దేవపాదాః. యతః—

శ్లో. షట్కర్ణో భిద్యతే మన్త్రశ్చతుష్కర్ణః స్థిరో భవేత్
తస్మాత్సర్వప్రయత్నేన షట్కర్ణం వర్జయేత్సుధీః. 108

అ. అందువల్ల ఏకాంతంగా (ఒంటరిగా) నా మనవి ప్రభువులు వినాలి. ఏలననగా- ఆరుచెవుల (ముగ్గురు మనుష్యుల) ద్వారా రహస్యం ప్రకటితమౌతుంది. నాలుగుచెవుల (ఇద్దరు మనుష్యుల) ద్వారా రహస్యం నిలుస్తుంది. అందువల్ల విద్వాంసుడు ఆరుచెవులను వదలాలి.

మూ. అథ పింగలకాభిప్రాయజ్ఞా వ్యాఘ్ర-ద్వీపి-వృక పురస్సరాస్సర్వేఽపి తద్వచః సమాకర్ణ్య సంసది తత్క్షణాదేవ దూరీభూతాః. తతశ్చ దమనక ఆహ- ఉదకగ్రహణార్థం ప్రవృత్తస్య స్వామినః కిమిహ నివృత్యాఽవస్థానమ్. పింగలక ఆహ సవిలక్షణస్మితమ్-'న కిఞ్చిదపి'. సోఽబ్రవీత్- 'దేవ, యద్యనాఖ్యేయం తత్తిష్ఠతు. ఉక్తం చ-

అ. అంతట పింగళకునిభావం గుర్తించి పెద్దపులులు చిరుతపులులు తోడేళ్లు మొదలైనవన్నీ అతని (దమనకుని) మాటవిని సభనుండి దూరంగా వెళ్ళాయి అప్పుడు దమనకుడు ఇలా అన్నాడు- 'నీరుత్రాగడానికి పోయిన ప్రభువులు వెనుదిరిగి ఇచ్చటికి వచ్చి ఎందుకు కూర్చున్నారు'. పింగళకుడు విలక్షణంగా (సిగ్గుపడి) మందహాసం చేస్తూ ఇలా అన్నాడు- 'ఏమీ లేదే?' దమనకుడు అన్నాడు 'ప్రభూ! అది తెలుపదగనిదైతే అలాగే ఉండనీయండి. విజ్ఞులిలా అన్నారు—

శ్లో. దారేషు కిఞ్చిత్ స్వజనేషు కిఞ్చిద్ గోప్యం వయస్యేషు సుతేషు కిఞ్చిత్
యుక్తం న వా యుక్తమిదం విచిన్త్య వదేద్విపశ్చిన్మహతోఽనురోధాత్. 109

అ. కొన్ని విషయాలు భార్యవద్ద, కొన్ని స్వజనులవద్ద, కొన్నిమిత్రుల సమ

షంలో కొన్ని పుత్రులముందు దాచదగినవై ఉంటాయి కాని మహాత్ములు నిర్బంధించి అడిగితే 'ఇది యుక్తం ఇది అయుక్తం' అని విచారించి వివేకియైనవాడు రహస్యాలను సైతం తెల్పాలి.

మూ. తచ్ఛ్రుత్వా పింగలకశ్చిన్తయామాస—'యోగ్యోఽయం దృశ్యతే తత్కథయామ్యేతస్యాగ్రే ఆత్మనోఽభిప్రాయమ్. ఉక్తఞ్చ—

శ్లో. సుహృది నిరన్తరచిత్తే గుణవతి భృత్యేఽనువర్తిని కలత్రే
స్వామిని సౌహృదయుక్తే నివేద్య దుఃఖం సుఖీ భవతి. 110

అ. దానిని విని పింగళకుడు ఇలా ఆలోచించాడు—'ఇతడు యోగ్యుసిలా కన బడుచున్నాడు అందువల్ల ఇతనికి నా అభిప్రాయం వెల్లడిస్తాను' పెద్దలిలా అన్నారు—

అనన్యచిత్తుడైన (మనస్సులు కలిసిన) మిత్రునితో, గుణవంతుడైన సేవకునితో, అనువర్తిని అయిన భార్యతో, సహృదయుడైన ప్రభువుతో తనదుఃఖం చెప్పుకొని మానవుడు సుఖవంతుడౌతాడు.

మూ. 'భో దమనక, శృణోషి శబ్దం దూరాన్మహాన్తమ్.' సోఽబ్రవీత్ 'స్వామిన్, శృణోమి. తతః కిమ్'? పింగలక ఆహ—'భద్ర, అహమస్మాద్వనాద్ గన్తుమిచ్ఛామి.' దమనక ఆహ— కస్మాత్? పింగలక ఆహ—'యతోఽద్యాస్మద్వనే కిమప్యపూర్వం సత్త్వం ప్రవిష్టం, యస్యాయం మహాశబ్దః శ్రూయతే. తస్య చ శబ్దానురూపేణ పరాక్రమేణ భావ్యమ్'— ఇతి. దమనక ఆహ— 'యచ్ఛబ్దమాత్రాదపి భయముపగతః స్వామీ. తదప్యయుక్తమ్. ఉక్తఞ్చ—

శ్లో. అమ్భసా భిద్యతే సేతుస్తథా మన్త్రోఽప్యరక్షితః
పైశున్యాద్భిద్యతే స్నేహో భిద్యతే వాగ్భిరాతురః. 111

అ. ఓయి దమనకా, దూరంనుండివచ్చే మహాశబ్దం వింటున్నావా?
దమనక—'ప్రభూ, వింటున్నాను, కాని దానివల్ల మనకేమి?
పింగళక—భద్ర ! నేను ఈ అడవి విడిచి వెళ్లదలుస్తున్నాను.
దమనక— ఎందులకు ?

పింగళక-ఈ అడవిలోకి ఏదో అపూర్వ ప్రాణి వచ్చింది. వినబడే ఈ మహాశబ్దం (బహుశా) దానిదే. శబ్దానికి తగిన పరాక్రమందానికి ఉండవచ్చు.

దమనక - ఇలా శబ్దంవల్లనే ప్రభువులు భయపడడం సముచితంగాదు. పెద్దలు ఇలా అన్నారు—

ప్రవాహవేగంచే సేతువు (ఆనకట్ట-వంతెన) కొట్టుకొనిపోవును. మంత్రము అరక్షితమై ప్రకటితమౌతుంది. పైశున్యంచె (లోభంచే-చాడీలచే) స్నేహం చెడుతుంది ఆతురుడు (కంగారుపడువాడు) మాటలచే బెదరిపోతాడు.

మూ. తన్న యుక్తం స్వామినః పూర్వోపార్జితం వనం త్యక్తుమ్. యతో భేరీ–వేణు-వీణా-మృదంగ-తాల-పటహ–శఙ్ఖ–కాహలాదిభేదేన శబ్దా అనేకవిధా భవంతి. తన్న కేవలాచ్ఛబ్దమాత్రాదపి భేతవ్యమ్. ఉక్తఞ్చ-

శ్లో. అత్యుత్కటే చ రౌద్రే చ శత్రౌ ప్రాప్తే న హీయతే
ధైర్యం యస్య మహీనాథః న స యాతి పరాభవమ్. 112

అ. అందువల్ల ప్రభువులు పూర్వంసంపాదితమైన అడవి వీడుట సమంజసం గాదు. మరియూ శబ్దాలూ, నగారాలు, వేణువులు, వీణలు, మద్దెలలు, తాళాలు, తప్పెటలు శంఖాలు, కొమ్ములు ఇత్యాదికంనుండి సంభవిస్తూ బహుధా ఉంటాయి. కనుక కేవలం శబ్దంవల్లనే భయపడరాదు. విజ్ఞులిలా అన్నారు—

ఏ భూపాలునికి అత్యంత భయంకరమైన శత్రువుతో తలపడినప్పుడును ధైర్యం సడలదో, అతడు (ఆ భూపాలుడు) పరాభవం ఎన్నటికిని పొందదు.

శ్లో. దర్శితభయేఽపి ధాతరి ధైర్యధ్వంసో భవేన్న ధీరాణామ్
శోషితసరసి నిదాఘే నితరామేవోద్ధతః సిన్ధుః. 113

అ. విధాత భయపెట్టినా ధీరులకు ధైర్యంసడలదు. సరోవరాదుల శుష్కింపజేసే ఎండాకాలంలోనూ సముద్రం ఉద్ధృతంగానే ఉంటుంది.

మూ. తథా చ—

శ్లో. యస్య న విపది విషాదః సంపది హర్షో రణే న భీరుత్వమ్
తం భువనత్రయతిలకం జనయతి జననీ సుతం విరలమ్. 114

అ. అటులనే-ఎవనికి ఆపదలో విషాదం-సంపదలో సంతోషం-యుద్ధంలో పిరికితనం ఉండవో, అట్టి త్రిలోకతిలకుని ఏ తల్లియో అరుదుగా ప్రసవిస్తుంది.

మూ. తథా చ-

శ్లో. శక్తివైకల్యనమ్రస్య నిస్సారత్వాల్లఘీయసః
జన్మనో మానహీనస్య తృణస్య చ సమాగతిః. 115

అ. అటులనే బలహీనతవల్ల నమ్రుడూ(వంగునదీ) -నిస్సారత (పౌరుష శూన్యత, భారరాహిత్యం)వల్ల మిక్కిలి చులకన అయినవాడూ (తేలికయైనదీ) అయిన అభిమానహీనునిజన్మ గడ్డిపరకతో సమానం.

మూ. అపి చ-

శ్లో. అన్యప్రతాపమాసాద్య యో దృఢత్వం న గచ్ఛతి
జతుజాభరణస్యేవ రూపేణాపి హి తస్య కిమ్. 116

అ. మరియూ- ఎవడు ఇతరుని ప్రతాప పొందియూ దృఢతనొందడో, లక్కతోచేసిన బొమ్మవంటి వానిఆకృతిచే ఉపయోగం ఏముంది ?

మూ. తదేవం జ్ఞాత్వా స్వామినా ధైర్యావష్టమ్భః కార్యః. న శబ్ద మాత్రాద్ భేతవ్యమ్. అపి చ-

శ్లో. పూర్వమేవ మయా జ్ఞాతం పూర్ణమేతద్ధి మేదసా
అనుప్రవిశ్య విజ్ఞాతం యావచ్చర్మ చ దారు చ. 117

పింగలక ఆహ-'కథమేతత్?' సోఽబ్రవీత్--

అ. కను దీనిని గమనించి ప్రభువులు ధైర్యం అవలంబించాలి. శబ్ద మాత్రంచే భయపడరాదు. మరియూ ఇలా అన్నారు—

'నేను ఈ దుందుభిని క్రొవ్వుతో నిండినదని మొదట తలంచాను. కాని (బెజ్జం వేసికొని) లోనికి ప్రవేశించి 'పైన చర్మం మరియూ లోపలచుట్టూ కొయ్య'- అని గ్రహించాను.

దీనిని విని పింగళకుడు అన్నాడు-'ఇది ఎట్లు'? దమనకుడు (ఆ కథను)ఇలా చెప్పాడు—

## కథా–2

## శృగాలదున్దుభి–కథా

మూ. కశ్చిద్గోమాయుర్నామ శృగాలః క్షుత్క్షామకణ్ఠః ఇత స్తతః ఆహారార్థం పరిభ్రమన్ వనే సైన్యద్వయసఙ్గ్రామభూమిమపశ్యత్. తస్యాం చ దున్దుభేః పతితస్య వాయువశాద్వల్లీశాఖాగ్రైర్హన్యమానస్య శబ్దమశృణోత్. అథ క్షుభితహృదయశ్చిన్తయామాస – 'అహో వినష్టోఽస్మి. తద్యావన్నాస్య ప్రోచ్చారితశబ్దస్య దృష్టిగోచరే గచ్ఛామి తావదన్యతో వ్రజామి. అథవా నైతద్యుజ్యతే సహసైవ.

శ్లో. భయే వా యది వా హర్షే సమ్ప్రాప్తే యో విమర్శయేత్
కృత్యం న కురుతే వేగాన్న స సన్తాపమాప్నుయాత్. 118

తత్తావజ్జానామి కస్యాయం శబ్దః?

అ. గోమాయువు అనే ఒకానొక నక్క, ఆకలిచే శుష్కకంఠమై ఇటునటు తిరుగుచూ అడవిలో సేనాద్వయ యుద్ధభూమిని చూచింది. అచ్చట పడిన దుందుభిని గాలివశాన తీగలకొమ్మల అంచులు తగలడంతో వచ్చే శబ్దాన్ని వినింది. వెంటనే కలతనొంది ఇలా విచారింప సాగింది–'అయ్యో, చచ్చాను. ఈ శబ్దంచేసేవాని దృష్టిలో పడకముందే వేఱేచోటుకు పోయెదను. అయినా తొందరపడి అలాచేయడం తగదు.

భయంగానీ సంతోషంగానీ గల్గినప్పుడు వాటికి కారణాలు విచారించాలి. తొందరపడి ఏపనీ చేయరాదు. ఇలా ప్రవర్తించేవాడు దుఃఖం పొందడు.
అందుచే మొదట ఈ శబ్దం దేనిదో తెలిసికొందును.

మూ. ధైర్యమాలమ్బ్య విమర్శయన్ యావన్మన్దం మన్దం గచ్ఛతి తావద్దున్దుభిమపశ్యత్. స చ తం పరిజ్ఞాయ సమీపం గత్వా స్వయమేవ కౌతుకాదతాడయత్. భూయశ్చ హర్షాదచిన్తయత్–'అహో, చిరాదేతదస్మాకం మహద్భోజనమాపతితమ్. తన్నూనం ప్రభూతమాంసమేదోఽసృగ్భిః పరిపూరితం భవిష్యతి.'

అధైర్యంచేసికొని విచారిస్తూ మెల్లమెల్లగాపోయి నగారాను (దుందుభి) చూచింది. దాన్ని (ఆకారాది విశేషాలతో) చక్కగా తెలిసికొని దగ్గరకుపోయి స్వయంగా కుతూహలంతో ప్రోగించింది. పిమ్మట సంతోషంతో ఇలా తలంచింది. 'ఆహా! చిర కాలానికి మాకు ఈ మహత్తరభోజనం సంప్రాప్తమైంది. ఇది తప్పక అధికమైన మాంసంతో క్రొవ్వుతో రక్తంతో నిండిఉంటుంది ?

మూ. తతః పరుషచర్మావగుణ్ఠితం తత్కథమపి విదార్యైకదేశే ఛిద్రం కృత్వా సంహృష్టమనా మధ్యే ప్రవిష్టః. పరం చర్మవిదారణతో దంష్ట్రాభఙ్గః సమజని. అథ నిరాశీభూతస్తద్దారుశేషమవలోక్య శ్లోకమేనమపఠత్‌— 'పూర్వ మేవ మయా జ్ఞాతమ్' ఇతి. అతో న శబ్దమాత్రాద్భేతవ్యమ్.

అ. పిమ్మట కఠినచర్మంచే చుట్టబడిన ఆ దుందుభిని అతికష్టంమీద చీల్చి ఒకచోట బెజ్జం వేసింది. సంతోషంతో లోనికి ప్రవేశించింది. కాని చర్మాన్ని ఛేదించ డంలో దానిదంతాలు (కోరలు) ఊడిపోయాయి. పిమ్మట నిరాశచెంది దుందుభి సంబం ధించిన కొయ్యముక్కనుచూచి 'పూర్వమేవ మయా జ్ఞాతమ్'-ఇత్యాది శ్లోకం పఠించింది. కనుక శబ్దమాత్రంచే భయపడరాదు.

మూ. పిఙ్గలక ఆహ— 'భోః పశ్యాయం మమ సర్వోఽపి పరిగ్రహో భయవ్యాకులితమనాః పలాయితుమిచ్ఛతి. తత్కథమహం ధైర్యావష్టమ్భం కరోమి'. సోఽబ్రవీత్‌— 'స్వామిన్! నైషామేష దోషః. యతః స్వామిసదృశా ఏవ భవన్తి భృత్యాః ఉక్తఞ్చ—

శ్లో. అశ్వః శస్త్రం శాస్త్రం వీణా వాణీ నరశ్చ నారీ చ
పురుషవిశేషం ప్రాప్తా భవన్త్యయోగ్యాశ్చ యోగ్యాశ్చ. 119

అ. పింగళకుడు అన్నాడు-'ఓయీ! చూడుము. నా పరివారమంతా భయంతో కలతనంది పారిపోదలంచుతూంది. అలాంటప్పుడు నేనెలా ధైర్యం పొందగలను? దమనకుడు అన్నాడు-'ప్రభూ! ఇది వీరిదోషం గాదు. ఏలనన-స్వామితుల్యులుగానే సేవకులు ఉంటారు. అభిజ్ఞులిలా అన్నారు—

అశ్వం, ఆయుధం, శాస్త్రం, వీణా, వాక్కు, పురుషుడు, స్త్రీ ఈ ఏడు ఆశ్రయమైన వ్యక్తినిబట్టి యోగ్యాలు అయోగ్యాలు అగును.

మూ. తత్పౌరుషావష్టమ్భం కృత్వా త్వం తావదత్రైవ ప్రతిపాలయ, యావదహమేతచ్ఛబ్దస్వరూపం జ్ఞాత్వాఽఽగచ్ఛామి.. తతః పశ్చాద్యథోచితం కార్యమ్' ఇతి. పింగలక ఆహ– కిం తత్ర భవాన్ గన్తుముత్సహతే? స ఆహ– కిం స్వామ్యాదేశాత్ సద్భృత్యస్య కృత్యాకృత్యమస్తి? ఉక్తఞ్చ--

శ్లో. స్వామ్యాదేశాత్ సుభృత్యస్య న భీః సఞ్జాయతే క్వచిత్
ప్రవిశేన్ముఖమాహేయం దుస్తరం వా మహార్ణవమ్. 120

అ. అందుచే పౌరుషం అవలంబించి నేను ఆ శబ్దస్వరూపం తెలిసికొని వచ్చేంతవరకు ఇచ్చటనే ఉండండి.ఆ మీదట తగినట్లు చేయవచ్చు. దానిని విని పింగళకుడు ఇలా అన్నాడు–'నీవు అచ్చటికి వెళ్లడానికి ఉత్సాహపడుచున్నావా !' అందుకు దమనకుడిలా అన్నాడు– ప్రభువు ఆజ్ఞాపిస్తే మంచిసేవకునికి కర్తవ్యాకర్తవ్యాలు ఉండునా ఏమి ? పెద్దలిలా అన్నారు–

ప్రభుని ఆజ్ఞపొందిన సేవకునికి ఎచ్చటను ఏ విధమైన భయంగల్గదు.పాము నోటనైనా దుస్తరసముద్రంలోనైనా ప్రవేశిస్తాడు.

మూ. తథా చ–

శ్లో. స్వామ్యాదిష్టస్తు యో భృత్యః సమం విషమమేవ చ
మన్యతే న స సన్ధార్యో భూభుజా భూతిమిచ్ఛతా. 121

అ. అటులనే-ప్రభువు ఆజ్ఞాపించిన కార్యంలోని సారల్యకాఠిన్యాదులను
(ఎ) పరామర్శించే సేవకుని శ్రేయస్కాముడైన రాజు దగ్గర ఉంచుకోరాదు.
(బి) 'న మన్యతే' అని అన్వయించి క్రిందివిధంగా సైతం భావం చెప్పవచ్చును.

ప్రభువు ఆజ్ఞాపించిన కార్యంలోని సారల్యకాఠిన్యాదికమును తలంచని సేవకుణ్ణే అభివృద్ధికోరే రాజు దగ్గర ఉంచుకోవాలి.

మూ. పింగలక ఆహ– 'భద్ర, యద్యేవం తద్గచ్ఛ. శివాస్తే పన్థానః సన్తు'–ఇతి. దమనకోఽపి తం ప్రణమ్య సఞ్జీవకశబ్దానుసారీ ప్రతస్థే.

**అ.** పింగళకుడు అన్నాడు–ఓయీ, అలాగైతే వెళ్ళిరమ్ము. నీ మార్గములు శుభములగుత ? దమనకుడును అతనికి నమస్కరించి సంజీవకుని శబ్దాన్ని అనుసరిస్తూ వెళ్లాడు.

మూ. అథ దమనకే గతే భయవ్యాకులమనాః పింగలకశ్చింతయామాస– 'అహో! న శోభనం కృతం మయా యత్తస్య విశ్వాసం గత్వాఽఽత్మాభిప్రాయో నివేదితః. కదాచిద్దమనకోఽయముభయవేతనో భూత్వా మమోపరి దుష్టబుద్ధిః స్యాద్భ్రష్టాధికారత్వాత్. ఉక్తఞ్చ–

శ్లో. యే భవంతి మహీపస్య సమ్మానితవిమానితాః
యతన్తే తస్య నాశాయ కులీనా అపి సర్వదా. 122

అ. అంత దమనకుడు వెళ్లగానే భయంచే వ్యాకులచిత్తుడై పింగళకుడు ఇలా విచారించాడు–'అయ్యో! నేను చేసినపని శుభం కాదు. అతణ్ణి నమ్మి నా అభిప్రాయం తెలిపాను. అధికారచ్యుతుడవడంతో ఉభయవేతనుడై ఒకవేళ నాయెడ దుష్టబుద్ధితో వర్తిల్లునేమో! విజ్ఞులిలా అన్నారు–

ప్రభువుచే మొదట సన్మానంపొంది తర్వాత అవమానితులైన సేవకులు సత్కులీనులైనా ఆప్రభుని వినాశానికి నిత్యం యత్నిస్తూ ఉంటారు.

మూ. తత్తావదస్య చికీర్షితం వేత్తుమన్యత్ స్థానాన్తరం గత్వా ప్రతిపాలయామి. కదాచిద్దమనకస్తమాదాయ మాం వ్యాపాదయితుమిచ్ఛతి. ఉక్తఞ్చ–

శ్లో. న వధ్యన్తే హ్యవిశ్వస్తా బలిభిర్దుర్బలా అపి
విశ్వస్తాస్త్వేవ వధ్యన్తే బలవన్తోఽపి దుర్బలైః. 123

అ. అందుచే ఇతడు చేయదలంచినదేదో గ్రహించేందుకై మరియొకచోటుకు పోయి గమనిస్తాను. ఒకవేళ దమనకుడు అతన్ని తీసికొనివచ్చి నన్ను చంపదలచునేమో! పెద్దలు ఇలా అన్నారు—

ఎవరినీ నమ్మని బలహీనులను బలవంతులుసూ వధింపలేరు. అందర్నీ నమ్మే బలవంతులే దుర్బలులచే చంపబడుదురు.

శ్లో. బృహస్పతావపి ప్రాజ్ఞో న విశ్వాసం వ్రజేన్నరః
య ఇచ్ఛేదాత్మనో వృద్ధిమాయుష్యఞ్చ సుఖాని చ. 124

అ. తన అభివృద్ధి ఆయువూ సుఖాలు కోరే నరుడు ఎంతటి ప్రాజ్ఞుడైనా బృహస్పతినిగూడ విశ్వసింపరాదు.

శ్లో. శపథైః సన్ధితస్యాపి న విశ్వాసం వ్రజేద్రిపోః
రాజ్యలాభోద్యతో వృత్రః శక్రేణ శపథైర్హతః. 125

అ. శపథములచే సంధిచేసికొన్న శత్రువునుసైతం నమ్మరాదు. ఇంద్రుడు శపథాలద్వారా (విశ్వాసం గల్గించి) రాజ్యలాభాతురుడైన వృత్రుణ్ణి చంపాడు.

శ్లో. న విశ్వాసం వినా శత్రుః దేవానామపి సిద్ధ్యతి
విశ్వాసాత్త్రిదశేన్ద్రేణ దితేర్గర్భో విదారితః. 126

అ. దేవతల శత్రువుగూడ (రాక్షసుడు) విశ్వాసంగల్గించకపోతే లోబడడు. ఇంద్రుడు విశ్వాసం గల్గించియే దితి (రాక్షసజనని) గర్భాన్ని ఛేదించాడు.

మూ. ఏవం సమ్ప్రధార్య స్థానాంతరం గత్వా దమనకమార్గమవలోకయన్నేకాకీ తస్థౌ. దమనకోఽపి సఞ్జీవకసకాశం గత్వా వృషభోఽయమితి పరిజ్ఞాయ హృష్టమనా వ్యచిన్తయత్– 'అహో, శోభనమాపతితమ్. అనేనైతస్య సన్ధివిగ్రహద్వారేణ మమ పింగలకో వశ్యో భవిష్యతీతి. ఉక్తఞ్చ–

శ్లో. న కౌలీన్యాన్న సౌహార్దాన్నృపో వాక్యే ప్రవర్తతే
మంత్రిణాం యావదభ్యేతి వ్యసనం శోకమేవ చ. 127

అ. ఇలా నిశ్చయించి వేఱొకచోటికేగి దమనకుని (వచ్చే) దారినిచూస్తూ ఒంటరిగా కూర్చున్నాడు. దమనకుడున్నూ సంజీవకుని వద్దకుపోయి 'ఇది ఎద్దు' అని గ్రహించాడు. సంతోషం పొందాడు. ఇలా తలంచాడు. 'అహా, శుభం ప్రాప్తించింది. ఇతనితో అతనికి సంధి (మైత్రి) విగ్రహ (మైత్రీవిచ్ఛేద) ముల ద్వారా పింగళకుడు నాకు వశీభూతుడగును. పెద్దలిలా అన్నారు–

ప్రభువుకు ఏదేని ఆపద (వ్యసనం) గాని, దుఃఖంగాని సంభవిస్తేనేదప్ప కేవలం నత్కులీనతవల్లా, సౌహార్దంవల్లా, రాజు మంత్రులవాక్యాన్ని అనుసరింపడు.

శ్లో. సదైవాపద్గతో రాజా భోగ్యో భవతి మంత్రిణామ్
అత ఏవ హి వాఞ్ఛంతి మంత్రిణః సాపదం నృపమ్. 128

అ. నిత్యం ఆపదల్లో చిక్కుకొన్నరాజు మంత్రులకు భోగ్యపదార్థంఅగును. అందుచే మంత్రులు ప్రభువునకు ఆపదలు కోరుకుంటారు.

శ్లో. యథా నేచ్ఛతి నీరోగః కదాచిత్ సుచికిత్సకమ్
తథాఽఽపద్రహితో రాజా సచివం నాభివాఞ్ఛతి. 129

అ. రోగంలేనివాడు ఎన్నడును మంచివైద్యునిగూర్చి తలంపడు. అలాగే ఆపదలేని రాజు మంత్రిని అభిలషింపడు.

మూ. ఏవం విచింతయన్ పింగలకాభిముఖః ప్రతస్థే. పింగలకోఽపి తమాయాన్తం ప్రేక్ష్య స్వాకారం రక్షన్ యథాపూర్వం స్థితః. దమనకోఽపి పింగలకసకాశం గత్వా ప్రణమ్య ఉపవిష్టః. పింగలక ఆహ— 'కిం దృష్టం భవతా తత్సత్త్వమ్. దమనక ఆహ— దృష్టం స్వామిప్రసాదాత్. పింగలక ఆహ— 'అపి సత్యమ్? దమనక ఆహ— 'కిం స్వామిపాదానామగ్రేఽసత్యం విజ్ఞాప్యతే. ఉక్తం చ—

శ్లో. అపి స్వల్పమసత్యం యో పురో వదతి భూభుజామ్
దేవానాం చ వినశ్యేత స ద్రుతం సుమహానపి. 130

అ. ఇలా ఆలోచిస్తూ పింగళకునివద్దకు వెళ్లాడు. పింగళకుడును అతని రాకగుర్తించి తనఆకారం రక్షించుకొని (తన ఆందోళన బయటపడనీయక) పూర్వంవలె కూర్చుండెను. దమనకుడు పింగళకుని సమీపించి ప్రణమిల్లి అతనిఆజ్ఞతో కూర్చుండెను.

పింగళకుడు—నీవు ఆ ప్రాణిని చూచినావా ?

దమనకుడు —ప్రభువుల దయవల్ల చూచినాను.

పింగళకుడు—నిజమేనా ?

దమనకుడు—దేవరవారి పాదసన్నిధిని అసత్యం ఎందుకు విన్నవిస్తాను? పెద్దలన్నారు— ప్రభువుల సన్నిధిని దేవతాసన్నిధిని చిన్నఅసత్యంసైతం పల్కరాదు. అలాపల్కినవోవాడు ఎంత గొప్పవాడైనా త్వరలో నశిస్తాడు.

మూ. తథా చ—

శ్లో. సర్వదేవమయో రాజా మనునా సమ్ప్రకీర్తితః
తస్మాత్తం దేవవత్పశ్యేన్న వ్యలీకేన కర్హిచిత్. 13

అ. మరియూ మనువు ఇలా అన్నాడు, ప్రభువు సర్వదేవతా స్వరూపుడు. అందుచే అతన్ని దైవంవలె చూడాలి. అన్యవిధంగా వద్దు. వంచనవద్దు.

శ్లో. సర్వదేవమయస్యాఽపి విశేషో నృపతేరయమ్
శుభాశుభఫలం సద్యో - నృపాద్దేవాద్భవాన్తరే. 132

అ. సర్వదేవతా స్వరూపుడైనను ప్రభువునకు ఈ ప్రత్యేకత గలదు. మంచి చెడ్డలకు ఫలం ప్రభువువల్ల వెంటనే లభిస్తుంది. దైవ-వల్ల మరుజన్మలో లభిస్తుంది.

మూ. పిఙ్గలక ఆహ--'సత్యం దృష్టం భవిష్యతి భవతా. న దీనోపరి మహాన్తః కుప్యన్తీతి న త్వం తేన నిపాతితః. యతః--

శ్లో. తృణాని నోన్మూలయతి ప్రభఞ్జనో మృదూని నీచైః ప్రణతాని సర్వతః
స్వభావ ఏవోన్నతచేతసామయం మహాన్ మహత్స్వేవ కరోతి విక్రమమ్.

అ. పింగళకుడు అన్నాడు-నిజంగా నీవుచూచి ఉండవచ్చు. మహాత్ములు దీనులయెడ ఆగ్రహింపరు కనుక నిన్ను అతడు చంపలేదు-ఏలననగా--

వాయువు మెత్తనవీ క్రిందనుండేవీ అన్నివిధాల నమ్రమలూ అయిన గడ్డిపరకలను పెల్లగింపదు. ఇది గొప్పవారికి సహజగుణం. గొప్పవారు సాటిగొప్పవారి మీదనే తమ పరాక్రమం ప్రదర్శిస్తారు.

మూ. అపి చ--

శ్లో. గణ్డస్థలేషు మదవారిషు బద్ధరాగ
మత్తభ్రమద్భ్రమరపాదతలాఽహతోఽపి.
కోపం న గచ్ఛతి నితాన్తబలోఽపి నాగ
స్తుల్యే బలే తు బలవాన్ పరికోపమేతి. 134

అ. మదజలమందలి ఆసక్తితోచేరి(మదజలపానంచే) మత్తిల్లి పరిభ్రమించే తుమ్మెదలు(భ్రమరాలు)కపోలాలయందు తమ పాదాలతో తన్నుచుండినా, మదపుటేనుగు అధికబలంగలదైయున్ననూ, వాటిపై కోపం తెచ్చుకోదు. బలవంతుడు సాటిబలవంతుణ్ణే కోపిస్తాడు.

మూ. దమనక ఆహ-- 'అస్త్యేవం, స మహాత్మా, వయం కృపణాః

తథాపి స్వామీ యది కథయతి తం భృత్యత్వే నియోజయామి. పింగలక ఆహ– 'కిం భవాన్ శక్నోత్యేవం కర్తుమ్. దమనక ఆహ– కిమసాధ్యం బుద్ధే రస్తి. ఉక్తఞ్చ––

శ్లో. న తచ్ఛస్త్రైర్న నాగేన్ద్రైర్న హయైర్న పదాతిభిః
కార్యం సంసిద్ధిమభ్యేతి యథా బుద్ధ్యా ప్రసాధితమ్. 135

అ. దమనకుడు-అలాగే కానిండు. అతడు మహాత్ముడు, మేము అల్పులం. అయినా ప్రభువులు సెలవిస్తే అతణ్ణి సేవకధర్మంలో నియమిస్తాను.

పింగలకుడు—'నీవు ఇలా చేయగలవా ?'

దమనకుడు—బుద్ధికి అసాధ్యం ఏముంది? విజ్ఞులిలా అన్నారు— బుద్ధి ద్వారా కార్యం సంసిద్ధినిపొందినట్లు శస్త్రాలచే ఏనుగులచే గుఱ్ఱాలచే కాల్బలంచె సిద్ధింపదు.

మూ. పింగలక ఆహ 'యద్యేవం త్వ్యమాత్యపదేఽధ్యారోపిత స్త్వమ్. అద్య ప్రభృతి ప్రసాదనిగ్రహాదికం త్వయైవ కార్యమితి నిశ్చయః.

అ. పింగళకుడు అన్నాడు—'ఇలా అయితే నిన్ను అమాత్యపదవిలో నియమించాను. అనుగ్రహ నిగ్రహాదులు నీవే చేయాలి. ఇది మా నిశ్చయం.'

మూ. అథ దమనకః సత్వరం గత్వా సాక్షేపం తమిదమాహ–'ఏహ్యేహితో దుష్టవృషభ! స్వామీ పింగలకస్త్వామాకారయతి. కిం నిశ్శఙ్కో భూత్వా ముహుర్ముహుర్నదసి వృథా" ఇతి.

ఆ. అంత దమనకుడు వేగంగాపోయి ఆక్షేపస్వరంతో అతనితో (సంజీవకునితో) ఇలా అన్నాడు-"ఓయీ, దుష్టవృషభమా! ఇటు రమ్ము రమ్ము. ప్రభువైన పింగళకుడు నిన్ను పిలుస్తున్నాడు. నిర్భయంగా మాటిమాటికి ఎందుకు వ్యర్థంగా అంకె వేస్తావు ?

మూ. తచ్ఛ్రుత్వా సఞ్జీవకోఽబ్రవీత్—'భద్ర, కోఽయం పింగలకః? దమనక ఆహ–'కిం స్వామినం పింగలకమపి న జానాసి? తత్ క్షణం ప్రతి

పాలయ. ఫలేనైవ జ్ఞాస్యసి. నన్వయం సర్వమృగపరివృతో వటతలే స్వామీ పింగలకనామా సింహస్తిష్ఠతి.

అ. దానిని విని సంజీవకుడు అన్నాడు—'అయ్యా ! ఈ పింగలకుడెవరు ? దమనకుడు అన్నాడు—'ఏమి ప్రభువైన పింగళకునే ఎరుగవా ? అయితే క్షణం నిరీక్షింపుము. ఫలితంతో తెలిసికొందువు. సకలమృగ పరివృతుడై ఈ మా ప్రభువైన పింగళకుడు అనే సింహం మర్రిచెట్టునీడన గలడు.

మూ. తచ్ఛ్రుత్వా గతాయుషమివాత్మానం మన్యమానః సఞ్జీవకః పరం విషాదమగమత్. అహ చ-భద్ర, భవాన్ సాధుసమాచారో వచనపటుశ్చ దృశ్యతే. తద్యది మామవశ్యం తత్ర నయసి తదభయప్రదానేన స్వామినః సకాశాత్ ప్రసాదః కారయితవ్యః. దమనక ఆహ— భోః సత్యమభిహితం భవతా. నీతిరేషా. యతః—

శ్లో. పర్యన్తో లభ్యతే భూమేః సముద్రస్య గిరేరపి
న కథఞ్చిన్మహీపస్య చిత్తాన్తః కేనచిత్ క్వచిత్. 136

అ. దానిని విని తనకు ఆయువు మూడినట్లు తలుస్తూ సంజీవకుడు మిక్కిలి దుఃఖంపొందాడు. ఇలా అన్నాడు. "అయ్యా ! తాము మంచి వ్యవహర్తలుగాను వాక్నిపుణులుగాను కనబడుచున్నారు. అందువల్ల నన్ను అచ్చటికి తప్పక తీసికొనిపోదలంచినచో ప్రభువువలన అభయదానంతో అనుగ్రహించాలి." దమనకుడు ఇలా అన్నాడు-'ఓయీ, నీవు సత్యంపల్కావు. ఇదియేనీతి(అనగా రాజులను నమ్మరాదు) ఏలననగా-భూమికి సముద్రానికి పర్వతానికి అంతం లభిస్తుంది. కాని రాజు హృదయానికి అంతం (మనస్సులోని భావం) ఎవడును ఏ విధంగాను ఎచ్చటా పొందలేదు.

మూ. "తత్ త్వమత్రైవ తిష్ఠ. యావదహం తం సమయే దృష్ట్వా తతః పశ్చాత్ త్వామానయామి"- ఇతి. తథా అనుష్ఠితే దమనకః పింగలకసకాశం గత్వేదమాహ— 'స్వామిన్, న తత్ ప్రాకృతం సత్త్వమ్. స హి భగవతో మహేశ్వరస్య వాహనభూతో వృషభ ఇతి. మయా పృష్ట ఇదమూచే— మహేశ్వరేణ పరితుష్టేన కాలిన్దీపరిసరే శష్పాగ్రాణి భక్షయితుం సమాదిష్టః. కిం

బహునా? మమ ప్రదత్తం భగవతా క్రీడార్థం వనమిదమ్. పింగలక ఆహ– 'సత్యం జ్ఞాతం మయాఽధునా. న దేవతాప్రసాదం వినా శష్పభోజనో వ్యాలాకీర్ణే ఏవంవిధే వనే నిశ్శఙ్కా నదన్తో భ్రమన్తి తతస్త్వయా కిమభిహితమ్?'

ఆ. అందువల్ల నీవు ఇచ్చటనే ఉండుము నేను అతని అనుకూల సమయం చూచివస్తాను– పిమ్మట నిన్ను వెంటతీసికొని పోతాను ఇలాచేసి దమనకుడు పింగళకుని వద్దకుపోయి ఇట్లుచెప్పాడు– 'ప్రభూ, అది సామాన్యప్రాణి గాదు. భగవానుడు అయిన మహేశ్వరుని వాహనమైన వృషభం. నేను అడుగగా ఇలా అన్నాడు–పరమేశ్వరుడు సంతుష్టుడై యమునాతీరపరిసరాలయందు (ప్రదేశాలలో) లేతపచ్చికను మేయడానికి ఆజ్ఞ ఇచ్చాడు. అధికమేల? భగవానుడు నాకు ఈ వనం క్రీడార్థం అనుగ్రహించాడు (దానిని విని) పింగళకుడు అన్నాడు 'నేను నేడు సత్యం గ్రహించాను. దేవతానుగ్రహం లేక గడ్డితినే ప్రాణులు, సర్పాలతో నిండిన ఇలాంటి అడవిలో నిస్సంకోచంగా గర్జిస్తూ భ్రమిస్తాయా! పిమ్మట నీవు ఏమి అన్నావు?

మూ. దమనక ఆహ– ఏతదభిహితం మయా యదేతద్వనం చణ్డికావాహనభూతస్య మత్స్వామినః పింగిలకనామ్నః సింహస్య విషయీభూతమ్. తద్భవానభ్యాగతః ప్రియోఽతిథిః. తత్తస్య సకాశం గత్వా భ్రాతృస్నేహేనైకత్ర భక్షణపానవిహరణక్రియాభిరేకస్థానాశ్రయేణ కాలో నేయ ఇతి. తతస్తేనాపి సర్వమేతత్ప్రతిపన్నమ్. ఉక్తఞ్చ సహర్షమ్– స్వామినః సకాశాదభయదక్షిణా దాపయితవ్యా ఇతి. తదత్ర స్వామీ ప్రమాణమ్."

అ. దమనకుడిలా అన్నాడు – నేను ఇలా తెల్పాను–'ఈ అడవి భగవతి చండికాదేవికి వాహనమూ, మా ప్రభువూ అయిన పింగళకుడు అనే సింహం అధికారంలో ఉంది. అందువల్ల అభ్యాగతులైన తాము ప్రియమైన అతిథులు. కనుక అతని వద్దకుపోయి సోదరస్నేహంతో ఆహార-పాన విహారాలద్వారా ఒక్కస్థానంలో కాలం గడుపండి. అప్పుడతడు నామాటను అంగీకరించి సంతోషంతో ఇలాఅన్నాడు-ప్రభువుల నుండి అభయదక్షిణ ఇప్పించండి. ఆపైన ఇందు ప్రభువులచిత్తం.

మూ. తచ్ఛ్రుత్వా పిఙ్గలక ఆహ–'సాధు సుమతే, సాధు. మంత్రిశ్రోత్రియ, సాధు. మమ హృదయేన సహ సమ్మన్త్ర్య భవతేదమభిహితమ్.

తద్దత్తా మయా తస్యాభయదక్షిణా. పరం సోఽపి మదర్థేఽభయదక్షిణాం యాచయిత్వా ద్రుతతరమానీయతామ్' ఇతి. అథ సాధు చేదముచ్యతే—

శ్లో. అన్తస్సారైరకుటిలైరచ్ఛిద్రైః సుపరీక్షితైః
మంత్రిభిర్ధార్యతే రాజ్యం సుస్తమ్భైరివ మన్దిరమ్. 137

అ. దానిని విని పింగళకుడు ఇలా అన్నాడు—'లెస్స సుబుద్ధీ లెస్స మంత్రి శ్రేష్ఠా! లెస్స. నా హృదయంతో ఆలోచించినట్లు నీవు మాట్లాడినావు. అలాగే నేను అతనికి అభయదక్షిణ ఇచ్చాను. కాని అతనినుండియూ నాకు అభయదక్షిణ అర్థించి శీఘ్రాతిశీఘ్రంగా తీసికొనిరమ్ము. పెద్దలిలా లెస్సగానే చెప్పినారు—

చేవగలవీ, వంకరలేనివీ, బెజ్జాలులేనివి అయినట్లు సువరీక్షితాలైన స్తంభాలచే మందిరం ధరింపబడినట్లు, ప్రజ్ఞాబలులూ, అకపటులూ, అదోషులూ అయినట్లు సుపరీక్షితులైన మంత్రులచే రాజ్యం ధరింపబడును.

మూ. తథా చ—

శ్లో. మంత్రిణాం భిన్నసన్ధానే, భిషజాం సాన్నిపాతకే
కర్మణి వ్యజ్యతే ప్రజ్ఞా స్వస్థే కో వా న పణ్డితః. 138

అ. అటులనే—భేదోపాయంలో, సంధిచేయడంలో మంత్రులప్రతిభా, సన్నిపాత జ్వరం వచ్చినప్పుడు వైద్యులప్రతిభా వ్యక్తం అవుతాయి. స్వస్థావస్థలో అందరూ పండితులే.

మూ. దమనకోఽపి తం ప్రణమ్య సఞ్జీవకసకాశం ప్రస్థితః సహర్షమచిన్తయత్—'అహో, ప్రసాదసమ్ముఖో నః స్వామీ వచనవశగశ్చ సంవృత్తః. తన్నాస్తి ధన్యతరో మమ. ఉక్తం చ—

శ్లో. అమృతం శిశిరే వహ్నిరమృతం ప్రియదర్శనమ్
అమృతం రాజసమ్మానమమృతం క్షీరభోజనమ్. 139

అ. దమనకుడును అతనికి ప్రణామంచేసి సంజీవకునివద్దకు బయలుదేరాడు. సంతోషంతో ఇలా తలంచాడు. 'ఆహా, ప్రభువు ప్రసన్నుడూ వశీభూతుడూ

అయినాడు. నాకంటె ధన్యుడులేడు. పెద్దలన్నారు-

శిశిర ఋతువునందు(మాఘ, ఫాల్గుణ మాసాలలో)అగ్ని అమృతం (అమృతం వలె సుఖావహం) ప్రియజనదర్శనం అమృతం. రాజసన్మానం అమృతం. క్షీర భోజనం అమృతం.

మూ॰ అథ సఞ్జీవకసకాశమాసాద్య సప్రశ్రయమువాచ- భో మిత్ర, ప్రార్థితోఽసౌ మయా భవదర్థే స్వామ్యభయప్రదానమ్. తద్విశ్రబ్ధం గమ్యతామితి॰ పరం త్వయా రాజప్రసాదమాసాద్య మయా సహ సమయధర్మేణ వర్తితవ్యమ్॰ న గర్వమాసాద్య స్వప్రభుతయా విచరణీయమ్. అహమపి తవ సఙ్కేతేన సర్వాం రాజధురమమాత్యసదవీమాశ్రిత్యోద్ధరిష్యామి. ఏవం కృతే ద్వయోరప్యావయో రాజ్యలక్ష్మీర్భోగ్యా భవిష్యతి॰

శ్లో. ఆఖేటకస్య ధర్మేణ విభవాః స్యుర్వశే నృణామ్
నృప్రజాః ప్రేరయత్యేకో హన్త్యన్యోఽత్ర మృగానివ. 140

మూ॰ తథా చ—

శ్లో॰ యో న పూజయతే గర్వాదుత్తమాధమ మధ్యమాన్
భూపసమ్మానమాన్యోఽపి భ్రశ్యతే దంతిలో యథా. 141

సఞ్జీవక ఆహ— కథమేతత్? సోఽబ్రవీత్—

అ. పిమ్మట సంజీవకునివద్దకు వచ్చి స్నేహపూర్వకంగా (దమనకుడు) ఇలా అన్నాడు-'ఓ మిత్రమా! నేను తమకై ప్రభువును అభయప్రదానం అర్థించాను. కనుక నిర్భయంగా రండి. కాని రాజానుగ్రహం పొందిన తర్వాతగూడ తాము నాతో సమయ ధర్మానురూపంగా వర్తించాలి. గర్వంపొంది స్వప్రభుతతో ప్రవర్తిల్లరాదు. నేను మీ సంకేతంతో (సలహాతో-సైగతో) సమస్త రాజ్యభారం (వహించే) మంత్రిపదవి పొంది ఉద్ధరిస్తాను (మిమ్ము). ఇలాఅయితే మనకు ఇరువురికి రాజ్యసంపద (సమాన) భోగ్య మగును.

వేటకాని ధర్మంచే (వేటాడుటచే) మానవులకు సంపదలు లోబడుచున్నవి.

కొందరు ఈ వేటలో (తమకు సాయంగా) నరరూప ప్రజలను ప్రేరేపిస్తారు. మరి కొందరు (సాటిమానవులను) మృగాలవలె సంహరిస్తారు.

మరియూ-ఎవడు గర్వించి ఉత్తమ-మధ్యమాధములను అందరినీ గౌరవించడో, వాడు దంతిలునివలె రాజసన్మానమందియు భ్రష్టుడగును.

సంజీవకుడన్నాడు—'ఇది ఎట్లు'?

దమనకుడు ఇలా చెప్పాడు.

## కథా-3

## దన్తిలగోరమ్భయోః కథా

మూ. అస్త్యత్ర ధరాతలే వర్ధమానం నామ నగరమ్. తత్ర దన్తిలో నామ నానాభాణ్డపతిః సకలపురనాయకః ప్రతివసతి స్మ. తేన పురకార్యం నృపకార్యఞ్చ కుర్వతా తుష్టిం నీతాస్తత్పురవాసినో లోకా నృపతిశ్చ. కిం బహునా? న కోఽపి తాదృక్ కేనాపి దృష్టో, నాఽపి శ్రుతో వేతి. అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. నరపతిహితకర్తా ద్వేష్యతాం యాతి లోకే
జనపదహితకర్తా త్యజ్యతే పార్థివేన్ద్రైః.
ఇతి మహతి విరోధే వర్తమానే సమానే
నృపతిజనపదానాం దుర్లభః కార్యకర్తా. 142

అ. ఈ భూమండలమున వర్ధమానం అనే నగరం ఉంది. అందు గొప్ప శ్రీమంతుడూ (పెట్టుబడిదారుడు) సమస్తనగర నాయకుడూ అయిన దంతిలుడు అనే వాడు నివసించేవాడు. అతడు నగరకార్యాలూ రాజకార్యాలూ నిర్వహిస్తూ నగరవాసులను ప్రభువును సంతోషపఱచాడు. పెక్కులేల? అలాంటినేర్పరిని ఎవరూ ఎచ్చటా చూచిఉండరు, విని ఉండరుకూడ. ఇది లెస్సగా విజ్ఞులచే ఇలా చెప్పబడింది—

ప్రభువునకు హితమైనదాన్ని చేసేవాణ్ణి ప్రజలు ద్వేషిస్తారు. ప్రజాహిత కార్యాలుచేసేవాణ్ణి ప్రభువు అధికారంనుండి తొలగిస్తాడు. ఇలా మహత్తరవిరోధం ఉండినా రెండింటినీ (జాగ్రత్తగా) నిర్వహించేవాడు అరుదుగా లభిస్తారు.

మూ. అథైవం గచ్ఛతి కాలే దన్తిలస్య కదాచిద్వివాహః సమ్ప్రవృత్తః. తత్ర తేన సర్వే పురనివాసినో రాజసన్నిధిలోకాశ్చ సమ్మానపురస్సరమామన్త్ర్య భోజితా వస్త్రాదిభిః సత్కృతాశ్చ. తతో వివాహానన్తరం రాజా సాన్తఃపురః స్వగృహమానీయాభ్యర్చితః. అథ తస్య నృపతేర్గృహసమ్మార్జనకర్తా గోరమ్భో నామ రాజసేవకో గృహాయాతోఽపి తేనానుచితస్థాన ఉపవిష్టోఽవజ్ఞయాఽర్ధచన్ద్రం దత్వా నిస్సారితః. సోఽపి తతః ప్రభృతి నిశ్వసన్నపమానాన్న రాత్రావప్యధిశేతే. 'కథం మయా తస్య భాణ్డపతే రాజప్రసాదహానిః కర్తవ్యా' ఇతి చిన్తయన్నాస్తే. అథవా కిమనేన వృథాశరీరశోషణేన న కిఞ్చిన్మయా తస్యాపకర్తుం శక్యమితి. అథవా సాధు చేదముచ్యతే-

శ్లో. యో హ్యపకర్తుమశక్తః కుప్యతి కిమసౌ నరోఽత్ర నిర్లజ్జః
ఉత్పతితోఽపి హి చణకః శక్తః కిం భ్రాష్ట్రకం భఙ్క్తుమ్. 143

అ. ఇలా కాలం గడుస్తుండగా ఒకప్పుడు దంతిలునికి వివాహం జరిగింది. ఆ పెండ్లికి అతడు నగరవాసులందరినీ రాజసన్నిధి (మంత్రి, సేనాపతి, మొదలగు) వారిని సగౌరవంగా ఆహ్వానించాడు. విందుచేశాడు. వస్త్రాదులతో సత్కరించాడు. వివాహంతర్వాత మహారాజును రాణివాసంతో (తన గృహానికి) ఆహ్వానించి గౌరవించాడు. అంత రాజభవనంలో సమ్మార్జనం(కసవు ఊడ్చడం)చేసే గోరంభుడు అనే రాజసేవకుడు దంతిలుని ఇంటికివచ్చియు అనుచితస్థానంలో (గొప్పవారిస్థానంలో) కూర్చుండడంవల్ల అవమానకరంగా దంతిలునిచే అర్ధచంద్రప్రయోగంతో (మెడమీదచేయి వేయించిగెంటించడంతో) వెళ్ళగొట్టబడ్డాడు. అది మొదలు వాడు నిట్టూర్పులువిడుస్తూ అవమానంతో రాత్రులందును నిద్రించడంలేదు. 'నేను ఈ భాండపతికి (శ్రీమంతునికి) రాజానుగ్రహభంగం ఎలా గల్గించాలి'? అని చింతిస్తూండేవాడు. ఇలావ్యర్థంగా (దిగులుతో) శుష్కించడం దేనికి? నేను అతనికి ఏవిధమైన కీడుచేయజాలను. విజ్ఞులు దీనిని ఇలా లెస్సగా తెల్పారు-

అపకారంచేసే శక్తిలేని మానవుడు సిగ్గువీడి వ్యర్థంగా కోపంపొందరాదు. శనగగింజ (ఎంతగా) ఎగిరిపడినా భాండలిని పగుల గొట్టలేదుగదా ?

మూ. అథ కదాచిత్ ప్రత్యూషే యోగనిద్రాం గతస్య రాజ్ఞః శయ్యాన్తే మార్జనం కుర్వన్నిదమాహ—'అహో, దన్తిలస్య మహాన్ దృప్తత్వం యద్ రాజమహిషీమాలిఙ్గతి. తచ్ఛ్రుత్వా రాజా ససమ్భ్రమముత్థాయ తమువాచ భో భో గోరమ్భ, సత్యమేతత్ యత్ త్వయా జల్పితమ్? కిం దేవీ దంతిలేన సమాలిఙ్గితా'?— ఇతి. గోరమ్భః ప్రాహ—"దేవ! రాత్రిజాగరణేన ద్యూతాసక్తస్య మే బలాన్నిద్రా సమాయాతా. తన్న వేద్మి కిం మయాఽభిహితమ్."

అ. అంత ఒకనాడు ప్రాతఃకాలంలో రాజు మసకనిద్రయందుండగా అతని (రాజు) మంచందగ్గర కసవు ఊడ్చుతూ ఇలా అన్నాడు-''ఆహా, దంతిలుని పొగరుబోతుతనం. పట్టపురాణిని ఆలింగనం చేసుకుంటాడు.'' దానిని విని రాజు తొట్రుపాటుతో లేచి అతణ్ణి అడిగాడు-ఓరోరీ గోరంభ, నీవు పల్కింది సత్యమేనా ? పట్టపురాణిని దంతిలుడు కౌగిలించుకొన్నాడా ? గోరంభుడు ఇలా అన్నాడు- 'మహారాజా, జూదంవ్యసనంతో రాత్రిఅంతా మేల్కొన్ననాకు నిద్రముంచుకొనివచ్చింది. ఏమన్నానో తెలియదు.

మూ. రాజా సేర్ష్యం స్వగతమ్—'ఏష తావదస్మద్గృహేఽప్రతిహతగతిస్తథా దంతిలోఽపి. తత్ కదాచిదనేన దేవీ సమాలిఙ్గ్యమానా దృష్టా భవిష్యతి. తేనేదమభిహితమ్. ఉక్తఞ్చ—

శ్లో. యద్వాఞ్ఛతి దివా మర్త్యో వీక్షతే వా కరోతి వా
తత్స్వప్నేఽపి తదభ్యాసాద్ బ్రూతే వాఽథ కరోతి వా. 144

అ. రాజు అసూయతో తనలో ఇలా తలంచాడు-'ఈ గోరంభకునికివలెనే దంతిలునికి మా భవనంలో తిరుగటానికి ఆటంకంలేదు. అందుచే వీడు మహారాణిని దంతిలుడు కౌగిలించుకొనగా చూచిఉండవచ్చును. కనుకనే వీడు (గోరంభుడు) ఇలా పల్కాడు. విజ్ఞులచే ఇలా చెప్పబడింది.

మానవుడు పగలు దేనిని కోరునో చూచునో చేయునో దానినే అభ్యాసకారణంగా స్వప్నంలోనూ పల్కును చేయును.

మూ. తథా చ-

శ్లో. శుభం వా యది వా పాపం యన్నృణాం హృది సంస్థితమ్
సుగూఢమపి తద్‌జ్ఞేయం స్వప్నవాక్యాత్తథా మదాత్. 145

అ. అటులనే-మంచిదిగాని చెడ్డదిగాని ఏభావం మానవుల హృదయంలో ఉండునో, అది (ఆ భావం) ఎంతో గోప్యంగా ఉంచబడినదైనా స్వప్నవాక్యంవల్లనో మాదకద్రవ్య సేవనంవల్లనో ప్రకటితం అవుతుంది.

మూ. అథవా స్త్రీణాం విషయే కోఽత్ర సన్దేహః?

శ్లో. జల్పన్తి సార్ధమన్యేన పశ్యంత్యన్యం సవిభ్రమాః
హృద్గతం చింతయంత్యన్యం ప్రియః కో నామ యోషితామ్. 146

అ. ఇక స్త్రీల విషయంలో సందేహమేముంది ?

ఒకరితో (ఆత్మీయంగా) మాట్లాడుతారు. ఇంకొకర్ని విలాసంగా చూస్తారు. ఇక వేరొకర్ని మనస్సులో ఆలోచిస్తారు. (ఇలాంటప్పుడు) స్త్రీలకు (నిజమైన) ప్రియుడు ఎవరు ?

మూ. అన్యచ్చ-

శ్లో. ఏకేన స్మితపాటలాధరరుచో జల్పన్త్యనల్పాక్షరం
వీక్షన్తేఽన్యమితః స్ఫుటత్కుముదినీఫుల్లోల్లసల్లోచనాః.
దూరోదారచరిత్రచిత్రవిభవం ధ్యాయంతి చాన్యం ధియా
కేనేత్థం పరమార్థతోఽర్థవదివ ప్రేమాస్తి వామభ్రువామ్. 147

అ. మరియూ-ఒకరితో చిరునవ్వుచిందిస్తూ లేయెరుపు పెదవుల కాంతులు వెదజల్లుతూ ఎక్కువగా మాట్లాడుతారు. మరొకరిపైపు పూర్తిగా వికసించిన కలువల వంటి కన్నులతో విలాసంగా చూస్తారు. ఇక మనస్సులో దూరస్థుడూ, దాతయూ విచిత్ర చరిత్రుడూ, ఐశ్వర్యయుక్తుడూ ఆయిన వేరొక పురుషుణ్ణి ధ్యానిస్తూంటారు. ఈ వామలోచనలకు నిజమైన ప్రేమ ఎవరియందు పరమార్థంగా గలదో తెలుపసాధ్యమా. (ఎవరిపై లేదేమో?)

శ్లో. నాగ్ని స్తృప్యతి కాష్ఠానాం నాపగానాం మహోదధిః
నాంతకః సర్వభూతానాం న పుంసాం వామలోచనా. 148

అ. అగ్నికి కట్టెల (కాల్చడం)వలన, సముద్రానికి అనేక నదుల(సమాగమం) వలన, యమునికి సర్వభూతముల(సంహారం) వలన, వామలోచనకు అనేక పురుషుల (సంపర్కం)వలన తృప్తిలేదు.

శ్లో. రహో నాస్తి క్షణో నాస్తి నాస్తి ప్రార్థయితా నరః
తేన నారద నారీణాం సతీత్వముపజాయతే. 149

అ. ఒంటరితనం లభించక పోవడం, తీరిక లేకుండడం, ప్రార్థించేవాడు సమకూరకపోవడం ఇత్యాదికంచే ఓ నారదా! స్త్రీలకు పాతివ్రత్యం సిద్ధిస్తుంది.

శ్లో. యో మోహాన్మన్యతే మూఢో రక్తేయం మమ కామినీ
స తస్యా వశగో భూత్వా భవేత్క్రీడాశకున్తవత్. 150

అ. 'ఈకామిని నాయందు అనురాగవతి' –అని ఎవడేని అజ్ఞానంవలన తలంచెనేని వాడు ఆమెకులోబడి క్రీడాపక్షివలె అగును.

శ్లో. తాసాం వాక్యాని కృత్యాని స్వల్పాని సుగురూణ్యపి
కరోతి సః కృతైర్లోకే లఘుత్వం యాతి సర్వతః. 151

అ. స్త్రీల వాక్యములు పనులు–అవి మిక్కిలి చిన్నవిగానీ – లేక మిక్కిలి గొప్పవిగానీ–చేసేవాడు లోకంలో అన్నివిధాల చులకనయై పోవును.

శ్లో. స్త్రియం చ యః ప్రార్థయతే సన్నికర్షం చ గచ్ఛతి
ఈషచ్చ కురుతే సేవాం తమేవేచ్ఛంతి యోషితః. 152

అ. స్త్రీలు తమ్ము ప్రార్థించేవానిని, సమీపానికి వచ్చేవానిని, ఏకొద్దియో సేవచేసే వానిని కోరుదురు.

శ్లో. అనర్థిత్వాన్మనుష్యాణాం భయాత్పరిజనస్య చ
మర్యాదాయామమర్యాదాః స్త్రియస్తిష్ఠంతి సర్వదా. 153

అ. కోరేపురుషులు లేనందువలన– సేవకజనభయంవలను దుష్టస్త్రీలుకూడ

సర్వదా మర్యాదగా (విరుద్ధంగా) ప్రవర్తిస్తారు.

శ్లో. నాసాం కశ్చిదగమ్యోఽస్తి నాసాఞ్చ వయసి స్థితిః
విరూపం రూపవన్తం వా పుమానిత్యేవ భుఞ్జతే. 154

అ. ఈ స్త్రీలు, గమ్యాగమ్యవిచారంగాని, బాల, వృద్ధాదివరిశీలనగాని విరూప సురూపాదివిచక్షణగాని చేయరు కేవలపురుషుడు-అని అనుభవిస్తారు.

శ్లో. రక్తో హి జాయతే భోగ్యో నారీణాం శాటికా యథా
ఘృష్యతే యో దశాలమ్బి నితమ్బే వినివేశితః. 155

అ ఆసురక్తపురుషుడు చీరెవలె స్త్రీలకు భోగ్యపదార్థం అగును. వాడు దశా లంబియై నితంబ-వినివేశితుడై ఘర్షితుడగును [దశా-కామావస్థా-చీరెఅంచు]

అనగా-కాంతలు తాముకోరినచీరెను అంచులు వ్రేలాడునట్లు నితంబముల ధరించి వాటిరాపిడిచే ఎలా ఆనందిస్తారో, అలాగే తాముపలచిన పురుషునికి కామావస్థా దశను గల్గించి నితంబాదులపై జేర్చుకొని రతిఘర్షణచే అతన్ని అనుభవిస్తారు.

శ్లో. అలక్తకో యథా రక్తో నిష్పీడ్య పురుషస్తథా
అబలాభిర్బలాద్రక్తః పాదమూలే నిపాత్యతే. 156

అ. స్త్రీలు లత్తుకను బలంగాపిండి ఎలా పాదాలకు(పారాణిగా)పూసికొందురో అలాగే అనురక్తపురుషుని కౌగిలించుకొని తమ పాదాలపై పడవేసికొంటారు.

మూ. ఏవం స రాజా బహువిధం విలప్య తత్ప్రభృతి దంతిలస్య ప్రసాదపరాఙ్ముఖః సఞ్జాతః. కిం బహునా? రాజద్వారప్రవేశోఽపి తస్య నివారితః. దంతిలోఽప్యకస్మాదేవ ప్రసాదపరాఙ్ముఖమవనిపతిమవలోక్య చిన్తయామాస- 'అహో సాధు చేదముచ్యతే.

శ్లో. కోఽర్థాన్ ప్రాప్య న గర్వితో విషయిణః కస్యాపదోఽస్తం గతాః
స్త్రీభిః కస్య న ఖణ్డితం భువి మనః కో నామ రాజ్ఞాం ప్రియః.
కః కాలస్య న గోచరాన్తరగతః కోఽర్థీ గతో గౌరవం
కో వా దుర్జనవాగురాసు పతితః క్షేమేణ యాతః పుమాన్. 157

అ. ఇలా ఆ భూపతి పెక్కుభంగుల విచారించి అదిమొదలు దంతిలుని యెడ అనుగ్రహవిముఖుడాయెను. అధిక మేల ? రాజప్రవేశంకూడ అతనికి నిషిద్ధం అయింది. దంతిలుడును ప్రభువు అకస్మాత్తుగా అనుగ్రహశూన్యుడు అగుట గాంచి ఇలా విచారించాడు. 'ఆహా- విజ్ఞులు ఇలా సత్యం పల్కారు-

సంపదలపొంది గర్వంలేనివాడు, విషయలంపటుడై ఆపదలందనివాడు, స్త్రీలచే మనస్సు ఖండితం కానివాడు, రాజులకు (నిత్యం) ఇష్టమైనవాడు, మృత్యుపాశంలో చిక్కనివాడు, యాచకుడై గౌరవమందినవాడు, దుష్టుల (కపటములనే) వలలల్లో జిక్కి క్షేమంగా బయటపడినవాడు ఎవరుగలరు ? (ఎవరునులేరు)

మూ. తథా చ

శ్లో. కాకే శౌచం ద్యూతకారే చ సత్యం
సర్పే క్షాంతిః స్త్రీషు కామోపశాంతిః.
క్లీబే ధైర్యం మద్యపే తత్త్వచిన్తా
రాజా మిత్రం కేన దృష్టం శ్రుతం వా. 158

అ. ఆటులనే-కాకియందు పరిశుద్ధత, జూదగానియందు సత్యం, పాముయందుఓర్పు, స్త్రీలయందు కామోపశాంతి, నపుంసకునియందు ధైర్యం, త్రాగుబోతునందు వేదాంతవిచారం, రాజుమిత్రుడగుట ఇవి ఎవడూ చూచిఉండడు, వినిఉండడు.

మూ. అపరం మయాస్య భూపతేరథవాన్యస్యాపి కస్యచిద్రాజసమ్బంధినః స్వప్నేఽపి నానిష్టం కృతమ్. తత్కిమేతత్ పరాఙ్ముఖో మాం ప్రతి భూపతిః-ఇతి. ఏవం తం దంతిలం కదాచిద్రాజద్వారే విష్కమ్భితం విలోక్య సమ్మార్జనకర్తా గోరమ్భో విహస్య ద్వారపాలానిదమూచే- భో భో ద్వారపాలాః! రాజప్రసాదాధిష్ఠితోఽయం దంతిలః స్వయం నిగ్రహానుగ్రహకర్తా చ. తదనేన నివారితేన యథాహం తథా యూయమప్యర్ధచన్ద్రభాజినో భవిష్యథ.' తచ్ఛ్రుత్వా దంతిలశ్చిన్తయామాస- 'నూనమిదమస్య గోరమ్భస్య చేష్టితమ్. అథవా సాధ్విదముచ్యతే-

శ్లో. అకులీనోఽపి మూర్ఖోఽపి భూపాలం యోఽత్ర సేవతే
అపి సమ్మానహీనోఽపి స సర్వత్ర ప్రపూజ్యతే. 159

అ. మరియూ నేను ఈ రాజునకుగాని లేక రాజసంబంధియైన ఏ ఇతరునికి గాని స్వప్నంలోనూ అప్రియం చేయలేదు. అలాంటప్పుడు రాజు నావిషయంలో విముఖుడు అగుటకు కారణం ఏమి ? ఇలాఉండగా ఆ దంతిలుని ఒకనాడు రాజ ద్వారంలో (ద్వారపాలకుడు)నిరోధింపగా జూచి సమ్మార్జనకర్తఅయిన(కసువు ఊడ్చే) గోరంభుడు నవ్వి ద్వారపాలకులతో ఇలా అన్నాడు–'ఓరోరీ, ద్వారపాలకులారా, రాజానుగ్రహంపొందిన ఈ దంతిలుడు స్వయంగా దండింపను అనుగ్రహింపను సమర్థుడు. అందుచే నివారింతురేని నావలెనే మీరూ అర్ధచంద్రప్రయోగం (మెడపట్టి గెంటింపబడడం) పొందెదరు. దానిని విని దంతిలుడు ఇలా విచారించాడు–'ఇది నిజంగా ఈ గోరంభుని పనియే. పెద్దలిది చక్కగా చెప్పారు–

కులహీనుడుగాని మూర్ఖుడుగాని ఎవడేని ప్రభువును సేవిస్తే, వాడు గౌరవ హీనుడైనా అంతటా గౌరవింపబడును.

శ్లో. అపి కాపురుషో భీరుః స్యాచ్చేన్నృపతిసేవకః
తథాపి న పరాభూతిం జనాదాప్నోతి మానవః. 160

అ. కుత్సితుడూ పిరికివాడూ అయినమనుష్యుడును రాజసేవకుడైనచో జనులవలన అవమానంపొందడు.

మూ. ఏవం స బహువిధం విలప్య విలక్షమనాః సోద్వేగో గతప్రభావః స్వగృహం నిశాముఖే గోరమ్భమాహూయ వస్త్రయుగలేన సమ్మాన్యేదముదాచ– 'భద్ర, మయా న తదా రాగవశాన్నిఃసారితః. యత స్త్వం బ్రాహ్మణానామగ్రతోఽనుచితస్థానే సముపవిష్టో దృష్ట ఇత్యపమానితః. తత్ క్షమ్యతామ్. సోఽపి స్వర్గరాజ్యోపమం తద్వస్త్రయుగలమాసాద్య పరం పరితోషం గత్వా తమువాచ– 'భోః శ్రేష్ఠిన్. క్షాన్తం మయా తే తత్, తదస్య సమ్మానస్య కృతే పశ్య మే బుద్ధిప్రభావం, రాజప్రసాదఞ్చ'. ఏవముక్త్వా సపరితోషం నిష్క్రాన్తః. సాధు చేదముచ్యతే–

శ్లో. స్తోకేనోన్నతిమాయాతి స్తోకేనాయాత్యధోగతిమ్
అహో సుసదృశీ చేష్టా తులాయష్టేః ఖలస్య చ. 161

అ. ఇలా అతడు బహువిధముల పలపించి లజ్జితుడూ వ్యాకులితుడూ కలా విహీనుడు అయి తనయింటికి (పోయి) సాయంకాలం గోరంభుని పిలిపించి వస్త్రయుగళంతో సన్మానించి ఇలా అన్నాడు-'మిత్రమా! నిన్ను ఆనాడు క్రోధంతో గెంటింపలేదు కాని నీవు బ్రాహ్మణులయెదుట అనుచితస్థానంలో సముపవిష్టుడవై కనబడడంతో అవమానం పొందావు. దానిని క్షమింపుము.' అతడును [గోరంభుడును] స్వర్గరాజ్యతుల్యంగా ఆ వస్త్రములజంటను పొంది మిక్కిలి సంతుష్టుడై అతనితో[దంతిలునితో]ఇలా పల్కాడు. 'ఓ శ్రేష్ఠీ, నేను నీ ఆదోషం క్షమించాను. ఈ సన్మానానికి బదులుగా నాబుద్ధిప్రభావంతో [నీకు] రాజానుగ్రహం చూడుము' ఇలాపల్కి సంతోషంగా వెళ్ళాడు.

పండితులు ఇలా చక్కగా అన్నారు.

''ఆహా! త్రాసుకఱ్ఱ (తులాదండము), ఖలునిచేష్ట ఈరెండు మిక్కిలి సదృశాలు. అల్పంతోపైకి పోవును. అల్పంతో క్రిందికివచ్చును.

మూ. తతశ్చాన్యేద్యుః స గోరమ్భో రాజకులం గత్వా యోగనిద్రాం గతస్య భూపతేః సమ్మార్జనక్రియాం కుర్వన్నిదమాహ-'అహో, అవివేకోఽస్మద్భూపతేః, యత్పురీషోత్సర్గమాచరంశ్చిర్భటీభక్షణం కరోతి. తచ్ఛ్రుత్వా రాజా సవిస్మయం తమువాచ- 'రే రే గోరమ్భ, కిమప్రస్తుతం లపసి? గృహకర్మకరం మత్వా త్వాం న వ్యాపాదయామి. కిం త్వయా కదాచిదహమేవంవిధం కర్మ సమాచరన్ దృష్టః'. సోఽబ్రవీత్-'దేవ, ద్యూతాసక్తస్య రాత్రిజాగరణేన సమ్మార్జనం కుర్వాణస్య మమ బలాన్నిద్రా సమాయాతా. తయాధిష్ఠితేన మయా కిఞ్చిజ్జల్పితమ్. తన్న వేద్మి. తత్ప్రసాదం కరోతు స్వామీ నిద్రాపరవశస్య' ఇతి.

అ. పిమ్మట మరుసటిదినం ఆగోరంభుడు రాజభవనమేగి మసకనిద్రలో రాజునకు [మంచంసమీపంలో] కసవుఊడ్చుచూ ఇలా అన్నాడు- 'అయ్యో మనప్రభువు ఎంత అవివేకి, మలవిసర్జనంచేస్తూ దోసకాయతింటున్నాడు.' దానిని వినిన రాజు ఆశ్చర్యంపొంది

వానితో [గోరంభునితో] ఇలా అన్నాడు. 'ఓరోరీ, గోరంభ, ఎందుకు అప్రస్తుతం వదరుతున్నావు ? ఇంటిపనులు చేసేవాడివి అని తలచి నిన్ను చంపుటలేదు నేను ఎప్పుడైనా ఇలాంటి పనిచేస్తూ ఉండగా నీవు చూచినావా?' అతడు (గోరంభుడు బదులు) అన్నాడు: ద్యూతవ్యసనంతో రాత్రిఅంతా మేల్కొన్న నాకు నిద్రముంచుకువచ్చింది. ఆమత్తులో ఏమి వదరినానో తెలియదు. నిద్రమత్తు వానిని ప్రభువులు కరుణించాలి.'

మూ. ఏవం శ్రుత్వా రాజా చింతితవాన్ – 'యన్మయా జన్మాన్తరే పురీషోత్సర్గం కుర్వతా కదాపి చిర్భటికా న భక్షితా. తద్యథాఽయం వ్యతికరో ఽసమ్భావ్యో మమానేన మూఢేన వ్యాహృతః, తథా దంతిలస్యాపీతి నిశ్చయః. తన్మయా న యుక్తం కృతం యత్స వరాకః సమ్మానేన వియోజితః. న తాదృ క్పురుషాణామేవంవిధం చేష్టితం సమ్భావ్యతే. తదభావేన రాజకృత్యాని పౌర కృత్యాని చ సర్వాణి శిథిలతాం వ్రజన్తి.' ఏవమనేకధా విమృశ్య దంతిలం సమాహూయ నిజాఙ్గవస్త్రాభరణాదిభిః సంయోజ్య స్వాధికారే నియోజయా మాస. అతోఽహం బ్రవీమి – 'యో న పూజయతే గర్వాత్' ఇతి.

అ. దీనినివిని రాజు ఇలా విచారించాడు – నేను జన్మాంతరంలోనూ మలం వదులుతూ ఎన్నడూ దోసకాయ తినలేదు. ఈమూఢుడు చెప్పిన ఈవ్యసనం నాయెడ ఎలా అసంభవమో-అలాగే దంతిలునియెడను నిశ్చయంగా[అసంభవం] అగును. అందు వల్ల ఆదీనుణ్ణి సన్మానరహితుని చేయడం యుక్తం గాదు; అలాంటి పురుషులయెడ ఇలాంటి[దుష్ట]వ్యవహారం సంభవింపదు. అతడులేక రాజకార్యములు, పౌరకార్యములు అన్నీ శిథిలమగుచున్నాయి "ఇలా పెక్కుభంగుల విమర్శించి దంతిలుని పిలిపించి స్వీయవస్త్ర భూషణాదులతో[సత్కరించి] అలంకరించి పూర్వాధికారంలో నియమించాడు. అందుచే ఇలా నేను చెప్పుచున్నాను-(ఎవడు గర్వంచే-గౌరవింపడో-ఇత్యాది) యో న పూజయితే గర్వాత్-ఇత్యాది

మూ. సఞ్జీవక ఆహ – భద్ర, ఏవమేవైతత్ యద్భవతాభిహితం తదేవ మయా కర్తవ్యమ్, ఇతి. ఏవమభిహితే దమనకస్తమాదాయ పింగలక సకాశమగమత్. ఆహ చ – 'దేవ, ఏష మయాఽఽనీతః స సంజీవకః, అధునా

దేవః ప్రమాణమ్. సంజీవకోఽపి తం సాదరం ప్రణమ్యాగ్రతః సవినయం స్థితః. పింగలకోఽపి తస్య పీనాయతకకుద్మతో నఖకులిశాలఙ్కృతం దక్షిణపాణి ముపరి దత్త్వా మానపురఃసరమువాచ— 'అపి శివం భవతః? కుత స్త్వమస్మిన్ వనే విజనే సమాయాతోఽసి?' తేనాప్యాత్మవృత్తాంతః కథితః, యథా వర్ధమానేన సహ వియోగః సఞ్జాత స్తథా సర్వం నివేదితమ్.

అ. సంజీవకుడు ఇలా అన్నాడు- మిత్రమా, ఇదిఇటులే ! నీవు చెప్పినట్లే నేను చేసెదను. ఇట్లుచెప్పిన తర్వాత దమనకుడు అతనిని తీసికొని పింగళకునివద్దకు వెళ్లాడు. ఇలా అన్నాడు-ప్రభూ ఇదిగో ఆ సంజీవకుణ్ణి తెచ్చాను. సంజీవకుడును అతనికి ఆదరంగా ప్రణమిల్లి వినయంతో ఎదుట కూర్చుండెను. పింగళకుడును బలిసిన విశాలమైన మూపురంగల అతనిపై (సంజీవకునిపై) వజ్రాలవంటిగోళ్ళచే ప్రకాశించే కుడిచేతిని ఉంచి గౌరవపూర్వకంగా ఇలా పల్కాడు-'తాముక్షేమమా ! ఈ నిర్జనారణ్యానికి ఎచ్చటనుండి (ఎందులకు) వచ్చినారు. అతడును తనవృత్తాంతం-వర్ధమానుడు వదలినది మొదలు సంభవించినదంతా నివేదించాడు.

మూ. తచ్ఛ్రుత్వా పింగలకః సాదరతరం తమువాచ— 'వయస్య న భేతవ్యమ్. మద్భుజపఞ్జరపరిరక్షితేన యథేచ్ఛం త్వయాఽధునా వర్తితవ్యమ్. అన్యచ్చ నిత్యం మత్సమీపవర్తినా భావ్యమ్. యతః కారణాన్ బహ్వపాయం రౌద్రసత్త్వనిషేవితం వనం గురూణామపి సత్త్వానామసేవ్యమ్, కుతః శష్పభోజినామ్.' ఏవముక్త్వా సకలమృగపరివృతో యమునాకచ్ఛమవతీర్యోదకగ్రహణం కృత్వా స్వేచ్ఛయా తదేవవనం ప్రవిష్టః తతశ్చ కరటకదమనకనిక్షిప్తరాజ్యభారః సంజీవకేన సహ సుభాషితగోష్ఠీరనుభవన్నాస్తే అథవా సాధ్విదముచ్యతే.

శ్లో. యదృచ్ఛయాప్యుపగతం సకృత్సజ్జనసంగతమ్
భవత్యజరమత్యంతం నాభ్యాసక్రమమీక్షతే. 162

అ. దానిని విని పింగళకుడు మిక్కిలి ఆదరంగా ఇలా పల్కాడు- 'మిత్రమా, భయపడకుము. ఇప్పుడు నా భుజపంజరపరిరక్షితుడవై నీవు స్వేచ్ఛగా ఉండుము.

మరియూ నిత్యం నాకు సమీపవర్తివికమ్మా. ఏలననగా–పెక్కుఆపదలుగలదీ భయంకరజంతువులచే సేవితమూ అయిన ఈ అడవిలో పెద్దపెద్ద జంతువులే ఉండలేవు. ఇక గతికతనే (నీవంటి) వారి విషయం ఏమనాలి. ఇలా అని సర్వజంతుపరివృతుడై యమునాతీరం దిగి నీడ్రతాగి ఆ అడవినే ప్రవేశించాడు. పిమ్మట కరటకదమనకులపై పమస్తరాజ్యభారంఉంచి సంజీవకునితో సుభాషితగోష్ఠులసుఖం అనుభవించసాగాడు. విజ్ఞులు ఇది లెస్సగా అన్నారు—

'యదృచ్ఛగా (అనుకోకుండా) ఒకసారియైనా సజ్జన సాంగత్యం గల్గినచో అది మిక్కిలి అజరం (ముసలితనంలేనిది) అగును. అభ్యాసక్రమాన్ని అపేక్షింపదు.

మూ. సంజీవకేనాప్యనేకశాస్త్రావగాహనాదుత్పన్నబుద్ధిప్రాగల్భ్యేన స్తోకైరేవాహోభిర్మూఢమతిః పింగలకో ధీమాంస్తథా కృతో యథారణ్యధర్మాద్వియోజ్య గ్రామధర్మేషు నియోజితః. కిం బహునా? ప్రత్యహం పింగలకసంజీవకావేవ కేవలం రహసి మంత్రయతః. శేషః సర్వోఽపి మృగజనో దూరీభూతస్తిష్ఠతి. కరటకదమనకావపి ప్రవేశం న లభేత్. అన్యచ్చ సింహపరాక్రమాభావాత్ సర్వోఽపి మృగజనస్తౌ చ శృగాలౌ క్షుధావ్యాధిబాధితౌ ఏకాం దిశమాశ్రిత్య స్థితాః. ఉక్తఞ్చ–

శ్లో. ఫలహీనం నృపం భృత్యాః కులీనమపి చోన్నతమ్
సన్త్యజ్యాన్యత్ర గచ్ఛంతి శుష్కం వృక్షమివాణ్డజాః. 163

అ. సంజీవకుడును అనేక శాస్త్రావగాహనచే జనించిన ప్రతిభానైపుణ్యం వలన కొలది దినములలో మూఢబుద్ధియైన పింగలకుని ధీమంతుని చేసాడు. అందువల్ల ఆతడు (పింగళకుడు) ఆటవిక ధర్మాలను(హింసా ఆది) వదలి గ్రామ్యధర్మాలను (దయాధర్మం, ఇత్యాది) అనుసరింపసాగాడు. పెక్కులేల, ప్రతిదినం పింగళకసంజీవకులే కేవలం రహస్యంగా మంత్రణచేస్తారు. తక్కిన సమస్తపరిజనం దూరంగా ఉండేది. కరటకదమనకులు కూడ ప్రవేశం పొందరైరి. మరియూ సింహం పరాక్రమం లేనిదగుటచే (వేట మానడంతో) సమస్తజంతువులూ– ఆ నక్కలురెండూ ఆకలిచే, వ్యాధిచే బాధితములై ఒక దిక్కున (కొంతదూరంలో) కూర్చుండేవి.

పండితులిలా అన్నారు—

'ప్రభువు, ఉన్నతుడూ సత్కులీనుడూ అయినా శుష్కశరీరుడూ నిష్ఫలుడూ అయితే అతన్ని సేవకులు- వృక్షం ఉన్నతమూ సత్కులీనమూ (ఆమ్రాదిజాతికము) అయినా దాన్ని పక్షులవలె, వదలి వేరొకచోటికేగుదురు.

మూ. తథా చ-

శ్లో. అపి సన్మానసంయుక్తాః కులీనా భక్తితత్పరాః
వృత్తిభఙ్గాన్మహీపాలం త్యజన్త్యేవ హి సేవకాః. 164

అ. అటులనే- గౌరవయుక్తులూ, సత్కులీనులూ స్వామిభక్తితత్పరులూ అయిన సేవకులుగూడ వృత్తిభంగమైతే అనగా వేతనం లభించనిచో ప్రభువును వదలి వేస్తారు.

మూ. అన్యచ్చ-

శ్లో. కాలాతిక్రమణం వృత్తేర్యో న కుర్వీత భూపతిః
కదాచిత్తం న ముఞ్చన్తి భర్త్సితా అపి సేవకాః. 165

అ. మరియూ, వేతనం ఇవ్వడంలో సమయాన్ని దాటని (ఉచిత సమయంలో వేతనం ఇచ్చే) ప్రభువు చీవాట్లు పెట్టేవాడైనా సేవకులు అతన్ని ఎప్పటికీ విడువరు.

మూ. తథా న కేవలం సేవకా ఇత్థమ్భూతాః, యావత్సమస్తమప్యేతజ్జగత్ పరస్పరం భక్షణార్థం సామాదిభిరుపాయైస్తిష్ఠతి. తద్యథా-

శ్లో. దేశానాముపరి క్ష్మాభృదాతురాణాం చికిత్సకాః
వణిజో గ్రాహకాణాం చ మూర్ఖాణామపి పణ్డితాః. 166
ప్రమాదినాం తథా చోరా భిక్షుకా గృహమేధినామ్
గణికాః కామినాం చైవ సర్వలోకస్య శిల్పినః. 167
సామాదిసజ్జితైః పాశైః ప్రతీక్షన్తే దివానిశమ్
ఉపజీవన్తి శక్త్యా హి జలజా జలదానివ. 168

అ. ఇలా సేవకులు మాత్రమే గాదు. మరేమన- ఈ ప్రపంచమంతా పరస్పరభక్షణార్థమై సామాదిఉపాయాలలో (మగ్నమై) ఉంది. అదెట్లనగా భూపాలుడు దేశవాసులను- వైద్యుడు రోగులను, వ్యాపారి గ్రాహకులను (వస్తువులు కొనువారిని), పండితులు మూర్ఖులను, దొంగలు జాగ్రత్తలేనివారిని, భిక్షగాండ్రు గృహస్థులను, వేశ్యలు కాముకులను, శిల్పులు సర్వప్రజలను, సామాద్యుపాయసంసిద్ధమైన పాశాలతో బంధించి భక్షించడానికి అహోరాత్రాలు నిరీక్షిస్తారు. కాని జలజాతములు (ధాన్యాదికము) జలదాలపై (వర్షించే మేఘాలపై) ఆధారపడి వాటిశక్తిద్వారా (వర్షజలంవల్ల) ఉపజీవితాలైనట్లు, వీరంతా (రాజు వైద్యుడు మొదలైనవారంతా) వారిపై (దేశప్రజలు రోగులుమొదలైనవారిపై) ఆధారపడి వారిశక్తిచే ఉపజీవితులు అగుచున్నారు. అనగా వారులేనిచో వీరిబ్రతుకు శూన్యం అనిభావం.

మూ. అథవా సాధ్విదముచ్యతే-

శ్లో. సర్పాణాం చ ఖలానాం చ పరద్రవ్యాపహారిణామ్
అభిప్రాయా న సిద్ధ్యంతి తేనేదం వర్తతే జగత్. 169

అ. ఇది లెస్సగా చెప్పబడుతూంది- సర్పములయు పరధనాపహర్తలైన దుష్టులయు అభిప్రాయాలు సిద్ధించదం లేదు. అందుచే ఈ ప్రపంచం (ఇంతవరకు) నిలిచిఉంది.

శ్లో. అత్తుం వాఞ్ఛతి శామ్భవో గణపతేరాఖుం క్షుధార్తః ఫణీ
తం చ క్రౌఞ్చరిపోః శిఖీ గిరిసుతా సింహోఽపి నాగాశనమ్.
ఇత్థం యత్ర పరిగ్రహస్య ఘటనా శమ్భోరపి స్యాద్గృహే
తత్రాప్యస్య కథం న భావిజగతో యస్మాత్ స్వరూపం హి తత్. 170

అ. శివుని పాము ఆకలిబాధచే గణపతి ఎలుకను, తినగోరుతూంది. ఆ పామును కుమారస్వామి నెమలి తినగోరుతూంది. ఆ నెమలిని పార్వతి సింహం తినగోరుతూంది. ఇలా శివునియింటియందే పరిగ్రహఘటన ఉండినచో- ఈ జగత్తునందు ఇతరుల గృహాలలో ఎట్లుండునో? ఏలనన ప్రపంచం స్వరూపమే అట్టిది.

మూ. తతః స్వామిప్రసాదరహితౌ క్షుత్క్షామకణ్ఠౌ పరస్పరం కరటకదమనకౌ మంత్రయతః. తత్ర దమనకో బ్రూతే- 'ఆర్య కరటక, ఆవాం తావ

ద[ప్రధానతాం గతౌ. ఏష పింగలకః సంజీవకానుర క్తః స్వవ్యాపారపరాఙ్ముఖః సఞ్జాతః. సర్వోఽపి పరిజనో గతః. తత్కిం క్రియతే?' కరటక ఆహ— యద్యపి త్వదీయవచనం న కరోతి, తథాపి స్వామీ స్వదోషనాశాయ వాచ్యః ఉక్తం చ—

శ్లో. అశృణ్వన్నపి బోద్ధవ్యో మంత్రిభిః పృథివీపతిః
యథా స్వదోషనాశాయ విదురేణామ్బికాసుతః. 171

అ. పిమ్మట రాజానుగ్రహం లేనివారు-ఆకలిచే గొంతు ఎండినవారు అయిన కరటకదమనకులు పరస్పరం ఇలా ఆలోచించారు.

దమనకుడు—ఆర్య, కరటకా? మనం ఇరువురం అప్రధానులం అయినాము. ఈ పింగళకుడు సంజీవకునియెడ అనురక్తుడై తన పనికి (వేటాడుట అనగా జంతువుల చంపుట మొదలైన దానికి) విముఖుడైనాడు. పరిజనమంతా వెళ్లిపోయింది. కనుక (ఇప్పుడు) ఏమి చేయాలి?

కరటకుడు—(అతడు)నీమాటను అనుసరింపడు. అయినా అతన్ని స్వదోషంనుండి (రాజ్య పాలనచేయమినుండి) రక్షించడానికి-లేక మనదోషం లేకుండా ఉండడానికి (హితం) తెల్పడం ఉచితం. పెద్దలు ఇలాఅన్నారు-రాజువినకపోయినా అతనికి బోధించడం మంత్రులకర్తవ్యం. విదురుడు స్వదోషనివృత్తికై ధృతరాష్ట్రునికి బోధించాడు.

మూ. తథా చ—

శ్లో. మదోన్మత్తస్య భూపస్య కుఞ్జరస్య చ గచ్ఛతః
ఉన్మార్గం వాచ్యతాం యాన్తి మహామాత్రాః సమీపగాః. 172

తత్త్వయైష శష్పభోజీ స్వామినః సకాశమానీతః. తత్స్వహస్తేనాఙ్గారాః కర్షితాః.

అ. అటులనే-ప్రభువు ఏనుగు మదోన్మత్తతచే చెడుమార్గాన పోవుచున్నచో సమీపవర్తులైన మహామాత్రులు[ప్రధానమంత్రి-మావటివాడు]నిందితులగుదురు.

మూ. దమనక ఆహ— 'సత్యమేతత్. మమాయం దోషః న స్వామినః ఉక్తఞ్చ—

శ్లో. జమ్బుకో హుడుయుద్ధేన వయం చాషాఢభూతినా
దూతికా పరకార్యేణ త్రయో దోషాః స్వయంకృతాః. 173

అ. దమనకుడు అన్నాడు-'ఇది సత్యం, ఈదోషం నాదే. ప్రభువుదికాదు' పెద్దలు ఇలాఅన్నారు పొట్టేంౘ్రయుద్ధంచే నక్క-మేము[దేవశర్మ,సన్యాసి], ఆషాఢభూతిచే పరకార్యం(చేయడం)చే దూతిక-ఇలాముగ్గురు స్వదోషంచే దూషితులైతి.

## కథా-4

## దూతీజమ్బుకాషాఢభూతి కథా

మూ. కరటక ఆహ- కథమేతత్? సోఽబ్రవీత్-

అస్తి కస్మింశ్చిద్వివిక్తప్రదేశే మఠాయతనమ్. తత్ర దేవశర్మా నామ పరివ్రాజకః ప్రతివసతి స్మ. తస్యానేకసాధుజనదత్తసూక్ష్మవస్త్రవిక్రయవశాత్ కాలేన మహతీ విత్తమాత్రా సఞ్జాతా. తతః స న కస్యచిద్ విశ్వసితి. నక్తన్దినం కక్షాన్తరాత్ తాం మాత్రాం న ముఞ్చతి. అథవా సాధు చేదముచ్యతే-

శ్లో. అర్థానామార్జనే దుఃఖమార్జితానాం చ రక్షణే
ఆయే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థాః కష్టసంశ్రయాః. 174

అ. కరటకుడు అడిగాడు-ఇదియెట్లు? అతడు[దమనకుడు] ఇలా చెప్పాడు.

'ఒకానొక నిర్జన ప్రదేశంలో ఒకమఠం ఉంది. అందు దేవశర్మ అనే సన్యాసి నివసించేవాడు. సజ్జనులనేకులు ఇచ్చిన విలువగల వస్త్రాలు అమ్మడంతో కొంతకాలానికి అధికధనం అతనికి సమకూరింది. అందువల్ల అతడు ఎవరినీ నమ్మడు. రేబవళ్లు ఆ సంచిని చంకనుండి విడువడు. ఈవిషయంలో పండితులు ఇలా ఎన్నగానే తెల్పారు. ధనాన్ని సంపాదించడం దుఃఖం.సంపాదితధనాన్ని రక్షించడం దుఃఖం-ఆదాయంతో దుఃఖం-వ్యయంలో దుఃఖం-ఇలా కష్టకారకధనములకు ధిక్కారం.

మూ. అథాషాఢభూతిర్నామ పరవిత్తాపహారీ ధూర్తస్తామర్థమాత్రాం తస్య కక్షాన్తరగతాం లక్షయిత్వా వ్యచిన్తయత్- 'అహో, మయాస్యేయమర్థమాత్రా హర్తవ్యా ఇతి. తదత్ర మఠే తావద్ దృఢశిలాసఞ్చయవశాద్భిత్తిభేదో

న భవతి. ఉచ్చైస్తరత్వాచ్చ ద్వారే ప్రవేశో న స్యాత్. తదేనం మాయావచనై ర్విశ్వాస్యాహం ఛాత్రతాం వ్రజామి యేన స విశ్వస్తో కదాచిద్ విశ్వాసమేతి. ఉక్తం చ-

శ్లో. నిస్పృహో నాధికారీ స్యాన్నా కామీ మణ్డనప్రియః
నావిదగ్ధః ప్రియం బ్రూయాత్ స్ఫుటవక్తా న వఞ్చకః. 175

అ. అంతట పరధనంహరించే ఆషాఢభూతి అనే వంచకుడు అతనివద్దలో ఉండే ఆ ధనపుసంచిని(జోలెను) చూచి ఇలా ఆలోచించాడు. 'నేను ఇతని ఈ ధనం సంచిని ఎలా అపహరించాలి. ఈ మఠం బలిష్ఠమైన రాళ్ళతో కట్టబడటంవల్ల గోడలకు కన్నంవేయడం సాధ్యంగాదు. మిక్కిలి ఎత్తుగా ఉండడంవల్ల ద్వారంనుండి పోవడం సైతం వీలుగాదు. అందువలన కపటవాక్కుల ద్వారా నమ్మకం గల్గించి (శిష్యరికం పొందెదను.) శిష్యునిగా చేరెదను. నమ్మిన అతడు కొంతకాలానికి పూర్తినమ్మకం పొందును.

విజ్ఞులిలా అన్నారు— 'ఆశలేనివాడు (ధనానికి) అధికారి కాజాలడు. కాముకుడు కానివాడు అలంకారప్రియుడుగా ఉండడు. నేర్పులేనివాడు (మూర్ఖుడు) ప్రియముగా మాట్లాడలేడు. స్ఫుటవక్త (యథార్థవాది) వంచకుడు కాదు.

మూ. ఏవం నిశ్చిత్య తస్యాన్తికముపగమ్య 'ఓం నమః శివాయ' ఇతి ప్రోచ్చార్య సాష్టాఙ్గం ప్రణమ్య చ సప్రశ్రయమువాచ-'భగవన్, అసారః సంసారోఽయమ్, గిరినదీవేగోపమం యౌవనమ్. తృణాగ్నిసమం జీవితమ్ శరదభ్రచ్ఛాయా సదృశా భోగాః, స్వప్నసదృశో మిత్రపుత్రకలత్రభృత్యవర్గ సమ్బన్ధః, ఏవం మయా సమ్యక్ పరిజ్ఞాతమ్. తత్ కిం కుర్వతో మే సంసార సముద్రోత్తరణం భవిష్యతి.'

అ. ఇలా నిశ్చయించి అతనివద్ద కేగి 'ఓం నమః శివాయ' అని బిగ్గరగా (భక్తితో) ఉచ్చరించాడు. సాష్టాంగంగా ప్రణమిల్లాడు. (లేచి) వినయంగా ఇలా అన్నాడు. 'భగవన్, ఈ సంసారం నిస్సారం యౌవనం కొండవాగు (సెలయేరు)వలె ఉరువడి గలది. జీవితం తృణాగ్నితుల్యం(క్షణికం). భోగాలు శరత్కాల మేఘచ్ఛాయా

సమాలు. మిత్రపుత్రకళత్ర భృత్యవర్గ సంబంధం స్వప్నసమానం, అని ఇలా నేను చెన్నగా గ్రహించాను. కనుక ఎలా ప్రవర్తిస్తే నేను సంసారసముద్రం దాటగలను?

మూ. తచ్ఛ్రుత్వా దేవశర్మా సాదరమాహ– 'వత్స, ధన్యోఽసి యత్ప్రథమే వయస్యేవం విరక్తభావః. ఉక్తం చ–

శ్లో. పూర్వే వయసి యః శాన్తః స శాన్త ఇతి మే మతిః
ధాతుషు క్షీయమాణేషు శమః కస్య న జాయతే 176

అ. దానిని విని దేవశర్మ ఆదరంగా ఇలా అన్నాడు– బిడ్డా! ధన్యుడివి. ఏలనన–ప్రథమవయస్సులోనే (బాల్యంలోనే) ఇంత విరక్తి గల్గింది. పెద్దలిలా అన్నారు– 'ప్రథమవయస్సులో ఎవడు శాంతుడో, వాడే శాంతుడు అని నా భావం నరములు క్షీణించుచుండగా (బలహీనులు అవుతూండగా) శాంతి ఎవరికి గల్గదు?

శ్లో. ఆదౌ చిత్తే తతః కాయే సతాం సమ్పద్యతే జరా
అసతాం తు పునః కాయే నైవ చిత్తే కదాచన 177

అ. సజ్జనులకు మొదట మనస్సునందు పిమ్మట శరీరంనందు ముసలితనం వస్తుంది. దుష్టులకు అయితే శరీరంలో ముసలితనం వచ్చినా మనస్సునందు ఎప్పటికీ (అది) రానేరాదు.

మూ. యచ్చ మాం సంసారసాగరోత్తరణోపాయం పృచ్ఛసి తచ్ఛ్రూయతామ్–

శ్లో. శూద్రో వా యది వాన్యోఽపి చణ్డాలోఽపి జటాధరః
దీక్షితః శివమన్త్రేణ సభస్మాఙ్గః శివో భవేత్. 178

శ్లో. షడక్షరేణ మన్త్రేణ పుష్పమేకమపి స్వయమ్
లిఙ్గస్య మూర్ధ్ని యో దద్యాన్న స భూయోఽభిజాయతే. 179

అ. ఇక నన్ను సంసారసముద్రం దాటే ఉపాయం అడిగావు. దానినివినుము– శూద్రుడుగాని ఇతరుడుగాని చండాలుడుగాని జటాధరుడుగాని (ఎవడైనా) అగుగాక, శివమంత్రదీక్షితుడై విభూతిపూసికొనునో అతడు శివుడు (శివస్వరూపుడు–శివతుల్యుడు) అగును.

'ఓం నమః శివాయ' - అనే షడక్షరమంత్రం జపిస్తూ స్వయంగా ఒక పుష్పమైనా లింగంపైన సమర్పించేవానికి మరల పుట్టుకలేదు.

మూ. తచ్ఛ్రుత్వా ఆషాఢభూతిస్తత్పాదౌ గృహీత్వా సప్రశ్రయమిదమాహ– 'భగవన్, తర్హి దీక్షయా మేఽనుగ్రహం కురు ?. దేవశర్మా ఆహ– అనుగ్రహం తే కరిష్యామి. పరన్తు రాత్రౌ త్వయా మఠమధ్యే న ప్రవేష్టవ్యమ్. యత్కారణం నిస్సఙ్గతా యతీనాం ప్రశస్యతే తవ చ మమాపి చ. ఉక్తం చ–

శ్లో. దుర్మన్త్రాన్నృపతిర్వినశ్యతి, యతిః సఙ్గాత్, సుతో లాలనాద్
విప్రోఽనధ్యయనాత్ కులం కుతనయాచ్ఛీలం ఖలోపాసనాత్.
మైత్రీ చాప్రణయాత్ సమృద్ధిరనయాత్, స్నేహః ప్రవాసాశ్రయాత్
స్త్రీ గర్వాదనవేక్షణాదపి కృషిస్త్యాగాత్ ప్రమాదాద్ధనమ్ 160

అ. దానిని విని ఆషాఢభూతి, అతని పాదములురెండు పట్టుకొని నమ్రంగా ఇలాఅన్నాడు–'భగవన్' అయితే నన్ను దీక్షతో (శివమంత్రోపదేశంతో) అనుగ్రహించండి,' దేవశర్మ ఇలా పల్కాడు–'వత్స' నిన్ను అనుగ్రహిస్తాను. కానీ రాత్రివేళ నీవు మఠంమధ్య ప్రవేశింపరాదు. ఏలననగా–సన్యాసులకు సంగరాహిత్యం ప్రశంసనీయంగా ఉంది. ఇది నీకూ నాకూ మంచిది–' మహాత్ములిలా అన్నారు–

'ప్రభువు దుర్మంత్రంచే (చెడు సలహాలచే)–సన్యాసి విషయసంగంచే–పుత్రుడు వాత్సల్యంచే (ప్రేమచే)–విప్రుడు అనధ్యయనంచే కులం కుపుత్రునిచే, సౌశీల్యం దుష్టజనసేవచే–మైత్రి స్నేహశూన్యతచే–సంపద అవినీతిచే–స్నేహం దేశాంతరవసంచే–స్త్రీ గర్వంచే–వ్యవసాయం పర్యవేక్షణలేమిచే–ధనం త్యాగనిర్లక్ష్యాలచే నశించడం సంభవిస్తుంది.

కనుక వ్రతం గ్రహించిన తర్వాత మఠద్వారంలో ఉండే గడ్డిగుడిసెలో నీవు శయనించాలి.

మూ. స ఆహ 'భగవన్, భవదాదేశః ప్రమాణమ్. పరత్ర హి తేన మే ప్రయోజనం. అథ కృతశయనసమయం దేవశర్మానుగ్రహం కృత్వా

శాస్త్రోక్తవిధినా శిష్యతామనయత్. సోఽపి హస్తపాదావమర్దనాదిపరిచర్యయా తం పరితోషమనయత్. పునస్తథాపి మునిః కక్షాన్తరాన్మాత్రాం న ముఞ్చతి. అథైవం గచ్ఛతి కాలే ఆషాఢభూతిశ్చిన్తయామాస-'అహో, న కథఞ్చిదేష మే విశ్వాసమాగచ్ఛతి. తత్కిం దివాపి శస్త్రేణ మారయామి, కిం వా విషం ప్రయచ్ఛామి? కిం వా పశుధర్మేణ వ్యాపాదయామి.' ఇతి.

ఆ. ఆతడు(ఆషాఢభూతి) అన్నాడు. 'భగవన్, మీ ఆజ్ఞయే ప్రమాణం, అందుచే నాకు పరలోకంలో ఉపయోగం ఉండును.' అంత శయనానంతరం దేవశర్మ అనుగ్రహించి శాస్త్రోక్తవిధిని (అతనిని) శిష్యుని చేసికొన్నాడు. అతడూ, (ఆషాఢభూతియు) కాళ్లు చేతులు పిసగటం మొదలైన సేవలచే అతనికి (దేవశర్మకు) సంతోషం గల్గించేవాడు. కాని, ధనసంచిని, సన్యాసి, చంకనడుమనుండి వదిలేవాడు కాదు. పిమ్మట ఇలా (కొంత) కాలం గడువగా ఆషాఢభూతి ఇలా విచారించాడు - 'ఆహా' ఏవిధంగానూ ఇతడు నన్ను నమ్మడం లేదు. పగలే శస్త్రంతో చంపుదునా! లేక విషం ఇచ్చుదునా! అట్లుగాసిచో పశుధర్మంగా (గొంతువిసికి.గుండెబాది) సంహరింతునా,"

మూ. ఏవం చిన్తయతస్తస్య దేవశర్మణోఽపి శిష్యపుత్రః కశ్చిద్ గ్రామాదామన్త్రణార్థం సమాయాతః ప్రాహ చ-'పవిత్రారోపణకృతే మమ గృహమాగమ్యతామ్' ఇతి. తచ్ఛ్రుత్వా దేవశర్మా ఆషాఢభూతినా సహ ప్రహృష్టమనాః ప్రస్థితః.

ఆ. ఇలా ఆతడు(ఆషాఢభూతి) విచారించుచుండగా దేవశర్మ శిష్యుని-పుత్రుడొకడు గ్రామంనుండి ఆహ్వానింప వచ్చాడు-ఇలా అన్నాడు-'భగవన్, పవిత్రారోపణకై (యజ్ఞోపవీతసంస్కారం చేయుడానికై)మాయింటికి దయచేయండి.' దానిని విని దేవశర్మ ఆషాఢభూతితోనహ సంతుష్టుడై బయలుదేరాడు

మూ. అథైవం తస్య గచ్ఛతోఽగ్రే కాచిన్నదీ సమాయాతా. తాం దృష్ట్వా మాత్రాం కక్షాన్తరాదవతార్య కన్థామధ్యే సుగుప్తాం నిధాయ స్నాత్వా దేవార్చనం విధాయ తదనన్తరమాషాఢభూతిమిదమాహ- 'భో ఆషాఢభూతే,

యావదహం పురీషోత్సర్గం కృత్వా సమాగచ్ఛామి తావదేషా కన్థా యోగేశ్వరస్య సావధానతయా రక్షణీయా,' ఇత్యుక్త్వా గతః.

అ. అంత ఇలా పయనించే అతనికి (దారిలో) ఎదుట ఒకానొక నది వచ్చింది. దానిని చూచి మూటను (సంచిని) చంకనుండి తీసాడు-బొంతలో దాచాడు-స్నానంచేసాడు-దేవతార్చన గావించాడు-పిమ్మట ఆషాఢభూతితో ఇలా అన్నాడు - 'ఓ ఆషాఢభూతీ, నేను మల విసర్జనచేసి వచ్చేవరకు ఈయోగేశ్వరుని (శివుని) బొంతను జాగ్రత్తగా రక్షించాలి.' ఇలాచెప్పి వెళ్లిపోయాడు.

మూ. ఆషాఢభూతిరపి తస్మిన్నదర్శనీభూతే మాత్రామాదాయ సత్వరం ప్రస్థితః. దేవశర్మాపి ఛాత్రగుణానురఞ్జితమనాః సువిశ్వస్తో యావదుపవిష్టస్తిష్ఠతి తావత్సువర్ణరోమదేహయూథమధ్యే హుడుయుద్ధమపశ్యత్. అథ రోషవశాద్ధుడుయుగలస్య దూరమపసరణం కృత్వా భూయోఽపి సముపేత్య లలాటపట్టాభ్యాం ప్రహరతో భూరి రుధిరం పతతి. తచ్చ జమ్బుకో జిహ్వాలౌల్యేన రఙ్గభూమిం ప్రవిశ్య ఆస్వాదయతి.

అ. ఆషాఢభూతియు అతడు చాటుకుపోగానే మూటను తీసికొని వేగంగా బయలుదేరాడు. దేవశర్మయు శిష్యునిగుణాలపై ప్రసన్నుడూ సువిశ్వాసీఅయి (తిరిగి వచ్చి నదీతీరాన) కూర్చుండగానే (దాపున) బంగారువన్నె(తో, మిలమిలలాడే) రోమకూపంతోడి పొట్టేంద్రమందనడుమ రెండు పొట్టేళ్లుచేసే పోరాటం (అతనికి) కనబడింది. రోషంతో పొట్టేళ్లు రెండు వెనుకకు దూరంగా పోవడం, మరలా వేగంగావచ్చి ఢీకొనడం వల్ల నొసళ్లనుండి రక్తం అధికంగా(క్రింద)పడుతూంది. ఆ నెత్తురును ఒకనక్క నాల్కచాపల్యంతో యుద్ధభూమిని ప్రవేశించి నాకుతూంది.

మూ. దేవశర్మాపి తదాలోక్య వ్యచిన్తయత్–'అహో, మన్దమతిరయం జమ్బుకః. యది కథమప్యనయోః సంఘట్టే పతిష్యతి, తన్నూనం మృత్యుమవాప్స్యతీతి వితర్కయామి.' క్షణాన్తరే చ తథైవ రక్తాస్వాదనలౌల్యాన్మధ్యే ప్రవిశంస్తయోః శిరఃసమ్పాతే పతితో మృతశ్చ శృగాలః.

అ. దేవశర్మ దానినిచూచి ఇలా విచారించాడు-అయ్యో, ఈ నక్క తెలివి

తక్కువది, ఏదోవిధంగా ఈరెండిటి సంఘట్టనలో (ఘట్టననడుమ) పడితే తప్పక చచ్చును అని నాకు తోస్తూఉంది. మరుక్షణంలో అటులనే నెత్తురురుచి చూచే చాపల్యంతో (పొట్టేంౘ్రడ) నడుమ ప్రవేశిస్తూ వాటిరెండు తలల ఘర్షణలోపడినదై నక్క చచ్చింది.

మూ. దేవశర్మాపి తం శోచమానో మాత్రాముద్దిశ్య శనైః శనైః ప్రస్థితో యావదాషాఢభూతిం న పశ్యతి తతశ్చౌత్సుక్యేన శౌచం విధాయ యావత్కన్థామాలోకయతి తావన్మాత్రాం న పశ్యతి. తతశ్చ 'హా, హా ముషితోఽస్మి' ఇతి జల్పన్ పృథివీతలే మూర్ఛయా నిపపాత. తతః క్షణాచ్చేతనాం లబ్ధ్వా భూయోఽపి సముత్థాయ పూత్కర్తుమారబ్ధః– 'భో ఆషాఢభూతే క్వ మాం వఞ్చయిత్వా గతోఽసి? తద్ దేహి మే ప్రతివచనమ్! ఏవం బహు విలప్య తస్య పదపద్ధతిమన్వేషయన్ శనైః ప్రస్థితః.

ఆ. దేవశర్మయు దానిని (నక్కమరణం) గూర్చివిచారిస్తూ మూట (ధనం సంచి) తీసికొనేందుకై మెలమెల్లగా గదిలాడు-ఆషాఢభూతి కనబడక పోవడంతో తత్తర పాటు నొందాడు-శౌచకృత్యం [త్వరలో] ఆచరించి, బొంతలో వెదికాడు. అందులో ధనం మూట [కనబడలేదు.] అప్పుడతడు 'అయ్యో! అయ్యో! లూటీచేయబడ్డాను.' అని పలవరిస్తూ మూర్ఛవచ్చి నేలపై పడ్డాడు. పిమ్మట క్షణకాలానికి తెలివినంది లేచి నిట్టూర్పులు విడుస్తూ మరల బిగ్గరగా ఇలా ఆక్రోశింపసాగాడు– 'ఓరీ ఆషాఢభూతీ! నన్ను మోసగించి ఎక్కడికి వెళ్లావు? నాకు బదులు పల్కుము–' ఇలా పలువిధాల విలపించి అతని అడుగుల గుర్తులు వెదకుచూ మెల్లగా పయనం సాగించాడు.

మూ. అథైవం గచ్ఛన్ సాయన్తనసమయే కఞ్చిద్గ్రామమాససాద. అథ తస్మాన్ గ్రామాత్ కశ్చిత్ కౌలికః సభార్యో మద్యపానకృతే సమీపవర్తిని నగరే ప్రస్థితః. దేవశర్మాపి తమాలోక్య ప్రోవాచ– 'భో భద్ర, వయం సూర్యోఢా అతిథయస్తవాన్తికం ప్రాప్తాః. న కమప్యత్ర గ్రామే జానీమః. తద్ గృహ్యతామతిథిధర్మః. ఉక్తఞ్చ–

శ్లో. సంప్రాప్తో యోఽతిథిః సాయం సూర్యోఢో గృహమేధినామ్
పూజయా తస్య దేవత్వం ప్రయాన్తి గృహమేధినః. 181

అ. ఇలాపోతూ సాయంకాలానికి ఒకానొక గ్రామం చేరాడు. ఆగ్రామం నుండి ఒక సాలెవాడు భార్యతోగూడ మద్యం త్రాగేందుకై దాపునఉండే నగరానికి బయలుదేరాడు, దేవశర్మ వాణ్ణిచూచి ఇలా అన్నాడు-ఓ శుభమూర్తి, మేము సూర్యుడు అస్తమించేవేళ నీదగ్గరకు చేరిన అతిథులం. ఈ గ్రామంలో ఇంకెవరినీ, ఎరుగం, అందువల్ల అతిథిధర్మం స్వీకరింపుము. పెద్దలన్నారు-

'సంధ్యాసమయంలో సూర్యాస్తమయకాలంలో వచ్చిన అతిథిని పూజించడంచే గృహస్థులు-దేవత్వం పొందుదురు.

మూ. తథా చ-

శ్లో. తృణాని భూమిరుదకం వాక్చతుర్థీ చ సూనృతా
సతామేతాని హర్మ్యేషు నోచ్ఛిద్యన్తే కదాచన. 182

అ. అటులనే తృణములు, [దర్భచాపలు-కుశాసన] భూమి. ఉదకం – ఇక నాల్గవదైన సత్యప్రియభాషణం-ఈ నాలుగు సజ్జనుల భవనాలనుండి ఎప్పుడూ తొలగిపోవు

శ్లో. స్వాగతేనాగ్నయస్తృప్తా ఆసనేన శతక్రతుః
పాదశౌచేన పితరః అర్ఘ్యాచ్ఛమ్భుస్తథాతిథేః. 183

అ. అతిథికి స్వాగతం పల్కడంతో అగ్ని,-ఆసనదానంతో ఇంద్రుడు-పాదాలు కడుగడంతో పితృదేవతలు, అర్ఘ్యంతో(ఫల-పుష్ప నైవేద్యాదికంచే) పరమేశ్వరుడు సంతోషం పొందుదురు.

మూ. కౌలికోఽపి తచ్ఛ్రుత్వా భార్యామాహ–'ప్రియే! గచ్ఛ త్వమతిథిమాదాయ గృహం ప్రతి. పాదశౌచభోజనశయనాదిభిః సత్కృత్య త్వం తత్రైవ తిష్ఠ. అహం తవ కృతే ప్రభూతం మద్యమానేష్యామి.' ఏవముక్త్వా ప్రస్థితః. సాఽపి భార్యా పుంశ్చలీ తమాదాయ ప్రహసితవదనా దేవదత్తం మనసి ధ్యాయన్తీ గృహం ప్రతి ప్రతస్థే. అథవా సాధు చేదముచ్యతే–

శ్లో. దుర్దివసే ఘనతిమిరే దుఃసఞ్చారాసు నగరవీథీషు
పత్యుర్విదేశగమనే పరమసుఖం జఘనచపలాయాః. 184

అ. సాలెవాడు దానిని విని భార్యతో ఇలా అన్నాడు-"ప్రియా! నీవు అతిథిని తీసికొని ఇంటికిపొమ్మ. పాదప్రక్షాళనం భోజనం శయనం మొదలైనవానిచే సత్కరించి నీవు అచ్చటనేయుండుము. నేనునీకై మద్యం తెస్తాను.' ఇట్లుపల్కి వెళ్ళిపోయాడు. వ్యభిచారిణి అయిన ఆ భార్యయు ఆతనిని(దేవశర్మను) తీసికొని నవ్వుతూ మనస్సులో దేవదత్తుణ్ణి ధ్యానిస్తూ ఇంటిదారి తీసింది. పిణ్ణులిలా చక్కగా అన్నారు-

'చపలజంఘకు (వ్యభిచారిణికి) మేఘాలుదట్టంగా క్రమ్ముకొన్న దినమందు, కటికచీకటియందు, ఇరుకైన నగర వీథులందు, భర్తదేశాంతరం వెళ్ళినచో మిక్కలి ఆనందం కల్గుతుంది.'

మూ. తథా చ-

శ్లో. పర్యఙ్కేష్వాస్తరణం పతిమనుకూలం మనోహరం శయనమ్
తృణమివ లఘు మన్యన్తే కామిన్యశ్చౌర్యరతలుబ్ధాః. 185

అ. అటులనే-చాటుమాటు (చౌర్యంగా) వ్యభిచారంపై మోజుగల్గిన స్త్రీలు, మంచాలపైని(అందమైన) వస్త్రాలను, అందమైన పడకలను, అనుకూలుడైన భర్తనుగడ్డి పరకవలె తేలిగ్గా తలుస్తారు.

మూ. తథా చ-

శ్లో. కేలిం ప్రదహతి లజ్జా శృఙ్గారోఽస్థీని చాటవః కటవః
బన్ధక్యాః పరితోషో న కిఞ్చిదిష్టం భవేత్ పత్యౌ. 186

అ. అటులనే-జారిణియైనస్త్రీకి సిగ్గు(భర్తతోడి) కామక్రీడనూ, శృంగారం (అలంకరణ) ఎముకలనూ కాల్చివేస్తాయి. చాటువులు (భర్త హాస్యవినోద వాక్కులు) కటువుగా తోస్తాయి. (పెక్కులేల) భర్తపని యేదీ ఇష్టంగా ఉండదు. సంతుష్టిగల్గదు.

శ్లో. కులపతనం జనగర్హాం బన్ధనమపి జీవితవ్యసన్దేహమ్
అఙ్గీకరోతి కులటా సతతం పరపురుషసంసక్తా. 187

అ. నిత్యం పరపురుషాసక్తయైన జారిణి, వంశగౌరవపతనం, లోకనింద, బంధింపబడడం. బ్రతుకు సంశయంతో ఉండడం, (ఇత్యాదులను) అంగీకరిస్తుంది.

మూ. అథ కౌలికభార్యా గృహం గత్వా దేవశర్మణే గతాస్తరణాం భగ్నాం చ ఖట్వాం సమర్ప్యేదమాహ- భో భగవన్, యావదహం స్వసఖీం

గ్రామాదభ్యాగతాం సంభావ్య ద్రుతమాగచ్ఛామి, తావత్త్వయా మద్గృహేఽప్రమత్తేన భావ్యమ్. ఏవమభిధాయ శృఙ్గారవిధిం విధాయ యావద్దేవదత్తముద్దిశ్య వ్రజతి తావత్తద్భర్తా సమ్ముఖో మదవిహ్వలాఙ్గో ముక్తకేశః పదే పదే ప్రస్ఖలన్ గృహీతమద్యభాణ్డః సమభ్యేతి. తం చ దృష్ట్వా సా ద్రుతతరం వ్యావృత్య స్వగృహం ప్రవిశ్య ముక్తశృఙ్గారవేషా యథాపూర్వమభవత్

అ. అంత సాలెవానిభార్య ఇంటికి పోయి పరుపులేని (దుప్పటిలేని) పిరిగిన మంచం దేవశర్మకు సమర్పించి ఇలా అంది-'హే భగవన్, గ్రామంనుండి వచ్చిన నా చెలికత్తెతో మాట్లాడి త్వరలో వస్తాను. అంతవరకు మీరు ఇంటిలో మెలకువగా ఉండండి- ఇలాపల్కి శృంగారవేషం ధరించి దేవదత్తుని కలియ డానికి(ఇంటినుండి) కదిలింది. ఇంతలో ఆమెభర్త, త్రాగినమైకంతో ఒడలుతెలియనివాడై వెంట్రుకలు విరబోసుకొని, అడుగడుగునకు జారిపడుతూ, మద్యభాండంపట్టుకొని ఎదురయ్యాడు. అతనిని చూడగానే ఆమె మిక్కిలివేగంగా వెనుకకు తిరిగింది. ఇంట్లోచొరబడింది శృంగారవేషం తీసివేసి యథాపూర్వంగా తయారైంది.

మూ. కౌలికోఽపి తాం పలాయమానాం కృతాద్భుతశృఙ్గారాం విలోక్య ప్రాగేవ కర్ణపరమ్పరయా తస్యాః శ్రుతాపవాదక్షుభితహృదయః స్వాకారం నిగూహమానః సదైవాస్తే. తతశ్చ తథావిధం చేష్టితమవలోక్య దృష్టప్రత్యయః క్రోధవశగో గృహంప్రవిశ్య తామువాచ-'ఆః పాపే పుంశ్చలి, క్వ ప్రస్థితాసి? సా ప్రోవాచ- 'అహం త్వత్సకాశాదాగతా న కుత్రచిదపి నిర్గతా. తత్కథం మద్యపానవశాదప్రస్తుతం వదసి ? అథవా సాధు చేదముచ్యతే-

శ్లో. వైకల్యం ధరణీపాతమయథోచితభాషణమ్
సన్నిపాతస్య చిహ్నాని మద్యం సర్వాణి దర్శయేత్. 188

శ్లో. కరస్పన్దోఽమ్బరత్యాగస్తేజోహానిః సరాగతా
వారుణీసఙ్గజావస్థా భానునాప్యనుభూయతే. 189

అ. సాలెవాడు అద్భుతశృంగార వేషంతో పరుగెత్తే ఆమెను (భార్యను) చూచాడు. అతడు(అంతకు)ముందే ఆమెపై ఉండే అపవాదుపిని కలతచెందియూ తన

ఆకారంద్వారా బయటపడక నిత్యం మెలగేవాడు. ఆ సమయంలో అలాంటి (వేషాది) చేష్టనుచూచి ప్రత్యక్షంచే విశ్వాసంపొందాడు. క్రోధపరాధీనుడై బిగ్గరగా ఇలా పల్కాడు. 'ఓసీ పాపాత్మురాలా, కులటా! ఎక్కడికి బయలుదేరావు ?' ఆమె నొక్కి పల్కింది. 'నేను నీదగ్గరనుండి వచ్చాను. ఎక్కడికిపోలేదు. నీవు మద్యంత్రాగడంతో మత్తుచే (అప్రస్తుతంగా) తలాతోక లేని విధంగా వదరుచున్నావు. పెద్దలు ఇది సరిగానే చెప్పారు—

వికలత (చిత్తభ్రాంతి), నేలపై బడడం, సందర్భహాస్యంగా (నోటికి వచ్చినట్లు) మాట్లాడడం అనే ఈ సన్నిపాతరోగం గుర్తులు త్రాగుడుకును గలవు.

త్రాగుబోతు, సూర్యుడు ఈ ఇరువురు వారుణీసంగజావస్థాధర్మాలు (మద్యపానజన్యావస్థాగుణాలు, వరుణదిశాసంబంధావస్థాగుణాలు) సమంగా అనుభవిస్తున్నారు. అవి కరస్పందన(చేతులు వణకడం, కిరణాలు తగ్గడం) అంబరత్యాగం (గుడ్డలు విడచి వేయడం, ఆకాశాన్ని వదలడం), తేజోహాని (శరీరం కళతప్పడం, వేడిమితగ్గడం లేక కాంతితగ్గడం), సరాగత (కన్నులు ఎఱ్ఱబడడం, అస్తమిస్తూ ఎఱ్ఱరంగుదాల్చడం)అనేవి.

మూ. సోఽపి తచ్ఛ్రుత్వా ప్రతికూలవచనం వేషవిపర్యయం చావలోక్య తామాహ—'పుంశ్చలి, చిరకాలం శ్రుతో మయా తవాపవాదః తదద్య స్వయం సఞ్జాతప్రత్యయస్తవ యథోచితం నిగ్రహం కరోమి. ఇత్యభిధాయ లగుడప్రహారైస్తాం జర్జరితదేహాం విధాయ స్థూణయా సహ దృఢబన్ధనేన బద్ధ్వా సోఽపి మదవిహ్వలో నిద్రావశమగమత్. అత్రాన్తరే తస్యాః సఖీ నాపితీ కౌలికం నిద్రావశగతం విజ్ఞాయ తాం గత్వేదమాహ—'సఖి, దేవదత్తస్తస్మిన్ స్థానే త్వాం ప్రతీక్షతే. తచ్ఛీఘ్రమాగమ్యతామ్' ఇతి. సా చాహ—'పశ్య మమావస్థామ్. తత్కథం గచ్ఛామి ? తద్గత్వా బ్రూహి తం కామినం యదస్యాం రాత్రౌ న త్వయా సహ సమాగమః'. నాపితీ ప్రాహ—'సఖి, మా మైవం వద. నాయం కులటాధర్మః. ఉక్తఞ్చ—

శ్లో. విషమస్థస్వాదుఫలగ్రహణవ్యవసాయనిశ్చయో యేషామ్
ఉష్ట్రాణామివ తేషాం మన్యేఽహం శంసితం జన్మ. 190

అ. దానిని విని అతడును (సాలెవాడు) మాటలమార్చి, వేషం మార్చుకొని ఆమెతో అన్నాడు- ఓసీకులటా, చాలాకాలంగా నీ చెడునడత విన్నాను. దానిని నేడు స్వయంగా సమ్యకంపొందాను. నీకు తగినట్లు అంగపూజ(దండన) చేస్తాను ? ఇలా అని శరీరం శిథిలం అయ్యేవిధంగా లాటీతో(కఱ్ఱతో) కొట్టి కంబానికి గట్టి త్రాటితో బంధించి మద్యం మత్తువలన నిద్రపోయాడు. ఈలోపల దానిచెలికత్తె మంగలిది, సాలెవాడు నిద్రావశుడై ఉండడం గుర్తించింది. ఆమె దగ్గరకు వచ్చింది. ఇలా చెప్పింది-'చెలీ, ఆ దేవదత్తుడు అచ్చట నీకై ఎదురుచూస్తూ ఉన్నాడు. కనుక తొందరగా రమ్ము.' ఆమె(సాలెది) అనింది- "నా అవస్థ చూడుము. ఇలాంటిస్థితిలో ఎలాపోగలను? అందుచే పోయి ఆ కాముకునితో. 'ఈ రాత్రికి నీ పొందు లేదు'-అని చెప్పుము. మంగలిది చెప్పింది- చెలీ, వద్దు అలా అనవద్దు. ఇది జారిణీ ధర్మంగాదు అనుభవజ్ఞులిలా అన్నారు— ఒంటెలవలె విషమస్థమధురఫలాలను గ్రహించే దృఢనిశ్చయంగలవారి జన్మ (దుర్లభపరపురుష సమాగమానందప్రాప్తికై దృఢనిశ్చయముగలవారి జన్మ) ప్రశంసనీయం అని నా తలంపు.

మూ. తథా చ-

శ్లో. సన్దిగ్ధే పరలోకే జనాపవాదే చ జగతి బహుచిత్రే
స్వాధీనే పరరమణే ధన్యాస్తారుణ్యఫలభాజః. 191

అ. అటులనే పరలోక సంశయగ్రస్తం. ఈలోకమన్ననో [సత్యమిథ్యాది విరుద్ధవస్తువులద్వారా] బహుచిత్రమూ, లోకనిందాయుక్తమూ [అనిత్యం అనుకొని అసి] అయిఉంది. అయినా పురుషునితో రమించడం స్వాధీనంలో ఉంది. ఇలా అనుభవించే స్త్రీలు తమ యౌవనఫలం పొందిన ధన్యురాండ్రు.

మూ. అన్యచ్చ-

శ్లో. యది భవతి దైవయోగాత్ పుమాన్ విరూపోఽపి బన్ధకీ రహసి
న తు కృచ్ఛ్రాదపి భద్రం నిజకాన్తం సా భజత్యేవ. 192

అ. మరియూ-దైవయోగంచే కురూపుడైన పురుషుడు రహస్యంగా నంభవిస్తే (తటస్థపడితే) జారిణిఅయినస్త్రీ అతనితో రమిస్తుంది, కాని అందంగాఉండే తన భర్తతో కష్టంగానైన [ఇష్టంలేనట్లైనా] రమింపదు.

మూ. సాఽబ్రవీత్—'యద్యేవం తర్హి కథయ కథం దృఢబన్ధనబద్ధా సతీ తత్ర గచ్ఛామి. సన్నిహితశ్చాయం పాపాత్మా మత్పతిః.' నావిత్యాహ—సఖి, మదవిహ్వలోఽయం సూర్యకరస్పృష్టః ప్రబోధం యాస్యతి. తదహం త్వాముస్మోచయామి. మామాత్మస్థానే బద్ధ్వా ద్రుతతరం దేవదత్తం సమ్భావ్యాగచ్ఛ. సాఽబ్రవీత్ -'ఏవమస్తు' ఇతి. తదను సా నావితీ తాం స్వసఖీం బన్ధనాద్విమోచ్య తస్యాః స్థానే యథాపూర్వమాత్మానం బద్ధ్వా తాం దేవదత్తసకాశం సఙ్కేతస్థానం ప్రేషితవతీ.

అ. ఆమె (సాలెవానిభార్య) ఇలాపల్కింది—ఇలా అయితే (నీవే) చెప్పుము—దృఢంగా త్రాళ్లతో బంధింపబడిన నేను అచ్చటికి ఎలా పోగలను? పాపాత్ముడైన నా మొగుడు దగ్గరనె ఉన్నాడు. మంగలిది చెప్పింది. 'చెలీ, మద్యపానంచే విహ్వాలుడైన ఇతడు (తెల్లవారి) సూర్యకిరణాలు తగిలితేగాని మెలకువనందడు, అందువల్లనేను నిమ్న బంధనవిముక్తను చేస్తాను- నన్ను నీకు బదులుగా (నీచోట) బంధించి దేవదత్తుని కోరిక దీర్చి మిక్కిలి శీఘ్రంగా రమ్ము. ఆమె చెప్పింది. ఇటులనే కానిమ్ము. వెంటనే మంగలిది ఆ తనచెలిని బంధవిముక్తను చేసింది. ఆమెస్థానంలో తన్ను బంధింపజేసికొంది-ఆమెను దేవదత్తునివద్దకు సంకేతస్థానానికి పంపింది.

మూ. తథానుష్ఠితే కౌలికః కస్మింశ్చిత్ క్షణే సముత్థాయ కిఞ్చిద్గతకోపో విమదస్తామాహ—'హే పరుషవాదిని, యదద్య ప్రభృతి గృహాన్నిష్క్రమణం న కరోషి, న చ పరుషం వదసి, తతస్త్వాముస్మోచయిష్యామి'. నావిత్యపి స్వరభేదభయాద్యావన్న కిఞ్చిదూచే తావత్సోఽపి భూయో భూయస్తాం తదేవాహ. అథ సా యావత్ప్రత్యుత్తరం కిమపి న దదౌ, తావత్స ప్రకుపిత స్తీక్ష్ణశస్త్రమాదాయ నాసికామచ్ఛినత్. ఆహ చ—'రే పుంశ్చలి, తిష్ఠేదానీమ్. త్వాం భూయస్తోషయిష్యామి—' ఇతి జల్పన్ పునరపి నిద్రావశమగాత్.

అ. అటులైన తర్వాత ఒకానొక క్షణాన కౌలికుడు లేచాడు. కొంతకోపం తగ్గింది, మత్తువదలింది-ఆమెతో ఇలా అన్నాడు—ఓసీ గయ్యాళీ! నేటిమొదలు ఇల్లు వదలకుంటివేని-పరుషవాక్కులు పలుకవేని, నీకు బంధవిముక్తి గల్గిస్తాను. దానిని విని

మంగలిది స్వరభేదభయంవల్ల ఏమీపల్కలేదు. వాడు మాటిమాటికి అదే అన్నాడు— అయినా ఆమె ఎంతకును బదులుపల్కలేదు. అంతట వాడు (సాలెవాడు) పిక్కిలికోపం చెంది వాడి కత్తి తీసికొని ఆమె ముక్కును కోసివేశాడు-ఇలా అన్నాడు - 'ఓసీ జారిణీ, ఇప్పటికి ఇలా (బంధనంతో) ఉండుము, నిన్ను మరల సంతోషపరుస్తాను-ఇలా జల్పిస్తూ (వదరుచూ) మరల నిద్రపోయాడు.

మూ. దేవశర్మాపి విత్తనాశాత్ క్షుత్క్షామకణ్ఠో నష్టనిద్ర స్తత్సర్వం స్త్రీచరిత్రమపశ్యత్. సాపి కౌలికభార్యా యథేచ్ఛయా దేవదత్తేన సహ సురత సుఖమనుభూయ కస్మింశ్చిత్ క్షణే స్వగృహమాగత్య తాం నాపితీమిదమాహ– అయి శివం భవత్యాః. నాయం పాపాత్మా మమ గతాయా ఉత్థితః? నాపిత్యాహ– 'శివం నాసికయా వినా శేషస్య శరీరస్య. తద్భ్రుతతరం మాం మోచయ, బంధ నాద్ యావన్నాయం మాం పశ్యతి, యేన స్వగృహం గచ్ఛామి'.

అ. దేవశర్మయు ధనం పోవడంవలనా-ఆకలి(చే గొంతుఎండడం) వలనా- నిద్రరానందున ఆ స్త్రీచరిత్రనంతా చూచాడు. సాలెవాని భార్య దేవదత్తునితో తృప్తిగా సురతసుఖం అనుభవించి కొంత సేపటికి ఇల్లుచేరింది-మంగలిదానిని ఇలా అడిగింది - నీవు క్షేమమా! నేను పోగానే ఈ పాపాత్ముడు లేవలేదు గదా! మంగలిది చెప్పింది-ముక్కు తప్ప మిగిలినశరీరం క్షేమమే. అందుచే త్వరగా కట్లువిప్పుము-ఇతడు చూడకముందే ఇంటికి పోవాలి.

మూ. తథానుష్ఠితే భూయోఽపి కౌలిక ఉత్థాయ తామాహ–'పుంశ్చలి, కిమద్యాపి న వదసి? కిం భూయోఽప్యతో దుష్టతరం నిగ్రహం కర్ణచ్ఛేదేన కరోమి'. అథ సా సకోపం సాధిక్షేపమిదమాహ–"ధిఙ్మహామూఢ, కో మాం మహాసతీం ధర్షయితుం వ్యఙ్గయితుం వా సమర్థః? తచ్ఛృణ్వన్తు సర్వేఽపి లోకపాలాః.

శ్లో. ఆదిత్యచన్ద్రావనిలోఽనలశ్చ ద్యౌర్భూమిరాపో హృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సన్ధ్యే ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్. 193

అ. అలా జరిగిన తర్వాత (కొంతసేపటికి) సాలెవాడులేచి ఆమెతో ఇలా అన్నాడు.'ఓసీ వ్యభిచారిణీ, ఇప్పటికీ బదులుపల్కవా? మరల ఇంతకంటె కఠినమైన దండనగా చెవులుకోస్తాను. అప్పుడు ఆమె కోపంతో-అధిక్షేపంతో (నీవాటతో) ఇలా ఉంది-'ఛీ మహామూర్ఖ, మహాసాధ్వి అయిన నన్ను బెదిరించడానికిగాని అంగవైకల్యం చేయటానికిగాని సమర్థుడెవడు గలడు? అందువల్ల సమస్తలోకపాలకులారా! వినండి-

సూర్యుడు చంద్రుడు-వాయువు అగ్ని ఆకాశం భూమి జలం హృదయం యముడు పగలు రేయి రెండుసంధ్యలు ధర్మదేవత - వీరందరు మానవుల నడవడికను ఎరుంగుదురు.

మూ. తద్యది మమ సతీత్వమస్తి. మనసాపి పరపురుషో నాభిలషితః తతో దేవా భూయోఽపి మే నాసికాం తాదృగ్రూపామక్షతాం కుర్వన్తు. అథవా యది మమ చిత్తే పరపురుషస్య భ్రాన్తిరపి భవతి మాం భస్మసాన్నయన్తు. ఏవముక్త్వా భూయోఽపి తమాహ-భో దురాత్మన్, పశ్య మే సతీత్వప్రభావేణ తాదృశ్యైవ నాసికా సంవృత్తా'. అథాసావుల్ముకమాదాయ యావత్పశ్యతి, తావత్ తద్రూపాం నాసికాం చ భూతలే రక్తప్రవాహం చ మహాన్తమపశ్యత్. అథ స విస్మితమనాస్తాం బన్ధనాద్విముచ్య శయ్యాయామారోప్య చ చాటుశతైః పర్యతోషయత్. దేవశర్మాపి తం సర్వం వృత్తాన్తమాలోక్య విస్మితమనా ఇదమాహ—

శ్లో. శమ్బరస్య చ యా మాయా యా మాయా నముచేరపి
బలేః కుమ్భీనసేశ్చైవ సర్వాస్తా యోషితో విదుః. 194

అ. అందువల్ల నాకు పాతివ్రత్యం ఉంటే-మనస్సులోనైనా పరపురుషుడు కోరబడకుంటే, దేవతలు నాకు ముక్కును అలాంటిదాన్నే అఖండితంగా అనుగ్రహింతురు గాక, అట్లుగాక నామనస్సులో పరపురుషుని భ్రాంతి అయినాఉంటే నన్ను భస్మంచేయుదురు గాక,' ఇలాపల్కి మరలా అతనితో ఇలా పల్కింది-'ఓరీదురాత్మా! చూడుము. నా పాతివ్రత్యమహిమచే అలాంటి ముక్కే వచ్చింది.' అంతవాడు మండేకొఱవితెచ్చి చూడగా అలాంటిముక్కు-భూమిపై గొప్పరక్తప్రవాహం కనబడ్డాయి. అంత వాడు ఆశ్చర్యపడి ఆమెకు బంధనవిముక్తి గల్గించాడు-మంచంపై చేర్చుకున్నాడు-వందలకొలది చాటు

వాక్కులతో సంతోషపఱచాడు. దేవశర్మయు (సన్యాసియు) ఆవృత్తాంతం అంతా చూచి ఆశ్చర్యపడి ఇలా (తనలో) అనుకున్నాడు-

శంబరునికి-నముచికి (శుంభ నిశుంభుల తమ్ముడు)

బలిచక్రవర్తికి-కుంభీనసికి (లవణాసురుని తల్లి-రావణునిపినతల్లి)

ఏ యే మాయలు గలవో-వాటినన్నింటిని స్త్రీలు ఎరుంగుదురు.

శ్లో. హసన్తం ప్రహసన్త్యేతా రుదన్తం ప్రరుదన్త్యపి
అప్రియం ప్రియవాక్యైశ్చ గృహ్ణన్తి కాలయోగతః. 195

అ. నవ్వే వానితోబాటు నవ్వుతారు. ఏడ్చే వానితో కలిసి ఏడుస్తారు. కాలానుగుణంగా కటువుగా మాట్లాడేవాణ్ణి ప్రియభాషణములతో లోబఱచుకుంటారు.

శ్లో. ఉశనా వేద యచ్ఛాస్త్రం యచ్చ వేద బృహస్పతిః
స్త్రీబుద్ధ్యా న విశేష్యేత తస్మాద్రక్ష్యాః కథం హి తాః. 196

అ. శుక్రాచార్యుడు ఏ శాస్త్రం ఎరుగునో, బృహస్పతి ఏ శాస్త్రం ఎరుంగునో అవి అన్నీ స్త్రీబుద్ధినిమించి లేవు. (అట్టియెడ) స్త్రీలు ఎలా రక్షింపబడగలరు ?

శ్లో. అనృతం సత్యమిత్యాహుః సత్యం చాపి తథాఽనృతమ్
ఇతి యాస్తాః కథం ధీరైః సంరక్ష్యాః పురుషైరిహ. 197

అ. ఈ స్త్రీలు అసత్యాన్ని సత్యంగాను, అలాగే సత్యాన్ని అసత్యంగాను (తారుమారుచేసి) పల్కుదురు. ఇట్టి వీరు ఈ లోకంలో ధీరులైన ఏ పరపురుషులచే రక్షింపబడుదురు ?

మూ. అన్యత్రాప్యుక్తమ్-

శ్లో. నాతిప్రసంగః ప్రమదాసు కార్యో నేచ్ఛేద్బలం స్త్రీషు వివర్ధమానమ్
అతిప్రసక్తైః పురుషైర్యతస్తాః క్రీడన్తి కాకైరివ లూనపక్షైః. 198

అ. మరియొకచోటను చెప్పబడింది-

స్త్రీలయెడ అధికమైన ఆసక్తి(ప్రేమ)చూపరాదు. వారియందు బలం వృద్ధి చెందాలని తలంపరాదు. ఏలననగా-అత్యాసక్తులైన పురుషులతో, ఱెక్కలు విరిగిన

కాకులతోవలె స్త్రీలు ఆడుకొంటారు.

శ్లో. సుముఖేన వదన్తి వల్గునా ప్రహరన్త్యేవ శితేన చేతసా

మధు తిష్ఠతి వాచి యోషితాం హృదయే హాలాహలం మహద్విషమ్. 199

అ. వారు (స్త్రీలు) సుందరవదనంతో అందంగా మాట్లాడుతారు. వాడియైన మనస్సుతో గాయపఱుస్తారు. స్త్రీలకు మాటలందు తేనె, హృదయంలో హాలహలమహా విషం ఉంటాయి.

శ్లో. అత ఏవ నిపీయతేఽధరో హృదయం ముష్టిభిరేవ తాడ్యతే

పురుషైః సుఖలేశవఞ్చితైర్మధులుబ్ధైః కమలం యథాలిభిః. 200

అ. మధులుబ్ధాలైన భ్రమరాలు అధరాలలోని (పుష్పాది తిత్తులలోని) మధువును పానం చేసి వాటి (కిందిభాగాన్ని (కమలహృదయతుల్యాన్ని) మర్దించే విధంగా - అల్పసుఖవంతులైన పురుషులు స్త్రీల అధరాలను (పెదవులను) పానం చేస్తారు. హృదయాన్ని (వక్షోజాలను) మర్దిస్తారు.

మూ. అపి చ-

శ్లో. ఆవర్తః సంశయానామవినయభవనం పత్తనం సాహసానాం

దోషాణాం సన్నిధానం కపటశతగృహం క్షేత్రమప్రత్యయానామ్.

దుర్గ్రాహ్యం యన్మహద్భిర్నరవరవృషభైః సర్వమాయాకరణ్డం

స్త్రీయన్త్రం కేన లోకే విషమమృతయుతం ధర్మనాశాయ సృష్టమ్. 201

అ. మరియూ-స్త్రీరూపమైన యంత్రాన్ని లోకంలో ధర్మనాశానికై ఎవడు సృష్టించాడో, అది సంశయాలకు సుడిగుండం, అవినీతులకు భవనం, సాహసాలకు నగరం, దోషాలకు సన్నిధి (పెన్నిధి), కపటశతాలకు పుట్టినిల్లు, అవిశ్వాసాలకు జన్మభూమి, మహాత్ములైన నరవరవృషభులకూ దుర్గ్రాహ్యం. సమస్త మాయలకు కరండం (బుట్టి-పేటిక) అమృతమిశ్రమమైన విషం అయి ఉంది.

శ్లో. కార్కశ్యం స్తనయోర్దృశోస్తరలతాఽలీకం ముఖే దృశ్యతే

కౌటిల్యం కచసఞ్చయే ప్రవచనే మాన్ద్యం త్రికే స్థూలతా,

భీరుత్వం హృదయే సదైవ కథితం మాయాప్రయోగః ప్రియే

యాసాం దోషగణా గుణా మృగదృశాం తాః కిం నరాణాం ప్రియాః. 202

అ. (ఈ స్త్రీలకు) స్తనాలందు కాఠిన్యం- చూపులందు చంచలత- నోటిలో అసత్యం- శిరోజాలందు వక్రత్వం, వాక్కునందు మాంద్యం, నితంబాలందు (పిరుదు లందు) స్థూలత్వం, హృదయంలో పిరికితనం, నిత్యం భర్తయెడ ఇంద్రజాల ప్రయోగం [సహజాలై ఉంటాయి]. ఈ హరిణాక్షులయెడ ఈ దోషాలు [కూడ] గుణాలుగా తలంప బడుతున్నాయి. ఇలాంటి వీరు ఎచ్చటనైనా పురుషులకు ప్రియురాండ్రై ఉందురా! [ఎచ్చటా ఉండరని భావం]

శ్లో. ఏతా హసన్తి చ రుదన్తి చ కార్యహేతో
ర్విశ్వాసయన్తి చ పరం న విశ్వసన్తి.
తస్మాన్నరేణ కులశీలవతా సదైవ
నార్యః శ్మశానవటికా ఇవ వర్జనీయాః. 203

అ. ఈ స్త్రీలు తమ కార్యసాధనకై నవ్వుతారు. ఏడుస్తారు. ఇతరులకు నమ్మకం గల్గిస్తారు. కాని తాము మాత్రం ఎవరినీ నమ్మరు. అందువల్ల కులవంతుడూ శీలవంతుడూ అయిన నరుడు స్త్రీలను శ్మశానంలోని వటికలను [ధనం సంచులు- పూల కుండీలు] వలె సర్వదా పరిత్యజించాలి.

శ్లో. వ్యాకీర్ణకేసరకరాలముఖా మృగేన్ద్రా
నాగాశ్చ భూరి మదరాజివిరాజమానాః,
మేధావినశ్చ పురుషాః సమరేషు శూరాః
స్త్రీసన్నిధౌ పరమకాపురుషా భవన్తి. 204

అ. చెదరిన (విచ్చిన) జూలుచే భయంకరమైన ముఖంగల సింహాలు- అధికమైన మదసమూహంచే విరాజిల్లే మదపుటేనుగులు, మేధావులైన పురుషులు, (గొప్ప) సంగ్రామవీరులూ, వీరందరు తమ భార్యలవద్ద మిక్కిలి పిటికివారు అగుదురు.

శ్లో. కుర్వన్తి తావత్ప్రథమం ప్రియాణి యావన్న జానన్తి నరం ప్రసక్తమ్,
జ్ఞాత్వా చ తం మన్మథపాశబద్ధం గ్రస్తామిషం మీనమివోద్ధరన్తి. 205

అ. 'పురుషుడు తనపై ఆసక్తుడు'- అనే విషయం తెలియనంతవరకు

స్త్రీలు అతనికి ఇష్టమైన పనులు చేస్తారు. 'అతడు తనయెడ కామాతురుడు'- అని తెలియగానే గాలానికి గ్రుచ్చిన మాంసాన్ని మ్రింగిన చేపనువలె అతన్ని స్వాధీనపఱచుకుంటారు.

శ్లో. సముద్రవీచీవ చలస్వభావాః సన్ధ్యాభ్రరేఖేవ ముహూర్తరాగాః,
 స్త్రియః కృతార్థాః పురుషం నిరర్థం నిష్పీడితాలక్తకవత్ త్యజన్తి. 206

అ. సముద్రతరంగాలవలె చపల స్వభావం గలవారూ, సంధ్యాకాల మేఘరేఖవలె క్షణికమైన రాగం [ఎఱ్ఱదనం-ప్రేమ] గలవారు అయిన స్త్రీలు కృతార్థలు (తమ పనిని సాధించుకొన్నవారు) కాగానే అర్థహీనుడైన పురుషుణ్ణి, పిండిన లత్తుకనువలె పరిత్యజిస్తారు.

శ్లో. అనృతం సాహసం మాయా మూర్ఖత్వమతిలోభతా
 అశౌచం నిర్దయత్వం చ స్త్రీణాం దోషాః స్వభావజాః. 207

అ. అసత్యం, సాహసం, మాయ (కల్పన-వంచన), మూర్ఖత, అధిక లోభం, అశుద్ధత, దయాశూన్యత– ఇవి స్త్రీలకు సహజసిద్ధమైన దోషాలు.

శ్లో. సమ్మోహయన్తి మదయన్తి విడమ్బయన్తి
 నిర్భర్త్సయన్తి రమయన్తి విషాదయన్తి,
 ఏతాః ప్రవిశ్య సరలం హృదయం నరాణాం
 కిం వా న వామనయనా న సమాచరన్తి. 208

అ. ఈ కుటిలనేత్రలు (తమ వాలుచూపులతో మొదట మగవాని మనస్సునందు) మోహం పుట్టిస్తారు. తర్వాత (తమ ప్రేమలో) మత్తుణ్ణి చేస్తారు. ఆపైన ఒకసారి మోసగిస్తే మరొకసారి బెదరిస్తారు (కసరుకుంటారు). వేఱొక పర్యాయం రతిచే ఆనందం గల్గిస్తే ఇంకొకవేళ (విరసించి) విషాదం జనింపజేస్తారు. వీరు సరళమైన (కపటంలేని) పురుషుల హృదయంలో ప్రవేశించి ఏమి చేయరని లేదు? అన్నీ చేస్తారు అని భావం.

శ్లో. అన్తర్విషమయాహ్యేతా బహిశ్చైవ మనోరమాః,
 గుఞ్జాఫలసమాకారా యోషితః కేన నిర్మితాః. 209

ఆ. గురిగింజవలె లోపల చేదుగానూ, బయటికి చూడడానికి అందంగానూ కనబడే ఈ స్త్రీలను ఎవడు పుట్టించాడో?

మూ. ఏవం చిన్తయత స్తస్య పరివ్రాజకస్య సా నిశా మహతా కృచ్ఛ్రేణాతిచక్రామ. సా చ దూతికా ఛిన్ననాసికా స్వగృహం గత్వా చిన్తయామాస— 'కిమిదానీం కర్తవ్యమ్? కథమేతన్మహచ్ఛిద్రం స్థగయితవ్యమ్?' అథ తస్యా ఏవం విచిన్తయన్త్యా భర్తా కార్యవశాద్రాజకులే పర్యుషితః ప్రత్యూషే చ స్వగృహమభ్యుపేత్య ద్వారదేశస్థో వివిధపౌరకృత్యోత్సుకతయా తామాహ— 'భద్రే, శీఘ్రమానీయతాం క్షురభాణ్డం యేన క్షౌరకర్మకరణాయ గచ్ఛామి'.

ఆ. ఇలా విచారించే ఆ సన్యాసికి ఆ రాత్రి మిక్కిలి కష్టంగా గడిచింది. ముక్కు కోయబడిన ఆ దూతికయు తన ఇంటికి పోయి ఇలా విచారించింది– 'ఇప్పుడు ఏమి చేయాలి? ఈ గొప్ప దోషం ఎలా దాచాలి?' ఇలా ఆమె విచారిస్తూ ఉండగా ఏదో కార్యవశాన రాజకులంలో (రాజభవనంలో) రాత్రి గడపి తెల్లవారగానే (ఆమె) మగడు ఇంటికి వచ్చాడు. రాగానే ద్వారంనుండియే, పురవాసుల కనేకులకు క్షౌరం చేయవలసిన తొందరలో ఆమెతో ఇలా అన్నాడు– శుభమూర్తీ! మంగలిపెట్టె త్వరగా తెమ్ము. క్షౌరం చేయడానికి వెళ్లాలి!

మూ. సాఽపి ఛిన్ననాసికా గృహమధ్యస్థితైవ కార్యకరణాపేక్షయా క్షురభాణ్డాత్ క్షురమేకం సమాకృష్య తస్యాభిముఖం ప్రేషయామాస. నాపితోఽప్యుత్సుకతయా తమేకం క్షురమవలోక్య కోపావిష్టః సన్ తదభిముఖమేవ తం క్షురం ప్రాహిణోత్. ఏతస్మిన్నన్తరే సా దుష్టోర్ధ్వబాహూ విధాయ ఫూత్కుర్వతీ గృహాన్నిశ్చక్రామ. "అహో పశ్యత, పాపేనానేన మమ సదాచారవర్తిన్యా నాసికాచ్ఛేదో విహితః. తత్ పరిత్రాయతామ్ పరిత్రాయతామ్" (ఇత్యాక్రోశం కృతవతీ).

ఆ. ముక్కు కోయబడిన ఆ మంగలిదియు ఇంటి నడుమనుండియే పని తొందరను (ప్రకటిస్తూ–నటిస్తూ) మంగలి పెట్టెనుండి ఒక (మంగలి) కత్తిని గుంజ వానికి ఎదురుగా విసరివేసింది. మంగలివాడు (క్షౌరకర్మ) తొందరలో ఆ కత్తినొక

దాన్ని చూచి కోపావిష్టుడయ్యాడు. ఆ కత్తిని ఆమెవైపుగానే విసిరివేశాడు. ఇంతలో ఆ దుష్టురాలు రెండు చేతులూ పైకెత్తి బుసకొట్టుతూ (నిట్టూర్పు విడుస్తూ) ఇంటినుండి (వేగంగా) వెలుపలికి వచ్చింది. "అయ్యో. చూడండి ఈ పాపాత్ముడు పతివ్రతనైన నాకు ముక్కును కోశాడు. కనుక రక్షించండి, రక్షించండి. (అని అరిచింది)

మూ. అత్రాన్తరే రాజపురుషాః సమభ్యేత్య తం నాపితం లగుడ ప్రహారైర్జర్జరీకృత్య దృఢబన్ధనైర్బద్ధ్వా తయా ఛిన్ననాసికయా సహ ధర్మాధి కరణస్థానం నీత్వా సభ్యానూచుః – 'శృణ్వన్తు భవన్తః సభాసదః, అనేన నాపితేనాపరాధం వినా స్త్రీరత్నమేతద్వ్యఙ్గితమ్. తదస్య యద్యుజ్యతే తత్క్రియతామ్, ఇత్యభిహితే, సభ్యా ఊచుః–'రే నాపిత! కిమర్థం త్వయా భార్యా వ్యఙ్గితా ? కిమనయా పరపురుషోఽభిలషితః, ఉతస్విత్ ప్రాణద్రోహః కృతః. కిం వా చౌర్యకర్మాచరితమ్ ? తత్కథ్యతామస్యా అపరాధః'. నాపితోఽపి ప్రహారపీడితతనుర్వక్తుం న శశాక.

అ ఇంతలో (దానిని విని) రాజభటులు వచ్చారు. ఆ మంగలిని లాఠీకఱ్ఱలతో ఎముకలు విరుగబాదారు. గట్టిత్రాళ్లతో గట్టారు. ఆ ముక్కుకోయించుకొన్న దానితోబాటు న్యాయస్థానానికి గొంపోయారు. సభాసదులతో ఇలా చెప్పారు. "ఓ సభ్యులారా! తాము వినండి. ఈ మంగలి నిరపరాధ అయిన ఈ నారీరత్నాన్ని వికలాంగిని చేశాడు అందువల్ల వీనికి తగిన దండన విధింతురుగాక''! (భటులు) ఇలా చెప్పగా సభ్యులు అన్నారు- ''ఓరీ మంగలీ! భార్యను ఎందుకు వికలాంగిని చేశావు? ఈమె పరపురుషుణ్ణి కోరిందా? (నీకు) ప్రాణద్రోహం తలపెట్టిందా? లేక దొంగతనం చేసిందా? ఈమె తప్పు ఏమియో తెల్పుము'. (కాని) మంగలి దెబ్బలబాధవల్ల (ఏమియు) పలుకలేక పోయాడు.

మూ. అథ తం తూష్ణీభూతం దృష్ట్వా పునరూచుః–"అహో సత్య మేతత్ రాజపురుషాణాం వచః. పాపాత్మాఽయమ్. అనేనేయం నిర్దోషా వరాకీ దూషితా. ఉక్తఞ్చ–

శ్లో. భిన్నస్వరముఖవర్ణః శఙ్కితదృష్టిః సముత్పతితతేజాః
భవతి హి పాపం కృత్వా స్వకర్మసన్త్రాసితః పురుషః. 210

మూ. తథా చ-

శ్లో. ఆయాతి స్ఖలితైః పాదైర్ముఖవైవర్ణ్యసంయుతః
లలాటస్వేదభాగ్ భూరి గద్గదం భాషతే వచః. 211

శ్లో. అధో దృష్టిర్వదేత్కృత్వా పాపం ప్రాప్తః సభాం నరః
తస్మాద్యత్నాత్ పరిజ్ఞేయాశ్చిహ్నైరేతైర్విచక్షణాః. 212

మూ. అన్యచ్చ-

శ్లో, ప్రసన్నవదనో దృష్టః స్పష్టవాక్యః సరోషదృక్
సభాయాం వక్తి సామర్షం సావష్టమ్భో నరః శుచిః. 213

తదేష దుష్టచారిత్రలక్షణో దృశ్యతే. స్త్రీధర్షణాద్వధ్య ఇతి. తచ్ఛూలీయామారోప్యతామ్"- ఇతి.

అ. అంతట వాడు (మంగలి) మౌనంగా ఉండటం చూచి (సభ్యులు) అన్నారు. 'ఆహా, ఈరాజభటుల మాట సత్యం. నిరపరాధి అయిన ఈదీనురాలికి వీడు అపచారంచేశాడు.' పెద్దలిలా అన్నారు-

పాపం చెసిన పురుషుడు తనపాపంవల్ల భయపడుతాడు. (అందుచే అప్పుడు) వానిమాటలు తడబడుతాయి ముఖాకృతి మారుతుంది. చూపులు సందిగ్ధంగా ఉంటాయి. (శరీరంపై) కాంతి తగ్గుతుంది.

అలాగే-అపరాధి తొట్రుపాటు కాళ్లతో నడుస్తాడు. ముఖం కళాహీనం అవుతుంది. నొసట అధికంగా చెమట పట్టుతుంది. డగ్గుత్తికతో మాట్లాడుతాడు.

అపరాధి న్యాయస్థానానికి వచ్చినచో అధోదృష్టియై (నేలనుచూస్తూ) మాట్లాడుతాడు.అందుచే విజ్ఞులైన అధికారులు ఈగుర్తులవల్ల దోషులను గుర్తించాలి.

మరియూ-నిర్దోషి అయినవాడు న్యాయస్థానంలో ప్రసన్న వదనుడుగా-స్పష్ట భాషణుడుగా-రోషయుక్తుడుగా (గర్విగా) ఉంటాడు. (మరియూ) ధైర్యంగా మాట్లాడుతాడు.

అందువల్ల పాపంచేసిన గుర్తులతో వీడు కనబడుచున్నాడు. స్త్రీని అవమానించడంచే మరణశిక్షకు అర్హుడు. శూలానికి ఎక్కించాలి".

మూ. అథ వధ్యస్థానం నీయమానం తమవలోక్య దేవశర్మా తాన్ ధర్మాధికృతాన్ గత్వా ప్రోవాచ– భో భోః అన్యాయేనైష వరాకో వధ్యతే నాపితః. సాధు సమాచార ఏషః. తచ్ఛ్రూయతాం మే వాక్యమ్. 'జమ్బుకో హుడుయుద్ధేన–' ఇతి. అథ తే సభ్యా ఊచుః–'భో భగవన్, కథమేతత్ ?' తతో దేవశర్మా తేషాం త్రయాణాం వృత్తాన్తం విస్తరేణాకథయత్. తదాకర్ణ్య సువిస్మితమనస స్తే నాపితం విమోచ్య మిథః ప్రోచుః–'అహో !

శ్లో. అవధ్యా బ్రాహ్మణో బాలః తపస్వీ చ రోగభాక్
విహితా వ్యఙ్గితా తేషామపరాధే మహత్యపి. 214

తదస్యా నాసికాచ్ఛేదః స్వకర్మణా హి సంవృత్తః. తతో రాజనిగ్రహస్తు కర్ణచ్ఛేదః కార్యః".

అ. అంతట వధ్యస్థానానికి ఆమంగలిని తీసికొని పోవుచుండగా దేవశర్మ చూచాడు. ధర్మాధికారులవద్దకు పోయి ఇలా పోక్కి చెప్పాడు–'అయ్యలారా, అన్యాయంగా ఈదీనుడు వధింపబడుతున్నాడు. వీడు మంచి నడవడిక గలవాడు. నామాటవినండి– 'జమ్బుకో హుడుయుద్ధేన' ఇత్యాది. ఆ సభ్యులు అడిగారు– 'ఓ స్వామీ! అదిఎట్లు?' పిమ్మట–ఆముప్పురి వృత్తాంతాన్ని విశదంగా తెలిపాడు. దానిని విని వారు మిక్కిలి ఆశ్చర్యం పొందారు. మంగలిని విడిపించారు. తమలోతాము ఇలా మాట్లాడుకున్నారు– "ఆశ్చర్యం ?

'గొప్ప అపరాధం చేసినా బ్రాహ్మణుడు, బాలుడు, స్త్రీ, తపస్వి, రోగి– ఈ అయిదుగురికి మరణశిక్ష విధింపరాదు (అని ధర్మశాస్త్రం). అందుచే వికలాంగత విధింపవచ్చు

ఈమెకు తనకర్మచేతనే ముక్కు కోయబడింది. రాజదండనగా చెవులు కోయించాలి.

మూ. తథానుష్ఠితే దేవశర్మాపి విత్తనాశసముద్భవశోకరహితః పునరపి స్వకీయం మఠాయతనం జగామ. అతోఽహం బ్రవీమి–'జమ్బుకో హుడుయుద్ధేన'– ఇతి. కరటక ఆహ– 'ఏవంవిధే వ్యతికరే కిం కర్తవ్యమావయోః?"

దమనకోఽబ్రవీత్ – 'ఏవం విధేఽపి సమయే మమ బుద్ధిస్ఫురణం భవిష్యతి, యేన సఞ్జీవకం ప్రభోర్విశ్లేషయిష్యామి. ఉక్తఞ్చ యతః –

శ్లో. ఏకం హన్యాన్న వా హన్యాదిషుర్ముక్తో ధనుష్మతా
బుద్ధిర్బుద్ధిమతః సృష్టా హన్తి రాష్ట్రం సనాయకమ్. 215

తదహం మాయాప్రపఞ్చేన గుప్తమాశ్రిత్య తం స్ఫోటయిష్యామి.

అ. అలా చేయగా దేవశర్మయు ధనంపోవడంచే గల్గిన దుఃఖంనుండి (కొంత) ఓదార్పు నొందాడు. మరలా తన మఠం చేరాడు. అందుచే నేను (దమనకుడు) చెప్పుచున్నాడు – 'జమ్బుకో హుడుయుద్ధేన–ఇత్యాది. కరటకుడు అన్నాడు' ఇలాంటి విపరీతమైన అవస్థవస్తే మనం ఏం చేయాలి? దమనకుడు ఇలా చెప్పాడు – ఇలాంటి సమయంలోనూ నాబుద్ధికి స్ఫురిస్తూనే ఉంది. దాని ప్రభావంచే ప్రభువునుండి సంజీవ కుణ్ణి విడదీస్తాను. ఏలననగా పెద్దలన్నారు —

విలుకాని విల్లునుండి విడువబడ్డ ఒకబాణం (గురికుదిరితే) ఒకణ్ణి చంప వచ్చు. లేక వ్యర్థం కావచ్చు. కాని రాజనీతిజ్ఞుడు సృష్టించిన బుద్ధి (వ్యూహం) రాజుతో బాటు రాష్ట్రాన్ని నాశనం చేస్తుంది.

అందుచే నేను నా మాయా సృష్టిద్వారా రహస్యం (కుట్రను) ఆశ్రయించి దాన్ని ప్రయోగిస్తాను.

మూ. కరటక ఆహ–'భద్ర, యది కథమపి తవ మాయాప్రవేశం పిఙ్గలకో జ్ఞాస్యతి సఞ్జీవకో వా తదా నూనం విఘాత ఏవ.' సోఽబ్రవీత్– తాత, మైవం వద. గూఢబుద్ధిభిరాపత్కాలే విధురేఽపి దైవే బుద్ధిః ప్రయోక్తవ్యా. నోద్యమస్త్యాజ్యః. కదాచిత్ ఘుణాక్షరన్యాయేన బుద్ధేః సామ్రాజ్యం భవతి. ఉక్తఞ్చ–

శ్లో. త్యాజ్యం న ధైర్యం విధురేఽపి దైవే
ధైర్యాత్కదాచిత్ స్థితిమాప్నుయాత్ సః,

యాతే సముద్రేఽపి హి పోతభఙ్గే
సాంయాత్రికో వాఞ్ఛతి కర్మ ఏవ(కార్యమేతత్). 216

అ. కరటకుడు అన్నాడు – 'శుభమూర్తీ! నీమాయను (వంచన) ఏదో విధంగా పింగళకుడుగానీ సంజీవకుడుగానీ తెలుసుకుంటే తప్పక వినాశమే? ఆతడు (దమనకుడు) ఇలా పల్కాడు–'తాతా! అలా అనవద్దు. ఆపదవచ్చినప్పుడు దైవం ప్రతికూలంగా ఉన్నా రాజనీతిజ్ఞులు తమబుద్ధిని ఉపయోగించవలసిందే. ప్రయత్నం మానరాదు. ఒకప్పుడు (కాలం కలిసివస్తే) ఘుణాక్షరన్యాయంగా బుద్ధికి సామ్రాజ్యం (విజయం) లభిస్తుంది. పెద్దలన్నారు—

దైవం ప్రతికూలం ఉన్నా ధైర్యం వీడరాదు. ధైర్యంగా-ఉండేవాడు ఒకనాటికైనా ఉన్నతస్థితిని పొందుతాడు. సముద్రంలో ఓడమునిగినా సముద్రవ్యాపారులు (ధైర్యంతో) అదేవ్యాపారం చేయడానికి ఇష్టపడుతారు.

మూ. తథా చ –

శ్లో. ఉద్యోగినం సతతమత్ర సమేతి లక్ష్మీ
ర్దైవేన దేయమితి కాపురుషా వదన్తి,
దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః. 217

అ. ప్రయత్నతత్పరునికి ఈ లోకంలో లక్ష్మి ప్రాప్తిస్తుంది. పిరికివాండ్రు (కాపురుషులు) దైవం దైవం అని పల్కుతుంటారు. దైవాన్ని (అదృష్టాన్ని) ప్రక్కకు ద్రోసి శక్తికొలది పురుషార్థానికి పాటుపడుము. ప్రయత్నం చేసినా నెఱవేరకపోతే(నీ) దోషం అందులో ఏముంది?

మూ. తదేవం జ్ఞాత్వా సుగూఢబుద్ధిప్రభావేణ యథా తౌ ద్వావపి న జ్ఞాస్యతః, తథా మిథో వియోజయిష్యామి. ఉక్తఞ్చ–

శ్లో. సుప్రయుక్తస్య దమ్భస్య బ్రహ్మాప్యన్తం న గచ్ఛతి
కౌలికో విష్ణురూపేణ రాజకన్యాం నిషేవతే. 218

కరటక ఆహ–'కథమేతత్?' సోఽబ్రవీత్—

అ. కనుక ఇలా తలంచి నిగూఢమైన బుద్ధిప్రభావంచే వారికిరువురకు తెలియనట్లుగా వారిని విడదీస్తాను. విజ్ఞులు అన్నారు—

లెస్సగా ప్రయోగించిన రాజకీయవ్యూహం (దంభం) అంతును బ్రహ్మగూడ తెలిసికొనజాలడు. సాలెవాడు విష్ణురూపం ధరించి రాజకన్యతో క్రీడిస్తాడు. (దంభము మాయ, వ్యూహము) కరటకుడు అడిగాడు— 'అదిఎట్లు'? అతడు ఇలా చెప్పాడు—

## కథా–5

## విష్ణురూపధృక్ కౌలికకథా

మూ. కస్మింశ్చిదధిష్ఠానే కౌలికరథకారౌ మిత్రే ప్రతివసతః స్మ. తత్ర చ తౌ బాల్యాత్ ప్రభృతి సహచారిణౌ పరస్పరమతీవ స్నేహపరౌ సదైకస్థాన విహారిణౌ కాలం నయతః. అథ కదాచిత్ తత్రాధిష్ఠానే కస్మింశ్చిద్దేవాయతనే యాత్రామహోత్సవః సంవృత్తః. తత్ర నట-నర్తకచారణసఙ్కులే నానాదేశాగతజనావృతే తౌ సహచరౌ భ్రమన్తౌ కాఞ్చిద్రాజకన్యాం కరేణుకారూఢాం సర్వలక్షణసనాథాం కఞ్చుకివర్షవరపరివారితాం దేవతాదర్శనార్థం సమాయాతాం దృష్టవన్తౌ.

అ. ఒకానొక నగరంలో సాలెవాడు, వడ్రంగి— ఈ ఇరువురు మిత్రులై నివసించేవారు. అచ్చట వారిరువురు బాల్యం నుండి సహచరులై, పరస్పరం మిక్కిలి స్నేహం గలవారై, నిత్యం ఏకస్థానవిహారులై కాలం గడిపేవారు. అంతట ఒకనాడు ఆ నగరంలో ఒకానొక దేవాలయమునందు యాత్రామహోత్సవం (జాతర-తిరుణాల) జరిగింది. అచ్చటికి నానా దేశాలనుండి సామాన్య జనులేగాక (తమ విద్యలు ప్రదర్శించేందుకై) నటులు, నర్తకులు, స్తుతిపాఠకులు— ఇత్యాదులెందరో వచ్చారు. అందుచే ఆ ప్రదేశం జనులచే క్రిక్కిరిసిపోయింది. ఈ మిత్రులిరువురు అచ్చట తిరుగుచు దైవసందర్శనార్థమై కరేణుకను (ఆడఏనుగును) ఆరోహించి వచ్చిన సర్వ శుభ లక్షణయుతయైన ఒకానొక రాజకన్యను చూచారు. ఆమె వెంట కంచుకులు (అంతఃపుర వృద్ధ బ్రాహ్మణులు) వర్షవరులు (రాణివాస రక్షకులైన నపుంసకులు) మొదలైన పరివారం ఉన్నారు.

మూ. అథాఽసౌ కౌలికస్తాం దృష్ట్వా విషార్దిత ఇవ. దుష్టగ్రహగృహీత ఇవ, కామశరైః ర్హన్యమానః సహసా భూతలే నిపపాత. అథ తం తదవస్థమవలోక్య రథకార స్తద్దుఃఖదుఃఖిత ఆప్తపురుషై స్తం సముత్క్షిప్య స్వగృహమనాయయత్. తత్ర చ వివిధైః శీతోపచారై శ్చికిత్సకోపదిష్టైర్మ న్త్రవాదిభిరుపచర్యమాణశ్చిరాత్ కథఞ్చిత్ సచేతనో బభూవ.

అ. అంత సాలెవాడు ఆమెను చూచి విషపీడితునివలె దుష్టగ్రహం పట్టినవానివలె మన్మథబాణాలచే బాధితుడు అగుచూ తటాలున (మూర్ఛితుడై) భూమిమీద పడ్డాడు. వడ్రంగి, అతని ఆ దురవస్థను చూచాడు. అతని దుఃఖంచే (తానూ) దుఃఖితుడయ్యాడు. ఆప్తులచే ఎత్తించుకొని తన ఇంటికి చేర్చాడు. వైద్యులు తెలిపిన అనేక శీతలోపచారాలూ, మంత్రవాదులచే మంత్రతంత్రాది ప్రయోగాలు చేయింపసాగాడు. ఇలా చేస్తూ ఉండగా కొంత సేపటికి ఏదోవిధంగా సాలెవాడు తెలివినొందాడు.

మూ. తతో రథకారేణ పృష్టః– 'భో మిత్ర, కిమేవం త్వమకస్మాద్విచేతనః సఞ్జాతః. తత్కథ్యతామాత్మస్వరూపమ్. స ఆహ– 'వయస్య యద్యేవం తచ్ఛృణు మే రహస్యం యేన సర్వామాత్మవేదనాం తే వదామి. యది త్వం మాం సుహృదం మన్యసే, తతః కాష్ఠప్రదానేన ప్రసాదః క్రియతామ్. క్షమ్యతాం యద్వా కిఞ్చిత్ ప్రణయాతిరేకాదయు క్తం తవ మయాఽనుష్ఠితమ్. సోఽపి తదా తదాకర్ణ్య బాష్పపిహితనయనః సగద్గదమువాచ– 'వయస్య, యత్కిఞ్చిద్దుఃఖకారణం తద్వద, యేన ప్రతీకారః క్రియతే యది శక్యతే కర్తుమ్, ఉక్తఞ్చ–

శ్లో. ఔషధానాం సుమన్త్రాణాం బుద్ధేశ్చైవ మహాత్మనామ్
అసాధ్యం నాస్తి లోకేఽత్ర యద్బ్రహ్మాణ్డస్య మధ్యగమ్. 219

తదేషాం చతుర్ణాం యది సాధ్యం భవిష్యతి తదాహం సాధయిష్యామి'

అ. పిమ్మట రథకారుడు (వడ్రంగి) అడిగాడు— 'ఓ మిత్రమా! ఎందుకిలా నీవు హఠాత్తుగా తెలివిదప్పావు? కనుక నీ పరిస్థితి ఏమిటో తెల్పుము. అతడు

(సాలెవాడు) ఇలా చెప్పాడు— 'మిత్రమా! ఇలా అయితే నా రహస్యం వినుము- నా దుఃఖం అంతా నీకు తెల్పుతాను. నీవు నన్ను మిత్రునిగా తలంతువేని నాకు కాష్ఠప్రదానంచేసి (చితిని తయారుచేసి) కరుణింపుము. నేను స్నేహకారణంగా నీయెడ ఏదేని అనుచితం చేసిఉంటే క్షమింపుము. దానిని వినగానే వానికి (రథకారునికి) కన్నులలో నీరు నిండింది. గద్గదస్వరంతో ఇలా అన్నాడు— 'మిత్రమా! దుఃఖ కారణం ఏమిటో తెల్పుము. వీలైతే ప్రతీకారం (తొలగే ఉపాయం) చేయవచ్చు. పెద్దలన్నారు—

'ఈ లోకమందు- తుదకు బ్రహ్మాండమందు (అంతటా) ఔషధానికి, ధనానికి, మంచి మంత్రాంగానికి (ఆలోచనకు), మహాత్ముల బుద్ధికి (ఈ నాల్గింటికి) అసాధ్యం లేదు.'

అందువల్ల ఈ నాల్గింటిలో ఏదోఒక ఉపాయంచే నీ కార్యం సాధ్యం అయితే నేను సాధిస్తాను.

మూ. కౌలిక ఆహ— 'వయస్య, ఏతేషామన్యేషామపి సహస్రాణాముపాయానామసాధ్యం తన్మే దుఃఖమ్. తస్మాన్మమ మరణే మా కాలక్షేపం కురు'. రథకార ఆహ— 'భో మిత్ర, యద్యప్యసాధ్యం తథాపి నివేదయ, యేనాహమపి తదసాధ్యం మత్వా త్వయా సమం వహ్నౌ ప్రవిశామి. న క్షణమపి త్వద్వియోగం సహిష్యే. ఏష మే నిశ్చయః'. కౌలిక ఆహ— 'వయస్య, యాఽసౌ రాజకన్యా కరేణుమారూఢా తత్రోత్సవే దృష్టా, తస్యా దర్శనానంతరం మకరధ్వజేన మమేయమవస్థా విహితా. తన్న శక్నోమి తద్వేదనాం సోఢుమ్. తథా చోక్తమ్—

శ్లో. మత్తేభకుమ్భపరిణాహిని కుఙ్కుమార్ద్రే తస్యాః పయోధరయుగే గతిఖేదఖిన్నః
వక్షో నిధాయ భుజపఞ్జరమధ్యవర్తీ స్వప్స్యే కదా క్షణమవాప్య తదీయసఙ్గమ్. 220

అ. కౌలికుడు (సాలెవాడు) ఇలా చెప్పాడు— 'ఈ (నాల్గు) ఉపాయాలకూ ఇతరాలైన వెయ్యి ఉపాయాలకూ తొలగింప నలవికానిది నా దుఃఖం. కనుక నా

మరణానికి కాలక్షేపం చేయవద్దు'. రథకారుడు అన్నాడు- ఓ నేస్తమా! అది అసాధ్యం అయినా తెలుపుము. నేనూ (దాన్ని) అసాధ్యంగా తలంచితే నీతోపాటు అగ్నిలో ప్రవేశిస్తాను. క్షణంగూడా నీ వియోగం సహింపలేను. ఇది నా నిశ్చయం. కౌలికుడు అన్నాడు, 'మిత్రమా! ఆ ఉత్సవంలో ఆడఏనుగును ఎక్కివచ్చిన ఆ రాజపుత్రిని చూచాను. అప్పటి నుండి మన్మధునిచే ఈ అవస్థను పొందాను. ఈ బాధను సహింప జాలను. విజ్ఞులు ఇలా అన్నారు—

'మదపుటేనుగు కుంభస్థలాలవలె విశాలములూ, కుంకుమాదికంచే తడిసినవీ (కుంకుమాదికం పూయబడినవి) అయిన ఆమె స్తనాలు రెండింటిపైన రతిశ్రమచే అలసినవాడనై నా వక్షము (రొమ్ము) ఉంచి, ఆమె రెండుభుజాల నడుమ నుండువాడనై (ఆమెచే కౌగిలింపబడినవాడనై) క్షణమైన ఆమె సంగం పొంది ఎప్పుడు నిద్రిస్తానో'

మూ. తథా చ -

శ్లో. రాగీ బిమ్బాధరోఽసౌ స్తనకలశయుగం యౌవనారూఢగర్వం
నీచా నాభిః ప్రకృత్యా కుటిలకమలకం స్వల్పకం చాపి మధ్యమ్.
కుర్వన్త్వేతాని నామ ప్రసభమిహ మనశ్చిన్తితాన్యాశు ఖేదం
యన్మాం తస్యాః కపోలౌ దహత ఇతి ముహుః స్వచ్ఛకౌ తన్న యుక్తమ్ 221

అ. అటులనే-

ఎఱ్ఱనిదైన దొండపండువంటి పెదవులు, యౌవన గర్వంతో(పొగరుతో) ఉండే చన్దోయి, లోతైన బొడ్డు, సహజంగా వంకరలు తిరిగిన శిరోజాలు, మిక్కిలి సన్నని నడుము, ఇవి అన్నీ బలాత్కారంగా తలంపబడ్డవై మనస్సుకు దుఃఖం కల్గించుగాక (అది కొంతవరకు ఉచితమే.) కాని ఆమె స్వచ్ఛమైన చెంపలు నన్ను మాటిమాటికీ దహిస్తున్నాయి. ఇది ఉచితం గాదు.

మూ. రథకారోఽప్యేవం సకామం తద్వచనమాకర్ణ్య సవిస్మితమిదమాహ- 'వయస్య, యద్యేవం త్వర్హి సిద్ధం నః ప్రయోజనమ్. తదద్యైవ తయా సహ సమాగమః క్రియతామ్-' ఇతి. కౌలిక ఆహ- వయస్య, యత్ర కన్యాన్తఃపురే

వాయుం ముక్త్వా నాన్యస్య ప్రవేశోఽస్తి. తత్ర రక్షాపురుషాధిష్ఠితే కథం నామ తయా సహ సమాగమః? తత్కిం మామసత్యవచనేన విడమ్బయసి?

అ. రథకారుడు(పడ్రంగియూ) ఇలా కామపూర్ణం అయిన అతని వాక్కు విని చిఱునవ్వు చిందిస్తూ ఇలా అన్నాడు– 'మిత్రమా! విషయం ఇది అయితే మన కోరిక సిద్ధించినది.' నేడే ఆమెతో సమాగమం(సంభోగం) చెయబడుగాక. సాలెవాడు అన్నాడు–'మిత్రమా! ఆ కన్యాంతఃపురంలోనికి గాలికి తప్ప ఇతరులకు ప్రవేశంలేదు. రక్షకభటులు కాపలా ఉంటారు. ఎట్లు నాకు ఆమెతో కలయిక అవుతుంది. అలాంటప్పుడు ఎందుకు నన్ను అసత్యవాక్కులతో వంచిస్తావు.'

మూ. రథకార ఆహ– 'పశ్య మే బుద్ధిబలమ్.' ఏవమభిధాయ తత్క్షణాత్ కీలసఞ్చారిణం వైనతేయం బాహుయుగలం వాయుజవృక్షదారుణా శఙ్ఖచక్రగదాపద్మాన్వితం సకిరీటకౌస్తుభమఘటయత్. తతస్తస్మిన్ కౌలికం సమారోప్య విష్ణుచిహ్నితం కృత్వా కీలసఞ్చరణవిజ్ఞానఞ్చ దర్శయిత్వా ప్రోవాచ–

అ. రథకారుడు ఇలా అన్నాడు - 'నా బుద్ధిబలం చూడుము', ఇలా అని తక్షణమే వాయుజవృక్షం (గాలిలోతేలియాడు ఒకవిధమైన చెట్టు) కఱ్ఱతో కీలసంచారి అయిన (యంత్రంతో సంచరించే) గరుత్మంతుణ్ణి నిర్మించాడు (దానికి) రెండురెక్కలు అమర్చాడు. శంఖం, చక్రం, గదా, పద్మం, కిరీటం, కౌస్తుభమణి తయారుచేసాడు. పిమ్మట ఆ గరుడునిపై (మిత్రుడైన) సాలెవాణ్ణి ఎక్కించాడు. అతణ్ణి (శంఖచక్రాదులతో) విష్ణుచిహ్నలు గలవానినిగా చేశాడు. యన్త్రగరుడుని నడిపే విజ్ఞానం ప్రదర్శన పూర్వకంగా నేర్పి ఇలా అన్నాడు—

మూ. 'వయస్య, అనేన విష్ణురూపేణ గత్వా కన్యాన్తఃపురే నిశీథే తాం రాజకన్యామేకాకినీం సప్తభూమికాప్రాసాదప్రాంతగతాం, ముగ్ధస్వభావాం, త్వాం వాసుదేవం మన్యమానాం, స్వకీయమిథ్యావక్రోక్తిభీ రఞ్జయిత్వా వాత్స్యాయనోక్తవిధినా భజ'. కౌలికోఽపి తదాకర్ణ్య తథారూపస్తత్ర గత్వా తామాహ– 'రాజపుత్రి, సుప్తా కిం వా జాగర్షి? అహం తవ కృతే సముద్రాత్

సానురాగో-లక్ష్మీం విహాయైవాగతః. తత్ క్రియతాం మయా సహ సమాగమః ఇతి.

అ. 'మిత్రమా, ఈవిష్ణురూపంతో ఎడిరేయిని కన్యాంతఃపురానికి పొమ్ము. ఏడు భూమికల (ద్వారాల)తోడి ప్రాసాదం చివరిభాగంలో ఒంటరిగా ఉండే రాజ కన్యను చూడుము. నిన్ను గాంచి వాసుదేవునిగా తలంచే ఆ ముద్దరాలిని నీకపటవక్రో క్తులతో రంజిల్లజేసి వాత్స్యాయనుడు(కామశాస్త్రంలో)బోధించినట్లు అనుభవింపుము'. కౌలికుడును దానిని విని అట్టిరూపంతో అచ్చటికిపోయి ఆమెతో ఇలా అన్నాడు-'రాజపుత్రీ! నిద్రిస్తున్నావా, లేక మేల్కొని ఉన్నావా? నేను నీ కొఱకై అనురాగంతో క్షీరసముద్రం నుండి లక్ష్మిదేవిని వదలి వచ్చాను. కనుక నాతో సమాగమం(సంభోగం)చేయుము'.

మూ. సాఽపి గరుడారూఢం చతుర్భుజం సాయుధం కౌస్తుభోపేత మవలోక్య సవిస్మయా శయనాదుత్థాయ ప్రోవాచ- 'భగవన్ అహం మానుషీ కీటికాఽశుచిః. భగవాంస్త్రైలోక్యపావనో వన్దనీయశ్చ. తత్కథమేతద్యుజ్యతే? కౌలిక ఆహ- సత్యమభిహితం భవత్యా. పరం కిన్తు రాధా నామ మే భార్యా గోపకులప్రసూతా ప్రథమమాసీత్, సా త్వమత్రావతీర్ణా. తేనాహమత్రాయాతః ఇత్యుక్తే సా ప్రాహ- 'భగవన్, యద్యేవం తన్మే తాతం ప్రార్థయ. సోఽప్య వికల్పం మాం తుభ్యం ప్రయచ్ఛతి'. కౌలిక ఆహ- 'సుభగే, నాహం దర్శన పథం మానుషాణాం గచ్ఛామి. కిం పునరాలాపకరణమ్. త్వం గాన్ధర్వేణ వివా హేనాఽత్మానం ప్రయచ్ఛ. నోచేచ్ఛాపం దత్వా సాన్వయం తే పితరం భస్మసాత్ కరిష్యామి'- ఇతి.

అ. ఆమెయు (రాజకన్యయు) గరుడారూఢుడూ, చతుర్భుజుడూ ఆయుధ యుతుడూ, కౌస్తుభమణిభూషితుడూ అయిన అతణ్ణి చూచింది- ఆశ్చర్యం పొందింది- (తటాలున) పడకనుండి లేచి ఇలా అంది. 'భగవన్, నేను మానవకన్యను, పురుగువలె అపరిశుద్ధను. భగవానులైన తాము త్రిలోకపావనులు వందనీయులును. అలాంటప్పుడు ఈ సంబంధం ఎలా యోగ్యం అవుతుంది?' కౌలికుడు అన్నాడు- 'సుందరీ? (సౌభాగ్య వతీ) నీవు సత్యం పల్కావు. కాని, రాధ అనే నా భార్య మొదట గోపకులంలో పుట్టి

ఉండింది. ఆమెయే నీవు. ఇచ్చట అవతరించావు. అందుచే నేను ఇచ్చటికి వచ్చాను.' ఇలా చెప్పగా ఆమె అంది— 'దేవా! ఇది ఇలా అయితే మా తండ్రిని అర్థించండి. అతడు నిస్సంకోచంగా నన్ను తమకు అర్పిస్తాడు.' కౌలికుడు అన్నాడు— 'శుభలక్షణా! నేను మానవులకు కనబడను. ఇక మాట్లాడడం ఎలా పొసగుతుంది. నీవు గాంధర్వ వివాహ పద్ధతిని నిన్ను నాకు అర్పించుకొనుము. లేనిచో శాపం ఇచ్చి వంశసమేతంగా నీతండ్రిని భస్మం చేస్తాను.'

మూ. ఏవమభిధాయ గరుడాదవతీర్య సవ్యే పాణౌ గృహీత్వా తాం సభయాం సలజ్జాం వేపమానాం శయ్యాయామానయత్. తతశ్చ రాత్రిశేషం యావద్వాత్స్యాయనోక్తవిధినా నిషేవ్య ప్రత్యూషే స్వగృహమలక్షితో జగామ. ఏవం తస్య తాం నిత్యం సేవమానస్య కాలో యాతి. అథ కదాచిత్ కఞ్చుకిన స్తస్యా అధరోష్ఠప్రవాలఖణ్డనం దృష్ట్వా మిథః ప్రోచుః— 'అహో పశ్యతాస్యా రాజకన్యాయాః పురుషోపభుక్తాయా ఇవ శరీరావయవా విభ్యావ్యన్తే. తత్కథ మయం సురక్షితేఽప్యస్మిన్ గృహే ఏవంవిధవ్యవహారః? తద్రాజ్ఞే నివేద యామః.

అ. ఇలా అని(కౌలికుడు) గరుడునినుండి దిగాడు. ఆమె ఎడమచేతిని పట్టు కున్నాడు. భయంతో సిగ్గుతో వణకుచుండే ఆమెను శయ్యమీదికి చేర్చాడు. పిమ్మట మిగి లిన రాత్రి అంతా వాత్స్యాయనకామశాస్త్రం ప్రకారం ఆమెను అనుభవించాడు. ఉషః కాలంలోనే ఎవరికంటనుబడక తన ఇల్లు చేరాడు. ఇలా నిత్యం(ప్రతిరేయా) ఆమెను అనుభవిస్తూ కాలం గడుపుతున్నాడు. అంత ఒకనాడు కంచుకులు, దొండపండువంటి ఆమె పెదవిపెదవి ఖండించబడి ఉండడం గాంచి తమలోతాము ఇలా చెప్పుకున్నారు.(చర్చించారు) 'ఆహా! చూడండి, ఈ రాజకుమారి శరీరావయవాలు పురుషునిచే అనుభవింపబడినట్లు తోచుచున్నాయి. సురక్షితం అయిన ఈ గృహంలో ఇలాంటిపని ఎలా జరిగింది? అందు వల్ల ప్రభువునకు నివేదిస్తాము'.

మూ. ఏవం నిశ్చిత్య సర్వే సమేత్య రాజానం ప్రోచుః— 'దేవ, వయం న విద్మః. పరం సురక్షితేఽపి కన్యాన్తఃపురే కశ్చిత్ ప్రవిశతి. తద్దేవః ప్రమాణమ్'— ఇతి. తచ్ఛ్రుత్వా రాజాఽతీవ వ్యాకులచిత్తో వ్యచిన్తయత్.

శ్లో. పుత్రీతి జాతా మహతీహ చిన్తా కస్మై ప్రదేయేతి మహాన్ వితర్కః
దత్త్వా సుఖం ప్రాప్స్యతి వా న వేతి కన్యా పితృత్వం ఖలు నామకష్టమ్.
నద్యశ్చ నార్యశ్చ సదృక్ప్రభావాస్తుల్యాని కూలాని కులాని తాసామ్
తోయైశ్చ దోషైశ్చ నిపాతయన్తి నద్యో హి కూలాని కులాని నార్యః. 223
జననీమనో హరతి జాతవతీ పరివర్ధతే సహ శుచా సుహృదామ్
పరసాత్కృతాపి కురుతే మలినం దురతిక్రమా దుహితరో విపదః. 224

ఏవం బహువిధం విచిన్త్య దేవీం రహస్థాం ప్రోవాచ–

అ. ఇలా నిశ్చయించి అందరూ కలిసి రాజుతో ఇలా చెప్పారు– 'ప్రభూ ! మేము (ఏమియూ) ఎరుంగము కాని మంచిరక్షణఉన్నా కన్యాంతఃపురంలోనికి ఎవడో ప్రవేశిస్తూన్నాడు. ఆ మీదట ప్రభువుల ఇష్టం.' దానిని విని రాజు మిక్కిలి కలత నొందినవాడై ఇలా విచారించాడు'–

'పుత్రిక పుట్టింది'– అనగానే ఈ ప్రపంచంలో గొప్పవిచారం గల్గుతూంది. (తర్వాత) 'ఎవరికి ఇవ్వాలి' అనే మహావితర్కం(గొప్పసమస్య) ఎదురౌతుంది. కన్యాదానం తర్వాతనూ 'భర్తతోసుఖం పొందునా, లేదా' అనే సందేహం బాధిస్తుంది. కనుక కన్యాపితృత్వం (ఆడపిల్లకు తండ్రికావడం) కష్టకారకం.

'నదులకు నారులకు(స్త్రీలకు) సమానమైన శక్తి ఉంది. నదులకు రెండు కూలములు (తీరాలు ఒడ్డులు), స్త్రీలకు రెండు కులాలు (తల్లికులం-భర్తకులం) సమానం ఉన్నాయి. నదులు (వరదల) నీటిచే తమ రెండు ఒడ్డులను, స్త్రీలు తమ దోషంచే రెండు కులాలను భ్రష్టం చేస్తారు.

'ఆడపిల్ల పుట్టగానే తల్లికి విచారం గల్గిస్తుంది. (పుట్టిన తర్వాత) సహృదయులైన (కుటుంబీకులు మొదలైన) వారి దుఃఖంతోబాటు పెరుగుతుంది. (వివాహం ద్వారా) భర్త అధీనం చేయబడినా ఏదేని మలిన కర్మ చేస్తుంది. ఆడపిల్లలు అనే ఆపదలను తరించడం చాలా కష్టం.

ఇలా పెక్కు విధాలుగా చింతించి ఏకాంతంలో (ఒంటరిగా) ఉండే పట్టపు

రాణితో ఇట్లు చెప్పాడు-

మూ. 'దేవి జ్ఞాయతాం కిమేతే కఞ్చుకినో వదన్తి. తస్య కృతాన్తః కుపితో యేనైతదేవం క్రియతే, దేవ్యపి తదాకర్ణ్య వ్యాకులీభూతా సత్వరం కన్యాన్తఃపురం గత్వా తాం ఖణ్డితాధరాం నఖవిలిఖితశరీరావయవాం దుహితరమపశ్యత్, ఆహ చ– 'ఆః పాపే కులకలఙ్కకారిణి, కిమేవం శీలఖండనం కృతమ్? కోఽయం కృతాన్తావలోకిత స్త్వత్సకాశమభ్యేతి.? తత్ కథ్యతాం మమాగ్రే సత్యమ్! ఇతి కోపాటోపవిసఙ్కటం వదన్త్యాం మాతరి రాజపుత్రీ భయలజ్జానతాననం ప్రోవాచ-

ACC NO. 24770

అ. 'దేవీ! ఈ కంచుకులు చెప్పేదానిని (విచారించి సత్యం) తెలిసికొనుము. ఇలా చేసేవానికి యముడు క్రుద్ధుడై ఉంటాడు. [కాలం (మరణం) దాపురించింది]. మహారాణియు దానిని విని వ్యాకులిత (విచారం గలది) అయింది. వెంటనే కన్యాంతఃపురం వెళ్ళింది. (అచ్చట) కొరికిన పెదవి గలదీ, గోళ్లగుర్తులుగల అవయవాలు గలదీ అయిన పుత్రికను చూచింది. ఇలా అంది– 'ఓసీ పాపాత్మురాలా, కులానికి అపకీర్తి తెచ్చేదానా! ఎందుకు ఇలా శీలం పోగొట్టుకున్నావు? నీ దగ్గరకు వచ్చేవాడు ఎవడు? వాడు యమునిచే చూడబడి ఉంటాడు. కనుక నావద్ద సత్యం తెల్పుము!' ఈ విధంగా కోపావేశంతో అధిక సంకటంతో తల్లి పలుకుచుండగా, రాజపుత్రి, భయంతో, సిగ్గుతో తల వంచుకొని ఇలా అంది__

891.231
28200
VLS

మూ. 'అమ్బ, సాక్షాన్నారాయణః ప్రత్యహం గరుడారూఢో నిశి సమాయాతి. చేదసత్యం మమ వాక్యమ్, తత్ స్వచక్షుషా విలోకయతు నిగూఢతరా నిశీథే భగవన్తం రమాకాన్తమ్'. తచ్ఛ్రుత్వా సాఽపి ప్రహసితవదనా పులకాఙ్కిత సర్వాఙ్గీ సత్వరం రాజానమూచే– 'దేవ, దిష్ట్యా వర్ధసే. నిత్యమేవ నిశీథే భగవన్నారాయణః కన్యకాపార్శ్వేఽభ్యేతి. తేన గాన్ధర్వవివాహేన సా వివాహితా. తదద్య త్వయా మయా చ రాత్రౌ వాతాయనగతాభ్యాం నిశీథే ద్రష్టవ్యః, యతో న స మానుషైః సహాలాపం కరోతి'. తచ్ఛ్రుత్వా హర్షితస్య రాజ్ఞ స్తద్దినం వర్షశతప్రాయమివ కథఞ్చిజ్జగామ.

అ. 'అమ్మా! సాక్షాత్తుగా శ్రీమన్నారాయణుడు ప్రతిదినం రాత్రివేళ గరుడవాహనారూఢుడై వస్తున్నాడు. నామాట అసత్యంగా తలంతువేని రహస్యంగా ఉండి (దాగి) నీకంటితో నడిరేయిని భగవానుడయిన లక్ష్మీనాథుని చూడుము. దానిని విని ఆమె (ఆనందంచే) నగుమోముగలదై నమస్తావయవాలయందు గగుర్పాటు (రోమాంచం) గలదై వెంటనే రాజువద్దకు పోయి ఇలా చెప్పింది- 'దేవా, దైవకరుణచే వృద్ధి నందుచున్నారు. (తాము అదృష్టవంతులు). నిత్యం నడిరేయిని భగవానుడయిన నారాయణుడు పుత్రికపక్కన (కన్యాపార్శ్వంలో) చేరుతున్నాడు. గాంధర్వవిధిని ఆమెను వివాహం చేసికొన్నాడు. దీన్ని నేడు (నడి) రేయిని (దాగి) కిటికీ సందులద్వారా చూడాలి. ఏలననగా-ఆ భగవానుడు మానవులతో సంభాషింపడు. దానిని విని రాజు సంతుష్టుడైనాడు. ఆ పగటివేళను (రాత్రికి నారాయణుని చూడాలి- అనే ఉత్కంఠతో) నూరేండ్లవలె కష్టంగా గడిపాడు.

మూ. తతస్తు రాత్రౌ నిభృతో భూత్వా రాజ్ఞీసహితో రాజా వాతాయనస్థో గగనాసక్తదృష్టిర్యావత్తిష్ఠతి, తావత్తస్మిన్ సమయే గరుడారూఢం తం శఙ్ఖచక్రగదాపద్మహస్తం యథోక్తచిహ్నాఙ్కితం వ్యోమ్నోఽవతరన్తం నారాయణమపశ్యత్. తతః సుధాపూరప్లావితమివాత్మానం మన్యమానస్తామువాచ- 'ప్రియే నాస్త్యన్యో ధన్యతరో లోకే మత్తస్త్వత్తశ్చ. తత్ప్రసూతిం నారాయణో భజతే. తత్సిద్ధాః సర్వేఽస్మాకం మనోరథాః. అధునా జామాతృప్రభావేణ సకలామపి వసుమతీం వశ్యాం కరిష్యామి'.

అ. పిమ్మట రాత్రివేళ రాణితోబాటు రాజు దాగి కిటికీలో నుండి ఆకాశం వైపు చూస్తూ ఉండగా గరుడారూఢుడూ, శంఖచక్రపద్మహస్తుడూ, పూర్వోక్తలక్షణయుతుడూ అయిన నారాయణుడు దివినుండి భువికి దిగుచు అతనికి (పత్నీయుతుడైన ప్రభువునకు) కనబడినాడు. అంత అమృతప్రవాహంలో ప్లావితునివలె (తేలే వానిని- ఈదే వానినివలె) తనను తలచుకొంటూ రాజు రాణితో ఇలా అన్నాడు- 'ప్రియురాలా! ఈ లోకంలో నాకంటె నీకంటె ధన్యులులేరు. మనపుత్రికను నారాయణుడు సేవిస్తున్నాడు. కనుక మన కోరికలు అన్నీ నెఱవేరినాయి. ఇప్పుడు అల్లుని ప్రభావంచే సమస్తమైన భూమండలాన్ని నా అధీనం చేసికుంటాను.

మూ. ఏవం నిశ్చిత్య సర్వైః సీమాధిపైః సహ మర్యాదావ్యతిక్రమ మకరోత్. తే చ తం మర్యాదావ్యతిక్రమేణ వర్తమానమాలోక్య సర్వే సమేత్య తేన సహ విగ్రహం చక్రుః. అత్రాంతరే స రాజా దేవీముఖేన తాం దుహితర ముపాచ– 'పుత్రి, త్వయి దుహితరి వర్తమానాయాం, భగవతి నారాయణే జామాతరి స్థితే, తత్కిమేవం యుజ్యతే యత్సర్వే పార్థివా మయా సహ విగ్రహం కుర్వన్తి. తత్సమ్బోధ్యోఽద్య త్వయా నిజభర్తా యథా మమ శత్రూన్ వ్యాపాదయతి'

అ. ఇలా తలంచి సరిహద్దురాజులందరివిషయంలో సరిహద్దులు ఉల్లంఘిం చాడు (విరోధం) పెట్టుకున్నాడు. వారు అతడు సరిహద్దులుదాటడం (సంధిభంగంచేసి దురాక్రమణ చేయడం) గాంచారు. అందరూ ఏకం ఐనారు. అతనితో యుద్ధం చేశారు. ఇంతలో ఆరాజు భార్యాద్వారా బిడ్డకు ఇలా చెప్పించాడు– 'పుత్రీ! నీవు బిడ్డవై ఉండగా, భగవానుడైన నారాయణుడు అల్లుడై ఉండగా, ఈ రాజులందరు నాతో యుద్ధం చేయడం సముచితమా? అందుచే నేడు నీవు నీభర్తకు నాశత్రువులను చంప వలసినదిగా బోధించాలి'.

మూ. తతస్తయా స కౌలికో రాత్రౌ సవినయమభిహితః– 'భగవన్, త్వయి జామాతరి స్థితే మమ తాతో యచ్ఛత్రుభిః పరిభూయతే తన్న యుక్తమ్. తత్ప్రసాదం కృత్వా సర్వాంస్తాన్ శత్రూన్ వ్యాపాదయ'. కౌలిక ఆహ– సుభగే, కియన్మాత్రాస్త్వేతే తవ పితుః శత్రవః? తద్విస్రబ్ధా భవ. క్షణేనాపి సుదర్శనచక్రేణ సర్వాంస్తిలశః ఖండయిష్యామి.' అథ గచ్ఛతా కాలేన సర్వ దేశం శత్రుభిరుద్వాస్య స రాజా ప్రాకారశేషః కృతః. తథాపి వాసుదేవరూప ధరం కౌలికమజానన్ రాజా నిత్యమేవ విశేషతః కర్పూరాగరుకస్తూరికాదిపరి మలవిశేషాన్ నానాప్రకారవస్త్రపుష్పభక్ష్యపేయాంశ్చ ప్రేషయన్ దుహితృ ముఖేన తమూచే– 'భగవన్, ప్రభాతే నూనం స్థానభఙ్గో భవిష్యతి యతో యవ సేన్ధనక్షయః సఞ్జాతస్తథా సర్వోఽపి జనః ప్రహారైర్జర్జరితదేహః సంవృత్తో యోద్ధు

మక్షమః ప్రచురో మృతశ్చ. తదేవం జ్ఞాత్వాఽత్ర కాలే యదుచితం భవతి. తద్విధేయమ్' ఇతి.

అ. అంతట ఆమె (రాజపుత్రి) రాత్రివేళ కౌలికునితో వినయంగా ఇలా చెప్పింది- 'దేవా! మీరు అల్లుడై ఉండగా నాతండ్రి శత్రువులచే అవమానింపబడడం సముచితం గాదు. కనుక దయయుంచి నాతండ్రి శత్రువులను సంహరించండి. కౌలికుడు ఇలా అన్నాడు- 'సుందరీ! ఈ నీ తండ్రిశత్రువులు ఎంతమాత్రం? నమ్మకంగా ఉండుము. క్షణంలో సుదర్శనచక్రంచే అందరినీ నువ్వులవలె ముక్కలు ముక్కలుగా ఖండిస్తాను'. ఇలా (కొంత)కాలం గడువగా శత్రువులు రాజ్యమంతా ఆక్రమించారు. కోటమాత్రం రాజుకు మిగిలింది. అయినా రాజు వాసుదేవరూపంతో వచ్చేవాడు కౌలికుడు(సాలెవాడు) అని తెలిసికొనలేదు. నిత్యం విశేషించి కర్పూరం అగరు, కస్తూరి మొదలైన సుగంధవస్తువులు బహువిధవస్త్ర పుష్ప భోజన పానీయాలు పంపుతూ పుత్రికద్వారా ఇలా చెప్పించాడు. 'దేవా, ప్రాతఃకాలానికి తప్పక స్థానభంగం (శత్రువులు కోటను ఆక్రమించడం) అవుతుంది. (కోటలో) యవసలు (అశ్వాదుల ఆహారం) కట్టెలు మొదలైనవాటికిని కొరత గల్గింది. అలాగే సైనికులు అందరు (శత్రువుల) దెబ్బలచే శిథిలదేహులైనారు. (వారికి) యుద్ధం చేసే శక్తిలేదు. చాలమంది మరణించారుగూడ. కనుక ఇదంతా తలంచి ఈసమయానికి తగినట్లు చేయండి'.

మూ. తచ్ఛ్రుత్వా కౌలికోఽప్యచింతయత్- 'స్థానభఙ్గే జాతే మమానయా సహ వియోగో భవిష్యతి. తస్మాద్గరుడమారుహ్య సాయుధమాత్మానమాకాశే దర్శయామి. కదాచిన్మాం వాసుదేవం మన్యమానాస్తే సాశఙ్కా రాజ్ఞో యోద్ధృభిర్హన్యన్తే. ఉక్తఞ్చ-

శ్లో. నిర్విషేణాపి సర్పేణ కర్తవ్యా మహతీ ఫణా
విషం భవతు వా మా భూత్ ఫణాటోపో భయంకరః. 225

అ. దానిని విని కౌలికుడు ఇలా ఆలోచించాడు. 'స్థానభంగం అయితే నాకు ఈమెతో వియోగం సంభవిస్తుంది. అందువల్ల గరుడుని ఎక్కి (చక్రాది) ఆయుధయుక్తమైన నా ఆకారం ఆకాశంలోనుండి చూపిస్తాను. వారు ఒకవేళ నారాయణునిగా

నన్ను తలంచి భయగ్రస్తులై ఈ రాజు సైనికులచే చంపబడుదురు. పెద్దలిలా అన్నారు.

'విషంలేని పాము గూడ పడగను పెద్దదిగా చేయాలి. విషం ఉండనీ, లేక పోనీ, ఫణాటోపం భయంకరంగా ఉండాలి.

మూ. అథవా యది మమ స్థానార్థముద్యతస్య మృత్యుర్భవిష్యతి తదపి సున్దరతరమ్. ఉక్తఞ్చ-

శ్లో. గవామర్థే బ్రాహ్మణార్థే స్వామ్యర్థే స్త్రీకృతేఽథవా
స్థానార్థే యస్త్యజేత్ప్రాణాంస్తస్య లోకాః సనాతనాః. 226

శ్లో. చన్ద్రేపి మణ్డలసంసే విగృహ్యతే రాహుణా దినాధీశః
శరణాగతేన సార్ధం విపదపి తేజస్వినాం శ్లాఘ్యా. 227

అ. అట్లుగానిచో స్థానరక్షణకై (కోటను రక్షించేందుకై) యత్నించే నాకు మరణం సంభవిస్తే అదీ మంచిదే. విజ్ఞులు ఇలా అన్నారు—

గోవుల కొఱకు, బ్రాహ్మణుల కొఱకు, ప్రభువు కొఱకు, స్త్రీ (అనాథ స్త్రీ) కొఱకు, స్థానం (దేశరక్షణ) కొఱకు ప్రాణాలు అర్పించేవానికి శాశ్వత పుణ్యలోకాలు లభిస్తాయి.

అమావాస్యనాడు చంద్రమండలానికి సూర్యుడు వస్తాడు. అప్పుడు సూర్యుణ్ణి రాహువు మ్రింగుతాడు. (ఆశ్రయదాత చంద్రుడునూ మ్రింగబడుతాడు) శరణాగతుని రక్షకై వచ్చే ఆపదయూ తేజోవంతులకు ప్రశంసనీయం.

మూ. ఏవం నిశ్చిత్య ప్రత్యూషే దన్తధావనం కృత్వా తాం ప్రోవాచ– 'సుభగే, సమస్తైః శత్రుభిర్హతైరన్నం పానఞ్చాఽస్వాదయిష్యామి. కిం బహునా? త్వయాఽపి సహ సఙ్గమం తతః కరిష్యామి. పరం వాచ్యస్త్వయాఽఽత్మపితా, యత్ప్రభాతే ప్రభూతేన సైన్యేన సహ నగరాన్నిష్క్రమ్య యోద్ధవ్యమ్. అహం చాకాశస్థిత ఏవం సర్వాంస్తాన్ నిస్తేజసః కరిష్యామి. పశ్చాత్సుఖేన భవతా హన్తవ్యాః. యది పునరహం తాన్ స్వయమేవ సూదయామి తత్తేషాం

పాపాత్మానాం వైకుంఠీయా గతిః స్యాత్. తస్మాత్తే తథా కర్తవ్యా యథా పలా యన్తో హన్యమానాః స్వర్గం న గచ్ఛన్తి.'

అ. ఇలా నిశ్చయించి ఉషఃకాలంలో దంతధావనంచేసి రాజపుత్రితో ఇట్లు చెప్పాడు- "సౌభాగ్యవతీ, (నేడు) శత్రువుల నందరినీ చంపేవరకు అన్నపానాలు రుచిచూడను. పెక్కులేల? ఆ మీదటనే నీతో సంగమం చేస్తాను. కాని నీ తండ్రితో ఇలా చెప్పుము"- 'ప్రాతఃకాలమున అధిక సైన్యంతో నగరంనుండి వెలుపలికిపోయి యుద్ధం చేయాలి. నేను ఆకాశంలో నుండియే వారిని అందర్నీ తేజోవిహీనుల్ని చేస్తాను. పిమ్మట సుఖంగా మీరు చంపివేయండి. నేను స్వయంగా వారిని చంపినట్లైతే వారు (చచ్చి) స్వర్గానికి పోరు'.

మూ. సాఽపి తదాకర్ణ్య పితుః సమీపం గత్వా సర్వం వృత్తాన్తం న్యవేదయత్. రాజాఽపి తస్యా వాక్యం శ్రద్ధధానః ప్రత్యూషే సముత్థాయ సుసన్నద్ధసైన్యో యుద్ధార్థం నిశ్చక్రామ. కౌలికోఽపి మరణే కృతనిశ్చయశ్చాప పాణిర్గగనగతిర్గరుడారూఢో యుద్ధాయ ప్రస్థితః. అత్రాన్తరే భగవతా నారాయ ణేనాతీతానాగతవర్తమానవేదినా స్మృతమాత్రో వైనతేయః సస్మ్రాప్తో విహస్య ప్రోక్తః-

అ. ఆమెయు దానిని విని తండ్రిపద్దకు పోయింది. విషయం అంతా తెలి పింది. రాజు కూడ ఆమె వాక్యం నమ్మాడు. ఉషఃకాలంలోనే లేచాడు. సైన్యం సన్నద్ధం చేసికొని యుద్ధానికి నిష్క్రమించాడు. కౌలికుడు (సాలెవాడు) 'మరణం తప్పదు'- అని నిశ్చయించి విల్లును చేబూని (కొయ్యచెక్క) గరుడుని ఎక్కి ఆకాశ గమనుడై యుద్ధానికి బయలుదేరాడు. ఇంతలో భగవానుడూ త్రికాలవేదీ అయిన నారాయణుడు తలంచినంతనే వచ్చిన గరుడునితో నవ్వి ఇలా అన్నాడు-

మూ. 'భో గరుత్మన్, జానాసి త్వం యన్మమ రూపేణ కౌలికో దారు మయగరుడే సమారూఢో రాజకన్యాం కామయతే'. సోఽబ్రవీత్-'దేవ, సర్వం జ్ఞాయతే తచ్చేష్టితమ్. తత్కిం కుర్మః సామ్ప్రతమ్'? శ్రీభగవానాహ- 'అద్య కౌలికో మరణే కృతనిశ్చయో విహితనియమో యుద్ధార్థే వినిర్గతః. స, నూనం

ప్రధానక్షత్రియైర్మిలిత్వా వాసుదేవో గరుడశ్చ నిపాతితః. తతః పరం లోకోఽయమావయోః పూజాం న కరిష్యతి. తతస్త్వం ద్రుతతరం తత్ర దారుమయగరుడే సఙ్క్రమణం కురు. అహమపి కౌలికశరీరే ప్రవేశం కరిష్యామి. యేన స శత్రూన్ వ్యాపాదయతి. తతశ్చ శత్రువధాదావయోర్మాహాత్మ్యవృద్ధిః స్యాత్'.

అ. 'ఓగరుడుడా ! కౌలికుడు నారూపంతో కట్టెగరుడుని ఎక్కి రాజకన్యను కామించటం నీకుతెలియునా ?' అతడు (గరుడుడు) అన్నాడు దేవ! అతనిచేష్టఅంతా తెలియును. కనుక ఇప్పుడు మనం ఏమి చేయాలి ? శ్రీభగవానుడు ఇలా అన్నాడు - నేడు కౌలికుడు చావుకు తెగించి (మరణనిశ్చయుడై) నియమవంతుడై యుద్ధానికి నిర్గమించాడు. సంఘటితులైన ప్రధానక్షత్రియులచే తప్పక ఆ (వాసుదేవరూప) కౌలికుడూ, ఆ (దారుమయ) గరుడుడూ పడగొట్టబడుదురు (చంపబడుదురు). తర్వాత ఈప్రపంచం మన ఇరువురికి పూజచేయదు. కనుక నీవు మిక్కిలి శీఘ్రంగా ఆకట్టె గరుడునిలో సంక్రమింపుము. నేనూ కౌలికునిలో ప్రవేశిస్తాను. అందువల్ల వాడు శత్రువులను సంహరిస్తాడు. పిమ్మట శత్రుసంహారంవల్ల మనఇరువురికి మాహాత్మ్యం పెరుగుతుంది ?

మూ. అథ గరుడే తథేతి ప్రతిపన్నే శ్రీభగవాన్నారాయణస్తచ్ఛరీరే సఙ్క్రమణమకరోత్. తతో భగవన్మాహాత్మ్యేన గగనస్థః స కౌలికః శఙ్ఖచక్రగదాచాపచిహ్నితః క్షణాదేవ లీలయైవ సమస్తానపి ప్రధానక్షత్రియాన్ నిస్తేజసశ్చకార. తతస్తేన రాజ్ఞా స్వసైన్యపరివృతేన సఙ్గ్రామే జితా నిహతాశ్చ తే సర్వేఽపి శత్రవః. జాతశ్చ లోకమధ్యే ప్రవాదో యథా– 'అనేన విష్ణుజామాతృప్రభావేణ సర్వే శత్రవో నిహతా' ఇతి. కౌలికోఽపి తాన్ హతాన్ దృష్ట్వా ప్రముదితమనా గగనాదవతీర్ణః సన్ యావద్రాజామాత్యపౌరలోకాస్తం నగరవాస్తవ్యం కౌలికం పశ్యన్తి తతః పృష్టః 'కిమేతత్'? ఇతి. తతః సోఽపి మూలాదారభ్య సర్వం ప్రాగ్వృత్తాన్తం న్యవేదయత్. తతశ్చ కౌలికసాహసాను

రఞ్జితమనసా శత్రువధాదవాప్తతేజసా రాజ్ఞా సా రాజకన్యా సకలజనప్రత్యక్షం వివాహవిధినా తస్మై సమర్పితా దేశశ్చ ప్రదత్తః.

అ. అంత గరుడుడు 'అటులనే' అనగానే భగవానుడైన శ్రీమన్నారాయణుడు వాని (కౌలికుని) శరీరంలో సంక్రమించాడు. భగవానుని మాహాత్మ్యంచే ఆకాశస్థుడైన ఆ కౌలికుడు శంఖ-చక్ర-గదా-చాపచిహ్నితుడై క్షణకాలంలోనే అనాయాసంగా ప్రధానక్షత్రియులను అందరినీ తేజోహీనులను చేశాడు పిమ్మట ఆరాజు తనసేనతో శత్రువులందరినీ ఓడించాడు. అనేకులను సంహరించాడు కూడ. అప్పుడు లోకంలో 'ఈరాజు, తన అల్లుడైన విష్ణువుప్రభావంచే శత్రువులను చంపాడు,-అనే కింవదన్తి (జనులవాడుక) పుట్టింది. కౌలికుడును చచ్చిన శత్రువులను చూచి సంతోషంతో ఆకాశం (క్రిందికి) దిగాడు. తోడనే రాజు మంత్రులు నగరవాసులు, అతణ్ణి నగరవాసియైన కౌలికునిగా గుర్తించారు-'ఇది ఏమి'? అని అడిగారు. అప్పుడు వాడు మొదటినుండీ జరిగిన విషయం అంతా నివేదించాడు. అనంతరం కౌలికుని సాహసంచే సంతుష్టమైన మనస్సుగలవాడూ, శత్రువధచే పొందిన తేజస్సుగలవాడూ అయిన ఆ ప్రభువు జను లందరి ఎదుట వివాహం చేసి రాజకన్యను వానికి సమర్పించాడు. రాజ్యంకూడ ఇచ్చాడు.

మూ. కౌలికోఽపి తయా సార్ధం పఞ్చప్రకారం జీవలోకసారం విషయసుఖమనుభవన్ కాలం నినాయ. అతస్తూచ్యతే- 'సుప్రయుక్తస్య దమ్భస్య'- ఇతి. తచ్ఛ్రుత్వా కరటక ఆహ- 'భద్ర, అస్త్యేవమ్. పరం తథాపి మహాన్మే భయమ్. యతో బుద్ధిమాన్ సఞ్జీవకో రౌద్రశ్చ సింహః. యద్యపి తే బుద్ధి ప్రాగల్భ్యం తథాపి త్వం పిఙ్గలకాత్ తం వియోజయితుమసమర్థ ఏవ. దమనక ఆహ-'భ్రాతః, అసమర్థోఽపి సమర్థ ఏవ. ఉక్తఞ్చ-

శ్లో. ఉపాయేన హి యత్కుర్యాత్తన్న శక్యం పరాక్రమైః
కాక్యా కనకసూత్రేణ కృష్ణసర్పో నిపాతితః. 228

కరటక ఆహ- 'కథమేతత్?' సోఽబ్రవీత్-

అ. కౌలికుడును ఆమెతో మానవలోక సారముతైన (శబ్దాది) పంచేంద్రియ సుఖాలు అనుభవిస్తూ కాలం గడిపాడు. ఇందువలన అంటారు-సుప్రయుక్తస్య దంభస్య

–ఇత్యాది. దానిని విని కరటకుడు ఇలా అన్నాడు–'ఇది సరిగానే ఉంది. కాని నాకు మిక్కిలి భయంగా ఉంది. ఏలననగా–సంజీవకుడు బుద్ధిమంతుడు–పింగళకుడు రౌద్రుడు'. దమనకుడు ఇలా అన్నాడు–అసమర్థుడును సమర్థుడే అగును. పెద్దలన్నారు–

'ఏ పని ఉపాయంచే చేయడానికి వీలు అగునో, అది పరాక్రమం చేసాధ్యం గాదు. ఆడకాకి బంగారుగొలుసుచే నల్లత్రాచును చంపింది.

కరటకుడు అడిగాడు. అది ఎట్లు? అతడు చెప్పాడు....

## కథా_6

## కాకీకృష్ణసర్పకథా

మూ. అస్తి కస్మింశ్చిత్ప్రదేశే న్యగ్రోధపాదపః. తత్ర వాయస దమ్పతీ ప్రతివసతః స్మ. అథ తయోః ప్రసవకాలే వృక్షవివరాన్నిష్క్రమ్య కృష్ణసర్పః సదైవ తదపత్యాని భక్షయతి. అతస్తౌ నిర్వేదాదన్యవృక్షమూల నివాసినం ప్రియసుహృదం శృగాలం గత్వోచతుః– 'భద్ర, కిమేవంవిధే సఞ్జాత ఆవయోః కర్తవ్యం భవతి. ఏవం తావద్దుష్టాత్మా కృష్ణసర్పో వృక్షవివరాన్నిర్గత్యావయోర్బాలకాన్ భక్షయతి. తత్ కథ్యతాం తద్రక్షార్థం కశ్చిదుపాయః.

అ. ఒకానొక ప్రదేశంలో గొప్ప మఱ్ఱిచెట్టు గలదు ఆ చెట్టుమీద కాకుల జంట (కాకదంపతులు) నివసిస్తూంది. ఆడ కాకి ప్రసవించగానే చెట్టుతొఱ్ఱనుండి నల్లత్రాచు వచ్చి ఆ పిల్లలను తినివేసేది. అంత ఆ కాకులజంట ఏమిచేయడానికీ దోచని దుఃఖం (నిర్వేదం)తో మఱియొక చెట్టుమొదట నివసించే ప్రియమిత్రమైన నక్కవద్దకు పోయి ఇలా అన్నాయి. శుభమూర్తీ! ఇలాంటి పరిస్థితివస్తే మేము ఏమి చేయాలి? ఈ క్రూర బుద్ధిఅయిన నల్లత్రాచు చెట్టుతొఱ్ఱనుండి వచ్చి మా సంతానాన్ని తింటూ ఉంది. కనుక (సంతాన) రక్షణకు ఏదేని ఉపాయం తెల్పుము.

శ్లో. యస్య క్షేత్రం నదీతీరే భార్యా చ పరసఙ్గతా
ససర్పేచ గృహే వాసః కథం స్యాత్తస్య నిర్వృతిః. 229

అన్యచ్చ–

శ్లో. సర్పయుక్తే గృహే వాసో మృత్యురేవ న సంశయః
యద్గ్రామాన్తే వసేత్సర్పస్తస్య స్యాత్ ప్రాణసంశయః 2

అస్మాకమపి తత్ర స్థితానాం ప్రతిదినం ప్రాణసంశయః.

అ. ఏటిఒడ్డున పొలం, పరపురుషాసక్త (జారిణి) అయిన భార్య, పా
ఉండే ఇంటిలో నివాసం, ఇవిగల వానికి శాంతి (సుఖం) ఉండదు.

మరియూ - పాముఉండే ఇంట్లోనివాసం మృత్యువు అనడంలో సందేహ
లేదు. గ్రామ సరిహద్దుల్లో పాముఉన్నా ప్రాణభయమే.

(కనుక) అచ్చట ఉండే మాకూ ప్రతిదినం ప్రాణసంశయం గలదు.

మూ. స ఆహ–'నాత్రవిషయే స్వల్పోఽపి విషాదః కార్యః. మహా
స లుబ్ధో నోపాయమన్తరేణ వధ్యః స్యాత్.

శ్లో. ఉపాయేన జయో యాదృగ్ రిపోస్తాదృఙ్న హేతిభిః
ఉపాయజ్ఞోఽల్పకాయోఽపి న శూరైః పరిభూయతే. 2

మూ. తథా చ–

శ్లో. భక్షయిత్వా బహూన్ మత్స్యానుత్తమాధమమధ్యమాన్
అతిలౌల్యాద్బకః కశ్చిన్మృతః కర్కాటకగ్రహాత్. 2

తావూచతుః 'కథమేతత్ ?' సోఽబ్రవీత్.

అ. అతడు (నక్క) ఇలా అన్నాడు. ఈ విషయంలో ఏమాత్రం (స్వల్ప
గూడ దుఃఖం పొందవద్దు. (శిశుమాంస) లోభి అయిన ఆ పామును ఉపాయం
చంపలేము. ఇది నిశ్చయం.

ఉపాయంచే శత్రువులయెడ ఎలా జయం లభిస్తుందో ఆయుధాలచే ఆ
లభించదు. ఉపాయశాలి చిన్నదేహం గలవాడైనా (గొప్ప దేహంగల) వీరులచే
మానం పొందడు.

అటులనే - ఒకానొక కొంగ పెక్కు పిథాలైన చిన్న, పెద్ద, మధ్య ర

చేపలను తిని మిక్కిలి లోభంచే ఎండ్రకాయ (గొంతును) పట్టుకొనడంతో చచ్చింది. అవి [కాకుల జంట] అడిగాయి- అది ఎట్లు? నక్క చెప్పింది-

## కథా-7

## బక-కర్కటక-కథా

మూ. అస్తి కస్మింశ్చిద్వనప్రదేశే నానాజలచరసనాథం మహత్సరః. తత్ర చ కృతాశ్రయో బక ఏకో వృద్ధభావముపగతో మత్స్యాన్ వ్యాపాదయితు మసమర్థః. తతశ్చ క్షుత్క్షామకణ్ఠః సరస్తీర ఉపవిష్టో ముక్తాఫలప్రకరసదృశై రశ్రుప్రవాహైర్ధరాతలమభిషిఞ్చన్ రురోద. ఏకః కులీరకో నానాజలచరసమేతః సమేత్య తస్య దుఃఖేన దుఃఖితః సాదరమిదమూచే-'మామ, కిమద్య నాహార వృత్తిరనుష్ఠీయతే కేవలమశ్రుపూర్ణనేత్రాభ్యాం సనిశ్వాసేన స్థీయతే ? స ఆహ- 'వత్స, సత్యముపలక్షితం భవతా. మయా హి మత్స్యాదనం ప్రతి పరమవైరా గ్యతయా సామ్ప్రతం ప్రాయోపవేశనం కృతమ్. తేనాహం సమీపగతానపి మత్స్యాన్న భక్షయామి.

అ. ఒకానొక అడవిలో బహువిధ జలజంతువులతోడి పెద్ద సరస్సు (చెఱువు) గలదు. ఆ సరస్సును ఆశ్రయించుకొని ఒక కొంగ ఉండేది. దానికి ముసలి తనం రావడంతో చేపలను (వేటాడి) చంపి తినలేకపోయేది. అందుచే ఆకలిచే నకనక లాడుచు (క్షామకంఠమై) సరస్సు ఒడ్డున కూర్చుండి. ముత్యాలవంటి కన్నీటితో భూమిని తడుపుతూ ఏడ్వసాగింది. [అప్పుడు] ఒక ఎండ్రకాయ అనేకజలచర సమేతంగా దగ్గరకు వచ్చింది. దాని దుఃఖంతో తాను దుఃఖం పొందినదై ఆదరంగా ఇలా అడిగింది. మామ, నేడు ఎందులకు ఆహారప్రయత్నం (వేటాడడం) చేయుటలేదు. కేవలం కన్నుల నీరు నింపుకొని నిట్టూర్పులు విడుస్తున్నావు. అది (కొంగ) అంది. 'బిడ్డా, నీవు సరిగా ఊహించావు. మత్స్యభక్షణం గురించి మిక్కిలి విరక్తిచే ప్రస్తుతం నేను నిరాహారమరణవ్రతం (ఆమరణ నిరాహారదీక్ష) స్వీకరించాను. అందువల్ల దగ్గరకువచ్చే చేపలను సైతం తినడం లేదు.

మూ. కులీరక స్తచ్ఛ్రుత్వా ప్రాహ-'మామ, కిం తద్వైరాగ్యకారణమ్'? స ఆహ-'వత్స! అహమస్మిన్ సరసి జాతో వృద్ధిం గతశ్చ తన్మయైతచ్ఛ్రుతం యద్ద్వాదశవార్షిక్యనావృష్టిః సమ్పద్యతే లగ్నా. కులీరక ఆహ- 'కస్మాత్తచ్ఛ్రుతమ్?' బక ఆహ- 'దైవజ్ఞముఖాత్. ఏష శనైశ్చరో హి రోహిణీ శకటం భిత్త్వా భౌమం శుక్రం చ ప్రయాస్యతి.

అ. దానిని విని ఎండ్రకాయ అంది-'మామా! ఆ వైరాగ్యకారణం ఏమి?' అది (కొంగ) చెప్పింది. "బిడ్డా! నేను ఈచెరువులో పుట్టాను, పెరిగాను. పండ్రెండేండ్లు వరుసగా (సంలగ్నమై) అనావృష్టి సంభవిస్తుంది, అని విన్నాను". ఎండ్రకాయ అంది. 'ఆవిషయం ఎవరివల్ల విన్నావు'. కొంగ చెప్పింది-'జ్యోతిష్కుల వల్ల. ఈశనైశ్చరుడు రోహిణీమండలం భేదించి కుజశుక్రమండలాల దగ్గరకు పోనున్నాడు.

మూ. ఉక్తఞ్చ వరాహమిహిరేణ-

శ్లో. యది భిన్తే సూర్యసుతో రోహిణ్యాః శకటమిహ లోకే
ద్వాదశవర్షాణి తదా న హి వర్షతి వాసవో భూమౌ. 223

మూ. తథా చ--

శ్లో. ప్రాజాపత్యే శకటే భిన్నే కృత్వైవ పాతకం వసుధా
భస్మాస్థిశకలాకీర్ణా కాపాలికమివ వ్రతం ధత్తే. 234

మూ. తథా చ-

శ్లో. రోహిణీశకటమర్కనన్దనశ్చేద్భినత్తి రుధిరోఽథవా శశీ
కిం వదామి తదనిష్టసాగరే సర్వలోకముపయాతి సంక్షయః. 235

శ్లో. రోహిణీశకటమధ్యసంస్థితే చంద్రమస్యశరణీకృతా జనాః
క్వాపి యాన్తి శిశుపాచితాశనాః సూర్యతప్తభిదురామ్బుపాయినః. 236

అ. వరాహమిహిరుడు ఇలా చెప్పాడు—

శనైశ్చరుడు రోహిణీ శకటాన్ని భేదించినట్లైతే ఇంద్రుడు పండ్రెండేండ్లవరకు ఈ భూలోకంపై వర్షం కురవనీయడు.

అలాగే రోహిణీ శకటం (శనిచే) భేదింపబడగానే భూదేవి పాపంచేసినట్లు బూడిదచే ఎముకలముక్కలచే వ్యాప్తం అయి (తనపాప ప్రాయశ్చిత్తంగా) కాపాలిక వ్రతం దాల్చినదో అనునట్లు ఉండును.

అలాగే-రోహిణీ శకటాన్ని శనిగానీ కుజుడుగానీ చంద్రుడుగానీ భేదిస్తే అందువల్ల గల్గే అనిష్టసముద్రాన్ని ఎవరు వర్ణింపగలరు? సర్వలోకవినాశం సంభవిస్తుంది.

రోహిణీ శకటానికి మధ్యన చంద్రుడు ఉండినట్లైతే, ప్రజలంతా దిక్కులేనివారై పోతారు. (ఆకలికి తాళలేక) తమనంతానాన్నే వండుకొని తింటారు. సూర్యతాపంచే వేడియైన నీరు త్రాగుచూ ఎక్కడికో (ప్రాణభీతితో) వెళ్ళిపోతారు.

మూ. తదేతత్సరః స్వల్పతోయం వర్తతే. శీఘ్రం శోషం యాస్యతి. అస్మిన్ శుష్కే యైః సహాహం వృద్ధిం గతః సదైవ క్రీడితశ్చ, తే సర్వే తోయాభావాన్నాశం యాస్యన్తి. తత్తేషాం వియోగం ద్రష్టుమహమసమర్థః. తేనైతత్ప్రాయోపవేశనం కృతమ్. సామ్ప్రతం సర్వేషాం స్వల్పజలాశయానాం జలచరాః గురుజలాశయేషు స్వస్వజనైర్నీయన్తే. కేచిచ్చ మకర-గోధా-శిశుమార-జలహస్తి ప్రభృతయః స్వయమేవ గచ్ఛన్తి. అత్ర పునః సరసి యే జలచరాస్తే నిశ్చిన్తాః సన్తి. తేనాహం విశేషాద్రోదిమి, యద్బీజశేషమాత్రమప్యత్ర నోద్ధరిష్యతి'.

అ. ఈ చెరువులో నీరు తక్కువగా ఉంది. త్వరలోనే ఎండిపోతుంది. నేను ఈ నీటిజంతువులతో ఆడుకుంటూ పెరిగాను. చెరువు ఎండితే నీరులేనందున ఇవన్నీ మరణం పొందుతాయి. అప్పుడు వీని ఎడబాటును నేను చూడలేను. అందుచే ఈ నిరాహార మరణవ్రతం చేపట్టాను. ప్రస్తుతం చిన్న చిన్న చెరువులలోని జలచరాలు అన్నీ తమ తమ బంధువుల ద్వారా పెద్దపెద్ద చెరువులకు చేర్చబడుతున్నాయి. మొసళ్ళు ఉడుములు శిశుమారాలు [ఒకజాతి మొసళ్లు] నీటిఏనుగులు మొదలైనవి కొన్ని స్వయంగానే పోతున్నాయి. ఈ సరస్సులోని జలచరాలు నిశ్చింతగా ఉన్నాయి. వీని బీజ (విత్తనం) శేషంగూడ మిగులదు. అందుచే మిక్కిలి దుఃఖిస్తున్నాను.

మూ. తతః స తదాకర్ణ్యాన్యేషామపి తత్రస్య వచనం నివేదయామాస. అథ తే సర్వే భయత్రస్తమనసో మత్స్య-కచ్ఛపప్రభృతయ స్తమభ్యుపేత్య పప్రచ్ఛుః- 'మామ, అస్తి కశ్చిదుపాయో యేనాస్మాకం రక్షా భవతి'. బక ఆహ- 'అస్త్యస్య జలాశయస్య నాతిదూరే ప్రభూతజలసనాథం సరః పద్మినీ షణ్డమణ్డితం యచ్చతుర్వింశత్యాపి వర్షాణామవృష్ట్యా న శోషమేష్యతి. తద్యది మమ పృష్ఠం కశ్చిదారోహతి తదహం తం తత్ర నయామి'. అథ తత్ర విశ్వాస మాపన్నాః 'తాత, మాతుల, భ్రాతః' ఇతి బ్రువాణాః 'అహం పూర్వమహం పూర్వమ్'- ఇతి సమన్తాత్ పరితస్థుః.

అ. అంత దానిని విని ఆ ఎండ్రకాయ, తక్కిన జలచరాలకు(నీటివస్తువులకు) దానిమాట తెలిపింది. అప్పుడు చేపలు తాబేళ్లు మొదలైన ఆ ప్రాణులు అన్నీ భయ పడ్డాయి. ఆ కొంగవద్దకు వచ్చి ఇలా అడిగాయి 'మామా, మారక్షణకు ఏదేని ఉపాయం ఉందా'? కొంగ ఇలా అంది-ఈ చెరువునకు కొలది దూరంలో అత్యధిక జల యుక్తం అయిన (పెద్ద) చెరువు ఉంది. అది తామరపువ్వులచే అందమైంద. ఇరు వదినాల్గు ఏళ్లు వాన కురువకపోయినా ఎండిపోదు. నావీపును ఒకరు ఎక్కితే అతన్ని నేను అక్కడికి చేరుస్తాను. పిమ్మట అవి ఆ కొంగను విశ్వసించాయి. 'తాతా! మామా, సోదరా,' అని పలుకుచూ 'నేను ముందు-నేను ముందు' అనీ చుట్టూ (నలువైపులా) చేరాయి.

మూ. సోఽపి దుష్టాశయః క్రమేణ తాన్ పృష్ఠ ఆరోప్య జలాశయస్య నాతిదూరే శిలాం సమాసాద్య తస్యామాక్షిప్య స్వేచ్ఛయా భక్షయిత్వా భూయోఽపి జలాశయం సమాసాద్య జలచరాణాం మిథ్యావార్తాసన్దేశైర్మనాంసి రఞ్జయన్నిత్యమేవాహారవృత్తిమకరోత్. అన్యస్మిన్ దినే చ కులీరకేణోక్తః- 'మామ, మయా సహ తే ప్రథమః స్నేహసమ్భాషః సఞ్జాతః. తత్కిం మాం పరిత్యజ్యాన్యాన్ నయసి. తస్మాదద్య మే ప్రాణత్రాణం కురు'.

అ చెడు తలంపుగల ఆ కొంగయు క్రమంగా వానిని తనవీపుపై ఎక్కించుకొనేది. చెఱువునకు కొలదిదూరంలో ఉండే చట్టుబండను చేరేది. దానిమీద ఉంచి

స్వేచ్ఛగా భక్షించేది. మరలా చెరువువద్దకు వచ్చి జలచరాలకు కల్లబొల్లిమాటలు చెప్పి (వానికి) సంతోషం గల్గించేది. ఇలా ప్రతిదినం పొట్టనింపుకొనేది. ఒకనాడు ఎండ్రకాయ అడిగింది. 'మామా! నాతో మొదట స్నేహసంభాషణ జరిగింది. అలాంటప్పుడు నన్ను వదలి ఇతరులను ఎందుకు తీసికొని పోతున్నావు? కనుక నేడు నాకు ప్రాణరక్షణ చేయుము.'

మూ. తదాకర్ణ్య సోఽపి దుష్టాశయశ్చిన్తితవాన్ – 'నిర్విణ్ణోఽహం మత్స్యమాంసాదనేన తదద్యైనం కులీరకం వ్యఞ్జనస్థానే కరోమి.' ఇతి విచిన్త్య తం పృష్ఠే సమారోప్య తాం వధ్యశిలాముద్దిశ్య ప్రస్థితః. కులీరకోఽపి దూరాదేవాస్థిపర్వతం శిలాశ్రయమవలోక్య మత్స్యాస్థీనీతి పరిజ్ఞాయ తమపృచ్ఛత్– 'మామ, కియద్దూరే స జలాశయః, మదీయభారేణాతిశ్రాన్తస్త్వమ్. తత్కథయ.

అ. దానిని విని దుష్టబుద్ధి అయిన ఆకొంగయు ఇలా (తనలో) తలంచింది. చేపలు, (ప్రతిదినం) తిని తిని విసుగుచెందాను. నేడు ఈఎండ్రకాయను నంజుడుగా (చట్నీగా) చేసికుంటాను'. ఇలా తలంచి దానిని (ఎండ్రిని) వీపుపై ఎక్కించుకొంది. ఆవధ్యశిలకు ప్రయాణం సాగించింది ఎండ్రియూ దూరంనుండియే రాతికి దాపున ఉండే ఎముకల కొండను (రాశిని) చూచింది. చేపల ఎముకలు అని గుర్తించి కొంగను అడిగింది. 'మామా! ఆ చెరువు ఎంత దూరంలో ఉంది. నా బరువుచే చాలా అలసిపోయావు. దానిని చెప్పుము.'

మూ. సోఽపి మన్దధీర్జలచరోఽయమితి మత్వా స్థలే న ప్రభవతీతి సస్మితమిదమాహ– 'కులీరక, కుతోఽన్యో జలాశయః. మమ ప్రాణయాత్రేయమ్. తస్మాత్ స్మర్యతామాత్మనోఽభీష్టదేవతా. త్వామప్యస్యాం శిలాయాం నిక్షిప్య భక్షయిష్యామి.' ఇత్యుక్తవతి తస్మిన్ స్వవదనదంశద్వయేన మృణాలనాలధవలాయాం మృదుగ్రీవాయాం గృహీతో మృతశ్చ. అథ స తాం బకగ్రీవాం సమాదాయ శనైశ్శనైస్తజ్జలాశయమాససాద.

అ. ఆ మందబుద్ధి అయిన కొంగయు–ఇది జలచరం, స్థలంపై(నేలపై) దుర్బలం అని తలంచి చిరునవ్వు చిందిస్తూ ఇలా అంది: 'కులీరక! వేఱే చెరువు

ఎక్కడ ఉంది. ఇది నాజీవయాత్ర (జీవనోపాయం). కనుక ఇష్టదేవతను తలంచు కొమ్ము. నిన్నూ ఈశిలపై ఉంచి భక్షిస్తాను.' ఇలా అది చెప్పగానే ఎండ్రి తననోటి లోని రెండుకోరలతో తామరకాడవలె తెల్లగా మెత్తగా ఉండే కొంగమెడను పట్టుకొంది (కొరికివేసింది). కొంగచచ్చింది. అంత కుళీరం (ఎండ్రి) కొంగమెడను తీసికొని మెల్ల మెల్లగా ఆ (మొదటి) చెరువు చేరింది.

మూ. తతః సర్వైరేవ జలచరైః పృష్టః– 'భోః కులీరక! కిం నివృత్త స్త్వమ్. స మాతులోఽపి నాయాతః. తత్కిం చిరయతి వయం సర్వే సోత్సుకాః కృతక్షణా స్తిష్ఠామః.' ఏవం తైరభిహితే కులీరకోఽపి విహస్యోవాచ– 'మూర్ఖాః, సర్వే జలచరా స్తేన మిథ్యావాదినా వఞ్చయిత్వా నాతిదూరే శిలాతలే ప్రక్షిప్య భక్షితాః. తన్మమాయుః శేషతయా తస్య విశ్వాసఘాతుకస్యాభిప్రాయం జ్ఞాత్వా గ్రీవేయమానీతా. తదలం సమ్భ్రమేణ. అధునా సర్వజలచరాణాం క్షేమం భవి ష్యతి'. అతోఽహం బ్రవీమి– 'భక్షయిత్వా బహూన్ మత్స్యాన్–' ఇతి.

అ. అప్పుడు జలచరాలు అన్నీ అడిగాయి-'ఓ కుళీరకా! నీవు ఏల మరలి వచ్చావు? ఆ మామ రాలేదు. ఆలస్యం ఎందుకు చేస్తున్నాడు? మేమంతా ప్రతిక్షణం ఉత్కంఠతో (తొందరపాటుతో) ఉన్నాము.' ఇట్లు అవి అడుగగా ఎండ్రి నవ్వి చెప్పింది. 'ఓరీ మూర్ఖులారా! ఆ అసత్యవాది వంచించి జలచరాలను అన్నింటిని కొంది దూరంలో ఉండే చట్టుబండపై పడవేసి భక్షించాడు. ఆయువు మిగిలి ఉండుటంతో నేను విశ్వాస ఘాతకుడైన అతని భావం గ్రహించాను. గొంతు (కత్తిరించి) తెచ్చాను. విచారపడ వలసింది ఏమీలేదు. ఇక జలచరాలకు అన్నిటికీ క్షేమం లభిస్తుంది.'

అందుచే నేను చెప్పుచున్నాను-'భక్షయిత్వా బహూన్ మత్స్యాన్'-ఇత్యాది. (చేపలను అన్నిటినీ తిని-ఇత్యాది)

మూ. వాయసః ఆహ– 'భద్ర, కథయ కథం స దుష్టసర్పో వధ ముపైష్యతి'? శృగాల ఆహ– 'గచ్ఛతు భవాన్ కిఞ్చిన్నగరం రాజాధిష్ఠానమ్. తత్ర కస్యాపి ధనినో రాజామాత్యాదేః ప్రమాదినః కనకసూత్రం హారం వా గృహీత్వా తత్కోటరే ప్రక్షిప. యేన సర్పస్తద్గ్రహణేన వధ్యతే'.

అ. మగకాకి అడిగింది-'శుభమూర్తీ! ఆ దుష్టసర్పం ఎలాచస్తుందో తెలుపుము.' నక్క చెప్పింది-'నీవు రాజనివాసం అయిన ఏదేని నగరానికి పొమ్ము. అచ్చట అజాగరూకతతో ఉండే-ధనికుడు రాజు మంత్రి మొదలైన వారిలో ఎవరిదైనా బంగారుగొలుసు గానీ హారం గానీ తీసుకొనుము-దానిని పాము తొఱ్ఱలో పడవేయుము. దాన్ని గ్రహించేందుకై పామును చంపుతారు.'

మూ. అథ తత్క్షణాత్ కాకః కాకీ చ తదాకర్ణ్యాత్మేచ్ఛయోత్పతితౌ తతశ్చ కాకీ కిఞ్చిత్సరః ప్రాప్య యావత్పశ్యతి తావత్తన్మధ్యే కస్య చిద్రాజ్ఞోఽన్తఃపురం జలాసన్నన్యస్తకనకసూత్రం ముక్తాముక్తాహారవస్త్రాభరణం జలక్రీడాం కురుతే. అథ సా వాయసీ కనకసూత్రమేకమాదాయ స్వగృహాభిముఖం ప్రతస్థే. తతశ్చ కఞ్చుకినో వర్షవరాశ్చ తన్నీయమానముపలక్ష్య గృహీతలగుడాః సత్వరమనుయయుః. కాక్యపి సర్పకోటరే తత్కనకసూత్రం ప్రక్షిప్య సుదూరమవస్థితా.

అ. అంత దానిని విని వెంటనే కాకులజంట స్వేచ్ఛగా ఎగిరిపోయింది. పిమ్మట ఆడకాకి ఒకానొక సరస్సు (కోనేరు) చేరింది. చూడగా దాని నడుమ ఏదో రాజకాంతలు జలక్రీడలు చేస్తున్నారు. వారు నీటికి దగ్గరగా (నీటి ఒడ్డున) తమ బంగారు గొలుసులు-ముత్యాలహారాలు-(తక్కిన) వస్త్రభూషణాలు ఉంచారు. అప్పుడు ఆడకాకి ఒక బంగారు గొలుసును నోట కఱచుకొని తమగూటి దారిగా ప్రయాణం సాగించింది. వెంటనే కంచుకులు, వర్షవరులు (కొజ్జాలు) అది (గొలుసు) తీసుకొని పోవడం చూచారు. వెంటనే కఱ్ఱలు పట్టుకొని వెంబడించారు. ఆడకాకి పాముతొఱ్ఱలో బంగారుగొలుసును పడవేసింది. తాను దూరంగాపోయి కూర్చుంది.

మూ. అథ యావద్రాజపురుషాస్తం వృక్షమారుహ్య తత్కోటరమవలోకయన్తి తావత్కృష్ణసర్పః ప్రసారితభోగస్తిష్ఠతి. తతస్తం లగుడప్రహారేణ హత్వా కనకసూత్రమాదాయ యథాభిలషితం స్థానం గతాః. వాయసదమ్పతీ అపి తతః పరం సుఖేన వసతః. అతోఽహం బ్రవీమి- 'ఉపాయేన హి యత్కుర్యాత్'- ఇతి, తన్న కిఞ్చిదిహ బుద్ధిమతామసాధ్యమస్తి. ఉక్తఞ్చ-

శ్లో. యస్య బుద్ధిర్బలం తస్య నిర్బుద్ధేస్తు కుతో బలమ్
వనే సింహో మదోన్మత్తః శశకేన నిపాతితః. 237

కరటక ఆహ– కథమేతత్?' స ఆహ–

అ. అంత రాజభటులు ఆ వృక్షం ఎక్కారు. ఆ తొఱ్ఱలోనికి చూచారు. నల్లత్రాచు పడగవిప్పి ఉంది. వెంటనే (వారు) దాన్ని కఱ్ఱతో కొట్టి చంపారు. బంగారు గొలుసు తీసికొన్నారు. అభీష్ట(కోరిన) స్థానం వెళ్లారు. అటు పిమ్మట కాకిదంపతులు సుఖంగా నివసింపసాగాయి. ఇందువల్ల నేను చెప్పుచున్నాను. 'ఉపాయేన హి యత్కుర్యాత్' ఇత్యాది (ఉపాయంతో ఏదిచేయునో ఇత్యాది). కనుక బుద్ధిమంతులకు ఈ లోకంలో అసాధ్యం ఏమీలేదు. పెద్దలు ఇలా అన్నారు.

'ఎవనికి బుద్ధిఉందో వానికే బలం ఉంటుంది. బుద్ధిహీనునికి బలం ఎక్కడిది? అడవిలో (శరీరబలంచే) మదించిన సింహం కుందేలుచే చంపబడింది.'

కరటకుడు అన్నాడు— 'అది ఎట్లు'?

దమనకుడు— ఇలా చెప్పాడు–

## కథా–8

### సింహ-శశక-కథా

మూ. కస్మింశ్చిద్వనే భాసురకో నామ సింహః ప్రతివసతి స్మ. అథాసౌ వీర్యాతిరేకాన్నిత్యమేవానేకాన్ మృగశశకాదీన్ వ్యాపాదయన్ నోపరరామ. అథాన్యేద్యుస్తద్వనజాః సర్వే సారఙ్గ–వరాహ–మహిష–శశకాదయో మిలిత్వా తమభ్యుపేత్య ప్రోచుః–'స్వామిన్ ! కిమనేన సకలమృగవధేన నిత్యమేవ, యతస్తవైకేనాపి మృగేణ తృప్తిర్భవతి. తత్క్రియతామస్మాభిః సమయధర్మః. అద్య ప్రభృతి తవాత్రోపవిష్టస్య జాతిక్రమేణ ప్రతిదినమేకో మృగో భక్షణార్థం సమేష్యతి. ఏవం కృతే తవ తావత్ ప్రాణయాత్రా క్లేశం వినాపి భవిష్యతి. అస్మాకఞ్చ పునః సర్వోచ్ఛేదనం న స్యాత్. తదేష రాజధర్మోఽనుష్ఠీయతామ్'. ఉక్తఞ్చ–

అ. ఒకానొక అడవిలో భాసురకుడు అనే సింహం నివసిస్తూ ఉండేవాడు. అతడు బలాధిక్యంచే నిత్యం జింకలు కుందేళ్లు మొదలైన వాటిని పెక్కింటిని వధిస్తూ తృప్తి (శాంతి) పొందలేదు. అంత ఒకనాడు ఆ అడవిలో ఉండే జింకలు – పందులు (అడవిదున్నలు-కుందేళ్లు మొదలైనవి అన్నీ కలిసి అతణ్ణి సమీపించి ఇలా అర్థించాయి (చెప్పాయి). 'స్వామీ! నిత్యం (ప్రతిదినం) జంతువులను అన్నింటినీ చంపడంచే ఏమిలాభం ఉంది? ఒక జంతువు(ను తినడం) చేతనే తృప్తిలభిస్తుంది. అందువల్ల మాతో ఒప్పందం (నియమం) చేసికొనండి. నేటినుండి మీరు ఇచ్చటనే (కూర్చొని) ఉండండి. ప్రతిదినం జాతిక్రమంగా ఒకజంతువు ఆహారంగా వస్తుంది. ఇలా ఏర్పాటు చేసుకుంటే మీకు శ్రమలేకయే ప్రాణయాత్ర (జీవయాత్ర) గల్గుతుంది. మాకుకూడ సర్వనాశం తొలగుతుంది.' కనుక ఈ రాజధర్మం పాలించండి. విజ్ఞులు ఇలా అన్నారు—

శ్లో. శనైః శనైశ్చ యో రాజ్యముపభుఙ్క్తే యథాబలమ్
రసాయనమివ ప్రాజ్ఞః స పుష్టిం పరమాం వ్రజేత్. 238

అ. ప్రాజ్ఞుడు రసాయనం (బలవర్ధకమైన ఔషధం) ప్రతిదినం కొలది కొలదిగా సేవించి పుష్టిని(బలం)పొందునట్లు, రాజు తన రాజ్యసంపదను కొలది కొలదిగా అనుభవిస్తూ పుష్టి (ధనసమృద్ధి)ని పొందాలి.

శ్లో. విధినా మన్త్రయుక్తేన రూక్షాఽపి మథితాఽపి చ
ప్రయచ్ఛతి ఫలం భూమిరరణీవ హుతాశనమ్. 239

అ. శాస్త్రోక్త పద్ధతిని మంత్రజపం చేసి మథిస్తే రూక్ష(కఠిన)మైన అరణియు అగ్నిని ఇస్తుంది. ఆలాగే క్రమవిధిని (ఏ పైరు ఈభూమికి మంచిది-అని) మంత్రణ (ఆలోచన) చేసి వ్యవసాయం చేస్తే రూక్ష (కఠిన) భూమియు పంటను ఇస్తుంది.

శ్లో. ప్రజానాం పాలనం శస్యం స్వర్గకోశస్య వర్ధనమ్
పీడనం ధర్మనాశాయ పాపాయాయశసే స్థితమ్. 240

అ. రాజులకు ప్రజాపాలనం ప్రశంసనీయం-స్వర్గం అనే ధనాగారాన్ని పెంచడం అవుతుంది. ప్రజలను పీడించడం ధర్మనాశానికి పాపానికి-అపకీర్తికి

కారణమై ఉంటుంది.

శ్లో. గోపాలేన ప్రజాధేనోర్విత్తదుగ్ధం శనైః శనైః
పాలనాత్ పోషణాద్గ్రాహ్యం న్యాయ్యాం వృత్తిం సమాచరేత్. 241

అ. ప్రభువు, గోపాలుడు-వీరిరువురూ క్రమంగా ప్రజలను గోవులను-పాలిస్తూ పోషిస్తూ-మెల్లమెల్లగా ప్రజలనుండీ గోవులనుండీ-ధనం క్షీరం గ్రహిస్తూ న్యాయమైన వ్యవహారం చేయాలి. (గో=భూమి, గోవు)

శ్లో. అజామివ ప్రజాం మోహాద్యో హన్యాత్పృథివీపతిః
తస్యైకా జాయతే తృప్తిర్న ద్వితీయా కథఞ్చన. 242

అ. ఏ ప్రభువు మోహవశంచే తన ప్రజలను మేకనువలె చంపుతాడో ఆతనికి, ఆ మొదటి పర్యాయమే తృప్తి లభిస్తుంది. రెండవమారు లేదు-అనగా ప్రజలు జీవించి ఉంటే ధనాదికంచే నిత్యం తృప్తి గల్గిస్తారు- అని భావం.

శ్లో. ఫలార్థీ నృపతిర్లోకాన్ పాలయేద్యత్నమాస్థితః
దానమానాదితోయేన మాలాకారోఙ్కురానివ. 243

అ. మాలాకారుడు నీరుపోసి మొక్కలను శ్రద్ధవహించి పాలించి ఫలితం పొందుతాడు. అలాగే ఫలార్థి అయిన ప్రభువు దానసన్మానాది రూపమైన నీటిచే ప్రజలను ప్రయత్న పూర్వకంగా పాలించాలి.

శ్లో. నృపదీపో ధనస్నేహం ప్రజాభ్యః సంహరన్నపి
ఆన్తరస్థైర్గుణైః శుభ్రైర్లక్ష్యతే నైవ కేనచిత్. 244

అ. ప్రభువు అనేదీపం, ప్రజలనుండి ధనం అనే తైలన్ని గుంజుతూనే ఉంటుంది. అయినా అంతరస్థాలైన విశుద్ధగుణాలు (అంతరంగంలోని నిర్మలగుణాలు-వత్తిలోని వెల్గే తంతువులు) కారణంగా ఎవరిదృష్టిలోనూ(చెడుగా) పడడం సంభవింపదు.

శ్లో. యథా గౌర్దుహ్యతే కాలే పాల్యతే చ తథా ప్రజాః
సిచ్యతే చీయతే చైవ లతా పుష్పఫలప్రదా. 245

అ. గోవు ప్రాతః సాయం కాలాలలో పాలు ఇస్తుంది. నిత్యం పోషింప

బడుతుంది. తీగ ఋతుకాలంలో పూలు పండ్లు ఇస్తుంది. ప్రతిదినం జలదానాదికంచే సంరక్షింపబడుతుంది. అలాగే ప్రభువు ప్రజల విషయంలో (సకాలంలో వారినుండి పన్ను గ్రహిస్తూ వారిని రక్షిస్తూ) ప్రవర్తిల్లాలి.

శ్లో. యథా బీజాఙ్కురః సూక్ష్మః ప్రయత్నేనాభిరక్షితః
ఫలప్రదో భవేత్ కాలే తద్వల్లోకః సురక్షితః. 246

అ. చిన్నవిత్తనం నుండి వచ్చిన మొలక, ప్రయత్నపూర్వకంగా సంరక్షితం ఆయి ఋతుకాలంలో ఫలదాయకం అవుతుందో, అలాగే సురక్షితం అయిన ప్రజయు ప్రభువునకు సమయం వచ్చినప్పుడు సాయపడుతారు.

శ్లో. హిరణ్యధాన్యరత్నాని యానాని వివిధాని చ
తథాన్యదపి యత్కిఞ్చిత్ ప్రజాభ్యః స్యాన్మహీపతేః. 247

అ. బంగారం ధాన్యం రత్నాలు వివిధవాహనాలు ఇతరం అయిన ఏఏ వస్తు సమూహం ప్రభువువద్దగలదో, అది అంతా ప్రజలనుండి పొందినదే.

శ్లో. లోకానుగ్రహకర్తారః ప్రవర్ధన్తే నరేశ్వరాః
లోకానాం సంక్షయాచ్చైవ క్షయం యాన్తి న సంశయః. 248

అ. ప్రజలను అనుగ్రహించి పాలించే ప్రభువులు అభివృద్ధి పొందుతారు. ప్రజలు (ప్రజలను పీడిస్తే) ప్రభువులునూ నశిస్తారు. ఇందు సంశయం లేదు.

మూ. అథ తేషాం తద్వచనమాకర్ణ్య భాసురక ఆహ—'అహో సత్యమభిహితం భవద్భిః. పరం యది మమోపవిష్టస్యాత్ర నిత్యమేవ నైకః శ్వాపదః సమాగమిష్యతి, తన్నూనం సర్వానపి భక్షయిష్యామి.' అథ తే తథైవ ప్రతిజ్ఞాయ నిర్వృతిభాజస్తత్రైవ వనే నిర్భయాః పర్యటన్తి. ఏకశ్చ ప్రతిదినం క్రమేణ యాతి. వృద్ధో వా వైరాగ్యయుక్తో వా శోకగ్రస్తో వా పుత్రకలత్రనాశభీతో వా తేషాం మధ్యాత్తస్య భోజనార్థం మధ్యాహ్నసమయ ఉపతిష్ఠతే.

అ. అంత అవి చెప్పిన ఆమాట విని భాసురకుడు అన్నాడు-"ఆహా, మీరు సత్యం పల్కారు. కాని ఇచ్చట కూర్చుండిన నాదగ్గరకు ప్రతిదినం ఒకజంతువు

రానిచో అప్పుడు తప్పక అందర్నీ భక్షిస్తాను." అందుకు అవి 'అటులనే' అని ప్రతిజ్ఞ చేసాయి. తర్వాత నిర్భయంగా ఆ అడవిలోనే తిరుగుతూండేది. ప్రతిదినం ఒక జంతువు క్రమంగా పోయేది. ముసలివాడో, విరక్తుడో, దుఃఖితుడో, భార్యాపుత్ర వినాశభీతుడో ఆజంతువులనుండి ఎవడో ఒకడు అతని భోజనానికి మధ్యాహ్నసమయంలో వెళ్లేవాడు.

మూ. అథ కథాచిజ్జాతిక్రమాచ్ఛశకస్యావసరః సమాయాతః. స సమస్తమృగైః ప్రేరితోఽనిచ్ఛన్నపి మన్దం మన్దం గత్వా తస్య వధోపాయం చిన్తయన్ వేలాతిక్రమం కృత్వా వ్యాకులితహృదయో యావద్గచ్ఛతి తావన్మార్గే గచ్ఛతా కూపః సన్దృష్టః. యావత్ కూపోపరి యాతి తావత్ కూపమధ్య ఆత్మనః ప్రతిబిమ్బం దదర్శ. దృష్ట్వా చ తేన హృదయే చిన్తితమ్— 'యన్ భవ్య ఉపాయోఽస్తి. అహం భాసురకం ప్రకోప్య స్వబుద్ధ్యాఽస్మిన్ కూపే పాతయిష్యామి'. అథాసౌ దినశేషే భాసురకసమీపం ప్రాప్తః.

అ. అంత ఒకనాడు కులక్రమంగా కుందేలువంతు వచ్చింది. అది జంతువులన్నిటిచే ప్రేరితం అయి ఇష్టం లేకపోయినా మెల్లమెల్లగా పోవుచూ సింహాన్ని చంపే ఉపాయం ఆలోచిస్తూ (భోజన) సమయం దాటజేసింది. అందుచే కలతనంది పోతూ ఉండగా దారిలో బావి కనబడింది. బావి(ఒడ్డు) మీద పోవడంతో బావినడుమ తన ప్రతిబింబాన్ని చూచింది. చూచి మనస్సులో ఇలా తలంచింది. 'ఇది అందమైన ఉపాయం, భాసురునికి కోపం తెప్పించి నాబుద్ధిబలంచే ఈ బావిలో పడదోస్తాను.' పిమ్మట అది సాయంకాలానికి భాసురకుని వద్దకు పోయింది.

మూ. సింహోఽపి వేలాతిక్రమేణ క్షుత్క్షామకణ్ఠః కోపావిష్టః సృక్కిణీ పరిలేలిహన్ వ్యచిన్తయత్— 'అహో, ప్రాతరాహారాయ వనం మయా నిస్సత్త్వం కర్తవ్యమ్'. ఏవం చిన్తయతస్తస్య శశకో మన్దం మన్దం గత్వా ప్రణమ్య తస్యాగ్రే స్థితః. అథ తం ప్రజ్వలితాత్మా భాసురకో భర్త్సయన్నాహ— రే శశకాధమ! ఏకస్తావత్త్వం లఘుః ప్రాప్తోఽపరతో వేలాతిక్రమేణ. తదస్మాదపరాధాత్త్వాం నిపాత్య ప్రాతః సకలాన్యపి మృగకులానుచ్ఛేదయిష్యామి'. అథ శశకః సవినయం ప్రోవాచ— 'స్వామిన్, నాపరాధో మమ, న చ

సత్త్వానామ్– తచ్ఛ్రూయతాం కారణమ్. సింహ ఆహ– సత్వరం నివేదయ, యావన్మమ దంష్ట్రాంతర్గతో న భవాన్ భవిష్యతి' ఇతి.

అ. వేళ (భోజనసమయం) దాటడంతో సింహానికి ఆకలిచే గొంతు ఎండి పోయింది. కోపం వచ్చింది. పెదవులు నాకుకుంటూ ఇలా తలంచింది. ఆహా, ఉదయం ఆహారానికి అడవిన్నీ జంతురహితం చేయాలి? ఇలా అది (సింహం)తలంచుతూ ఉండగా కుందేలు మెల్లమెల్లగా వచ్చి నమస్కరించింది. దాని ఎదుట నిలబడింది. అప్పుడు భాసురకుడు మండిపడి బెదిరిస్తూ అన్నాడు. ఒకటి నీవు అల్పప్రాణివి వచ్చావు. రెండవది సమయం దాటడం అందుచే ఈ అపరాధానికి నిన్ను చంపి ప్రాతఃకాలం జంతుకులాలను అన్నిటినీ నాశనం చేస్తాను. అంత కుందేలు వినయంగా ఇలా అంది. 'స్వామీ' నావలనగాని, తక్కిన జంతువులవలనగాని అపరాధం లేదు. కారణం వినండి.' సింహం చెప్పింది. 'తొందరగా నాకోరలనడుమ పడుటకు ముందే తెలుపుము.'

మూ. శశక ఆహ– 'స్వామిన్, సమస్తమృగైరద్య జాతిక్రమేణ మమ లఘుతరస్య ప్రస్తావం విజ్ఞాయ తతోఽహం పఞ్చశశకైః సమం ప్రేషితః. తతశ్చాహమాగచ్ఛన్నన్తరాలే మహతా కేనచిదపరేణ సింహేన వివరాన్నిర్గత్యాభిహితః–'రే క్వ ప్రస్థితా యూయమ్? అభీష్టదేవతాం స్మరత. తతో మయాఽభిహితమ్– 'వయం స్వామినో భాసురకసింహస్య సకాశమాహారార్థం సమయధర్మేణ గచ్ఛామః.' తతస్తేనాభిహితమ్– 'యద్యేవం తర్హి మదీయమేతద్వనమ్. మయా సహ సమయధర్మేణ సమస్తైరపి శ్వాపదైర్వర్తితవ్యమ్. చోరరూపః స భాసురకః కః? అథ యది సోఽత్ర రాజా విశ్వాసస్థానే చతురః శశకానత్ర ధృత్వా తమాహూయ ద్రుతతరమాగచ్ఛ. యేన యః కశ్చిదావయోర్మధ్యాత్పరాక్రమేణ రాజా భవిష్యతి. స సర్వానిమాన్ భక్షయిష్యతి ఇతి. తతోఽహం తేనాదిష్టః స్వామిసకాశమభ్యాగతః ఏతద్వేలాతిక్రమణకారణమ్. తదత్ర స్వామీ ప్రమాణమ్'.

అ. కుందేలు చెప్పింది. 'సమస్తజంతువులు నేడు జాతిక్రమంగా నన్ను అల్ప దేహునిగా తలంచి నాలుగు కుందేళ్లతోబాటు పంపాయి. మేము వస్తుండగా దారిలో మరి

యొక పెద్దసింహం తనగుహనుండి వెలుపలికి వచ్చి ఇలా చెప్పింది. ఓరీ! మీరు ఎక్కడికి పోతూ ఉన్నారు? ఇష్టదేవతను స్మరించండి. అప్పుడు నేను అన్నాను. 'మేము ప్రభువైన భాసురకసింహం వద్దకు ఆహారంగా ఏర్పాటుప్రకారం పోతున్నాము.' అంత అతడు అన్నాడు. ఇలా అయితే ఈ అడవి నాది. జంతువులన్నీ ప్రతిజ్ఞాప్రకారం నాతో ప్రవర్తిల్లాలి. ఆ భాసురకుడు దొంగ. అతడు ఈ అడవికి రాజు అయితే, నాకు విశ్వాసంగా నాలుగుకుందేళ్ళను ఉంచి, మిక్కిలి శీఘ్రంగా అతణ్ణి పిలుచుకొని రమ్ము. మా ఇరువురిలో ఎవరో ఒకరు పరాక్రమంచే రాజు అవుతాడు. అతడే ఈ అన్నింటినీ భక్షిస్తాడు. పిమ్మట నేను అతనిచే ఆజ్ఞాపింపబడి ప్రభువుల వద్దకు వచ్చాను. సమయం దాటటానికి కారణం ఇది. ఇక ఈ విషయంలో ప్రభువులే ప్రమాణం.

మూ. తచ్ఛ్రుత్వా భాసురక ఆహ— 'భద్ర యద్యేవం తత్సత్వరం దర్శయ మే తం చోరసింహం యేనాహం మృగకోపం తస్యోపరి క్షిప్త్వా స్వస్థో భవామి. ఉక్తం చ—

శ్లో. భూమిర్మిత్రం హిరణ్యఞ్చ విగ్రహస్య ఫలత్రయమ్
నాస్త్యేకమపి యద్యేషాం న తం కుర్యాత్ కథఞ్చన. 249
యత్ర న స్యాత్ ఫలం భూరి యత్ర చ స్యాత్ పరాభవః
న తత్ర మతిమాన్ యుద్ధం సముత్పాద్య సమాచరేత్. 250

అ. దానిని విని భాసురకుడు అన్నాడు—'భద్రమూర్తీ! ఇలా అయితే ఆ దొంగసింహాన్ని వెంటనే నాకు చూపుము. జంతువులమీది కోపాన్ని దానిపైవేసి శాంతి అనుభవిస్తాను. పెద్దలన్నారు—

'భూమి, మిత్రుడు, బంగారం ఈ మూడు యుద్ధానికి ఫలాలు. వీటిలో ఏ ఒక్కటీ లభించే అవకాశం లేనిచో యుద్ధం చేయరాదు.

ఎచ్చట అధికఫలంలేదో అవమానాశంక ఉండునో అచ్చట బుద్ధిమంతుడైనవాడు యుద్ధంపుట్టే పనులు చేయరాదు.

మూ. శశక ఆహ— 'స్వామిన్, సత్యమిదమ్. స్వభూమిహేతోః పరిభవాచ్చ యుధ్యన్తే క్షత్రియాః. పరం స దుర్గాశ్రయః, దుర్గాన్నిష్క్రమ్య

వయం తేన విష్కమ్భితాః. తతో దుర్గస్థో దుఃసాధ్యో భవతి రిపుః. ఉక్తఞ్చ-

శ్లో. న గజానాం సహస్రేణ న చ లక్షేణ వాజినామ్
యత్కృత్యం సాధ్యతే రాజ్ఞాం దుర్గేణైకేన సిధ్యతి. 251

అ. కుందేలు అంది- 'స్వామీ! ఇది సత్యం. క్షత్రియులు తమభూమి కారణంగా, అవమానం కారణంగా యుద్ధం చేస్తారు. కాని అతడు కోటను ఆశ్రయించి ఉన్నాడు. కోటనుండి వెలుపలికివచ్చి మమ్మ అడ్డగించాడు. కనుక కోటలోని శత్రువును సాధించడం కష్టం. పెద్దలన్నారు—

ఏ కార్యం వెయ్యిఏనుగులచేత, లక్షగుఱ్ఱాలచేత సిద్ధిస్తుందో అది ఒకదుర్గం (కోట)చే సిద్ధిస్తుంది.

శ్లో. శతమేకోఽపి సన్ధత్తే ప్రాకారస్థో ధనుర్ధరః
తస్మాద్దుర్గం ప్రశంసన్తి నీతిశాస్త్రవిచక్షణాః. 252

అ. కోటలోని విలుకాడు ఒక్కడైనసూ వందమందిపై బాణప్రయోగం చేయగలడు. అందుచే నీతివేత్తలు కోటను ప్రశంసిస్తారు.

శ్లో. పురా గురోః సమాదేశాద్ధిరణ్యకశిపోర్భయాత్
శక్రేణ విహితం దుర్గం ప్రభావాద్విశ్వకర్మణః. 253

అ. పూర్వం గురుని (బృహస్పతి) ఆజ్ఞచే హిరణ్యకశిపుని భయంవల్ల ఇంద్రుడు విశ్వకర్మప్రభావంతో కోటను నిర్మించాడు.

శ్లో. తేనాపి చ వరో దత్తో యస్య దుర్గం స భూపతిః
విజయీ స్యాత్తతో భూమౌ దుర్గాణి స్యుః సహస్రశః. 254

అ. ఆ విశ్వకర్మ- 'కోటగల్గిన ప్రభువు విజయం పొందును'. అని వరం ఇచ్చాడు. నాటినుండి భూమిపై వేలకొలది కోటలు వెలిశాయి.

శ్లో. దంష్ట్రావిరహితో నాగో మదహీనో యథా గజః
సర్వేషాం జాయతే వశ్యో దుర్గహీనస్తథా నృపః. 255

అ. కోరలులేని పామువలె, మదంలేని ఏనుగువలె, కోటలేనిరాజు అందరికి లొంగిపోతాడు.

మూ. తచ్ఛ్రుత్వా భాసురక ఆహ–'భద్ర, దుర్గస్థమపి దర్శయ తం చోరసింహం యేన వ్యాపాదయామి. ఉక్తఞ్చ–

శ్లో. జాతమాత్రం నయః శత్రుం రోగం చ ప్రశమం నయేత్
మహాబలోఽపి తేనైవ వృద్ధిం ప్రాప్య స హన్యతే. 256

ఆ. దానిని విని భాసురకుడు అన్నాడు- 'భద్ర, కోటలో ఉన్నా ఆ దొంగ సింహాన్ని చూపుము. సంహరిస్తాను. విజ్ఞులు అన్నారు. శత్రువునూ రోగాన్నీ పుట్టగానే అణచివేయాలి. లేనిచో (క్రమంగా) వృద్ధిపొంది ఆ శత్రు, రోగాలు గొప్పబలశాలినైనా చంపివేస్తాయి.

మూ. తథా చ–

శ్లో. ఉత్తిష్ఠమానస్తు పరో నోపేక్ష్యః పథ్యమిచ్ఛతా
సమౌ హి శిష్టైరామ్నాతౌ వర్త్స్యన్తావామయః స చ. 257

ఆ. అలాగే మేలుకోరేవాడు వృద్ధినొందే శత్రువును ఉపేక్షింపరాదు. పెరిగే రోగం, శత్రువు ఈ రెండు ఒకటే అని విజ్ఞులు అన్నారు.

మూ. అపి చ–

శ్లో. ఉపేక్షితం క్షీణబలోపి శత్రుః ప్రమాదదోషాత్ పురుషైర్మదాన్ధైః
సాధ్యోఽపి భూత్వా ప్రథమం తతోఽసావసాధ్యతాం వ్యాధిరివ ప్రయాతి.

ఆ. మరియూ. అహంకారమదంచే నిర్లక్ష్యంగా ఉపేక్షింపబడిన శత్రువు మొదట బలహీనుడూ సాధ్యుడూ అయిఉన్నా పిమ్మట వ్యాధివలె అసాధ్యుడు అవుతాడు.

మూ. తథా చ–

శ్లో. ఆత్మనః శక్తిముద్వీక్ష్య మానోత్సాహం చ యో వ్రజేత్
బహూన్ హన్తి స ఏకోఽపి క్షత్రియాన్ భార్గవో యథా. 259

ఆ. తన శక్తిని గుర్తించి అభిమానం ఉత్సాహం పొందేవాడు ఒక్కడైనా అనేకులను సంహరిస్తాడు. పరశురాముడు అనేక క్షత్రియులను వధించాడు గదా!

మూ. శశక ఆహ– 'అస్త్యేతత్. తథాఽపి బలవాన్ స మయా

దృష్టః. తన్న యుజ్యతే స్వామిన స్తస్య సామర్థ్యమవిదిత్వా గన్తుమ్. ఉక్తఞ్చ--

శ్లో. అవిదిత్వాఽఽత్మనః శక్తిం పరస్య చ సముత్సుకః
గచ్ఛన్నభిముఖో నాశం యాతి వహ్నౌ పతఙ్గవత్. 260

శ్లో. యో బలాత్ ప్రోన్నతం యాతి నిహన్తుం స బలోఽత్యరిమ్
విమదః స నివర్తేత శీర్ణదన్తో గజో యథా. 261

అ. కుందేలు అంది- 'ఇది సరిగానే ఉంది. కాని నాకు అతడు బలవంతుడుగా కనబడ్డాడు. అందుచే ప్రభువులు అతని బలం గుర్తించక యుద్ధానికి పోవడం సముచితంగాదు. విజ్ఞులు ఇలా అన్నారు-

తనబలం శత్రుబలం గుర్తింపక తొందరపాటుతో (సముత్సుకతతో ఎదిరింపబోయేవాడు అగ్నిలో మిడుతవలె మాడిపోతాడు.

బలవంతుడై ఉన్నా (శత్రుబలం గుర్తింపక) తనకంటె ప్రబలుడైన శత్రువును చంపబోయేవాడు కోరలు విరిగిన ఏనుగువలె గర్వభంగంపొంది (మదంతొలగి) విఫలుడై తిరిగివస్తాడు.

మూ. భాసురక ఆహ– 'భోః, కిం తవానేన వ్యాపారేణ. దర్శయ మే తం దుర్గస్థమపి'. అథ శశక ఆహ– 'యద్యేవం తర్హ్యాగచ్ఛతు స్వామీ'. ఏవముక్త్వాఽగ్రే వ్యవస్థితః. తతశ్చ తేనాఽఽగచ్ఛతా యః కూపో దృష్టోఽభూత్, తమేవ కూపమాసాద్య భాసురకమాహ– 'స్వామిన్, కస్తే ప్రతాపం సోఢుం సమర్థః? త్వాం దృష్ట్వా దూరతోఽపి చోరసింహః ప్రవిష్టః స్వం దుర్గం తదాగచ్ఛ యేన దర్శయామి'–ఇతి. భాసురక ఆహ– 'దర్శయ, మే దుర్గమ్. తదనుదర్శిత స్తేన కూపః.

అ. భాసురకుడు అన్నాడు– 'ఓరీ, నీవు ఇలా చెప్పడం ఎందుకు? అతడు కోటలో ఉన్నా నాకు చూపుము. అంతకుందేలు అంది-ఇలాఅయితే ప్రభువులు(నావెంట) దయచేయండి. ఇట్లుపల్కి అది ముందు కదిలింది. పిమ్మట తాను వచ్చేటప్పుడు చూచిన బావిని చేరింది..భాసురకునితో ఇలా అంది– 'స్వామీ, మీ ప్రతాపం సహించే శక్తి ఎవరికి ఉంది? దూరంనుండియే మిమ్ము చూచి ఆ దొంగసింహం కోటలో ప్రవేశించింది.

ఇచ్చటికి రండి. చూపెదను. భాసురకుడు అన్నాడు- 'నాకు (దాని) కోటను చూపుము'. వెంటనే అది (కుందేలు) బావిని చూపింది.

మూ. తతః సోఽపి మూర్ఖః సింహః కూపమధ్య ఆత్మప్రతిబిమ్బం జలమధ్యగతం దృష్ట్వా సింహనాదం ముమోచ. తతః ప్రతిబిమ్బేన కూప మధ్యాద్ ద్విగుణతరో నాదః సముత్థితః. అథ తేన తం శత్రుం మత్వాఽఽత్మానం తస్యోపరి ప్రక్షిప్య ప్రాణాః పరిత్యక్తాః. శశకోఽపి హృష్టమనాః సర్వమృగా నానన్ద్య తైః సహ ప్రశస్యమానో యథాసుఖం తత్ర వనే నివసతి స్మ. అతోఽహం బ్రవీమి - 'యస్య బుద్ధిర్బలం తస్య' ఇతి. తద్యది భవాన్ కథ యతి, తత్తత్రైవ గత్వా తయోః స్వబుద్ధిప్రభావేణ మైత్రీభేదం కరోమి'. కరటక ఆహ– 'భద్ర, యద్యేవం తర్హి గచ్ఛ. శివాస్తే పన్థానః సన్తు. యథాఽభిప్రేతమనుష్ఠీయతామ్.

అ. అంత ఆ మూర్ఖసింహం బావిలోని నీటినడుమపడిన తననీడను (ప్రతిబింబం) చూచింది. సింహనాదం చేసింది. అప్పుడు (బావిలోని పలుకుడురాళ్ల) ప్రతిధ్వనిచే బావినుండి రెండంతలు సింహనాదం పుట్టింది. అప్పుడు సింహం దానిని (ప్రతిబింబాన్ని) శత్రువుగా తలంచింది. దానిమీదికి దుమికింది. ప్రాణాలు విడిచింది. కుందేలు సంతోషించింది. మృగాలకు అన్నింటికీ ఆనందం గల్గించింది. వాటిచే పొగడబడుతూ ఆ అడవిలో సుఖంగా నివసింపసాగింది. అందుచే నేను చెప్పుచున్నాను. 'యస్య బుద్ధిర్బలం తస్య' (ఎవడు బుద్ధిమంతుడో వాడు బలవంతుడు). కనుక తాము చెప్పినచో (అంగీకరిస్తే) అచ్చటికిపోయి నా బుద్ధిప్రభావంచే వారిరువురి మైత్రికి భంగం గల్గిస్తాను. కరటకుడు అన్నాడు- 'భద్ర, (శుభమూర్తీ) ఇలా అయితే వెళ్లుము. నీ మార్గాలు శుభప్రదాలు అగుత. తోచినట్లు చేయుము.'

మూ. అథ దమనకః సఞ్జీవకవిముక్తం పిఙ్గలకమవలోక్య తత్రాన్తరే ప్రణమ్యాగ్రే సముపవిష్టః. పిఙ్గలకోఽపి తమాహ– 'భద్ర, కిం చిరాద్ దృష్టః'? దమనక ఆహ– 'న కిఞ్చిద్దేవపాదానామస్మాభిః ప్రయోజనమ్. తేనాహం నాగచ్ఛామి. తథాఽపి రాజప్రయోజనవినాశమవలోక్య దన్దహ్యమానహృదయో

వ్యాకులతయా స్వయమేవాభ్యాగతో వక్తుమ్. ఉక్తఞ్చ-

శ్లో. ప్రియం వా యది వా ద్వేష్యం శుభం వా యది వాఽశుభమ్
అపృష్టోఽపి హితం వక్ష్యేద్యస్య నేచ్ఛేత్ పరాభవమ్. 262

అ. పిమ్మట సంజీవకుడులేని (సమయంలో)పింగళకుణ్ణి చూచాడు. వెంటనే ప్రణమిల్లాడు.(అంగీకారంపొంది) ఎదుట కూర్చున్నాడు. పింగళకుడు అతనితో ఇలా అన్నాడు. 'భద్రా, ఏమి చాలాకాలానికి కనబడినావు? దమనకుడు చెప్పాడు. 'మావలన పూజ్యపాదులైన ప్రభువులకు ఉపయోగం ఏమీ లేదు. అందుచే నేను రాలేదు. అయినా రాజకార్యవినాశం చూచి, హృదయం దహించుకుపోతూ ఉంటే విచారంతో స్వయంగానే తెలుపడానికి వచ్చాను. పెద్దలు అన్నారు—

మనం ఎవరి పరాభవం కోరమో, వారు అడుగకపోయినా వారికి హితం అయిన విషయం బోధించాలి. కానీ మనం చెప్పేహితం, వారికి ప్రియమూ ద్వేష్యమూ శుభంగా తోస్తున్నదా, అశుభంగా తోస్తున్నదా? అని ఆలోచింపరాదు.

మూ. అథ తస్య సాభిప్రాయం వచనమాకర్ణ్య పిఙ్గలక ఆహ– కిం వక్తుమనా భవాన్? తత్కథ్యతాం యత్కథనీయమస్తి. స ప్రాహ– 'దేవ! సఞ్జీవకో యుష్మత్పాదానాముపరి ద్రోహబుద్ధిరితి. విశ్వాసగతస్య మమ విజనే ఇదమాహ– 'భో దమనక, దృష్టా మయాస్య పిఙ్గలకస్య సారాసారతా. తదహమేనం హత్వా సకలమృగాధిపత్యం త్వత్సాచివ్యపదవీసమన్వితం కరిష్యామి'. పిఙ్గలకోఽపి తద్వజ్రసారసదృశం దారుణం వచః సమాకర్ణ్య మోహముపగతో న కిఞ్చిదప్యుక్తవాన్.

అ. అంత వ్యంగ్యగర్భితం అయిన అతని మాటవిని పింగళకుడు ఇలా అన్నాడు. 'తాము ఏమి చెప్పదలచినారు? చెప్పదగినది అయితే (స్పష్టంగా) చెప్పివేయండి'. అతడు (దమనకుడు) చెప్పాడు. 'మహారాజ, పూజ్యపాదులైన ప్రభువుల యెడ సంజీవకుడు ద్రోహబుద్ధితో ఉన్నాడు. నన్ను నమ్మి ఏకాంతంగా(ఒంటరిగా) ఇలా అన్నాడు– 'ఓ దమనకా! నేను పింగళకుని శక్తి, అశక్తి(ఎలాంటివో) చూచాను. అందువల్ల ఇతణ్ణి చంపుతాను. మృగాలకు అన్నింటికీ ప్రభువును అవుతాను. నీకు మంత్రి

పదవి ఇస్తాను'. పింగళకుడును శ్రేష్ఠమైన వజ్రంతోడి దెబ్బవంటి ఆ కఠినవాక్కు విని మోహం (భ్రాంతి) పొందాడు. ఏమీ పల్కలేదు.

మూ. దమనకోఽపి తస్య తమాకారమాలోక్య చిన్తితవాన్ – 'అయం తావత్ సఞ్జీవకనిబద్ధరాగః. తన్మూనమనేన మన్త్రిణా రాజా వినాశమవాప్స్యతి' ఇతి. ఉక్తంచ–

శ్లో. ఏకం భూమిపతిః కరోతి సచివం రాజ్యే ప్రమాణం యదా
తం మోహాచ్ఛ్రియతే మదః, స చ మదాద్దాస్యేన నిర్విద్యతే.
నిర్విణ్ణస్య పదం కరోతి హృదయే తస్య స్వతన్త్రస్పృహా
స్వాతన్త్ర్యస్పృహయా తతః స నృపతేః ప్రాణేష్వభిద్రుహ్యతే. 263
తత్కిమత్ర యుక్తమ్? ఇతి.

అ. దమనకుడును అలాంటి అతని ఆకారం చూచి ఇలా ఆలోచన చేశాడు– 'ఇతనికి అయితే సంజీవకునిపై గట్టిప్రేమ ఉంది. అందుచే ఈ మంత్రివల్ల ఈ రాజు తప్పక వినాశంపొందుతాడు విజ్ఞులు ఇలా అన్నారు—

'ప్రభువు తన రాజ్యంలో ఒకనిని ప్రామాణికమైన మంత్రిగా చేస్తాడు. ఆ మంత్రికి అజ్ఞానంవల్ల అహంకారం(మదం) జనిస్తుంది. అహంకారంచే దాస్యవృత్తిని (సేవకవృత్తిని) అసహ్యించుకుంటాడు. అందువల్ల అతని హృదయంలో స్వాతంత్ర్యకాంక్ష స్థిరపడుతుంది. స్వాతంత్ర్యవాంఛచే రాజు ప్రాణాలకు ద్రోహం చేయదలుస్తాడు. (ప్రభువును చంపదలుస్తాడు).

కనుక ఈ విషయంలో ఏది సముచితం?

మూ. పిఙ్గలకోఽపి చేతనాం సమాసాద్య కథమపి తమాహ– 'సఞ్జీవకస్తావత్ ప్రాణసమో భృత్యః. స కథం మమోపరి ద్రోహబుద్ధిం కరోతి'. దమనక ఆహ– 'దేవ! భృత్యోఽభృత్య ఇత్యనైకాన్తికమేతత్. ఉక్తఞ్చ–

శ్లో. న సోఽస్తి పురుషో రాజ్ఞాం యో న కామయతే శ్రియమ్
అశక్తా ఏవ సర్వత్ర నరేంద్రం సముపాసతే. 264

అ. పింగళకుడును కష్టంమీద తెలివినంది అతనితో అన్నాడు— 'సంజీవకుడు నాకు ప్రాణతుల్యుడైన సేవకుడు. అతడు నాయెడ ద్రోహచింత ఎందుకు చేస్తాడు?' దమనకుడు అన్నాడు — 'మహారాజ, భృత్యుడు అభృత్యుడు (ప్రభువు) అనేవి శాశ్వతాలు గావు. పెద్దలు అన్నారు—

'రాజ్యలక్ష్మిని గోరని రాజసేవకుడు ఎవడూ లేడు. సర్వదా బలహీనులే రాజును సేవిస్తుంటారు.

మూ. పింగలక ఆహ— 'భద్ర, తథాఽపి మమ తస్యోపరి చిత్తవృత్తిర్న వికృతిం యాతి. అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. అనేకదోషదుష్టోఽపి కాయః కస్య న వల్లభః
కుర్వన్నపి వ్యలీకాని యః ప్రియః ప్రియ ఏవ సః. 265

అ. పింగళకుడు అన్నాడు— 'భద్ర, అయినా నాకు అతనియెడ మనస్సు మారడం లేదు. పెద్దలు దీనిని చక్కగా చెప్పారు.—

'అనేక దోషాలచే దూషితం అయినా, ఎవరికీ తనశరీరం అప్రియం గాదు. అలాగే పెక్కు తప్పులు చేస్తూ ఉన్నా ప్రేమపాత్రుడు ప్రేమపాత్రుడే అవుతాడు.

మూ. దమనక ఆహ— 'అత ఏవాయం దోషః ఉక్తఞ్చ—

శ్లో. యస్మిన్నేవాధికం చక్షురారోపయతి పార్థివః
అకులీనః కులీనో వా స శ్రియా భాజనం నరః. 266

అ. దమనకుడు అన్నాడు- 'ఇందువల్లనే ఇది దోషం, విజ్ఞులన్నారు—

ప్రభువు ఎవరిపై అధికమైన దయా దృష్టి ఉంచుతాడో, వాడు కులీనుడు అయినా కులహీనుడు అయినా లక్ష్మీపాత్రుడు అవుతాడు.

మూ. అపరం కేన గుణవిశేషేణ స్వామీ సంజీవకం నిర్గుణకమపి నికటే ధారయతి. అథ దేవ, యద్యేవం చిన్తయసి మహాకాయోఽయమ్. అనేన రిపూన్ వ్యాపాదయిష్యామి. తదస్మాన్న సిద్ధ్యతి, యతోఽయం శష్పభోజీ. దేవపాదానాం పునః శత్రవో మాంసాశినః. తద్రిపుసాధనమస్య సాహాయ్యేన న భవతి. తస్మాదేనం దూషయిత్వా హన్యతామ్' ఇతి.

అ. మరియూ ప్రభువులు ఏ గుణవిశేషం కారణంగా గుణహీనుడైన సంజీవ కుణ్ణి దగ్గర చేర్చుకున్నారు? ఒకవేళ మహారాజులవారు 'ఇతడు గొప్పశరీరం గలవాడు. ఇతని (సాయం)చే శత్రువులను చంపెదను' అని తలుస్తున్నారా! అది సిద్ధింపదు. ఏల ననగా- ఇతడు గడ్డితినేవాడు. ప్రభువుల శత్రువులు మాంసభోజనులు. అందుచేత శత్రువులను జయించడం ఇతని సాయంతో కాదు. కనుక ఇతనిపై దోషం ఆరోపించి సంహరింపండి.

మూ. పింగలక ఆహ-

శ్లో. ఉక్తో భవతి యః పూర్వం గుణవానితి సంసది
తస్య దోషో న వక్తవ్యః ప్రతిజ్ఞాభఙ్గభీరుణా. 267

అ. పింగళకుడు అన్నాడు- "ఇతడు గుణవంతుడు-' అని మొదట సభా ముఖంగా అన్నచో ప్రతిజ్ఞాభంగభయంతో తర్వాత అతనిదోషం ఎన్నరాదు.

మూ. అన్యచ్చ. మయాస్య తవ వచనేనాభయప్రదానం దత్తమ్ తత్కథం స్వయమేవ వ్యాపాదయామి? సర్వథాసంజీవకోఽయం సుహృదస్మాకమ్ న చ తం ప్రతి కశ్చిన్మన్యురితి. ఉక్తం చ-

శ్లో. ఇతః స దైత్యః ప్రాప్తశ్రీర్నేత ఏవార్హతి క్షయమ్.
విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తుమసాంప్రతమ్. 268

అ. మరియూ, నేను నీమాటచే అతనికి అభయదానం చేశాను. అలాంటప్పుడు స్వయంగా ఎలా చంపగలను? ఇతడు అన్నివిధాలా మాకు మిత్రుడు. అతనిలో ఏదోషం లేదు. విజ్ఞులన్నారు—

ఈ తారకాసురుడు నావలన సంపద పొందాడు. నావలననే నాశం పొందడం అర్హం కాదు. విషవృక్షాన్ని అయినా స్వయంగా పెంచినదాన్ని స్వయంగా నరకడం అర్హంగాదు.

శ్లో. ఆదౌ న వా ప్రణయినాం ప్రణయో విధేయో
దత్తోఽథవా ప్రతిదినం పరిపోషణీయః.
ఉత్క్షిప్య యత్క్షిపతి తత్ప్రకరోతి లజ్జాం
భూమౌ స్థితస్య పతనాద్భయమేవ నాస్తి. 269

ఆ: మొదట ప్రేమికులను (తన్ను ప్రేమించువారిని) ప్రేమించకయే ఉండాలి. ఒకవేళ ప్రేమించితిమా దానిని (ప్రేమను) ప్రతిదినం పోషించాలి. పైకెత్తి కిందికి పడవేయటం లజ్జాకరం. భూమిమీద ఉండేవానికి 'క్రింద పడెదను' అనే భయం లేదు.

శ్లో. ఉపకారిషు యః సాధుః సాధుత్వే తస్య కో గుణః
అపకారిషు యః సాధుః స సాధుః సద్భిరుచ్యతే. 270

తన్ ద్రోహబుద్ధేరపి మయాఽస్య న విరుద్ధమాచరణీయమ్'.

ఆ. మేలుచేసినవానికీ మేలుచేయడంలో గొప్పతనం ఏమి ఉంది? కీడు చేసినవానికి మేలుచేసేవాడే ఉత్తముడుగా పెద్దలచే తలంపబడును. కనుక అతడు ద్రోహబుద్ధితోఉన్నా నేను విరుద్ధంగా ఆచరించరాదు.

మూ. దమనక ఆహ— 'స్వామిన్, నైష రాజధర్మో, యద్ద్రోహబుద్ధిరపి క్షమ్యతే. ఉక్తఞ్చ—

శ్లో. తుల్యార్థం తుల్యసామర్థ్యం మర్మజ్ఞం వ్యవసాయినమ్
అర్ధరాజ్యహరం భృత్యం యో న హన్యాత్ స హన్యతే. 271

ఆ. దమనకుడు అన్నాడు— ప్రభూ! ద్రోహిని సైతం క్షమించడం అనేది రాజధర్మం కాదు. విజ్ఞులు అన్నారు—

ప్రభువు అయినవాడు సాటి ధనికుణ్ణి-సాటి బలవంతుణ్ణి-తన రహస్యాలు తెలిసినవాణ్ణి-కార్యకుశలుణ్ణి-అర్ధరాజ్యం హరించిన సేవకుణ్ణి-(ఉపేక్షించక) సంహరించాలి. లేనిచో వానిచే చచ్చును.

మూ. అపరం త్వయాఽస్య సఖిత్వాత్ సర్వోఽపి రాజధర్మః పరిత్యక్తః. రాజధర్మాభావాత్ సర్వోఽపి పరిజనో విరక్తిం గతః. యః సంజీవకః శష్పభోజీ, భవాన్ మాంసాదః తవ ప్రకృతయశ్చ. యత్తావత్త్వం వధవ్యవసాయబాహ్యః కుతస్తాసాం మాంసాశనమ్. యత్తద్రహితాస్తాస్త్వాం త్యక్త్వా యాస్యన్తి. తతోఽపి వినష్ట ఏవ. అన్యసంగత్యా పునస్తే న కదాచిదాఖేటకే మతిర్భవిష్యతి. ఉక్తం చ—

శ్లో. యాదృశైః సేవ్యతే భృత్యైర్యాదృశాంశ్చోపసేవతే
కదాచిన్నాత్ర సన్దేహస్తాదృగ్భవతి పూరుషః. 272

అ. మరియూ ఇతని మైత్రిచే మీరు రాజధర్మాన్ని పూర్తిగా వదిలివేశారు. రాజధర్మం లేనందున పరిజనం అంతా విరక్తిని పొందింది. ఈ సంజీవకుడు గడ్డి తినేవాడు, తాము తన పరివారం మాంసభోజనులు. తాము జంతుహింస మానివేస్తే వారికి మాంసాహారం ఎలా లభిస్తుంది? అది (మాంసం) లభింపకపోవడంతో వారు మిమ్ము వదిలిపోతున్నారు. అందువల్లా మీరు నష్టాన్నే పొందారు. ఇతని స్నేహంచే ఒకానొకప్పుడైనా వేటమీదికి మీ మనస్సు పోవడం లేదు. పెద్దలు అన్నారు—

పురుషుడు ఎలాంటి సేవకులచే సేవింపబడుతాడో ఎలాంటి వారిని సేవిస్తాడో, (మైత్రి చేస్తాడో) అలాంటివాడే అగును. ఇందు ఏవిధమైన సందేహం లేదు.

మూ. తథా చ—

శ్లో. సన్తప్తాయసి సంస్థితస్య పయసో నామాపి న జ్ఞాయతే
ముక్తాకారతయా తదేవ నలినీపత్రస్థితం రాజతే.
స్వాతౌ సాగరశుక్తికుక్షిపతితం తజ్జాయతే మౌక్తికం
ప్రాయేణాధమమధ్యమోత్తమగుణః సంవాసతో జాయతే. 273

అ. అటులనే మిక్కిలి కాలిన ఇనుముపైపడిన నీరు నామమాత్రానికి ఉండదు. ఆ నీరే తామరాకుపై ఉన్నదై ముత్యంవలె విరాజిల్లుతుంది. అది (నీరు) స్వాతికార్తియందు సముద్రంలో ముత్తెపుచిప్పపొట్టలో పడినదై ముత్యంగా మారుతుంది. సామాన్యంగా సహవాసంవల్ల నీచ— మధ్యమ— ఉత్తమగుణాలు గల్గుతుంటాయి.

మూ. తథా చ—

శ్లో. అసతాం సంగదోషేణ సాధవో యాన్తి విక్రియామ్
దుర్యోధనప్రసంగేన భీష్మో గోహరణే గతః. 274

అ మరియూ— దుష్టజనస్నేహదోషంచే సజ్జనులున్నూ చెడిపోతారు. దుర్యోధనుని సహవాసంచే భీష్ముడు గోవుల దొంగిలింప వెళ్లాడు.

మూ. అత ఏవ సన్తో నీచసఙ్గం వర్జయంతి. ఉక్తం చ—

శ్లో. న హ్యావిజ్ఞాతశీలస్య ప్రదాతవ్యః ప్రతిశ్రయః
మత్కుణస్య చ దోషేణ హతా మన్దవిసర్పిణీ. 275

పింగలక ఆహ– 'కథమేతత్? సోఽబ్రవీత్–

అ. అందువలననే సజ్జనులు నీచస్నేహం వదలివేస్తారు. పెద్దలు ఇలా అన్నారు– స్వభావం తెలియక (ఎవరికీ) ఆశ్రయం ఇవ్వరాదు. [అలాఇచ్చి] నల్లిదోషంచే మన్దవిసర్పిణి అనేపేను చంపబడింది' పింగళకుడు అడిగాడు– ఇది ఎట్లు? అతడు ఇలా చెప్పాడు–

## కథా–9

## మన్దవిసర్పిణీ-మత్కుణ-కథా

మూ. అస్తి కస్యచిన్మహీపతేః కస్మింశ్చిత్స్థానే మనోరమం శయనస్థానమ్. తత్ర శుక్లతరపటయుగలమధ్యసంస్థితా మన్దవిసర్పిణీ నామ శ్వేతా యుకా ప్రతివసతి స్మ. సా చ తస్య మహీపతే రక్తమాస్వాదయంతీ, సుఖేన కాలం నయమానా తిష్ఠతి. అన్యేద్యుశ్చ తత్ర శయనే బ్రామ్యన్నగ్నిముఖో నామ మత్కుణః సమాయాతః. అథ తం దృష్ట్వా సా విషణ్ణవదనా ప్రోవాచ– 'భో అగ్నిముఖ, కుతస్త్వమత్రానుచితస్థానే సమాయాతః. తద్యావన్న కశ్చిద్వేత్తి తావచ్ఛీఘ్రం గమ్యతామ్' ఇతి.

అ. ఒకానొక రాజునకు ఒకానొకచోట అందమైన శయనమందిరం ఉంది. అచ్చట మిక్కిలి తెల్లనైన దుప్పటి (వస్త్రయుగలం) నడుమచేరి మందవిసర్పిణి అనే తెల్లని పేను (ఈపి) నివసిస్తూ ఉండేది. అది ఆ రాజు రక్తం త్రాగుచూ సుఖంగా కాలం గడుపుతుంది. ఒకదినాన (ఎచ్చటనుంచియో) తిరుగుచూ ఆ శయనగృహానికి అగ్నిముఖుడు అనే నల్లి వచ్చింది. అంత దానిని చూచి విషాదంతో అది (పేను) ఇలా అంది– ఎందుకు నీవు ఇచ్చటికి (నీకు) తగని చోటుకు వచ్చావు? కనుక ఎవరును ఏమియు అనకముందే [ఎవరు చూడకముందే] శీఘ్రంగా పొమ్ము.

మూ. స ఆహ– 'భగవతి, గృహాగతస్యాసాధోరపి నైతద్యుజ్యతే. ఉక్తఞ్చ–

శ్లో. ఏహ్యాగచ్ఛ సమాశ్రయాఽసనమిదం కస్మాచ్చిరం దృశ్యసే
కా వార్తా న్వతిదుర్బలోఽసి కుశలం ప్రీతోఽస్మి తే దర్శనాత్।
ఏవం నీచజనేఽపి యుజ్యతి గృహే ప్రాప్తే సతాం సర్వదా
ధర్మోఽయం గృహమేధినాం నిగదితః స్మార్తైర్లఘుః స్వర్గదః॥

అ. అతడు (అగ్నిముఖుడు) అన్నాడు- ఓ పూజ్యురాలా, ఇంటికి వచ్చిన మనిషి విషయంలోను ఇలా పలకడం ఉచితంగాదు. పెద్దలు అన్నారు—

రండి, దయచేయ్యండి, విశ్రాంతి తీసికొనండి. ఇదిగో ఆసనం (కూర్చోండి). ఎందుచేత చాలాకాలానికి కనబడినారు? విషయం ఏమి? మిక్కిలి దుర్బలంగా ఉన్నారు. కుశలమా! మీ దర్శనంచేత సంతోషం పొందాను.'— ఇలా వ్యవహారం తమ ఇంటికి వచ్చిన నీచుల విషయంలోనూ సజ్జనులు చేస్తుంటారు. ఇది గృహస్థులకు ధర్మశాస్త్ర బోధితం అయిన ధర్మం— అల్పంగా ఉన్నా స్వర్గసుఖదాయకం.

మూ. అపరం మయానేకమానుషాణామనేకవిధాని రుధిరాణ్యాస్వాదితాని, ఆహారదోషాత్ కటు-తిక్త-కషాయ-రసాస్వాదాని, న చ మయా కదాచిన్మధుర రక్తం సమాస్వాదితమ్. తద్యది త్వం ప్రసాదం కరోషి, తదస్య నృపతేర్వివిధ వ్యంజనాన్నపానచోష్యలేహ్యస్వాద్వాహారవశాదస్య శరీరే యన్మిష్టం రక్తం సంజాతమ్, తదాస్వాదనేన సౌఖ్యం సమ్పాదయామి జిహ్వయా ఇతి. ఉక్తం చ—

శ్లో. రఙ్కస్య నృపతేర్వాపి జిహ్వాసౌఖ్యం సమం స్మృతమ్
తన్మాత్రం చ స్మృతం సారం యదర్థం యతతే జనః॥ 277

అ. మరియు నేను అనేకమానవుల అనేకవిధాలైన రక్తాలను ఆస్వాదించాను. వారిలో ఆహారదోషంవల్ల చేదు- కారం- వగరు- వులుపు- రసాలను ఆస్వాదన చేశాను. మధురరసం ఆస్వాదించలేదు. ఈ రాజరక్తం బహువిధాలైన కూరలతోడి అన్నపానీయాలవల్లా, ఇతర రుచ్యములైన చోష్యలేహ్యాదిక— ఆహారంవల్లా జనించడంతో మధురమైంది. నీవు అనుగ్రహిస్తే దాన్ని ఆస్వాదించి, నాలుకసుఖం అనుభవిస్తాను. పెద్దలన్నారు—

బీదవానికీ మహారాజునకూ నాలుకసుఖం సమానం. సంసార (జీవిత) సారం నాలుకసుఖమే. అన్నట్లు మానవుడు అందుకై (నాలుకసుఖానికై) యత్నిస్తున్నాడు.

శ్లో. యద్యేవం న భవేల్లోకే కర్మ జిహ్వాప్రతుష్టిదమ్
తన్న భృత్యో భవేత్కశ్చిత్ కస్యచిద్వశగోఽథవా. 278

శ్లో. యదసత్యం వదేన్మర్త్యో యద్వాఽసేవ్యాంశ్చ సేవతే
యద్గచ్ఛతి విదేశఞ్చ తత్సర్వముదరార్థతః. 279

తన్మయా గృహాగతేన బుభుక్షయా పీడ్యమానేన త్వత్సకాశాత్ భోజనమర్థనీయమ్. తన్న త్వయైకాకిన్యాఽస్య భూపతే రక్తభోజనం కర్తుం యుజ్యతే.

అ. ఈ సంసారం (ప్రపంచం)లోని పనులు అన్నీ ఇలా నాల్కను సంతుష్టి పఱచడానికి ఏర్పడినవే. అలాకానిచో ఎవడూ సేవకుడుగా ఉండడు. ఎవరికీ లోబడి ఉండడు.

మానవుడు అసత్యం పల్కడం. అధముణ్ణి (అసేవ్యుణ్ణి) సేవించడం విదేశం వెళ్లడం- ఇదంతా పొట్టకొఱకే.

అందువల్ల ఆకలిచే బాధపడుచూ నేను నీ ఇంటికి వచ్చాను- నీనుండి భోజనం అర్థించాను- నీవు ఒక్కదానివే ఈ రాజరక్తం ఆరగించడం సముచితంగాదు.

మూ. తచ్ఛ్రుత్వా మన్దవిసర్పిణ్యాహ— "భో మత్కుణ, అహమస్య నృపతేర్నిద్రావశం గతస్య రక్తమాస్వాదయామి. పునస్త్వమగ్నిముఖశ్చపలశ్చ. తద్యది మయా సహ రక్తపానం కరోషి తత్తిష్ఠ. అభీష్టతరం రక్తమాస్వాదయ". సోఽబ్రవీత్— "భగవతి, ఏవం కరిష్యామి యావత్త్వం నాస్వాదయసి నృపరక్తమ్, తావన్మమ దేవగురుకృతః శపథః స్యాత్, యది తదాస్వాదయామి". ఏవం తయోః పరస్పరం వదతోః స రాజా తచ్ఛయనమాసాద్య ప్రసుప్తః.

అ. దానిని విని, మందవిసర్పిణి ఇలా అంది— "ఓ నల్లీ, నేను ఈ రాజు గాఢ నిద్రను పొందిన తర్వాత రక్తం ఆస్వాదిస్తాను. నీవో అగ్నిముఖుడవు— చపలుడవు. నాతో పాటు రక్తపానం చేయుదువేని ఉండుము— కోరినంత రక్తం త్రాగుము. అతడు (అగ్నిముఖుడు) అన్నాడు— పూజ్యురాలా, అలాగే చేస్తాను. (దేవ) గురువుసాక్షిగా

నీవు రాజరక్తం త్రాగిన తర్వాతనే నేను త్రాగుతాను' ఇలా ఆరెండు పరస్పరం సంభాషిస్తూ ఉండగా ఆ రాజు పక్కను చేరాడు. శయనించాడు.

మూ. అథాసౌ మత్కుణో జిహ్వా-లౌల్య-ప్రకృష్టౌత్సుక్యాజ్జాగ్రత మపి తం మహీపతిమదశత్. అథవా సాధ్విదముచ్యతే-

శ్లో. స్వభావో నోపదేశేన శక్యతే కర్తుమన్యథా
సుతప్తమపి పానీయం పునర్గచ్ఛతి శీతతామ్. 280

శ్లో. యదిస్యాచ్ఛీతలో వహ్నిః శీతాంశుర్దహనాత్మకః
న స్వభావోఽత్ర మర్త్యానాం శక్యతే కర్తుమన్యథా. 281

అ. అంత ఆ నల్లి నాల్కచాపల్యం వలని మిక్కిలి తొందరపాటుతో మేల్కొని ఉండగానే ఆ రాజును కఱచింది. పెద్దలు ఇలా చక్కగా చెప్పారు—

ఉపదేశంచే స్వభావాన్ని మార్చడం సాధ్యం గాదు. బాగుగా కాగిన నీరైనా మరలా (కొంత సేపటికి) చల్లబడుతుంది.

అగ్ని చల్లబడవచ్చు. చంద్రుడు, నిప్పులు(గక్కి) కాల్చువాడు కావచ్చు. కానీ మానవుల స్వభావాన్ని మార్చడం సాధ్యం గాదు.

మూ. అథాసౌ మహీపతిః సూచ్యగ్రవిద్ధ ఇవ తచ్ఛయనం త్యక్త్వా తత్క్షణాదేవోత్థితః— 'అహో, జ్ఞాయతామత్ర ప్రచ్ఛాదనపటే మత్కుణో యూకా వా నూనం తిష్ఠతి యేనాహం దష్టః' ఇతి (సేవకాన్ ప్రాహ). అథ యే కఞ్చుకిన స్తత్ర స్థితా స్తే ప్రచ్ఛాదనపటం గృహీత్వా సూక్ష్మదృష్ట్యా వీక్షాంచక్రుః. అత్రాన్తరే స మత్కుణశ్చాపల్యాత్ ఖట్వాన్తం ప్రవిష్టః. సా మన్దవిసర్పిణ్యపి వస్త్రసన్ధ్యన్తర్గతా తైర్దృష్టా, వ్యాపాదితా చ. అతోఽహం బ్రవీమి— 'న హ్యవిజ్ఞాతశీలస్య' ఇతి. ఏవం జ్ఞాత్వా త్వయైష వధ్యః. నోచేత్త్వాం వ్యాపాదయిష్యతి. ఉక్తఞ్చ—

శ్లో. త్యక్తాశ్చాభ్యన్తరా యేన బాహ్యాశ్చాభ్యన్తరీకృతాః
స ఏవ మృత్యుమాప్నోతి యథా రాజా కకుద్ద్రుమః. 282

విజ్ఞలక ఆహ– 'కథమేతత్ ?' సోఽబ్రవీత్—

అ. అప్పుడు ఆ భూపాలుడు సూదిమొనతో గ్రుచ్చబడినవాడువలె పడకను వదలి దిగ్గున లేచాడు. (సేవకులతో అన్నాడు) 'ఓరీ, ఈ దుప్పటిలో చూడండి. నల్లియో పేనో తప్పక ఉంది. అది నన్ను కఱచింది' వెంటనే అచ్చటఉండే కంచుకులు ఆ దుప్పటిని తీసికున్నారు. సూక్ష్మంగా చూచారు. ఈ లోపల ఆ నల్లి త్వరగా మంచం లోనికి దూరింది. ఆ మందవిసర్పిణిమాత్రం (పేను) వస్త్రంసందున వారికి కనబడింది. చంపబడింది. ఇందువల్ల నేను తెలుపుచున్నాను– 'న హ్యవిజ్ఞాతశీలస్య–' (శీలం తెలియని వానికి) ఇత్యాది. దీనిని తెలిసికొని మీరు ఇతణ్ణి (సంజీవకుణ్ణి) వధించాలి. లేనిచో (అతడు) మిమ్ములను సంహరిస్తాడు. విజ్ఞులు ఇలా అన్నారు—

ఎవడు అంతరంగికులను వదలిపేస్తాడో, బయటవారిని అంతరంగికులను చేసికుంటాడో, వాడు ప్రభువైన కకుద్ద్రుమునివలె మరణిస్తాడు.

పింగళకుడు అడిగాడు– 'అది ఎట్లు?' అతడు (దమనకుడు)ఇలాచెప్పాడు-

## కథా–10

## చణ్డరవశృగాల-కథా

మూ. కస్మింశ్చిద్వనప్రదేశే చణ్డరవో నామ శృగాలః ప్రతివసతి స్మ. స కదాచిత్ క్షుధావిష్టో జిహ్వాలౌల్యాన్నగరాన్తరే ప్రవిష్టః. అథ తం నగరవాసినః సారమేయా అవలోక్య సర్వతః శబ్దాయమానాః పరిధావ్య తీక్ష్ణదంష్ట్రాగ్రై ర్భక్షితుమారబ్ధాః. సోఽపి తై ర్భక్ష్యమాణః ప్రాణభయాత్ ప్రత్యాసన్నరజక గృహం ప్రవిష్టః. తత్ర చ నీలీరసపూర్ణమహాభాణ్డం సజ్జీకృతమాసీత్. తత్ర చ సారమేయైరాక్రాన్తో భాణ్డమధ్యే పతితః. అథ యావన్నిష్క్రాన్తస్తావన్నీలవర్ణః సఞ్జాతః. తత్రాపరే సారమేయాస్తం శృగాలమజానన్తో యథాభీష్టదిశం జగ్ముః.

అ. ఒకానొక అడవిలో చండరవుడు అనే నక్క నివసిస్తూ ఉండేది. అది ఒకనాడు ఆకలిచే బాధపడుచూ నాల్కచాపల్యంచే నగరంలో జొరబడింది. అప్పుడు నగరంలో ఉండే కుక్కలు దాన్ని చూచాయి. నలువైపులా మొఱుగుచూ వెంబడించాయి. తమ పదునైన కోరలతో కఱువసాగాయి. అది వాటిచే కఱుపబడుచూ ప్రాణభయంతో

దగ్గరలో ఉండే చాకలి ఇంటిలోనికి దూరింది. అచ్చట నీలిరంగుతో నిండిన పెద్దతొట్టి సిద్ధంగా ఉండేంది. అక్కడను కుక్కలు వెంబడింపగా తొట్టినడుమ పడింది.(తొట్టినుండి) వెలుపలికి రాగానే నీలివర్ణం అయింది. అప్పుడు ఆ కుక్కలు దాన్ని నక్కగా దలంపక తోచిన దిక్కున వెళ్లాయి.

మూ. చండరవోఽపి దూరతరం ప్రదేశమాసాద్య కాననాభిముఖః ప్రతస్థే. న చ నీలవర్ణేన కదాచిన్నిజరఙ్గస్త్యజ్యతే. ఉక్తం చ—

శ్లో. వజ్రలేపస్య మూర్ఖస్య నారీణాం కర్కటస్య చ
ఏకో గ్రహస్తు మీనానాం నీలీమద్యపయోర్యథా. 283

ఆ. చండరవుడును చాలాదూరంపోయి అడవిలోనికి వెళ్లాడు. నీలవర్ణం (నల్లరంగు) తనరంగు వదలదు. విజ్ఞులన్నారు—

వజ్రలేపం (వజ్రంపూత), మూర్ఖుడు, స్త్రీలు, ఎండ్రకాయ, చేపలు, నీలవర్ణం, త్రాగుబోతు వీరు తమ గుణాలను వీడరు.

మూ. అథ తం హర-గల-గరల-తమాల సమప్రభమపూర్వం సత్త్వమవలోక్య సర్వే సింహ-వ్యాఘ్ర-ద్వీపి-వృక ప్రభృతయోఽరణ్యనివాసినో భయవ్యాకులచిత్తాః సమన్తాత్ పలాయనక్రియాం కుర్వన్తి కథయన్తి చ 'న జ్ఞాయతేఽస్య కీదృగ్విచేష్టితం పౌరుషఞ్చ. తద్దూరతరం గచ్ఛామః. ఉక్తఞ్చ—

శ్లో. న యస్య చేష్టితం విద్యాన్న కులం న పరాక్రమమ్
న తస్య విశ్వసేత్ ప్రాజ్ఞో యదీచ్ఛేచ్ఛ్రియమాత్మనః. 284

ఆ. అంత శివునికంఠంలోని విషంతోడను కానుగుచెట్టుతో సమానమైన (నల్లని)కాంతిగల ఈ నూతనప్రాణిని, అడవిలో నివసించే సింహాలు పెద్దపులులు చిఱుతపులులు తోడేళ్లు మొదలైనవి అన్నీ చూచాయి. భయంచే కలతచెందాయి. నలువైపులా పరుగెత్తసాగాయి. ఇలా చెప్పుకొనదొడగాయి. 'దీని చేష్టితం (వర్తన) పౌరుషం ఎలాంటివో తెలియవు. కనుక మిక్కిలి దూరంగా పోదాము. విజ్ఞులు ఇలా అన్నారు—

ఎవరి ప్రవర్తన, కులం, పరాక్రమం తెలియవో, వానిని, తన శ్రేయస్సు కోరే ప్రాజ్ఞుడు నమ్మరాదు.

మూ. చండరవోఽపి తాన్ భయవ్యాకులితాన్ విజ్ఞాయేదమాహ- భో భోః శ్వాపదాః? కిం యూయం మాం దృష్ట్వైవ సంత్రస్తా వ్రజథ. తన్న భేతవ్యమ్. అహం బ్రహ్మణాఽద్య స్వయమేవ సృష్ట్వాఽభిహితః- 'యచ్ఛ్వాపదానాం మధ్యే కశ్చిద్రాజా నాస్తి. తత్త్వం మయాద్య సర్వశ్వాపదప్రభుత్వేఽభిషిక్తః కకుద్ద్రుమాభిధః. తతో గత్వా క్షితితలే తాన్ సర్వాన్ పాలయ' ఇతి. తతోఽహమత్రాగతః. తన్మమ ఛత్రచ్ఛాయాయాం సర్వైరేవ శ్వాపదైర్వర్తితవ్యమ్. అహం కకుద్ద్రుమో నామ రాజా త్రైలోక్యేఽపి సఞ్జాతః'.

అ. చండరవుడును ఆ మృగాలు భయంచే కలతజెందడం గ్రహించి ఇలా అన్నాడు- 'ఓఓ జంతువులారా! నన్ను చూడగానే భయపడి మీరు ఎందుకు పరుగెత్తెదరు? అలా భయపడకుడు. నేడు బ్రహ్మ, నన్ను స్వయంగా సృష్టించి ఇలా చెప్పాడు- 'జంతువులకు ప్రభువు ఎవడును లేడు. అందుచే నేడు నిన్ను సర్వజంతువులకు ప్రభువుగా అభిషేకించాను. నీపేరు కకుద్ద్రుముడు. కనుక భూలోకానికి పోయి వాటిని అన్నింటిని పరిపాలింపుము.' అందుచే నేను ఇచ్చటికి వచ్చాను. కనుక నా గొడుగు నీడలో (అధికారంలో) జంతువులన్నీ ఉండాలి. కకుద్ద్రుముడు అనే నేను ముల్లోకాలకు ప్రభువును అయ్యాను.

మూ. తచ్ఛ్రుత్వా సింహవ్యాఘ్రపురస్సరాః శ్వాపదాః 'స్వామిన్ ప్రభో, సమాదిశ'- ఇతి వదన్తస్తం పరివవ్రుః. అథ తేన సింహస్యామాత్యపదవీ ప్రదత్తా. వ్యాఘ్రస్య శయ్యాపాలనత్వమ్. ద్వీపినస్తామ్బూలాధికారః. వృకస్య ద్వారపాలకత్వమ్. యే చాత్మీయాస్తైః సహాలాపమాత్రమపి న కరోతి. శృగాలాః సర్వేఽప్యర్ధచన్ద్రం దత్త్వా నిస్సారితాః. ఏవం తస్య రాజ్యక్రియాయాం వర్తమానస్య తే సింహాదయో మృగాన్ వ్యాపాద్య తత్పురతః ప్రక్షిపన్తి. సోఽపి ప్రభుధర్మేణ సర్వేషాం తాన్ ప్రవిభజ్య ప్రయచ్ఛతి.

అ. దానిని విని సింహాలు పులులు మొదలైన జంతువులు- స్వామీ, ప్రభూ. ఆజ్ఞాపించండి,- అని పల్కుచూ దాని చుట్టూ చేరాయి. అంత అది సింహానికి మంత్రి పదవిని- పెద్దపులికి శయ్యాపాలనం- చిరుతపులికి తాంబూలం అందివ్వడం- తోడే

లుకు ద్వారపాలకత్వం ఇలా అధికారాలు ఇచ్చింది. తన కులంవారితో మాట్లాడడం సైతం మానివేసింది. నక్కలన్నీ అర్ధచంద్రప్రయోగంచే (మెడపట్టి) గెంటివేయబడి నాయి. ఇలా అతడు రాజ్యపాలన చేస్తుండగా సింహాలు మొదలైనవి మృగాలను (వేటాడి) చంపి తెచ్చి అతని ముందు ఉంచేవి. అతడు వాటిని ప్రభు ధర్మంగా విభజించి అన్నింటికీ పంచిపెట్టేవాడు.

మూ. ఏవం గచ్ఛతి కాలే కదాచిత్తేన సమాగతేన దూరదేశే శబ్దాయమానస్య శృగాలబృన్దస్య కోలాహలోఽశ్రావి. తం శబ్దం శ్రుత్వా పులకితతనురానన్దాశ్రుపరిపూర్ణ నయన ఉత్థాయ తారస్వరేణ విరోతుమారబ్ధవాన్. అథ తే సింహాదయస్తం తారస్వరమాకర్ణ్య శృగాలోఽయమితి మత్వా సలజ్జమధోముఖాః క్షణమేకం స్థిత్వా మిథః ప్రోచుః 'భోః వాహితా వయమనేన క్షుద్ర శృగాలేన. తద్వధ్యతామ్– ఇతి. సోఽపి తదాకర్ణ్య పలాయితుమిచ్ఛంస్తత్ర స్థాన ఏవ సింహాదిభిః ఖణ్డశః కృతో మృతశ్చ. అతోఽహం బ్రవీమి–(త్యక్తాశ్చాభ్యన్తరా యేన'– ఇతి.

అ. ఇలా కొంతకాలం గడిచింది. ఒకనాడు అది సభలో ఉండగా దూర ప్రాంతాన నక్కలగుంపు అఱవడం వినబడింది. ఆ శబ్దంవిని అది [నక్క] పులకరించిపోయింది, కన్నుల ఆనందాశ్రువులు నిండాయి, లేచి తారస్వరంతో [బిగ్గరగా] అఱువసాగింది. అంత సింహంమొదలైనవి ఆ తారస్వరం విన్నాయి. 'ఇది నక్క' అని తలంచాయి. సిగ్గుతో క్షణకాలం తలలు వాల్చాయి. పిమ్మట తమలోతాము ఇలా చెప్పుకున్నాయి. 'ఈ క్షుద్రమైన నక్క మనలను సేవకుల జేసింది. కనుక వధించాలి' నక్కయు దానిని వినిందీ. పాఱిపోదలంచింది. కాని అచ్చటనే సింహం మొదలైన వాటిచే ముక్కలు ముక్కలుగా చేయబడి చచ్చింది, అందుచే నేను ఇలా చెప్పుచున్నాను త్యక్తాశ్చాభ్యన్తరా యేన (ఎవడు అంతరంగికులను విడుచునో) ఇత్యాది.

మూ. తదాకర్ణ్య పింగలక ఆహ– 'భో దమనక కః ప్రత్యయోఽత్ర విషయే యత్సమమోపరి దుష్టబుద్ధిః'. స ఆహ'యదద్య మమాగ్రే–తేన నిశ్చయః కృతో యత్ ప్రభాతే పింగలకం వధిష్యామి. తదత్రైవ ప్రత్యయః. ప్రభాతేఽవసరవేలాయామారక్తముఖనయనః స్ఫురితాధరో దిశోఽవలోకయన్ననుచిత

స్థానోపవిష్టస్త్వాం క్రూరదృష్ట్యా విలోకయిష్యతి. ఏవం జ్ఞాత్వా యదుచితం తత్కర్తవ్యమ్.

అ. దానిని విని పింగళకుడు అన్నాడు—అతడు నా విషయంలో ద్రోహబుద్ధి అని ఎలా నమ్మడం' ? దమనకుడు చెప్పాడు— నేడు నాముందు అతడు- (రేపు) ఉదయం పింగళకుణ్ణి వధిస్తాను'- అని నిశ్చయం చేశాడు. అదే ఇందు ప్రమాణం. (రేపు) ఉదయం మీ దగ్గరకు వచ్చేటప్పటికి నోరు, కన్నులు ఎఱ్ఱగా ఉంటాయి. పెదవులు చలిస్తుంటాయి. నలుదెసల చూస్తూ అనుచిత స్థానంలో కూర్చుంటాడు మిమ్ము క్రూర దృష్టితో చూస్తాడు. ఈ లక్షణాలు తెలిసికొని తగినవిధంగా చేయండి.

మూ. ఇతి కథయిత్వా సంజీవకసకాశం గతః. తం ప్రణమ్యోపవిష్టః సంజీవకోఽపి సోద్వేగాకారం మన్దగత్యా సమాయాన్తం తముద్వీక్ష్య సాదరతర మువాచ— 'భో మిత్ర, స్వాగతం. చిరాద్ దృష్టోఽసి. అపి శివం భవతః? తత్కథయ, యేనాదేయమపి తుభ్యం గృహాగతాయ ప్రయచ్ఛామి. ఉక్తఞ్చ—

శ్లో. తే ధన్యాస్తే వివేకజ్ఞాస్తే సభ్యా ఇహ భూతలే
ఆగచ్ఛన్తి గృహే యేషాం కార్యార్థం సుహృదో జనాః. 285

అ. ఇట్లుపలికి సంజీవకుని దగ్గరకు వెళ్లాడు. అతనికి ప్రణమిల్లి కూర్చున్నాడు. సంజీవకుడును కంగారుతో ఉండే అతని (దమనకుని) ఆకారం మెల్లగా రావడం చూచాడు. మిక్కిలి ఆదరంగా ఇలా అన్నాడు— 'ఓ మిత్రమా ! స్వాగతం చాలా కాలానికి కనబడ్డారు. తాము క్షేమమా ? చెప్పండి. ఇంటికివచ్చిన మీకు ఇవ్వ కూడనిది అయినా ఇస్తాను. పెద్దలు ఇలా అన్నారు—

ఎవరి ఇంటికి పనిమీద మిత్రులు వస్తుంటారో, వారే ఈ భూతలంలో ధన్యులు. వివేకజ్ఞానులు సభ్యులు (అనబడుదురు)

మూ. దమనక ఆహ— 'భోః కథం శివం సేవకజనస్య?

శ్లో. సమ్పత్తయః పరాయత్తాః సదా చిత్తమనిర్వృతమ్
స్వజీవితేఽప్యవిశ్వాసస్తేషాం యే రాజసేవకాః. 286

అ. దమనకుడు ఇలా అన్నాడు— 'అయ్యా! సేవకజనానికి కళలం

ఎక్కడిది? రాజసేవకులకు సంపదలు పరాధీనాలు. చిత్తం శాంతిరహితం,జీవితంసైతం నమ్మకంలేనిది.

మూ. తథా చ-

శ్లో. సేవయా ధనమిచ్ఛద్భిః సేవకైః పశ్య యత్కృతమ్
స్వాతన్త్ర్యం యచ్ఛరీరస్య మూఢైస్తదపి హారితమ్. 287

అ. సేవావృత్తిద్వారా ధనంకోరే సేవకులు చేసేది ఏమిటో చూడుము. ఈ మూర్ఖులు శరీరానికి ఉండే స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకున్నారు.

శ్లో. తావజ్జన్మాతిదుఃఖాయ తతో దుర్గతతా సదా
తత్రాపి సేవయా వృత్తిరహో దుఃఖపరమ్పరా. 288

అ. పుట్టుకయే అధికదుఃఖానికి సంభవిస్తుంది. అందులో దరిద్రత, ఆ మీదట సేవావృత్తి. అయ్యో! దుఃఖపరంపర.

శ్లో. జీవన్తోఽపి మృతాః పఞ్చ శ్రూయన్తే కిల భారతే
దరిద్రో వ్యాధితో మూర్ఖః ప్రవాసీ నిత్యసేవకః. 289

అ. మహాభారతంలో ఈ అయిదుగురు బ్రతికి ఉన్నా చచ్చిన వారితో సమానంగా తెలుపబడినారు. వారెవరు అనగా 1. దరిద్రుడు, 2. రోగి, 3. మూర్ఖుడు 4. దేశాంతరనివాసీ, 5. నిత్యసేవకుడు.

శ్లో. నాశ్నాతి స్వేచ్ఛయౌత్సుక్యాద్వినిద్రోఽపి ప్రబుధ్యతే
స నిఃశఙ్కం వచో బ్రూతే సేవకోఽప్యత్ర జీవతి. 290

అ. సేవకుడు ఇష్టంఉన్నా ఉత్సాహంతో తినలేడు. పూర్తిగా నిద్రించక ముందే మేల్కొలుపబడుతాడు. నిర్భయంగా (నిస్సంకోచంగా) మాట్లాడజాలడు. అయినా జీవిస్తూనే ఉన్నాడు.

శ్లో. సేవా శ్వవృత్తిరాఖ్యాతా యైస్తైర్మిథ్యాప్రజల్పితమ్
స్వచ్ఛన్దం చరతి శ్వాత్ర సేవకః పరశాసనాత్. 291

అ. సేవావృత్తిని కుక్కజీవితంతో సమానంగా కొందరు అన్నారు. కాని అది మిథ్య(అసత్యం). కుక్క స్వేచ్ఛగా తిరుగుతుంది. సేవకుడు యజమాని

ఆజ్ఞప్రకారం సంచరిస్తాడు.

శ్లో. భూశయ్యా బ్రహచర్యం చ కృశత్వం లఘుభోజనమ్
సేవకస్య యతేర్యద్వద్విశేషః పాపధర్మజః 292

అ. సేవకునికి సన్యాసికి- భూశయనం- బ్రహ్మచర్యం- దుర్బల శరీరం అల్పభోజనం- అనేవి సమానధర్మాలు. ఇందు విశేషం ఏమి అంటే- సేవకుని ఆచరణ పాపానికీ, సన్యాసి ఆచరణ ధర్మానికి (ముక్తికి) హేతువులు.

శ్లో. శీతాతపాదికష్టాని సహతే యాని సేవకః
ధనాయ తాని చాల్పాని యది ధర్మాన్న ముచ్యతే. 293

అ. సేవకుడు సేవావృత్తికి విముఖుడు గానిచో చలి, ఎంత మొదలైన కష్టాలు సహిస్తాడు. ధనంకొరకు అవి అల్పాలు.

శ్లో. మృదునాపి సువృత్తేన సుశ్లిష్టేనాపి హారిణా
మోదకేనాపి కిం తేన నిష్పత్తిర్యస్య సేవయా. 294

అ. మెత్తనిదీ- గుండ్రం అయిందీ జీడిపప్పు, ద్రాక్ష,బాదంపప్పు మొదలైన వాటితో చేరినదీ- (కంటినీ నాల్కనూ) ఆకర్షించేదీ అయిన ఆ లడ్డుచే (మోదకంచే) ఏమిలాభం?' సేవచే అది లభిస్తుంది (నిష్పన్నమౌతుంది).

మూ. సంజీవక ఆహ- 'అథ భవాన్ కిం వక్తుమనాః?' సోఽబ్రవీత్- 'మిత్ర! సచివానాం మంత్రభేదం కర్తుం న యుజ్యతే. ఉక్తం చ-

శ్లో. యో మంత్రం స్వామినో భింద్యాత్ సాచివ్యే సన్నియోజితః
స హత్వా నృపకార్యం తత్ స్వయం చ నరకం వ్రజేత్. 295

శ్లో. యేన యస్య కృతో భేదః సచివేన మహీపతేః
తేనాశస్త్రవధస్తస్య కృత ఇత్యాహ నారదః. 296

అ. సంజీవకుడు ఇలా అన్నాడు- తాము ఏమి చెప్పదలచారు'? అతడు (దమనకుడు) చెప్పాడు- మిత్రమా, మంత్రులు (ప్రభువునకు) చెడుసలహాలు ఇవ్వడం తగదు. పెద్దలు అన్నారు—

ఎవడు మంత్రిపదవిని నియుక్తుడై మంత్రభేదం చేస్తాడో, వాడు ప్రభు కార్యం నాశం చేస్తాడు- మరణం తర్వాత నరకలోకానికి పోతాడు.

నారదుడు ఇలా అన్నాడు- ఏ మంత్రి ప్రభువునకు చెడుసలహాలు ఇస్తాడో (మంత్రభేదం చేస్తాడో) ఆ మంత్రిని ఆయుధంతో కాక- ముద్దముద్దగా మర్దించి చంపాలి.

మూ. తథాపి మయా తవ స్నేహపాశబద్ధేన మంత్రభేదః కృతః. యత స్త్వం మమ వచనేనాత్ర రాజకులే విశ్వ స్తః ప్రవిష్టశ్చ. ఉక్తం చ-

శ్లో. విశ్రమ్భాద్యస్య యో మృత్యుమవాప్నోతి కథఞ్చన
తస్య హత్యా తదుత్థా సా ప్రాహేదం వచనం మనుః. 297

అ. అయినా నేను నీ స్నేహపాశంలో బద్ధుడనై మంత్రభేదం చేశాను— ఏలనన— నీవు నా మాటచేత విశ్వాసం పొంది ఈ రాజకులంలో ప్రవేశించావు. పెద్దలు ఇలా అన్నారు—

ఎవరినేని విశ్వసించి ఎవడైన- ఏ విధమైన మరణం బొందినా- ఆ హత్యా, హత్యవల్ల గల్గినపాపం వానికి (విశ్వాసం గల్గించిన వానికి) గల్గును- అని మనువు తెల్పాడు.

మూ. తత్ తవోపరి పింగలకోఽయం దుష్టబుద్ధిః. కథితఞ్చాద్యానేన మత్పురతశ్చతుష్కర్ణతయా-'యత్ప్రభాతే సఞ్జీవకం హత్వా సమ స్తమృగపరివారం చిరాత్ తృప్తిం నేష్యామి'. తతః స మయో క్తః- 'న యుక్తమిదం యన్మిత్రద్రోహేణ జీవనం క్రియతే. ఉక్తం చ-

శ్లో. అపి బ్రహ్మవధం కృత్వా ప్రాయశ్చిత్తేన శుధ్యతి
తదర్హేణ విచీర్ణేన న కథఞ్చిత్ సుహృద్ద్రుహః. 298

అ. కనుక నీ విషయంలో ఈ పింగళకుడు చెడు భావంతో ఉన్నాడు. నేడు నా ముందు నాలుగు చెవులుగా (మూడవవాడు లేనట్లుగా) అతడు అన్నాడు- ప్రాతః కాలం సంజీవకుణ్ణి వధించి సమస్తపరివారానికి (ఎన్నోరోజులకు) చిరకాలీనమైన తృప్తిగల్గిస్తాను. అంత నేను అన్నాను- "ప్రభూ' మిత్రద్రోహంచే జీవించడం

సముచితం గాదు పెద్దలన్నారు—

బ్రహ్మ (బ్రాహ్మణ) హత్యచేసియూ ప్రాయశ్చిత్తంచే పరిశుద్ధి పొంద వీలు అగును. మిత్రద్రోహానికి ఏలాంటి ఆచరణచేతను ఏ విధంగా శుద్ధిలేదు."

మూ. తతస్తేనాహం సామర్షేణోక్తః– భో దుష్టబుద్ధే, సఞ్జీవకస్తావచ్ఛష్పభోజీ, వయం మాంసాశినః, తదస్మాకం స్వాభావికం వైరమ్, ఇతి కథం రిపురుపేక్ష్యతే. తస్మాత్ సామాదిభిరుపాయైర్హన్యతే. న చ హతే తస్మిన్ దోషః స్యాత్. ఉక్తం చ–

శ్లో. దత్త్వాపి కన్యకాం వైరీ నిహన్తవ్యో విపశ్చితా
అన్యోపాయైరశక్యో యో హతే దోషో న విద్యతే. 299

శ్లో. కృత్యాకృత్యం న మన్యేత క్షత్రియో యుధి సంగతః
ప్రసుప్తో ద్రోణపుత్రేణ ధృష్టద్యుమ్నః పురా హతః. 300

అ. అంత అతడు క్రుద్ధుడై నాతో ఇలా అన్నాడు— ఓరీ దుష్టబుద్ధీ! సంజీవకుడు గడ్డితినేవాడు. మనం మాంసాహారులం 'అందువల్ల మనకు (అతనితో) సహజమైన విరోధం ఉంది. ఈ కారణంచే శత్రువును ఎలా ఉపేక్షిస్తాం? కనుక సామాదులైన ఉపాయాలచే వధించాలి. విజ్ఞులు ఇలా అన్నారు—

రాజనీతిజ్ఞుడు, ఇతరోపాయాలచే చంపడానికి సాధ్యంగాని శత్రువునకు కన్యను ఇచ్చి అయినా చంపాలి. అలా చంపడంలో దోషం లేదు—

యుద్ధసంగతుడైన క్షత్రియుడు మంచిచెడ్డలను తలంపరాదు. పూర్వం ద్రోణపుత్రుడైన అశ్వత్థామ నిద్రించే ధృష్టద్యుమ్నుని చంపాడు.'

మూ. తదహం తస్య నిశ్చయం జ్ఞాత్వా త్వత్సకాశమిహాగతః. సాంప్రతం మే నాస్తి విశ్వాసఘాతకద్రోహః. మయా సుగుప్తమన్త్రో న్తవ నివేదితః. అథ యత్ తే ప్రతిభాతి తత్ కురుష్వ ఇతి. అథ సఞ్జీవకస్తస్య తద్వజ్రపాతదారుణం వచనం శ్రుత్వా మోహముపగతః.

అ. అందువల్ల నేను అతని నిశ్చయం తెలిసికొని ఇచ్చటికి నీ దగ్గరకు వచ్చాను. ఇప్పుడు నాకు విశ్వాసఘాతపాపం లేదు. మిక్కిలి దాచిన రహస్యం తెలిపాను.

పిమ్మట మీకు ఎలా తోస్తే అలా చేయండి.' అంత సంజీవకుడు వజ్రఘాతకఠోర మైన (భయంకరమైన) అతని మాటను విని మూర్ఛను పొందాడు.

మూ. అథ చేతనాం లబ్ధ్వా సవైరాగ్యమిదమాహ— 'భోః! సాధ్విద ముచ్యతే—

శ్లో. దుర్జనగమ్యా నార్యః ప్రాయేణాస్నేహవాన్ భవతి రాజా
కృపణానుసారి చ ధనం మేఘో గిరిదుర్గవర్షీ చ. 301

అ. పిమ్మట (కొంతసేపటికి) తెలివినంది వైరాగ్యభావంతో ఇలా అన్నాడు— ఓయీ! పెద్దలు దీనిని చక్కగా చెప్పారు—

స్త్రీలు దుర్జనులకు లొంగుతారు (గమ్యలు). రాజు సామాన్యంగా ప్రేమలేని వాడై ఉంటాడు. ధనం లోభిని చేరుతుంది. మేఘం కొండలలో కోటలలో వర్షిస్తుంది.

శ్లో. అహం హి సమ్మతో రాజ్ఞో య ఏవం మన్యతే కుధీః
బలీవర్దః స విజ్ఞేయో విషాణపరివర్జితః. 302

శ్లో. వరం వనం వరం భైక్ష్యం వరం భారోపజీవనమ్
వరం వ్యాధిర్మనుష్యాణాం నాధికారేణ సమ్పదః. 303

అ. నేను రాజునకు ఇష్టమైనవాడను,— అని ఎవడేని బుద్ధిహీనుడై తలంచి నచో— అతణ్ణి కొమ్ములులేని ఎద్దుగా తలంచాలి

అరణ్యనివాసం— భిక్షా భోజనం— బరువులుమోసి జీవించడం— వ్యాధిచే బాధింపబడడం అయినా శ్రేష్ఠమేగాని సేవావృత్తిచే సంపదలు వద్దు.

మూ. తదయుక్తం మయా కృతం తదనేన సహ మైత్రీ విహితా ఉక్తఞ్చ—

శ్లో. యయోరేవ సమం విత్తం యయోరేవ సమం కులమ్
తయోర్మైత్రీ వివాహశ్చ న తు పుష్ట—విపుష్టయోః. 304

శ్లో. మృగా మృగైః సఙ్గమనువ్రజన్తి గావశ్చ గోభిస్తురగాస్తురఙ్గైః
మూర్ఖాశ్చ మూర్ఖైః సుధియః సుధీభిః సమానశీలవ్యసనేన సఖ్యమ్. 305

అ. నేను ఇతని స్నేహం పొందడంద్వారా అనుచితం చేసాను. పెద్దలన్నారు-

మైత్రిగాని వివాహసంబంధంగాని, సమానధనం సమానకులంగల వారితో చేసికొనాలి. బలవంతునికి దుర్బలునికి తగదు.

మైత్రి అనేది సమానమైన శీలంగలవారితో గాని- వ్యసనం (చెడు అలవాటు) గలవారితో గాని సంభవిస్తుంది. ఎట్లనగా- లేళ్లు లేళ్లతో, ఆవులు ఆవులతో- గుర్రాలు గుర్రాలతో, మూర్ఖులు మూర్ఖులతో, జ్ఞానులు జ్ఞానులతో కలిసి ఉంటారు.

మూ. తద్యది గత్వా తం ప్రసాదయామి, తథాపి న ప్రసాదం యాస్యతి. ఉక్తఞ్చ-

శ్లో. నిమిత్తముద్దిశ్య హి యః ప్రకుప్యతి ధ్రువం స తస్యాపగమే ప్రశామ్యతి
అకారణద్వేషపరో హి యో భవేత్ కథం నరస్తం పరితోషయిష్యతి.

అ. ఒకవేళ నేను పోయి అతన్ని సంతోషపఱచడానికి యత్నించినప్పటికీనూ అతడు సంతోషంపొందడు. (ఎలననగా) పెద్దలన్నారు—

ఎవరైనా ఏదేని కారణంవల్ల కోపంపొందితే, ఆ కారణం గురించి తొలగిస్తే అతడు శాంతుడు అగును. కాని అకారణంగా ద్వేషించేవాడు ఎన్ని చేసినా ఎలా సంతుష్టుడౌతాడు?

మూ. అహో సాధు చేదముచ్యతే-

శ్లో. భక్తానాముపకారిణాం పరహితవ్యాపారయుక్తాత్మనాం
సేవాసంవ్యవహారతత్త్వవిదుషాం ద్రోహచ్యుతానామపి.
వ్యాపత్తిః స్ఖలితాన్తరేషు నియతా సిద్ధిర్భవేద్వా న వా
తస్మాదమ్బుపతేరివావనిపతేః సేవా సదా శఙ్కనీ. 307

అ ఆహా! దీనిని బాగా చెప్పారు—

భక్తులు- ఉపకారులు- ఇతరులకు మేలు గల్గించే పనులందు మనస్సు ఉంచినవారు, సేవావ్యవహారతత్వం తెలిసిన విద్వాంసులు, ద్రోహచింతలేనివారు అయిన మనుష్యులకును (చిన్న చిన్న) పొరపాట్లవలన ఆపత్తి (ఆపద) తప్పక అనుభవింప వలసి వస్తుంది. ధనలాభం కల్గవచ్చు, కల్గకపోవచ్చు. కనుక సముద్రసేవవలె

(సముద్రయాత్రవలె) రాజసేవయు సందేహయుక్తం.

మూ. తథా చ–

శ్లో. భావస్నిగ్ధైరుపకృతమపి ద్వేష్యతాం యాతి లోకే
సాక్షాదన్యైరపకృతమపి ప్రీతయే చోపయాతి.
దుర్గ్రాహ్యత్వాన్నృపతిమనసాం నైకభావాశ్రయాణాం
సేవాధర్మః పరమ-గహనో యోగినామప్యగమ్యః. 308

అ. అలాగే–ఈ ప్రపంచంలో ప్రేమభావంచే మెలిసే మిత్రులచే చేయబడిన ఉపకారంగూడ శత్రుతను గల్గిస్తుంది. సాక్షాత్తుగా శత్రువులు చేసిన అపకారం గూడ ప్రీతికి కారణం అవుతుంది. భిన్నభావాలతో ఉండే ప్రభువుల మనస్సులను గ్రహించడం చాలకష్టం. అందుచే సేవాధర్మం మిక్కిలి కష్టమైంది. యోగులకును అగమ్యం (అబోధ్యం).

మూ. తత్పరిజ్ఞాతం మయా మత్ప్రసాదమసహమానైః సమీపవర్తిభిరేష పింగలకః ప్రకోపితః. తేనాయం మమాదోషస్యాప్యేవం వదతి ఉక్తం చ–

శ్లో. ప్రభోః ప్రసాదమన్యస్య న సహన్తీహ సేవకాః
సపత్న్య ఇవ సంక్రుద్ధాః సపత్న్యాః సుకృతేరపి. 309

భవతి చైవం యద్గుణవత్సు సమీపవర్తిషు గుణహీనానాం న ప్రసాదో భవతి. ఉక్తం చ–

శ్లో. గుణవత్తరపాత్రేణ ఛాద్యన్తే గుణినాం గుణాః
రాత్రౌ దీపశిఖాకాన్తిర్న భానావుదితే సతి. 310

అ. కనుక నేను ఇలా గ్రహించాను– 'ప్రభువైన పింగళకుని దగ్గర ఉండే సేవకులు అతనికి నాపైగల అనుగ్రహం సహింపలేకపోయారు (నాపై) కోపం తెప్పించారు' అందుచే నిర్దోషి అయిన నన్ను ఇలా అనుచున్నాడు. విజ్ఞులిలా అన్నారు—

ఒక సవతి మంచి నడవడిక గలదైనా, భర్త ఆమెయెడ చూపే అనురాగాన్ని సహింపక సవతులు క్రుద్ధులైనట్లు, సేవకులుగూడ ఈ లోకంలో ప్రభువు ఒక సేవకుని యెడ చూపే అనుగ్రహం సహింపలేరు.

గుణవంతులు సమీపంలో ఉండగా గుణహీనులకు (ప్రభుని) అనుగ్రహం లభింపదుగాన ఇలా సంభవిస్తూ ఉంటుంది. పెద్దలు ఇలా అన్నారు—

రాత్రిఉండే దీపశిఖలకాంతి సూర్యుడు ఉదయింపగానే అణగిపోయినట్లు అధిక గుణవంతులవలన సాధారణ గుణవంతులగుణాలు కప్పబడి పోతాయి.

మూ. దమనక ఆహ— 'యద్యేవం తన్నాస్తి తే భయమ్. ప్రకోపితోఽపి స దుర్జనైస్తవ వచనరచనయా ప్రసాదం యాస్యతి'. స ఆహ— 'భోః న యుక్తముక్తం భవతా. లఘూనామపి దుర్జనానాం మధ్యే వస్తుం న శక్యతే. ఉపాయాంతరం విధాయ తే నూనం ఘ్నన్తి. ఉక్తఞ్చ—

శ్లో. బహవః పణ్డితాః క్షుద్రాః సర్వే మాయోపజీవినః
కుర్యుః కృత్యమకృత్యం వా ఉష్ట్రే కాకాదయో యథా. 311

దమనక ఆహ— 'కథమేతత్? సోఽబ్రవీత్—

అ. దమనకుడు ఇలా అన్నాడు—'ఈ విధంగా అయితే నీకు భయంలేదు. దుష్టుల ప్రేరణచే అతడు కోపితుడు అయినా నీ మాటలచే ప్రసన్నుడు అగును. అతడో (సంజీవకుడు) చెప్పాడు— 'ఓయీ! నీవు సముచితంగా పల్కడంలేదు. దుర్జనులు అల్పులైనా వారిమధ్యన నివసించడం సాధ్యంగాదు. మరియొక ఉపాయం ఆశ్రయించి వారు సంహరిస్తారు. అభిజ్ఞులు ఇలా అన్నారు—

క్షుద్రులూ మాయోపజీవులూ అయిన విద్వాంసులు అందరూ— 'ఇది చేయ దగినది-ఇది చేయదగనిది'- అని తలంపక ఒంటెయెడ కాకులు మొదలైనవివలె ప్రవర్తిస్తారు.

దమనకుడు అన్నాడు— 'అది ఎట్లు'? అతడు (సంజీవకుడు) చెప్పాడు.

## కథా-11

## ఉష్ట్ర-కాకాది-కథా

మూ. కస్మింశ్చిద్వనోద్దేశే మదోత్కటో నామ సింహః ప్రతివసతి స్మ. తస్య చానుచరా అన్యే ద్వీపివాయసగోమాయవః సన్తి. అథ కదాచిత్

ఇతస్తతో భ్రమద్భిః సార్థభ్రష్టః క్రథనకో నామోష్ట్రో దృష్టః. అథ సింహ ఆహ- అహో! అపూర్వమిదం సత్త్వమ్. తజ్జ్ఞాయతాం కిమేతదారణ్యకం గ్రామ్యం వా ఇతి. తచ్ఛ్రుత్వా వాయస ఆహ- 'భోః స్వామిన్ గ్రామ్యోఽయముష్ట్రో నామా జీవవిశేష స్తవ భోజ్యః. తద్ వ్యాపాద్యతామ్'. సింహ ఆహ- 'నాహం గృహమాగతం హన్మి. ఉక్తఞ్చ—

శ్లో. గృహే శత్రుమపి ప్రాప్తం విశ్వస్తమకుతోభయమ్
యో హన్యాత్తస్య పాపం స్యాచ్ఛతబ్రాహ్మణఘాతజమ్. 312

తదభయదానం దత్త్వా మత్సకాశమానీయతాం యేనాస్యాఽగమన కారణం పృచ్ఛామి'.

అ. ఒకానొక అడవిలో మదోత్కటుడు అనే సింహం నివసిస్తూ ఉండేది. చిఱుతపులి, కాకి, నక్క, దానికి సేవకులు. అంత ఒకనాడు అవి ఇటు అటు తిరుగుచూ వ్యాపారులనుండి తప్పిపోయిన క్రథనకుడు అనే ఒంటెను చూచాయి. అప్పుడు సింహం ఇలా అనింది— 'ఆహా, ఇది విలక్షణమైన (అపూర్వమైన) కొత్తజంతువు. ఇది అడవి జంతువో గ్రామ్యజంతువో తెలిసికొనండి.' దానిని విని కాకి చెప్పింది—'ఓ ప్రభూ! ఇది ఒంటె అనే గ్రామ్యజంతువిశేషం. మీకు భుజింపదగింది. కనుక వధించండి.' సింహం అనింది— 'నేను ఇంటికి వచ్చిన వానిని చంపను.' విజ్ఞులన్నారు—

నమ్మి నిర్భయంగా ఇంటికి వచ్చిన శత్రువునైనా చంపరాదు. అలా చంపిన వానికి నూర్గురు బ్రాహ్మణుల చంపిన పాపం చుట్టుకొంటుంది.

కనుక అభయం ఇచ్చి నా వద్దకు తీసికొని రండి. అతనిరాకకు కారణం అడిగెదను.

మూ. అథాసౌ సర్వైరపి విశ్వాస్యాభయప్రదానం దత్త్వా మదోత్కటసకాశమానీతః ప్రణమ్యోపవిష్టశ్చ. తత స్తస్య పృచ్ఛత స్తేనాత్మవృత్తా న్తః సార్థభ్రంశసముద్భవో నివేదితః. తతః సింహేనోక్తమ్- 'భోః క్రథనక, మా త్వం గ్రామం గత్వా భూయోఽపి భారోద్వహనకష్టభాగీ భూయాః. తదత్రైవా రణ్యే నిర్విశఙ్కో మరకతసదృశాని శష్పాగ్రాణి భక్షయన్ మయా సహ సదైవ

వస'. సోఽపి తథేత్యుక్త్వా తేషాం మధ్యే విచరన్నకుతోఽపి భయమితి సుఖే నా స్తే.

అ. పిమ్మట అవి అన్నీ పోయి ఒంటెకు నమ్మకం గల్గించాయి. అభయ ప్రదానం చేసాయి. మదోత్కటుని వద్దకు తెచ్చాయి. అది (ఒంటె) నమస్కరించి కూర్చుంది. తర్వాత అది (సింహం) అడుగగా వ్యాపారులనుండి తప్పిపోవడం ఆదిగా తన వృత్తాంతం నివేదించింది. ఆమీదట సింహం చెప్పింది- 'ఓయీ క్రథనకా నీవు గ్రామానికి పోయి బరువు మోసే కష్టం అనుభవింపవద్దు అందుచే ఈ అడవిలోనే సంశయం వీడి మరకతమణులవంటి లేతగడ్డిక తింటూ నాతోబాటు నిత్యం వసింపుము ఆదియు (ఒంటెయు) 'అటులనే' అని వాటి మధ్య తిరుగుచూ ఏలాటిభయం లేక సుఖంగా ఉండెను.

మూ. తథాన్యేద్యుర్మదోత్కటస్య మహాగజేనారణ్యచారిణా సహయుద్ధ మభవత్. తత స్తస్య ద న్తముసలప్రహారై ర్వ్యథా సఞ్జాతా. వ్యథితః కథమపి ప్రాణైర్విము క్తః. అథ శరీరాసామర్థ్యాన్న కుత్రచిత్ పదమపి చలితుం శక్నోతి. తేఽపి సర్వే కాకాదయోఽప్రభుత్వేన క్షుధావిష్టాః పరం దుఃఖం భేజుః. అథ తాన్ సింహః ప్రాహ– 'భోః, అన్విష్యతాం కుత్రచిత్ కిఞ్చిత్సత్త్వం,యేనాహ మేతామపి దశాం ప్రా ప్తస్తద్ధత్వా యుష్మద్భోజనం సమ్పాదయామి'. అథ తే చత్వారోఽపి భ్రమితుమారబ్ధా యావన్న కిఞ్చిత్ స త్త్వం పశ్య న్తి, తావద్వా యసశృగాలౌ పరస్పరం మన్త్రయతః.

అ. అనంతరం ఒక దినాన మదోత్కటునికి అడవిలో తిరిగే పెద్ద ఏనుగుతో యుద్ధం సంభవించింది. అప్పుడు రోకండ్లవంటి దాని (ఏనుగు) కోరల దెబ్బలచే అతడు (మదోత్కటుడు) బాధ పొందాడు- ఏదోవిధంగా ప్రాణాలతో బయట పడ్డాడు. కాని శరీరం దుర్బలంగా ఉండడంతో ఒక అడుగు గూడ కదలడానికి శ క్తిలేనివాడు అయినాడు, ఆ కాకి మొదలైనవి అన్నీ ప్రభువు దుర్బలుడు కావడంతో తిండిలేక మిక్కిలి దుఃఖం పొందాయి. అప్పుడు సింహం వాటితో ఇలా అంది– 'ఓరీ (సేవకులారా) ఎచ్చటేని ఏదేని ప్రాణిని వెదకండి. ఈ అవస్థలోఉన్నా దానిని వధిస్తాను. మీకు

తిండి సంపాదిస్తాను? అంతట ఆ నాల్గు (సింహంతో నాల్గు) వెదకసాగాయి. ఎచ్చట ఏ ప్రాణి కనబడలేదు. అప్పుడు కాకి, నక్క తమలోతాము ఇలా ఆలోచన చేయ సాగాయి

మూ. శృగాల ఆహ– 'భో వాయస! కిం ప్రభూతభ్రమణేన అయ మస్మాకం ప్రభోః క్రథనకో విశ్వస్తస్తిష్ఠతి. తదేనం హత్వా ప్రాణయాత్రాం కుర్మః' వాయస ఆహ– 'యుక్తముక్తం భవతా. పరం స్వామినా తస్యాభయ ప్రదానం దత్తమాస్తే. న వధ్యోఽయమితి.' శృగాల ఆహ– 'భో వాయస, అహం స్వామినం విజ్ఞాప్య తథా కరిష్యే యథా స్వామీ వధం కరిష్యతి. తత్తి ష్ఠంతు భవంతోఽత్రైవ, యావదహం గృహం గత్వా ప్రభోరాజ్ఞాం గృహీత్వా చాగచ్ఛామి'. ఏవమభిధాయ సత్వరం సింహముద్దిశ్య గతః.

ఆ. నక్క— 'ఓకాకీ? మిక్కిలి తిరుగడంవల్ల ఏమిలాభం! మన ప్రభువు నకు విశ్వాస పాత్రుడైన ఈ క్రథనకుడు (ఒంటె) ఉన్నాడు గదా! అతణ్ణి చంపి జీవ యాత్ర సాగింద్దా;

కాకి—'తాము సరిగా చెప్పారు. కాని, ఇతడు అవధ్యుడు; అని ప్రభువు అతనికి అభయ ప్రదానం చేశాడు.

నక్క— నేను స్వామికి విన్నవించి స్వామి వధించేటట్లు చేస్తాను. తాము ఇచ్చటనే ఉండండి. నేను ఇంటికిపోయి ప్రభువుల ఆజ్ఞ తీసికొని వస్తాను.

ఇలా అని (నక్క) వెంటనే సింహం వద్దకు వెళ్లింది.

మూ. అథ సింహమాసాద్యేదమాహ–'స్వామిన్, సమస్తవనంభ్రాన్త్వా వయమాగతాః. న కిఞ్చిత్సత్త్వమాసాదితమ్. తత్ కిం కుర్మో వయమ్? సమ్ప్రతి వయం బుభుక్షయా పదమేకమపి ప్రచలితుం న శక్నుమః. దేవోఽపి పథ్యాశీ వర్తతే. తద్యది దేవాదేశో భవతి తత్క్రథనకపిశితేనాద్య పథ్యక్రియా క్రియతే. అథ సింహస్తస్య తద్దారుణం వచనమాకర్ణ్య సకోపమిదమాహ– 'ధిక్, పాపా ధమ, యద్యేవం భూయోఽపి వదసి తతస్త్వాం తత్క్షణమేవ వధిష్యామి. యతో మయా తస్యాభయం ప్రదత్తమ్, తత్కథం వ్యాపాదయామి? ఉక్తం చ–

శ్లో. న గోప్రదానం న మహీప్రదానం న చాన్నదానం హి తథా ప్రధానమ్
యథా వదంతీహ బుధాః ప్రధానం సర్వప్రదానేష్వభయప్రదానమ్. 313

అ. అంత (నక్క) సింహాన్ని సమీపించి ఇలా చెప్పింది- 'స్వామీ' మేము అడవిఅంతా తిరిగి వచ్చాము ఏ ప్రాణీ కనబడలేదు. మేము ఏమి చేయగలం? ఇప్పుడు ఆకలిచే ఒక్క అడుగుసైతం కదలించే శక్తిలేక ఉన్నాం. ప్రభువులను పథ్యభోజనం తీసికొనాలి కనుక ప్రభువులు అనుజ్ఞ ఇస్తే ఆ క్రథనకుని మాంసంతో నేడు పథ్యం జరుగుతుంది. అప్పుడు సింహం కఠోరమైన నక్కమాటను విని కోపంతో ఇలా పల్కింది- 'ఛీ' పాపాధమా, ఇలా మరల అందువేని నిన్ను వెంటనే వధిస్తాను. నేను అతనికి అభయం ఇచ్చాను- ఎలా చంపగలను? పెద్దలు అన్నారు—

ఈ ప్రపంచంలో గోదానం- భూదానం- అన్నదానం అంత ముఖ్యమైనవి గావు. అన్నిదానాలలో అభయదానమే ప్రధానమైనది అని బుధులు చెప్పుదురు.

మూ. తచ్ఛ్రుత్వా శృగాల ఆహ- 'స్వామిన్, యద్యభయప్రదానం దత్త్వా వధః క్రియతే, తదైష దోషో భవతి. పునర్యది దేవపాదానాం భక్త్యా స ఆత్మనో జీవితవ్యం ప్రయచ్ఛతి తన్న దోషః. తతో యది స స్వయమేవాఽత్మానం వధాయ నియోజయతి తద్వధ్యః. అన్యథాఽస్మాకం మధ్యాదేకతమో వధ్య ఇతి. యతో దేవపాదాః పథ్యాశినః క్షున్నిరోధాదంత్యాం దశాం యాస్యన్తి తత్కిమేతైః ప్రాణైరస్మాకం యే స్వామ్యర్థే న యాస్యంతి. అపరం పశ్చాదప్యస్మాభిర్వహ్నిప్రవేశః కార్యః, యది స్వామిపాదానాం కిఞ్చిదనిష్టం భవిష్యతి. ఉక్తఞ్చ-

శ్లో. యస్మిన్ కులే యః పురుషః ప్రధానః స సర్వయత్నైః పరిరక్షణీయః
తస్మిన్ వినష్టే కులసారభూతే న నాభిభఙ్గే హ్యరయో వహంతి. 314

అ. దానిని విని నక్క ఇలా (బదులు) చెప్పింది- 'స్వామీ' అభయదానం చేసి చంపితే ఈ దోషం వస్తుంది. కాని ప్రభువుల పాదములపై ఉండే భక్తితో అతడు తన ప్రాణాలు సమర్పిస్తే దోషం లేదు. అందుచే అతడు స్వయంగా వధకు నియోగిస్తే (అతణ్ణి) చంపండి. లేనిచో మాలో ఒకరిని చంపండి. ఏలనన- ప్రభువులు ఆకలిచే

(ఆకలిని నిరోధించడంచే) అంతిమ దశను (మరణావస్థను) చేరుతున్నారు. అలాంటి యెక ప్రభువులకు ఉపయోగపడని ఈ మా ప్రాణాలు ఎందులకు? మరియూ మహారాజుల వారికి ఏదేని అశుభం (మరణం) సంభవిస్తే మేము అగ్నిప్రవేశం చేయవలసివస్తుంది. విజ్ఞులు అన్నారు—

కులానికి ప్రధానమైన వానిని సర్వయత్నాలచే రక్షించాలి. కులసారభూతుడైన అతడు నశిస్తే శత్రువులు (అరులు) తిరుగుబాటు చేస్తారు. చక్రానికి మూలాధారం అయిన నాభి (కుంట) పగిలితే ఆకులు- (అరలు) బండిని మోయవు.

మూ. తదాకర్ణ్య మదోత్కట ఆహ— 'యద్యేవం తత్కురుధ్వ' మిత్యుక్తః . తచ్ఛ్రుత్వా స సత్వరం గత్వా తానాహ— భోః, స్వామినో మహత్యవస్థా వర్తతే. తత్కిం పర్యటితేన? తేన వినా కోఽత్రాస్మాన్ రక్షయిష్యతి, తద్గత్వా తస్య క్షుద్రోగాత్ పరలోకం ప్రస్థితస్యాత్మశరీరదానం కుర్మః, యేన స్వామిప్రసాదస్యానృణతాం గచ్ఛామః. ఉక్తం చ—

శ్లో. ఆపదం ప్రాప్నుయాత్ స్వామీ యస్య భృత్యస్య పశ్యతః
ప్రాణేషు విద్యమానేషు స భృత్యో నరకం వ్రజేత్. 315

అ. దానిని విని మదోత్కటుడు అన్నాడు- 'ఇలా అయితే ఇష్టప్రకారం చేయండి. ఆమాట విని అది (నక్క) వెంటనే వెళ్లింది. తక్కిన జంతువులతో ఇలా అంది- 'మిత్రులారా, ప్రభువులకు గొప్ప దురవస్థ వచ్చింది. అలాంటప్పుడు ఇలా తిరుగడం దేనికి? అతడు లేనిచో మనలను ఇచ్చట ఎవరు రక్షిస్తారు? అందుచే పోయి ఆకలిరోగంచే పరలోకానికి ప్రయాణమైన అతనికి మన శరీరం సమర్పిద్దాం. దీనిచే స్వామి- అనుగ్రహ ఋణం నుండి విముక్తిని పొందెదము. విజ్ఞులు అన్నారు—

ఏ సేవకుడు చూస్తూఉండగా, ప్రాణాలతో ఉండగా యజమాని ఆపదను పొందునో, ఆ సేవకుడు నరకం పొందును.

మూ. తదనంతరం తే సర్వే బాష్పపూరితదృశో మదోత్కటం ప్రణమ్యోపవిష్టాః. తాన్ దృష్ట్వా మదోత్కట ఆహ— 'భోః ప్రాప్తం దృష్టం వా కించిత్సత్త్వమ్'? అథ తేషాం మధ్యాత్ కాకః ప్రోవాచ— 'స్వామిన్, వయం

తావత్ సర్వత్ర పర్యటితాః. పరం న కిఞ్చిత్సత్త్వం సమాసాదితం దృష్టం వా తదద్య మాం భక్షయిత్వా ప్రాణాన్ ధారయతు స్వామీ, యేన దేశస్యాఽశ్వాసనం భవతి. మమ పునః స్వర్గప్రాప్తిరితి. ఉక్తం చ-

శ్లో. స్వామ్యర్థే యస్త్యజేత్ ప్రాణాన్ భృత్యో భక్తిసమన్వితః
పరం స పదమాప్నోతి జరామరణవర్జితమ్. 316

అ. పిమ్మట అవి అన్నీ కన్నుల నీరు నింపుకొని మదోత్కటునికి ప్రణమిల్లి కూర్చున్నాయి వాటిని చూచి మదోత్కటుడు అన్నాడు- ఓరీ, ఏదేని ప్రాణి లభించిందా- లేక చూచారా? అంత వాటిలో కాకి ఇలా అంది- 'ప్రభూ' మేము అయితే అంతటా తిరిగాం. కాని ఏ చిన్న ప్రాణియూ లభింపలేదు. కనుక నేడు నన్ను తిని ప్రభువులు ప్రాణాలు నిలుపుకొనండి. ఇందుచే ప్రభువులకు ఆశ్వాసనం (ప్రాణరక్ష) నాకు స్వర్గ ప్రాప్తి కలుగుతుంది.' పెద్దలు అన్నారు—

ఏ సేవకుడు ప్రభువుకొఱకై భక్తితో ప్రాణాలు అర్పిస్తాడో అతడు ముసలితనం- చావులేని పరమపదం (మోక్షం) పొందును

మూ. తచ్ఛ్రుత్వా శృగాల ఆహ- 'భోః స్వల్పకాయో భవాన్. తవ భక్షణాత్ స్వామినస్తావత్ ప్రాణయాత్రా న భవతి. అపరో దోషశ్చ తావత్ సముత్పద్యతే. ఉక్తఞ్చ-

శ్లో. కాకమాంసం శునోచ్ఛిష్టం స్వల్పం తదపి దుర్లభమ్
భక్షితేనాపి కిం తేన తృప్తిర్యేన న జాయతే. 317

తద్దర్శితా స్వామిభక్తిర్భవతా. గతఞ్చానృణ్యం భర్తృపిణ్డస్య. ప్రాప్తశ్చోభయలోకే సాధువాదః. తదపసరాగ్రతః. అహం స్వామినం విజ్ఞాపయామి'. తథాఽనుష్ఠితే శృగాలః సాదరం ప్రణమ్యోపవిష్టః ప్రాహ-'స్వామిన్ మాం భక్షయిత్వాఽద్య ప్రాణయాత్రాం విధాయ మమోభయలోకప్రాప్తిం కురు. ఉక్తఞ్చ-

శ్లో. స్వామ్యాయత్తాః సదా ప్రాణా భృత్యానామార్జితా ధనైః
యత స్తతో న దోషోఽస్తి తేషాం గ్రహణసమ్భవః. 318

అ. దానిని విని నక్క ఇలా చెప్పింది— 'ఓయీ! నీ దేహం మిక్కిలి

చిన్నది. నిన్ను తినడంతో ప్రభువుల పొట్టనిండదు (ప్రాణం నిల్వదు). మరియూ పాపం సైతం గల్గుతుంది. పెద్దలన్నారు—

కాకిమాంసం, కుక్కఎంగిలి (తినగా మిగిలింది) స్వల్పంగానైనా దుర్లభంగా ఉన్నా తినరాదు. అందువల్ల ఏ లాభం లేదు. తృప్తి లేదు. (కాకిని తినడంచే మహాపాపం, కుక్క ఎంగిలిచే పరమదరిద్రం చుట్టుకొంటాయి).

నీవు ప్రభుభక్తి చూపించావు. ప్రభుని తిండి ఋణంనుండి విముక్తి పొందావు. ఉభయ లోకాలలో కీర్తి గడించావు. కనుక (ప్రభువుల) ఎదుటనుండి తొలగుము. నేను ప్రభువులకు మనవి చేయాలి? కాకి అలాగే తొలగింది. నక్క సాదరంగా ప్రణమిల్లి కూర్చుండి ఇలా పల్కింది- 'ప్రభూ! నన్ను భక్షించి నేడు తాము జీవయాత్ర సాగించండి. నాకు ఉభయలోకాలలో శుభాలు గల్గించండి. విజ్ఞులు అన్నారు-

ప్రభువు ధనముచే (ధనం ఇచ్చి) సేవకుల ప్రాణాలను తన అధీనం చేసికొన్నాడు. అందుచే వాటిని (ప్రాణాలు) గ్రహించడంలో దోషంలేదు.

మూ. అథ తచ్ఛ్రుత్వా ద్వీప్యాహ- భోః సాధూక్తం భవతా. పునర్భవానపి స్వల్పకాయః స్వజాతిశ్చ. నఖాయుధత్వాదభక్ష్య ఏవ ఉక్తఞ్చ-

శ్లో. నాభక్ష్యం భక్షయేత్ ప్రాజ్ఞః ప్రాణైః కణ్ఠగతైరపి
విశేషాత్తదపి స్తోకం లోకద్వయవినాశకమ్. 319

తద్దర్శితం త్వయాఽఽత్మానం కౌలీన్యమ్. అథవా సాధు చేదముచ్యతే -

శ్లో. ఏతదర్థం కులీనానాం నృపా కుర్వన్తి సఙ్గ్రహమ్
ఆదిమధ్యావసానేషు న తే గచ్ఛన్తి విక్రియామ్. 320

తదపసరాగ్రతః, యేనాహం స్వామినం విజ్ఞాపయామి. తథానుష్ఠితే ద్వీపి ప్రణమ్య మదోత్కటమాహ- 'స్వామిన్ క్రియతామద్య మమ ప్రాణైః ప్రాణయాత్రా. దీయతామక్షయో వాసః స్వర్గే. విస్తార్యతాం క్షితితలే ప్రభూతతరం యశః. తన్నాత్ర వికల్పః కార్యః. ఉక్తఞ్చ-

శ్లో. మృతానాం స్వామినః కార్యే భృత్యానామనువర్తినామ్
భవేత్ స్వర్గేఽక్షయో వాసః కీర్తిశ్చ ధరణీతలే. 321

అ. దానిని విని చిఱుత అన్నది- 'ఓయీ! నీవు చక్కగా సంభాషించావు. కాని నీవును స్వల్పదేహుడవు. సజాతీయుడవు. గోళ్లు ఆయుధాలుగా ఉపయోగిస్తావు కనుక భక్షణార్హుడవే. పెద్దలన్నారు. ప్రాజ్ఞుడైనవాడు కొనఊపిరితోనున్నా (ప్రాణాలు కంఠానికి వచ్చినా) అభక్ష్యపదార్థం భక్షింపరాదు అందును అల్పశరీరప్రాణి ఉభయ లోకాలను నశింపచేస్తుంది.

నీవు నీ సత్కులీనత చూపావు. పెద్దలు లెస్సగా అన్నారు. ఇందువల్లనే ప్రభువులు సత్కులంలో పుట్టినవారిని తమ దగ్గరకు చేర్చుకొందురు (రాజకార్యం అప్పగిస్తారు). వారు మొదట, నడుమ, చివర (ఎప్పటికిని) మార్పు పొందరు.

కనుక (ప్రభువుల) ఎదుటనుండి తొలగుము. నేను ప్రభువునకు విన్నవిస్తాను. నక్క అలా తొలగగానే చిఱుతపులి ప్రణామంచేసి మదోత్కటునితో ఇలా అంది- 'ప్రభూ, నేడు నాప్రాణాలతో ప్రాణాలు నిల్పుకోండి. నాకు శాశ్వతస్వర్గ సుఖం ఇయ్యండి. భూతలంలో మిక్కిలి అధికమైన కీర్తి (నాది) విస్తరిల్లునట్లు చేయండి. అందు సందేహంచేయకుడు. విజ్ఞులు అన్నారు—

అనుసరించే సేవకులు ప్రభుని కార్యంలో మరణిస్తే, వారికి శాశ్వతమైన స్వర్గసుఖం లభిస్తుంది- భూమిపై చిరకీర్తి సిద్ధిస్తుంది.

మూ. తచ్ఛ్రుత్వా క్రథనకశ్చింతయామాస- 'ఏతైస్తావత్ సర్వైరపి శోభనాని వాక్యాని ప్రోక్తాని. న చైకోఽపి స్వామినా వినాశితః. తదహమపి ప్రాప్తకాలం విజ్ఞాపయామి. యేన మమ వచనమేతే త్రయోఽపి సమర్థయన్తి'- ఇతి నిశ్చిత్య ప్రోవాచ- 'భోః సత్యముక్తం భవతా. పరం భవానపి నఖాయుధః. తత్కథం భవన్తం స్వామీ భక్షయతి. ఉక్తఞ్చ-

శ్లో. మనసాపి స్వజాత్యానాం యోఽనిష్టాని ప్రచింతయేత్
భవంతి తస్య తాన్యేవ ఇహలోకే పరత్ర చ. 322

తదపసరాగ్రతః. యేనాహం స్వామినం విజ్ఞాపయామి'. తథానుష్ఠితే క్రథనకోఽగ్రే స్థిత్వా ప్రణమ్యోవాచ- 'స్వామిన్, ఏతే తావదభక్ష్యా భవతామ్. తన్మమ ప్రాణైః ప్రాణయాత్రా విధీయతామ్. యేన మమోభయలోకప్రాప్తిః

భవిష్యతి. ఉక్తఞ్చ—

శ్లో. న యజ్వానోఽపి గచ్ఛంతి తాం గతిం నైవ యోగినః
యాం యాంతి ప్రోజ్ఝితప్రాణాః స్వామ్యర్థే సేవకోత్తమాః.' 323

ఏవమభిహితే తాభ్యాం శృగాలచిత్రకాభ్యాం విదారితోభయకుక్షిః క్రథనకః ప్రాణానత్యాక్షీత్. తతశ్చ తైః క్షుద్రపణ్డితైః సర్వైర్భక్షితః. అతోఽహం బ్రవీమి 'బహవః పణ్డితాః క్షుద్రా' ఇతి.

అ. దానిని విని క్రథనకుడు ఆలోచించాడు- వీరు అందరూ శుభమైన మాటలు చెప్పారు. ఏ ఒకనినీ ప్రభువు చంపలేదు' అందువల్ల నేనుగూడ సమయానికి తగినట్లు విన్నవిస్తాను. ఈ ముగ్గురూ నా మాటను సమర్థిస్తారు. ఇలా నిశ్చయించి దృఢంగా, పల్కింది- 'అయ్యా' నీవు సత్యం చెప్పావు, కాని నీవును నఖాయుధుడవే. అట్టి యెడ ప్రభువు నిన్ను ఎలా భక్షిస్తాడు? విజ్ఞులు అన్నారు—

ఎవడు మనస్సుతో అయినా తనజాతివారికి అశుభాలు కోరునో, వానికి (ఈ) ఇహ, పరలోకాలు రెండిటిలోనూ అవే (అశుభాలే) సంభవిస్తాయి.

కనుక (ప్రభుని) ఎదుటనుండి తొలగండి. నేను స్వామికి విన్నవిస్తాను; అలాగే (చిఱుతపులి) చేయగా, క్రథనకుడు ఎదురుగా నిలబడి ప్రణమిల్లి ఇలా చెప్పాడు- 'ప్రభూ, తమకు వీరంతా తినడానికి అనర్హులే.) కనుక నా ప్రాణాలతో ప్రాణయాత్ర (జీవయాత్ర) సాగించండి. అందుచే నాకు ఉభయలోకాలలో శుభం సంభవిస్తుంది. పెద్దలన్నారు—

ఉత్తములైన సేవకులు ప్రభువుకొఱకై ప్రాణాలు వీడి పొందేపుణ్యలోకాన్ని యజ్ఞకర్తలూ- యోగులూ పొందలేరు.

ఇలా అతడు (క్రథనకుడు) చెప్పగానే నక్క, చిఱుత, రెండూ దాని (ఒంటె) రెండు పొట్టలను చీల్చి చంపాయి. పిమ్మట ఆ- క్షుద్రపండితులందరూ తినివేశారు. అందుచే నేను చెప్పుచున్నాను. బహవః పణ్డితాః క్షుద్రాః- (అల్పపండితులు అనేకులు) ఇత్యాదిగా.

మూ. తద్భద్ర, క్షుద్రపరివారోఽయంతే రాజా మయా సమ్యగ్ జ్ఞాతః

సతామసేవ్యశ్చ. ఉక్తఞ్చ—

శ్లో. అశుద్ధప్రకృతౌ రాజ్ఞి జనతా నానురజ్యతే
యథా గృధ్రసమాసన్నః కలహంసః సమాచరేత్. 324

మూ. తథా చ—

శ్లో. గృధ్రాకారోఽపి సేవ్యః స్యాద్ధంసాకారైః సభాసదైః
హంసాకారోఽపి సన్త్యాజ్యో గృధ్రకారైః స తైర్నృపః. 325

అ. ఓ శుభమూర్తి, అందుచే నీరాజు నీచమైన పరివారం గలవాడు అని నేను బాగుగా గ్రహించాను. కనుక సజ్జనులు సేవింపరాదు. విజ్ఞులు అన్నారు—

ఎలా గద్దలచే చుట్టబడిన రాజహంస మంచిగా ప్రవర్తింపదో అలాగే అశుద్ధ (నీచ) పరివారంతోడి రాజువలనను ప్రజలు శుభం పొంది సుఖింపరు.

అలాగే - రాజు గద్దవంటివాడైనా సభాసదులు హంసలవంటి వారు అయితే ఆ రాజును సేవింపవచ్చును. రాజు హంసవంటివాడైనా- సభాసదులు (సేవకులు) గద్దల వంటి వారైతే ఆరాజును త్యజించాలి.

మూ. తన్నూనం మమోపరి కేనచిద్దుర్జనేనాయం ప్రకోపితః తేనైవం వదతి. అథవా భవత్యేతత్. ఉక్తం చ-

శ్లో. మృదునా సలిలేన ఖన్యమానాన్యవఘృష్యంతి గిరేరపి స్థలాని
ఉపజాపవిదాం చ కర్ణజాపైః కిము చేతాంసి మృదూని మానవానామ్.

శ్లో. కర్ణవిషేణ చ భగ్నః కిం కిం న కరోతి బాలిశో లోకః
క్షపణకతామపి ధత్తే పిబతి సురాం నర-కపాలేన. 327

అ. అందుచే తప్పక ఎవడో దుష్టుడు నామీద అతనికి కోపం తెప్పించాడు. కనుక ఇలా అనుచున్నాడు. ఇది ఇలా సంభవిస్తుందిగూడా. విజ్ఞులు అన్నారు—

మృదువైన నీటి రాపిడిచే పర్వతస్థలాలు (కొండబండలే) అరిగిపోతున్నాయి. ఇక భేదవిద్యానిపుణులు నిత్యం కర్ణజపం (చాడీలు చెప్పడం) చేస్తూ ఉంటే ఏ మానవుల మనస్సులు మృదువుగా ఉంటాయి?

చాడీలు అనే విషంచే చెడిన మూర్ఖుడైన మానవుడు ఏమేమి చేయడు? (ఏమైనా చేస్తాడు అని భావం) క్షపణక-రూపం (దిగంబర సన్యాసిరూపం) అయినా ధరిస్తాడు. పుఱ్ఱెతో కల్లు త్రాగుతాడు.

మూ. అథవా సాధ్విద ముచ్యతే-

శ్లో. పాదాహతోఽపి దృఢదణ్డసమాహతోఽపి
యం దంష్ట్రియా స్పృశతి తం కిల హన్తి సర్పః.
కోఽప్యేష ఏవ పిశునోగ్రమనుష్యధర్మః
కర్ణే పరం స్పృశతి హన్తి పరం సమూలమ్. 328

అ. పాము కాళ్లచే తన్నబడినా, గట్టికఱ్ఱచే కొట్టబడినా ఎవనిని కోరలతో కరుస్తుందో వాణ్ణి చంపుతుంది. చాడీలు చెప్పడం అనే ఈ భయంకర మానవస్వభావం చెవిలో మాత్రం తాకుతుంది. సమూలంగా చంపుతుంది.

మూ. తథా చ-

శ్లో. అహో ఖలభుజఙ్గస్య విపరీతో వధక్రమః
కర్ణే లగతి చైకస్య ప్రాణైరన్యో వియుజ్యతే. 329

అ. అలాగే. ఆశ్చర్యం! దుర్జనుడు అనే సర్పంచేసే సంహారపద్ధతి విపరీతంగా ఉంటుంది. ఒకని చెవిలో తగులుతుంది. వేఱొకడు ప్రాణాలు పోగొట్టుకుంటాడు.

మూ. తదేవం గతేపి కిం కర్తవ్యమిత్యహం త్వాం సుహృద్భావాత్ పృచ్ఛామి. దమనక ఆహ- తద్దేశాన్తరగమనం యుజ్యతే. నైవం విధస్య కుస్వామినః సేవాం విధాతుమ్. ఉక్తఞ్చ-

శ్లో. గురోరప్యవలిప్తస్య కార్యాకార్యామజానతః.
ఉత్పథప్రతిపన్నస్య పరిత్యాగో విధీయతే. 330

అ. అందువల్ల 'ఇలాంటిస్థితిలో ఏమి చేయాలి?' అని నేను నిన్ను మిత్రభావంతో అడుగుతున్నాను. దమనకుడు చెప్పాడు- 'దేశం వదలిపోవడం తగినపని. ఇలాంటి చెడుప్రభువును సేవింపరాదు. విజ్ఞులు అన్నారు—

అహంకారియై మంచిచెడ్డలు గుర్తింపక చెడ్డగా నడిచే గురువునైనా వదలివేయాలి.

మూ. సఞ్జీవక ఆహ– అస్మాకముపరి స్వామిని కుపితే గన్తుం న శక్యతే. న చాన్యత్ర గతానామపి నిర్వృతిర్భవతి. ఉక్తఞ్చ–

శ్లో. మహతాం యోఽపరాధ్యేత దూరస్థోఽస్మీతి నాశ్వసేత్
దీర్ఘౌ బుద్ధిమతో బాహూ తాభ్యాం హింసతి హింసకమ్. 331

అ. సంజీవకుడు చెప్పాడు– 'నాయెడ ప్రభువు కోపంతోఉండగా పోవడం వీలుగాదు. వేఱేచోటికి పోయినా శాంతి (సుఖం) ఉండదు. పెద్దలు అన్నారు—

మహాత్ములకు అపరాధం చేసినవాడు 'నేను దూరంగా ఉన్నాన.' అనిఓదార్పు పొందరాదు. బుద్ధిమంతుల భుజాలు పొడవైనవి. వాటితో అవరాధిని హింసిస్తారు.

మూ. తద్యుద్ధం ముక్త్వా మే నాన్యదస్తి శ్రేయస్కరమ్. ఉక్తఞ్చ–

శ్లో. న, తాన్ హి తీర్థై స్తపసా చ లోకాన్ స్వర్గైషిణో దానశతైః సువృత్తైః.
క్షణేన యాన్ యాన్తి రణేషు ధీరాః ప్రాణాన్ సముజ్ఝన్తి హి యే సుశీలాః.

శ్లో. మృతైః సమ్ప్రాప్యతే స్వర్గో జీవద్భిః కీర్తిరుత్తమా.
తదుభావపి శూరాణాం గుణావేతౌ సుదుర్లభౌ. 333

అ. అందుచే యుద్ధం విడిచి నాకు వేఱే శ్రేయోదాయకం లేదు. విజ్ఞులు అన్నారు—

స్వర్గసుఖకాంక్షతో మనుష్యులు తీర్థస్నానాలూ తపములూ వందలకొలది దానాలూ, విశుద్ధాలైన ఇతర ఆచరణలు చేసినా స్వర్గాదిపుణ్యలోకాలను పొందలేరు. విశుద్ధులై యుద్ధభూములందు తమ ప్రాణాలు వదిలే వీరులు క్షణంలో ఆ స్వర్గాదిలోకాలను పొందెదరు.

యుద్ధంలో మరణిస్తే స్వర్గం, గెలిస్తే ఉత్తమమైన కీర్తి ప్రాప్తిస్తాయి. ఈ రెండు (ఉత్తమ) గుణాలు శూరులకు తేలిగ్గా లభించేవి. (ఇతరులకు దుర్లభాలు).

శ్లో. లలాటదేశే రుధిరం స్రవేత్తు శూరస్య యస్య ప్రవిశేచ్చ వక్త్రే
తత్సోమపానేన సమం భవేచ్చ సఙ్గ్రామయజ్ఞే విధివత్ప్రదిష్టమ్. 334

మూ. తథా చ–

శ్లో. హోమార్థైర్విధివత్ప్రదానవిధినా సద్విప్రబృన్దార్చనైః
యజ్ఞైర్భూరిసుదక్షిణైః సువిహితైః సమ్ప్రాప్యతే యత్ఫలమ్.
సత్తీర్థాశ్రమవాస-హోమనియమైశ్చాన్ద్రాయణాద్యైః కృతైః
పుమ్భిస్తత్ఫలమాహవే వినిహతైః సమ్ప్రాప్యతే తత్క్షణాత్. 335

అ. శాస్త్రకారులు యుద్ధం అనే యజ్ఞాన్నిగూర్చి ఇలా అన్నారు- వీరునికి నొసటినుండి రక్తం స్రవించుగాక, స్రవించిన రక్తం నోటిలో పడుగాక. అలా నోటిలో పడినరక్తం సోమరసంతో సమానం.

మరియూ-విధిపూర్వక హోమాలూ, ఉత్తమదానాలూ, సద్బ్రాహ్మణ సమాజ పూజలూ, చక్కగా చేయబడిన భూరిదక్షిణలతోడి యజ్ఞాలూ ఉత్తమతీర్థ స్నానాలూ, ఉత్తమ ఆశ్రమవాసాలూ, (బ్రహ్మచర్యాది) నియమాలూ, చాంద్రాయణాదివ్రతాలు ఇవన్నీ ఆచరించడంతో పురుషులు ఏపుణ్యఫలం పొందుదురో, దాన్ని వీరులు యుద్ధంలో మరణించి వెంటనే పొందుదురు.

మూ. తదాకర్ణ్య దమనకశ్చిన్తయామాస 'యుద్ధాయ కృతనిశ్చయోఽయం దృశ్యతే దురాత్మా. తద్యదికదాచిత్తీక్ష్ణశృఙ్గాభ్యాం స్వామినం ప్రహరిష్యతి తన్మహానన్ర్థః సమ్పత్స్యతే. తదేనం భూయోఽపి స్వబుద్ధ్యా ప్రబోధ్య తథా కరోమి యథా దేశాన్తరగమనం కరోతి. ఆహ చ- 'భో మిత్ర? సమ్యగభిహితం భవతా. పరం కః స్వామిభృత్యయోః సఙ్గ్రామః? ఉక్తఞ్చ-

శ్లో. బలవంతం రిపుం దృష్ట్వా కిలాత్మానం ప్రగోపయేత్
బలవద్భిశ్చ కర్తవ్యా శరచ్చన్ద్రప్రకాశతా. 336

అన్యచ్చ-

శ్లో. శత్రోర్విక్రమమజ్ఞాత్వా వైరమారభతే హి యః
స పరాభవమాప్నోతి సముద్రష్టిట్టిభాద్యథా. 337

సఞ్జీవక ఆహ- 'కథమేతత్? సోఽబ్రవీత్-

అ. దానిని విని దమనకుడు ఇలా తలంచాడు- 'ఈ దురాత్ముడు యుద్ధానికి

నిశ్చయించినట్లు కనబడుతున్నాడు. అట్టియెడ ఒకవేళ వాడికొమ్ముంతో ప్రభువును పొడిస్తే గొప్ప అనర్థం సంభవిస్తుంది. అందుచే ఇతనికి మరలా నా బుద్ధికొలది బోధించి దేశాంతరం పోయేటట్లు చేస్తాను. (ఇలా తలంచి) సంజీవకునితో అన్నాడు- 'ఓ మిత్రమా! చక్కంగా చెప్పావు. కాని ప్రభువునకు సేవకునికి యుద్ధం ఎలా (పొసగుతుంది). పెద్దలన్నారు—

బలవంతుడైన శత్రువును చూచినచో (ఏదోవిధంగా) తన్ను రక్షించుకోవాలి. ఇక తాను బలవంతుడైతే శరత్కాలచంద్రునివలె కీర్తిచంద్రికలను ప్రకాశింపజేయాలి

మరియూ, శత్రుబలం తెలియక విరోధం పెట్టుకొనేవాడు టిట్టిభం (లకుముకి పిట్ట)వలన సముద్రుడు వలె పరాభవం పొందును.

సంజీవకుడు అడిగాడు— 'అది యెట్లు?' ఇతడు (దమనకుడు) ఇలా చెప్పాడు—

## కథా-12

### టిట్టిభ-సముద్ర-కథా

మూ. కస్మింశ్చిత్ సముద్రతీరైకదేశే టిట్టిభదమ్పతీ ప్రతివసతః స్మ. తతో గచ్ఛతి కాలే ఋతుసమయమాసాద్య టిట్టిభీ గర్భమాధత్త. అథాసన్న ప్రసవా సతీ సా టిట్టిభమూచే- 'భోః కాన్త, మమ ప్రసవసమయో వర్తతే. తద్విచిన్త్యతాం కిమపి నిరుపద్రవం స్థానమ్, యేన తత్రాహమణ్డక విమోక్షణం కరోమి'. టిట్టిభః ప్రాహ- 'భద్రే, రమ్యోఽయం సముద్రప్రదేశః తదత్రైవ ప్రసవః కార్యః. సాఽఽహ-'అత్ర పూర్ణిమాదినే సముద్రవేలా చరతి. సా మత్తగజేన్ద్రానపి సమాకర్షతి. తద్దూరమన్యత్ర కిఞ్చిత్స్థానమన్విష్యతామ్'.

అ. ఒకానొక సముద్రతీరంలోని ఒక ప్రదేశాన లకుముకిపిట్టలజంట (దంపతులు) నివసిస్తూ ఉండేది. అరిత కాలం గడుస్తూండగా ఋతుకాలం ప్రాప్తించడం వలన ఆడలకుముకిపిట్ట గర్భం ధరించింది. ప్రసవకాలం (గుడ్లుపెట్టుకాలం)సమీపించగా అది మగనితో ఇలా అంది- 'ఓ ప్రియా! నా ప్రసవసమయం దగ్గరకు వచ్చింది. కనుక నిరపాయం అయిన ప్రదేశం వెదకండి. అచ్చట నేను గుడ్లు పెట్టాలి. మగ లకుముకి

పెట్ట అంది- 'కళ్యాణీ! ఈ సముద్రప్రదేశం అందమైంది. అందుచే ఇచ్చటనే గ్రుడ్లు పెట్టుము.' ఆడపక్షి (మరలా) అంది. 'ఇచ్చట పున్నమినాడు సముద్రంలో పొంగు (తుఫాను) వస్తుంది. అది మదపుటేనుగులను సైతం (లోనికి) ఆకర్షిస్తుంది. కనుక దూరంగా ఎచ్చటనైన వేఱేచోటు వెదుకండి'

మూ॰ తచ్ఛ్రుత్వా విహస్య టిట్టిభః ప్రాహ- భద్రే! యుక్తముక్తం భవత్యా. కా మాత్రా సముద్రస్య, మమ దూషయిష్యతి ప్రసూతిమ్? కిం న శ్రుతం భవత్యా-

శ్లో. బద్ధ్వామ్బర-చరమార్గం వ్యపగతధూమం సదా మహద్భయదమ్
మన్దమతిః కః ప్రవిశతి హుతాశనం స్వేచ్ఛయా మనుజః. 338

శ్లో. మత్తేభకుమ్భవిదలనకృతశ్రమం సుప్తమన్తకప్రతిమమ్
యమలోకదర్శనేచ్ఛుః సింహం బోధయతి కో నామ? 339

అ. ఆ మాటను విని నవ్వి మగటిట్టిభం ఇలా పల్కింది. 'దేవీ, నీవు చెప్పింది సరియే కాని నా సంతానాన్ని దూషించడానికి (నష్టం చేసేందుకు) ఆ సముద్రునికి శక్తి ఎక్కడిది? నీవు వినలేదా___

ఆకాశవిహారులైన పక్షులదారిని అడ్డగించేవాడూ, పొగలేనిదై నిత్యం మహా భయదాయకమై ఉండే అగ్నిలో స్వేచ్ఛగా ప్రవేశించేవాడూ అయిన మందబుద్ధితోడి మానవుడు ఎవడు గలడు?

మదపుటేనుగు కుంభస్థలాన్ని చీల్చుటవలన అలసినదీ, యమునితోసమానం అయినదీ, నిద్రించునదీ అయిన సింహాన్ని యమలోకం చూడగోరేవాడు (చావుగోరే వాడు) ఎవడో మేలుకొనునట్లు చేస్తాడు.

శ్లో. కో గత్వా యమసదనం స్వయమన్తకమాదిశత్యజాతభయః
ప్రాణానపహర మత్తో యది శక్తిః కాచిదస్తి తవ. 340

శ్లో. ప్రాలేయలేశమిశ్రే మరుతి ప్రాభాతికే చ వాతి జడే
గుణదోషజ్ఞః పురుషో జలేన కః శీతమపనయతి. 341

తస్మాద్విస్రబ్ధాఽత్రైవ గర్భం ముఞ్చ. ఉక్తఞ్చ-

శ్లో. యః పరాభవసన్త్రస్తః స్వస్థానం సన్త్యజేన్నరః
తేన చేత్పుత్రిణీ మాతా తద్వన్ధ్యా కేన కథ్యతే. 342

అ. స్వయంగా యముని ఇంటికిపోయి నిర్భయంగా యమునితో- 'నీకు ఏమైన శక్తిఉంటే నా ప్రాణాలను అపహరింపుము'- అని ఎవడైన అడుగునా?

మంచుతో కూడినది (మిక్కిలి చల్లనిది) అయిన ప్రాతఃకాలపు వాయువు మెల్లగా వీచుచుండగా దాని చల్లదనాన్ని నీటిద్వారా పోగొట్టడానికి మంచిచెడ్డలు తెలిసిన మానవుడు ఎవడేని ప్రయత్నిస్తాడా?

అందుచే నిస్సందేహంగా (నమ్మకం గలదానివై) ఇచ్చటనే గర్భం (గ్రుడ్లను) పెట్టుము. విజ్ఞులు అన్నారు—

అవమానానికి భయపడి స్వస్థానం వదిలిపెట్టి పోయేవానివలన తల్లి, పుత్రవతి అయితే గొడ్డురాలు ఇక ఎవనిచే (ఎందుచే) అగును?-

మూ. తచ్ఛ్రుత్వా సముద్రశ్చిన్తయామాస- 'అహో గర్వః పక్షికీటస్యాస్య! అథవా సాధ్విదముచ్యతే-

శ్లో. ఉత్క్షిప్య టిట్టిభః పాదావాస్తే భఙ్గభయాద్దివః
స్వచిత్తకల్పితో గర్వః కస్య నాత్రాపి విద్యతే. 343

తన్మయాస్య ప్రమాణం కుతూహలాదపి ద్రష్టవ్యమ్. కిం మమైషోఽణ్డాపహారే కృతే కరిష్యతి? ఇతి చిన్తయిత్వా స్థితః.

అ. దానిని విని సముద్రుడు ఇలా తలంచాడు- ఆహా, పురుగువంటి ఈ పక్షికి ఎంత గర్వం, విజ్ఞులు ఈ విషయం చక్కగా చెప్పారు—

'ఆకాశం విరిగి (నెత్తిన) పడునేమో' అనే భయంవలన రెండుకాళ్లు పైకి ఎత్తి (నిద్రిస్తూ) ఉంటుంది. ఈ ప్రపంచంలో స్వమనఃకల్పితమైన గర్వం ఎవని ఉండదు? (అందరికీ ఉండును- అని భావం)

అందుచే, నేను (దీని) గ్రుడ్లను అపహరిస్తే ఇది ఏమి చేస్తుందో నిదర్శనానికైనా కుతూహలంతో (పరీక్షించి) చూడాలి' ఇలా భావించాడు.

మూ. అథ ప్రసవానన్తరం ప్రాణయాత్రార్థం గతాయాష్టిట్టిభ్యాః

సముద్రో వేలావ్యాజేనాణ్డాన్యపజహార. అథాఽఽగతా సా టిట్టిభీ ప్రసవస్థానం శూన్యమవలోక్య ప్రలపన్తీ టిట్టిభమూచే– 'భో మూర్ఖ! కథితమాసీన్మయా తే యత్సముద్రవేలయాఽణ్డానాం వినాశో భవిష్యతి, తద్దూరతరం వ్రజావఃపరం మూఢతయాఽహఙ్కారమాశ్రిత్య మమ వచనం న కరోషి. అథవా సాధ్విద ముచ్యతే–

శ్లో. సుహృదాం హితకామానాం న కరోతీహ యో వచః
న కూర్మ ఇవ దుర్బుద్ధిః కాష్ఠాద్భ్రష్టో భవిష్యతి. 344

టిట్టిభ ఆహ– కథమేతత్? సోఽబ్రవీత్–

అ. అంత గ్రుడ్లు పెట్టినమీదట టిట్టిభి (ఆడ లకుముకిపిట్ట) మేతకై వెళ్ళింది. వెంటనే సముద్రుడు అలల నెపంతో గ్రుడ్లను అపహరించాడు. టిట్టిభి తిరిగి వచ్చి గ్రుడ్లు పెట్టిన చోటు చూచింది. గ్రుడ్లు లేకపోవడం చూచి విలపిస్తూ టిట్టిభంతో (మగలకుముకితో) ఇలా అంది– 'ఓ మూర్ఖుడా, 'సముద్ర తరంగాల వల్ల గ్రుడ్లు నశిస్తాయి' అని నేను మొదటనే చెప్పాను. కాని మూర్ఖత్వంతో అహంకారం పొంది నామాట వినలేదు. పెద్దలు చక్కగా చెప్పారు—

ఈ ప్రపంచంలో మేలుకోరే మిత్రుల మాటను వినని దుర్బుద్ధి కఱ్ఱనుండి జారిపడిన తాబేలు వలె నశిస్తాడు.

టిట్టిభం అడిగింది– 'అది యెట్లు? అది (టిట్టిభి) ఇలా చెప్పింది—

## కథా_13

## మూర్ఖకచ్ఛప-కథా

మూ. అస్తి కస్మింశ్చిజ్జలాశయే కమ్బుగ్రీవో నామ కచ్ఛపః. తస్య చ సఙ్కట–వికటనామ్నీ మిత్రే హంసజాతీయే పరస్పరస్నేహకోటిమాశ్రితే నిత్యమేవ సరస్తీరమాసాద్య తేన సహానేకదేవర్షిమహర్షీణాం కథాః కృత్వాస్తమయవేలాయాం స్వనీడాసంశ్రయం కురుతః. అథ గచ్ఛతా కాలేనాఽనావృష్టివశాత్ సరః శనైః శోషమగమత్. తతస్తద్దుఃఖదుఃఖితౌ తావూచతుః 'భో మిత్ర! జమ్బాలశేషమేతత్సరః సఞ్జాతమ్. తత్కథం భవాన్ భవిష్యతీతి వ్యాకులత్వం నౌ హృది వర్తతే.

అ. ఒకానొక చెఱువునందు కంబుగ్రీవుడు అనే తాబేలు ఉండేది. దానికి సంకటుడు, వికటుడు అనే రెండు హంసలు మిక్కిలి మిత్రులై ఉండేవారు. ఆ మిత్రులు ఇరువురు ప్రతిదినం చెఱువు ఒడ్డున చేరేవారు. అతనితో అనేకులైన దేవర్షులయు, రాజర్షులయు కథలు చర్చించేవారు. సంధ్యాకాలంలో తమ గూటికి వెళ్లేవారు- ఇలా కొంతకాలం గడవగా అనావృష్టి కారణంగా చెఱువు మెల్లగా ఎండి పోసాగింది. అంత అతని దుఃఖంలో భాగస్వాములైన ఆ హంసమిత్రులిరువురూ ఇలా అన్నారు- 'ఓ మిత్రమా! ఈ చెరువులో బురద మాత్రం మిగిలింది. నీవు ఎట్లా అగుదువో అని మా మనస్సులో విచారంగా ఉంది.'

మూ. తచ్ఛ్రుత్వా కమ్బుగ్రీవ ఆహ-'భోః సామ్ప్రతం నాస్త్యస్మాకం జీవితవ్యం జలాభావాత్. తథాప్యుపాయశ్చిన్త్యతామితి. ఉక్తఞ్చ-

శ్లో. త్యాజ్యం న ధైర్యం విధురేఽపి కాలే ధైర్యాత్ కదాచిద్గతిమాప్నుయాత్సః
యథా సముద్రేఽపి చ పోతభఙ్గే సాంయాత్రికో వాఞ్ఛతి తర్తుమేవ. 345

మూ. అపరఞ్చ-

శ్లో. మిత్రార్థే బాన్ధవార్థే చ బుద్ధిమాన్ యతతే సదా
జాతాస్వాపత్సు యత్నేన జగాదేదం వచో మనుః 346

తదానీయతాం కాచిద్దృఢరజ్జుర్లఘుకాష్ఠం వా. అన్విష్యతాఞ్చ ప్రభూత జలసనాథం సరః, యేన మయా మధ్యప్రదేశే దన్తైర్గృహీతే సతి యువాం కోటిభాగయోస్తత్కాష్ఠం మయా సహితం సఙ్గృహ్య తత్సరో నయథః?,

అ. దానిని విని కంబుగ్రీవుడు అన్నాడు- ' ఓ మిత్రులారా! ప్రస్తుతం నీరు లేనందున మాకు జీవయాత్ర సాగడంలేదు. అయినా ఉపాయం ఆలోచించండి. పెద్దలు అన్నారు—

ప్రతికూలమైన కాలంలోనూ ధైర్యం వీడరాదు. ధైర్యంవలన ఒకప్పటికైనా (ఆపద తొలగే) మార్గం లభిస్తుంది. సముద్రంలో నావ పగిలిపోయినా నావికుడు ధైర్యంగా ఈది తరింపనెంచును.

మరియూ- మనువు ఇలా చెప్పాడు- 'ఆపదలు వచ్చినప్పుడు మిత్రుల కొరకు, బంధువుల కొరకు బుద్ధిమంతుడు సాయపడడానికి యత్నించాలి.

కనుక ఏదేని గట్టి త్రాడుగాని, చిన్న కఱ్ఱగాని తీసికొని రండు. అధికంగా నీరు ఉండే సరస్సు (చెరువు) వెదకండి. నేను, నడుమ నా దంతములతో (ఆ కఱ్ఱను) పట్టుకుంటాను. మీరు దానిని రెండు అంచులందు పట్టుకొని నన్ను ఆ చెరువు చేర్చండి.'

మూ. తావూచతుః– భో మిత్ర, ఏవం కరిష్యావః. పరం భవతా మౌనవ్రతేన స్థాతవ్యమ్. నో చేత్తవ కాష్ఠాత్ పాతో భవిష్యతి' తథానుష్ఠితే గచ్ఛతా కమ్బుగ్రీవేణాఽధోభాగవ్యవస్థితం కిఞ్చిత్పురమాలోకితమ్. తత్ర చ యే పౌరాస్తే తథా నీయమానం విలోక్య సవిస్మయమిదమూచుః– 'అహో చక్రాకారం కిమపి పక్షిభ్యాం నీయతే పశ్యత! పశ్యత! అథ తేషాం కోలాహలమాకర్ణ్య కమ్బుగ్రీవ ఆహ– ''భోః కిమేష కోలాహల?' ఇతి వక్తుమనా అర్ధోక్తే పతితః పౌరైః ఖణ్డశః కృతశ్చ. అతోఽహం బ్రవీమి– 'సుహృదాం హితకామానామ్' ఇతి. తథా చ–

శ్లో. అనాగతవిధాతా చ ప్రత్యుత్పన్నమతిస్తథా
ద్వావేతౌ సుఖమేధేతే యద్భవిష్యో వినశ్యతి''.

టిట్టిభ ఆహ– 'కథమేతత్? సాఽబ్రవీత్—

అ. ఆ హంసలు రెండు ఇలా చెప్పాయి– 'ఓ మిత్రమా! ఇలాగే చేస్తాము నీవు మౌనవ్రతంతో ఉండాలి. లేనిచో కఱ్ఱనుండి పడడం సంభవిస్తుంది.' అలా చేయగా (ఆకాశంలో) పోయే కంబుగ్రీవుడు క్రిందనుండే ఒకానొక నగరం చూచాడు. అచ్చట ఉండే పౌరులు అలా తీసికొని పోబడడం చూచారు. ఆశ్చర్యంతో అన్నారు– 'ఆహా! చూడండి చూడండి. పక్షులు ఏదో గుండ్రని పదార్థం తీసికొనిపోతున్నాయి. అంత వారి కోలాహలం విని కంబుగ్రీవుడు అన్నాడు– 'అరే ఇదేమి అల్లరి?' – ఇలా చెప్పదలంచి సగం చెప్పగానే (నోటిపట్టు వదలి) క్రిందపడినాడు. పౌరులచే ముక్కలు చేయబడినాడు. అందుచే నేను చెప్పుచున్నాను—

'సుహృదాం హితకామానామ్-' (మేలుకోరే మిత్రులమాట) ఇత్యాది.
అలాగే – 1. అనాగతవిధాత (రాబోయే దానిని ఆలోచించి పని చేసేవాడు)
2. ప్రత్యుత్పన్నమతి (సమయోచిత ప్రతిభ గలవాడు)

ఈ ఇరువురు సుఖంచే వృద్ధినందెదరు. 3. యద్భవిష్యుడు (ఏది జరుగనున్నదో అది అగును అని ఏ ప్రయత్నం చేయనివాడు) నశిస్తాడు.

టిట్టిభం (మగతీతువ) అడిగింది - 'అది ఎట్లు?' టిట్టిభి ఇలా చెప్పింది -

## కథా_14

## మత్స్యత్రయ-కథా

మూ. కస్మింశ్చిజ్జలాశయేఽనాగతవిధాతా ప్రత్యుత్పన్నమతిర్యద్భవిష్యశ్చేతి త్రయో మత్స్యాః సన్తి. అథ కదాచిత్తం జలాశయం దృష్ట్వా గచ్ఛద్భిర్మత్స్యజీవిభిరుక్తమ్— 'యదహో, బహుమత్స్యోఽయం హ్రదః. కదాచిదపి నాస్మాభిరన్వేషితః. తదద్య తావదాహారవృత్తిః సఞ్జాతా, సన్ధ్యాసమయశ్చ సంవృత్తః. తతః ప్రభాతేఽత్రాగన్తవ్యమితి నిశ్చయః'.

అ. ఒకానొక చెరువునందు అనాగతవిధాత, ప్రత్యుత్పన్నమతి, యద్భవిష్యుడు - అనే మూడు చేపలు ఉండేవి. అంత ఒకనాడు చెరువును చూచి (దారిన) పోతూ బెస్తవారు అన్నారు– 'అహా! ఈ చెరువులో చేపలు అధికంగా ఉన్నాయి. మనం ఎప్పుడూ దీనిని చూడలేదు. నేడు అయితే తిండికి సరిపడునట్లు దొరికాయి. సంధ్యావేళయు అయింది. అందువలన వేకువనే ఇచ్చటికి తప్పక రావాలి.'

మూ. అతస్తేషాం తత్కులిశపాతోపమం వచః సమాకర్ణ్యానాగతవిధాతా సర్వాన్ మత్స్యానాహూయేదమూచే– 'అహో, శ్రుతం భవద్భిర్యన్మత్స్యజీవిభిరభిహితమ్. తద్రాత్రావపి గమ్యతాం కిఞ్చిన్నికటం సరః ఉక్తఞ్చ–

శ్లో. అశక్తైర్బలినః శత్రోః కర్తవ్యం ప్రపలాయనమ్
సంశ్రితవ్యోఽథవా దుర్గో నాన్యా తేషాం గతిర్భవేత్. 348

తన్నూనం ప్రభాతసమయే మత్స్యజీవినోఽత్ర సమాగమ్య మత్స్యసంక్షయం కరిష్యన్తి. ఏతన్మమ మనసి వర్తతే. తన్నయుక్తం క్షణమప్యత్రావస్థాతుమ్.

ఉక్తఞ్చ—

శ్లో. విద్యమానా గతిర్యేషామన్యత్రాపి సుఖావహా
తే న పశ్యన్తి విద్వాంసో దేహభఙ్గం కులక్షయమ్. 349

ఆ. అంత అనాగతవిధాత (రాబోవుదానిని ఆలోచించి పనిచేసేవాడు) వజ్రపాతంవంటి వారి ఆ మాటలను విని చేపలను అన్నింటిని పిలిచి ఇలా చెప్పాడు - 'అయ్యో! బెస్తవారు అన్నది మీరు వినలేదా? అందువల్ల ఈ రాత్రికి రాత్రే దగ్గర ఉండే ఏదో చెరువు చేరాలి. విజ్ఞులు అన్నారు—

బలవంతుడైన శత్రుసంబంధంగా (శత్రువు ఆక్రమణచేస్తే) బలహీనులు పారిపోవాలి. లేదా కోటను ఆశ్రయించాలి. ఈ రెండింటికి మించి వేఱేదారి లేదు.

కనుక తప్పక వేకువనే బెస్తవారు ఇచ్చటికి వచ్చి చేపలను చంపివేస్తారు. నా మనసులోని మాట ఏమిటంటే- క్షణకాలం గూడ ఇచ్చట ఉండరాదు. నీతిజ్ఞులు ఇలా అన్నారు—

ఇతర స్థలంలో సుఖదాయకమైన మార్గం (ఉపాయం) ఉండగా విద్వాంసులైనవారు తమకూ వంశానికీ వినాశనం చూడజాలరు.

మూ. తదాకర్ణ్య ప్రత్యుత్పన్నమతిః ప్రాహ— 'అహో, సత్యమభిహితం భవతా. మమాప్యభీష్టమేతత్. తదన్యత్ర గమ్యతామ్—' ఇతి. ఉక్తఞ్చ—

శ్లో. పరదేశభయాద్భీతా బహుమాయా నపుంసకాః
స్వదేశే నిధనం యాన్తి కాకాః కాపురుషా మృగాః. 350

శ్లో. యస్యాస్తి సర్వత్ర గతిః స కస్మాత్ స్వదేశరాగేణ హి యాతి నాశమ్
తాతస్య కూపోఽయమితి బ్రువాణాః క్షారం జలం కాపురుషాః పిబన్తి. 351

అ. దానిని విని ప్రత్యుత్పన్నమతి (సమయోచితంగా ఆపదకు ప్రతీకారం చేసేవాడు) ఇలా అన్నాడు— 'అహా! తాము సత్యం చెప్పారు. నాకూ ఇది ఇష్టమే. కనుక వేఱేచోటికి పోదాము. పెద్దలు అన్నారు—

పరదేశం అనగానే భయపడేవారు, తమ దేశంపై అధికమాయతో

(మమకారంతో) ఉండేవారు, నపుంసకులు, కొకులు, కాపురుషులు (అల్పబుద్ధులు), లేళ్లు - తమ దేశంలోనే మరణిస్తారు

ఎవనికి అన్నిచోట్ల గతి (జీవనోపాయం) గలదో, వాడు స్వదేశంపై అభిమానంతో (అచ్చటనే) ఎందుకు చస్తాడు ?' ఇది తండ్రిగారి బావి అని అంటూ- పిఱికివాడు (కాపురుషులు) ఉప్పునీరు త్రాగుదురు.

మూ. అథ తత్సమాకర్ణ్య ప్రోచ్చైర్విహస్య యద్భవిష్యః ప్రోవాచ- అహో, న భవద్భ్యాం మన్త్రితం సమ్యగేతదితి, యతః కిం వాఙ్మాత్రేణాపి తేషాం పితృపైతామహికమేతత్ సరస్త్యక్తుం యుజ్యతే. యద్యాయుఃక్షయోఽస్తి తదన్యత్ర గతానామపి మృత్యుర్భవిష్యత్యేవ. ఉక్తఞ్చ-

శ్లో. అరక్షితం తిష్ఠతి దైవరక్షితం సురక్షితం దైవహతం వినశ్యతి
జీవత్యనాథోఽపి వనే విసర్జితః కృతప్రయత్నోఽపి గృహే వినశ్యతి. 352

తదహం న యాస్యామి భవద్భ్యాం చ యత్ప్రతిభాతి తత్కర్తవ్యమ్'.

ఆ. అంత అది విని బిగ్గరగా నవ్వి యద్భవిష్యుడు (ఏది జరగాలో అది జరుగును అనేవాడు) నొక్కి చెప్పాడు— 'అహా! (మిత్రులారా) మీరు ఇరువురు చేసిన ఈ ఆలోచన సరిగా లేదు. ఏలనన— ఆ జెస్తవాడు చెప్పినంత మాత్రానికే తండ్రి జేజయ్యలనాటి ఈ సరస్సును విడువవచ్చునా ? ఆయువు తీరిఉంటే వేఱె చోటికి పోయినా చావు తప్పదు. పెద్దలు అన్నారు –

దైవరక్షితప్రాణి మానవులు రక్షింపకుండినా బ్రతుకుతుంది, మానవులచే సురక్షితం అయినా దైవహతం అయినది నశిస్తుంది దిక్కులేని పిల్లగా (అనాథుడుగా) అడవిలో వదలివేసినా బ్రతుకుతాడు, ఇంట్లో జాగ్రత్తగా రక్షించినా (ఆయువు తీరినవాడు) చస్తాడు.

మూ. అథ తస్య తం నిశ్చయం జ్ఞాత్వాఽనాగతవిధాతా ప్రత్యుత్పన్నమతిశ్చ నిష్క్రాన్తౌ సహ పరిజనేన. అథ ప్రభాతే తైర్మత్స్యజీవిభిర్జాలైః తజ్జలాశయమాలోడ్య యద్భవిష్యేణ సహ తత్సరో నిర్మత్స్యతాం నీతమ్. అతోఽహం బ్రవీమి– 'అనాగతవిధాతా' ఇతి.

అ. పిమ్మట అతని ఆ నిశ్చయం తెలుసుకొని అనాగతవిధాత, ప్రత్యుత్పన్నమతి (ఇద్దరూ) పరిజనంతో వెళ్లిపోయారు. మరునాడు ప్రాతఃకాలం ఆ జాలవారు (వచ్చి) వలలతో ఆ చెరువును అంతా ఆలోడించారు. యద్భవిష్యునితో సహా (చేపలన్నీ పట్టారు) మత్స్యశూన్యం చేశారు. కనుక నేను చెప్పుచున్నాను - 'అనాగత విధాతా' (రాబోవు కీడుకు ప్రతిక్రియ చేసేవాడు) అని ;

మూ. తచ్ఛ్రుత్వా టిట్టిభ ఆహ— 'భద్రే, కిం మాం యద్భవిష్యసదృశం సమ్భావయసి? తత్పశ్య మే బుద్ధిప్రభావం యావదేనం దుష్టసముద్రం స్వచఞ్చ్వా శోషయామి'. టిట్టిభ్యాహ— 'అహో క స్తే సముద్రేణ సహ విగ్రహః. తన్నయుక్తమస్యోపరి కోపం కర్తుమ్. ఉక్తఞ్చ—

శ్లో. పుంసామసమర్థానాముపద్రవాయాత్మనో భవేత్కోపః
పిఠరం జ్వలదతిమాత్రం నిజపార్శ్వానేవ దహతితరామ్. 353

తథా చ—

శ్లో. అవిదిత్వాఽఽత్మనః శక్తిం పరస్య చ సముత్సుకః
గచ్ఛన్నభిముఖో నాశం యాతి వహ్నౌ పతఙ్గవత్. 354

అ. దానిని విని టిట్టిభము (మగ తీతువు) ఇలా అంది - 'ఓ కల్యాణీ! నన్ను యద్భవిష్యునితో సమానంగా తలుస్తున్నావా ఏమి? నా బుద్ధిబలం చూడు - నా ముక్కుతో ఈ దుష్టసముద్రుని శుష్కించేటట్లు (ఎండిపోయేటట్లు) చేస్తాను. టిట్టిభి (ఆడ తీతువు) అంది - 'అయ్యో! సముద్రునితో నీకు యుద్ధం ఏమిటి? ఇతనిపై కోపం పొందడం ఉచితం గాదు. పెద్దలు చెప్పారు -

అసమర్థుల కోపం తమకే ఉపద్రవం (కీడు) గల్గిస్తుంది. అధికంగా భట్టి కాలినచో తమ సమీప వస్తువులనే దహించివేస్తుంది.

అలాగే - తన బలం శత్రుబలం తెలిసికొనక ఉత్తేజంతో (తొందరపాటుతో) శత్రువునెదిరించేవాడు అగ్నిలో పడిన పురుగువలె నశిస్తాడు."

మూ. టిట్టిభ ఆహ— 'ప్రియే, మా మైవం వద. యేషాముత్సాహశక్తిర్భవతి, తే స్వల్పా అపి గురూన్ విక్రమన్తే. ఉక్తఞ్చ—

శ్లో. విశేషాత్ పరిపూర్ణస్య యాతి శత్రోరమర్షణః
అభిముఖ్యం శశాఙ్కస్య యథాఽద్యాపి విధున్తుదః. 355

అ. టిట్టిభము అనింది - 'ప్రియురాలా! ఇలా వలుకవద్దు. ఉత్సాహ శక్తి గలవారు అల్పులు అయినా, గొప్పవారిని ఎదిరిస్తారు. పెద్దలు చెప్పారు -

విరోధించే వీరపురుషులు పరిపూర్ణబలుడైన శత్రువు పైననే దాడిచేస్తారు. నేటికిని రాహువు పూర్ణచంద్రునికే అభిముఖంగా (మింగడానికి) పోతున్నాడు.

మూ. తథా చ–

శ్లో. ప్రమాణాదధికస్యాపి గణ్డశ్యామమదచ్యుతేః
పదం మూర్ధ్ని సమాధత్తే కేసరీ మదదన్తినః. 356

తథా చ–

శ్లో. బాలస్యాపి రవేః పాదాః పతన్త్యుపరి భూభృతామ్
తేజసా సహ జాతానాం వయః కుత్రోపయుజ్యతే. 357

శ్లో. హస్తీ స్థూలతరః స చాఙ్కుశవశః కిం హస్తిమాత్రోఽఙ్కుశో
దీపే ప్రజ్వలితే ప్రణశ్యతి తమః కిం దీపమాత్రం తమః
వజ్రేణాపి హతాః పతన్తి గిరయః కిం వజ్రమాత్రో గిరిః
తేజో యస్య విరాజతే స బలవాన్ స్థూలేషు కః ప్రత్యయః. 358

తదనయా చఞ్చ్వాఽస్య సకలం తోయం శుష్కస్థలతాం నయామి.

అ. అటులనే - సింహం, తన శరీరంకంటే పరిమాణంలో అధికశరీరం గలదియూ, కపోలాలనుండి శ్యామవర్ణమదం స్రవించునదియు అయిన మదపుటేనుగు (యొక్క) కుంభస్థలంపై తనపాదం ఉంచుతూంది. అలాగే- బాలసూర్యుని పాదములు (కిరణాలు) పర్వతాల శిఖరాలపై పడుచున్నాయి. కనుక తేజస్సుతోపుట్టినవారియెడ, వయస్సు ఎచ్చట చూడబడుతుంది ?

ఏనుగు మిక్కిలి స్థూలమైనది అయినా, అంకుశానికి లొంగుతుంది. అంకుశం ఏనుగంత ఉందా? దీపం ప్రజ్వలింపగానే చీకటి నశిస్తుంది. చీకటి దీపమంత చిన్నదియా? వజ్రాయుధంచే కొట్టబడినపై పర్వతాలు పడిపోతున్నాయి పర్వతం వజ్రాయుధం

వలె చిన్నదా? కనుక ఎవనికి తేజస్సు (పరాక్రమం) అధికమో వాడే బలవంతుడు. స్థూల శరీరులపై నమ్మకం ఏముంది?

అందుచే నేను ఈ ముక్కుతో నీటినంతా శుష్కింపజేస్తాను.

మూ. టిట్టిభ్యాహ– 'భోః కాన్త, యత్ర జాహ్నవీ నవనదీశతాని గృహీత్వా నిత్యమేవ ప్రవిశతి, తథా సిన్ధుశ్చ తత్కథం త్వమష్టాదశనదీశతైః పూర్యమాణం తం విప్రుషవాహిన్యా చఞ్చ్వా శోషయిష్యసి? తత్కిమశ్రద్ధేయే నోక్తేన?'

అ. టిట్టిభి చెప్పింది - 'ఓ కాంతా! ఈ సముద్రంలో గంగానది. నిత్యం తొమ్మిదివందల నదులను తీసికొని కలుస్తూ ఉంది. అలాగే సింధూ నదియూ' (తొమ్మిది వందల నదులతో కలుస్తూ ఉంది.) ఇలా పదునెనుమిది వందల నదులతో నిండింపబడే ఆ సముద్రుని ఒక బిందువుమాత్రం వహించె ముక్కుతో ఎలా శుష్కింపజేస్తావు? నమ్మరాని మాటలవల్ల ఉపయోగం ఏముంది?

మూ. టిట్టిభ ఆహ– 'ప్రియే,

శ్లో. అనిర్వేదః శ్రియో మూలం చఞ్చుర్మే లోహసన్నిభా
అహోరాత్రాణి దీర్ఘాణి సముద్రః కిం న శుష్యతి. 359

శ్లో. దురధిగమః పరభాగో యావత్పురుషేణ పౌరుషం న కృతమ్
జయతి తులామధిరూఢో భాస్వానపి జలదపటలాని. 360

అ. టిట్టిభం (మరలా) చెప్పింది– ప్రియురాలా!

నిరాశను పొందకపోవడం లక్ష్మికి కారణం. నా ముక్కు ఇనుము వంటిది. అహోరాత్రాలు పెద్దవి (నిత్యం శ్రమిస్తే) సముద్రం శుష్కింపదా?

పురుషుడు తన పరాక్రమం (పౌరుషం) చూపనిచో ఉత్కర్షను (పురుషార్థం) పొందడం సాధ్యంగాదు. సూర్యుడు తులారాశిలో చేరినా మేఘసమూహాలను జయిస్తున్నాడు (సూర్యునికి మేషం ఉచ్చరాశి, తుల నీచరాశి– అని జ్యోతిశ్శాస్త్రం).

మూ. టిట్టిభ్యాహ– 'యది త్వయాఽవశ్యం సముద్రేణ విగ్రహానుష్ఠానం

కార్యమ్, తదన్యానపి విహఙ్గమానాహూయ సుహృజ్జనసహిత ఏవం సమాచర. ఉక్తఞ్చ–

శ్లో. బహూనామప్యసారాణాం సమవాయో హి దుర్జయః
తృణైరావేష్ట్యతే రజ్జుర్యయా నాగోఽపి బద్ధ్యతే. 361

తథా చ–

శ్లో. చటకా కాష్ఠకూటేన మక్షికా దర్దురై స్తథా
మహాజనవిరోధేన కుఞ్జరః ప్రలయం గతః. 362

టిట్టిభ ఆహ– 'కథమేతత్?' సా ప్రాహ–

అ. ఆడ తీతువు (టిట్టిభి) ఇలా చెప్పింది– 'నీవు సముద్రునితో అవశ్యం పోట్లాడనెంతువేని ఇతర పక్షులను కూడ పిలువుము. మిత్రులతో కలిసి ఈ పనిచేయుము. విజ్ఞులు అన్నారు—

బలహీనులు అయినా అనేకుల కలయిక అజేయంగా ప్రసిద్ధం. (ఎండు)గడ్డిని పేని త్రాడు చేస్తారు. దానిచే ఏనుగు సైతం బంధింపబడుతుంది.

అలాగే— పిచ్చుక, వడ్రంగి పిట్ట, ఈగ, కప్ప– మొదలైన అనేక ప్రాణి విరోధంచే ఏనుగు చచ్చింది.

టిట్టిభం అడిగింది 'అది ఎట్లు?' అది (ఆడ టిట్టిభం) ఇలా చెప్పింది–

## కథా–14

## చటక-కుఞ్జర-కథా

మూ. కస్మింశ్చిద్వనోద్దేశే చటకదమ్పతీ తమాలతరుకృతనిలయౌ ప్రతి వసతః స్మ. అథ తయోర్గచ్ఛతా కాలేన సన్తతిరభవత్. అన్యస్మిన్నహని ప్రమత్తో వనగజః కశ్చిత్తం తమాలవృక్షం ఘర్మార్తశ్ఛాయార్థీ సమాశ్రితః. తతో మదోత్కర్షాత్తాం తస్య శాఖాం చటకాశ్రితాం పుష్కరాగ్రేణాకృష్య బభఞ్జ. తస్యా భఙ్గేన చటకాణ్డాని సర్వాణి విశీర్ణాని. ఆయుశ్శేషతయా చ చటకౌ కథమపి ప్రాణైర్న వియుక్తౌ. అథ చటకా స్వాణ్డభఙ్గాభిభూతా ప్రలాపాన్ కుర్వాణా న కిఞ్చిత్సుఖమాససాద.

అ. ఒకానొక అడవిలో పిచ్చుక జంట కానుగుచెట్టుపై గూడు కట్టుకొని నివసిస్తూ ఉండేవి. అంత కొంతకాలం గడువగా వాటికి సంతానం గల్గింది. పిమ్మట ఒకనాడు పగటివేళ మదించిన ఒక అడవిఏనుగు ఎండచే అలసినదై నీడకై ఆ కానుగుచెట్టు క్రిందికి వచ్చింది. తర్వాత మదాధిక్యంచే పిచ్చుకజంట ఉండే ఆ చెట్టుకొమ్మను తొండంతో గుంజి విఱచివేసింది. కొమ్మవిఱగడంతో పిచ్చుక గ్రుడ్లు అన్నీ పగిలిపోయాయి. ఆయువు మిగిలిఉండడంవల్ల పిచ్చుకజంట ఏదోవిధంగా ప్రాణాలు పోగొట్టుకోలేదు. అప్పుడు ఆ ఆడపిచ్చుక గ్రుడ్లు పగిలిపోవడంతో దిక్కు తోచక ఏడ్వసాగింది. ఏ విధంగానూ శాంతిని పొందలేకపోయింది.

మూ. అత్రాన్తరే తస్యాస్తాన్ ప్రలాపాన్ శ్రుత్వా కాష్ఠకూటో నామ పక్షీ తస్యాః పరమసుహృత్ తద్దుఃఖదుఃఖితోఽభ్యేత్య తామువాచ— 'భగవతి, కిం వృథా ప్రలాపేన? ఉక్తఞ్చ—

శ్లో. నష్టం మృతమతిక్రాన్తం నానుశోచన్తి పణ్డితాః
పణ్డితానాఞ్చ మూర్ఖాణాం విశేషోఽయం యతః స్మృతః. 363

తథా చ——

శ్లో. అశోచ్యానీహ భూతాని యో మూఢస్తాని శోచతి
స దుఃఖే లభతే దుఃఖం ద్వావనర్థౌ నిషేవతే. 364

అన్యచ్చ——

శ్లో. శ్లేష్మాశ్రు బాన్ధవైర్ముక్తం ప్రేతో భుఙ్క్తే యతోఽవశః
తస్మాన్న రోదితవ్యం హి క్రియాః కార్యాశ్చ శక్తితః. 365

అ. ఇంతలో దాని ఏడుపును, దానికి మిక్కిలి మిత్రమైన వడ్రంగిపిట్ట (కాష్ఠకూటం) అనే పక్షి వినింది. దాని దుఃఖానికి మిక్కిలి దుఃఖం పొందింది. సమీపించి దానితో ఇలా అంది— 'పూజ్యురాలా! వ్యర్థంగా ఎందుకు ఏడుస్తున్నావు? పెద్దలన్నారు——

నష్టం గురించి, మరణంపొందినవానిని గురించి, గడచిన విషయాన్ని గురించి —— (ఈ మూడింటిని గూర్చి) విద్వాంసులు శోకింపరు. మూర్ఖులకు విద్వాంసులకు భేదం ఇదియే.

అలాగే—ఏ మూర్ఖుడు ఈ ప్రపంచంలో దుఃఖింపదగని దానినిగూర్చి దుఃఖిస్తున్నాడో, వాడు దుఃఖంలో దుఃఖం పొందుతూ రెండు అనర్థాలు అనుభ విస్తున్నాడు.

మరియూ—ప్రేతాత్మ (మృతాత్మ) ఇష్టం లేకపోయినా తన బంధువులు విడిచే కఫం కన్నీరు (శ్లేష్మ + అశ్రు) పానం చేస్తున్నాడు. అందుచే బంధువులు ఏ మాత్రం ఏడ్వరాదు. పరలోకక్రియలు యథాశక్తి చేయాలి.

మూ. చటకా ప్రాహ— 'అస్త్యేతత్. పరం దుష్టగజేన మదాన్మమ సన్తానక్షయః కృతః. తద్యది త్వం మమ సుహృత్సత్యస్తదస్యగజాపసదస్య కోఽపి వధోపాయశ్చిన్త్యతామ్. యస్యానుష్ఠానేన మే సన్తతి–నాశదుఃఖమప సరతి. ఉక్తఞ్చ—

శ్లో. ఆపది యేనాపకృతం యేన చ హసితం దశాసు విషమాసు
అపకృత్య తయోరుభయోః పునరపి జాతం నరం మన్యే. 366

అ. ఆడ పిచ్చుక (చటక) ఇలా అంది—'ఇది (అటులనే) అగుగాక. కాని దుష్టగజము మదంతో నా సంతానాన్ని చంపి వేసింది. నీవు నాకు నిజమైన మిత్రుడవైతే ఆ నీచమైన ఏనుగును చంపే ఉపాయం ఏదేని వెదకుము. అలాచేస్తే సంతాననాశ దుఃఖం నాకు తొలగుతుంది. విజ్ఞులు అన్నారు—

తాను ఆపదలో ఉండగా అపకారం చేసినవాడు, తాను సంకటమైన అవస్థలో ఉండగా పరిహాసం చేసినవాడు–అనే ఈ ఇరువురికి కీడు చేసినవానిని (తద్వారా తృప్తినందినవానిని) పునర్జన్మ పొందినవానినిగా నేను తలంచెదను.'

మూ. కాష్ఠకూట ఆహ— 'భగవతి, సత్యమభిహితం భవత్యా. ఉక్తఞ్చ—

శ్లో. స సుహృద్వ్యసనే యః స్యాదన్యజాత్యుద్భవోఽపి సన్
వృద్ధౌ సర్వోఽపి మిత్రం స్యాత్సర్వేషామేవ దేహినామ్. 367

శ్లో. స సుహృద్వ్యసనే యః స్యాత్ స పుత్రో యస్తు బుద్ధిమాన్
స భృత్యో యో విధేయజ్ఞః సా భార్యా యత్ర నిర్వృతిః. 368

తత్పశ్య మే బుద్ధిప్రభావమ్. పరం మమాపి సుహృద్భూతా వీణారవా నామ.

మక్షికాఽస్తి. తత్రామాహూయాగచ్ఛామి, యేన స దురాత్మా దుష్టగజో వధ్యతే'!

అ. కాష్ఠకూటుడు అన్నాడు [వడ్రంగి పిట్ట-అంది] —'పూజ్యురాలా నీవు సత్యం చెప్పావు. విజ్ఞులు అన్నారు—

కడజాతిలో పుట్టినా ఆపదయందు సహాయపడేవాడే మిత్రుడు అనబడును, అభివృద్ధి దశలో అందరికీ అందరూ మిత్రులుగానే వ్యవహరిస్తారు.

ఆపదలో తోడు నిల్చువాడే మిత్రుడు. భక్తితో సేవించేవాడే పుత్రుడు. విధేయత తెలిసినవాడే సేవకుడు? సుఖం—ఆనందం కల్గించేదే భార్య.

కనుక నా బుద్ధిప్రభావం (శక్తి) చూడుము. కాని నాకునూ మిత్రురాలైన వీణారవ అనే ఈగ ఉంది. ఆమెను పిలుచుకొనివస్తాను. అందువల్ల (ఆమె సహాయంతో) ఆ పెద్ద ఏనుగును చంపవచ్చును.

మూ. అథాఽసౌ చటకయా సహ మక్షికామాసాద్య ప్రోవాచ– 'భద్రే, మమేష్టేయం చటకా. కేనచిద్దుష్టగజేన పరాభూతాఽణ్డస్ఫోటనేన. తత్తస్య వధోపాయమనుతిష్ఠతో మే సాహాయ్యం కర్తుమర్హసి. మక్షికాఽప్యాహ– 'భద్ర, కిముచ్యతేఽత్రవిషయే? ఉక్తఞ్చ–

శ్లో. పునః ప్రత్యుపకారాయ మిత్రాణాం క్రియతే ప్రియమ్
యత్పునర్మిత్రమిత్రస్య కార్యం మిత్రైర్న కిం కృతమ్. 369

సత్యమేతత్. పరం మమాఽపి భేకో మేఘనాదో నామ మిత్రం తిష్ఠతి. తమప్యాహూయ యథోచితం కుర్మః. ఉక్తఞ్చ–

శ్లో. హితైః సాధుసమాచారైః శాస్త్రజ్ఞైర్మతిశాలిభిః
కథఞ్చిన్న వికల్పన్తే విద్వద్భిశ్చిన్తితా నయాః. 370

అ. అంతట అది (వడ్రంగి పిట్ట) ఆడ పిచ్చుకతోబాటు ఈగవద్దకు పోయి ఇలా చెప్పింది—'కళ్యాణి? ఈమె నా మిత్రురాలైన పిచ్చుక. ఒక పెద్ద ఏనుగు ఈమె గుడ్లను పగులగొట్టి దుఃఖం కల్గించింది. కనుక దానిని చంపే యత్నంలో ఉండే మాకు సాయం చేయాలి.' ఈగ చెప్పింది.—'శుభమూర్తి, ఈ విషయంలో నాకు ఏమి ఆజ్ఞ ఇస్తున్నారు? విజ్ఞులు చెప్పారు—

(లోకంలో) ప్రత్యుపకారభావంతో మిత్రులకు ప్రియమైన (ఇష్టమైన) పని చేయబడుతుందా! (అలా అయితే మిత్రతలోని మహత్త్వం ఏముంది?) ఇక మిత్రమిత్రుల విషయంలో మిత్రులు చేయరానిది ఏముంది? (ఏదైనా తప్పక చేయాలి.)

కాని నాకూ మేఘనాథుడు అనే మిత్రమైన కప్ప గలడు. అతన్నిగూడ పిలిచి తగినట్లు చేయుదము. నీతిజ్ఞులు చెప్పారు—

తన మేలు కోరేవారు, సదాచారులు, శాస్త్రవేత్తలు, ప్రతిభావంతులు జ్ఞానులు అయినవారు ఆలోచించిచేసే నీతిమార్గాలు విఫలంగావు.

మూ. అథ తే త్రయోఽపి గత్వా మేఘనాదస్యాగ్రే సమస్తం వృత్తాన్తం నివేద్య తస్థుః. అథ స ప్రోవాచ— 'కియన్మాత్రోఽసౌ వరాకో గజో మహాజనస్య కుపితస్యాగ్రే. తన్మదీయో మన్త్రః కర్తవ్యః. మక్షికే, త్వం గత్వా మధ్యాహ్నసమయే తస్య మదోద్ధతస్య గజస్య కర్ణే వీణారవసదృశం శబ్దం కురు, యేన స శ్రవణసుఖలాలసో నిమీలితనయనో భవతి. తతశ్చ కాష్ఠకూటచఞ్చ్వా స్ఫోటితనయనోఽన్ధీభూతస్తృషార్తో మమ గర్తతటాశ్రితస్య సపరికరస్య శబ్దం శ్రుత్వా జలాశయం మత్వా సమభ్యేతి. తతో గర్తమాసాద్య పతిష్యతి పఞ్చత్వం యాస్యతి చేతి. ఏవం సమవాయః కర్తవ్యో యథా వైరసాధనం భవతి.'

అ. పిమ్మట ఆ మూడూ మేఘనాథుని ఎదుటికిపోయి విషయం అంతా తెలిపి కూర్చున్నాయి. అప్పుడు అతడు (మేఘనాథుడు) ఇలా నొక్కి చెప్పాడు— కోపం పొందిన ఈ మహాజనం (ప్రాణిసముదాయం) ముందు ఈ క్షుద్రమైన ఏనుగు ఎంత? కనుక నా ఆలోచన ప్రకారం చేయండి. ఓ ఈగా! నీవు మధ్యాహ్నవేళ మదగర్వితుడైన ఆ ఏనుగు వద్దకు పొమ్ము—అతని చెవిలో వీణానాదంవలె (మధురమైన) శబ్దం ఆలాపించుము. శ్రవణసుఖాసక్తుడై అతడు కన్నులు మూసికొనును. అప్పుడు కాష్ఠకూటుడుపోయి అతని కన్నులు పీకాలి (పెకలించాలి). పిమ్మట అతడు గ్రుడ్డివాడు అయి దాహంచే బాధితుడు అవుతాడు. ఆ సమయంలో నేను పరివార

సమేతంగా (బురద) గుంటవద్ద బెకబెక అరుస్తాను. దానిని విని అతడు చెరువుగా తలంచి వస్తాడు—(బురద) గుంటలోపడి కూరుకుపోతాడు—మరణిస్తాడు. ఇలా అంతా కలిసి (నేర్పుగా చేస్తే పగ తీర్చుకోవచ్చును'.

మూ. అథ తథానుష్ఠితే స మదగజో మక్షికాగేయసుఖాన్మిమీలితనేత్రః కాష్ఠకూటహృతచక్షుర్మధ్యాహ్నసమయే భ్రామ్యన్మణ్డూకశబ్దానుసారీ గచ్ఛన్మహాన్తం గర్తమాసాద్య పతితో మృతశ్చ. అతోఽహం బ్రవీమి—'చటకా కాష్ఠకూటేన- ఇతి.

అ. అంత అలాగే చేయగా ఈఁగ-గానంచే ఏనుగు ఆనందంతో కన్నులు మూసుకొంది. అప్పుడు వడ్రంగిపిట్ట దాని కిన్నులు పీకివేసింది. మధ్యాహ్నం కావడంతో ఏనుగు దప్పికగొంది. నీటికై ఇటునటు తిరుగుచు కప్పల అరుపులువింది. ఆ శబ్దాన్ని అనుసరించిపోయి (బురద) గుంటలో పడింది. చచ్చింది. అందుచే నేను (టిట్టిభి) చెప్పుచున్నాను—'చటకా కాష్ఠకూటేన'-(పిచ్చుక వడ్రంగి పిట్ట) ఇత్యాది.

మూ. టిట్టిభ ఆహ— 'భద్రే, ఏవం భవతు. సుహృద్వర్గసముదాయేన సహ సముద్రం శోషయిష్యామి.' ఇతి నిశ్చిత్య బకసారసమయూరాదీన్ సమాహూయ ప్రోవాచ— 'భోః పరాభూతోఽహం సముద్రేణాణ్డకాపహారేణ. తచ్చిన్త్యతామస్య శోషణోపాయః.' తే సమ్మన్త్ర్య ప్రోచుః— అశక్తా వయం సముద్రశోషణే. తత్కిం వృథా ప్రయాసేన? ఉక్తఞ్చ—

శ్లో. అబలః ప్రోన్నతం శత్రుం యో యాతి మదమోహితః
యుద్ధార్థం స నివర్తేత శీర్ణదన్తో గజో యథా. 371

తదస్మాకం స్వామీ వైనతేయోఽస్తి. తస్మై సర్వమేతత్పరిభవస్థానం నివేద్యతామ్, యేన స్వజాతిపరిభవకుపితో వైరానృణ్యం గచ్ఛతి. అథవాఽత్రావలేపం కరిష్యతి తథాపి నాస్తి వో దుఃఖమ్. ఉక్తఞ్చ—

శ్లో. సుహృది నిరన్తరచిత్తే గుణవతి భృత్యేఽనువర్తిని కలత్రే
స్వామిని శక్తిసమేతే నివేద్య దుఃఖం సుఖీ భవతి. 372

తద్యామో వైనతేయసకాశం యతోఽసావస్మాకం స్వామీ'.

అ. మగతీతువ చెప్పింది-'కళ్యాణి' ఇలాగే అగుగాక. మిత్రవర్గ సము దాయంతో కలిసి సముద్రుని ఇంకింప జేస్తాను ? ఇలా నిశ్చయించి కొంగలు బెగ్గురు పక్షులు నెమళ్లు మొదలైనవాటిని పిలిచి చెప్పింది- ఓ మిత్రులారా ! గ్రుడ్లను అపహ రించి సముద్రుడు దుఃఖం గల్గించాడు. అందుచే ఇతనిని శుష్కింపజేసే ఉపాయం ఆలోచించండి.'' వారు పరస్పరం ఆలోచనచేసి ఇలా అన్నారు— సముద్రాన్ని మనం శుష్కింపజేసే శక్తి మనకు లేదు. వ్యర్థంగా ప్రయాస ఎందులకు? పెద్దలు చెప్పారు—

బలహీనుడు మదగ్రాంతుడై మిక్కిలి ఉన్నతుడైన శత్రువుతో యుద్ధం చేయపోయినచో కోరలు ఊడిన ఏనుగువలె అవమానంతో తిరిగివస్తాడు.

అందువల్ల మన ప్రభువు గరుత్మంతుడు ఉన్నాడు. అతనికి ఈ దుఃఖ విషయం అంతా నివేదించాలి. తన జాతికి గల్గిన అవమానంచే కోపం పొంది అతడు పగతీర్చగలడు. అలా కాక ఈ విషయంలో (అతడు) అభిమానపడినా దుఃఖం లేదు. విజ్ఞులు ఇలా అన్నారు—

అభిన్న హృదయుడైన మిత్రునితో, గుణవంతుడైన సేవకునితో, అనుస రించే భార్యతో, బలవంతుడైన ప్రభువుతో- తన కష్టం తెలుపుకొని ప్రాణి, దుఃఖోప శాంతి (సుఖం) పొందును.

కనుక మన ప్రభువైన గరుడుని వద్దకు పోదాం!

మూ. తథాఽనుష్ఠితే సర్వే తే పక్షిణో విషణ్ణవదనా బాష్పపూరిత దృశో వైనతేయసకాశమాసాద్య కరుణస్వరేణ పూత్కర్తుమారబ్ధాః— 'అహో అబ్రహ్మణ్యమబ్రహ్మణ్యమ్. అధునా సదాచారస్య టిట్టిభస్య భగవతి నాథే సతి సముద్రేణాణ్డాన్యపహృతాని. తత్ప్రణష్టమధునా పక్షికులమ్. అన్యేఽపి స్వేచ్ఛయా సముద్రేణ వ్యాపాదయిష్యన్తే. ఉక్తఞ్చ—

శ్లో. ఏకస్య కర్మ సంవీక్ష్య కరోత్యన్యోఽపి గర్హితమ్
గతానుగతికో లోకో న లోకః పారమార్థికః. 373

అ. అలా చేయదలంచినవై పక్షులన్నీ విచార ముఖంగలవై— కన్నులలో

నీరు నిండగా గరుడుని చేరాయి. ఆర్త స్వరంతో నిట్టూర్పులు విడుస్తూ ఇలా విల వింప సాగాయి- 'అయ్యో! రక్షింపుము. రక్షింపుము. భగవానుడైన తాము ప్రభువై ఉండగా సద్వర్తనుడైన ఈ టిట్టిభం గ్రుడ్లను సముద్రుడు అపహరించాడు. కనుక నేడు పక్షికులం నశించింది ఇతర పక్షులను గూడ సముద్రుడు స్వేచ్ఛగా సంహ రిస్తాడు. విజ్ఞులు చెప్పారు—

ఒకచోట ఒకడు చెడుపనిని చేయుట చూచి ఇతరుడును అలాగే చేస్తాడు. ఇలా లోకం గొఱ్ఱెదాటుట వంటిది (గతాను గతికం). సత్యం గ్రహించి ప్రవర్తిల్లదు.

శ్లో. చాటు-తస్కర-దుర్వృత్తై స్తథా సాహసికాదిభిః
పీడ్యమానాః ప్రజా రక్ష్యాః కటు-చ్ఛద్మాదిభి స్తథా. 374

అ. ముఖస్తుతి చేసేవారు- దొంగలు, దుష్ప్రవర్తనులు, సాహసికులు - కఠిన హృదయులు, వంచకులు- ఇత్యాదుల బాధలనుండి ప్రజలను ప్రభువు రక్షించాలి.

శ్లో. ప్రజానాం ధర్మషడ్భాగో రాజ్ఞో భవతి రక్షితుః
అధర్మాదపి షడ్భా జాయతే యో న రక్షతి. 375

అ. ప్రజా రక్షకుడైన ప్రభువునకు ప్రజల ధర్మంలో ఆరవ భాగం లభి స్తుంది. (అలాగే) అరక్షకుడైన ప్రభువునకు ప్రజల అధర్మంలో ఆరవభాగం చెందుతుంది.

శ్లో. ప్రజాపీడనసన్తాపాత్ సముద్భూతో హుతాశనః
రాజ్ఞః శ్రియం కులం ప్రాణాన్ నాదగ్ధ్వా వినివర్తతే. 376

అ. పీడితప్రజల సంతాపంనుండి పుట్టిన అగ్ని, రాజు సంపదను కులాన్ని (తుదకు) ప్రాణాలను దహింపక చల్లారదు.

శ్లో. రాజా బన్ధురబన్ధూనాం రాజా చక్షురచక్షుషామ్
రాజా పితా చ మాతా చ సర్వేషాం న్యాయవర్తినామ్. 377

అ. ప్రభువే బంధురహితులకు బంధువు, గ్రుడ్డివారికి కన్ను అగును. న్యాయంగా ప్రవర్తిల్లే ప్రజల కందరకు తండ్రియు, తల్లియు ప్రభువే.

శ్లో. ఫలార్థీ పార్థివో లోకాన్ పాలయేద్యత్నమాస్థితః
దానమానాదితోయేన మాలాకారోఽఙ్కురానివ. 378

అ. ఫలార్థియైన తోటమాలి ప్రయత్నపూర్వకంగా నీరుపోయడం మొదలైన పనులచే మొక్కలను పెంచునట్లు- ఫలార్థియైన భూపాలుడు దానసన్మానాదికంచే, ప్రజలను శ్రద్ధవహించి పాలించాలి.

శ్లో. యథా బీజాఙ్కురః సూక్ష్మః ప్రయత్నేనాభిరక్షితః
ఫలప్రదో భవేత్కాలే తద్వల్లోకః సురక్షితః. 379

అ. బీజంనుండి వచ్చిన మొక్క చిన్నదైనా ప్రయత్న పూర్వకంగా రక్షితమై (వృక్షమైన) కాలమున ఫలాలను ఇచ్చునట్లు సురక్షితులైన ప్రజలును సమయానికి ఫలప్రదులు అగుదురు.

శ్లో. హిరణ్యధాన్యరత్నాని యానాని వివిధాని చ
తథాఽన్యదపి యత్కిఞ్చిత్ ప్రజాభ్యః స్యాన్నృపస్య తత్. 380

అ. బంగారం, ధాన్యం, రత్నాలు అశ్వాది వివిధవాహనాలు- అలాగే ప్రభువు వద్ద ఉండే సమస్తం ప్రజల నుండి లభించినవియే.'

మూ. అథైవం గరుడః సమాకర్ణ్య తద్దుఃఖదుఃఖితః కోపావిష్టః వ్యచిన్తయత్- 'అహో సత్యముక్తమేతైః పక్షిభిః. తదద్య గత్వా తం సముద్రం శోషయామః. ఏవం చిన్తయతస్తస్య విష్ణుదూతః సమాగత్యాహ- 'భో గరుత్మన్, భగవతా నారాయణేనాహం తవ పార్శ్వే ప్రేషితః. దేవకార్యాయ భగవానమరావత్యాం యాస్యతీతి. తత్సత్వరమాగమ్యతామ్'. తచ్ఛ్రుత్వా గరుడః సాభిమానం ప్రాహ- 'భో దూత, కిం మయా కుభృత్యేన భగవాన్ కరిష్యతి? తద్గత్వా తం వద, యదన్యో భృత్యో వాహనాయాస్మత్స్థానే క్రియతామ్. మదీయో నమస్కారో వాచ్యో భగవతః ఉక్తం చ-

శ్లో. యో న వేత్తి గుణాన్ యస్య న తం సేవేత పణ్డితః
న హి తస్మాత్ ఫలం కిఞ్చిత్ సుకృష్టాదూషరాదివ. 381

అ. అంత గరుడుడు ఇలా విని ఆ పక్షులదుఃఖంచే దుఃఖితుడై ఇట్లు తలంచాడు- 'ఆహా, ఈ పక్షులు సత్యం చెప్పాయి. అందుచే ఇప్పుడు పోయి ఆ సముద్రుణ్ణి ఎండిపోయేటట్లు చేస్తాను. ఈవిధంగా అతడు తలంచుచుండగా

విష్ణుదూత వచ్చి ఇలా చెప్పాడు- 'ఓ గరుడుడా! భగవానుడైన నారాయణుడు నన్ను నీవద్దకు పంపాడు. దేవతలపనిమీద భగవానుడు అమరావతికి (దేవనగరం) పోయె దరు. కనుక త్వరగా రమ్ము. దానిని విని గరుత్మంతుడు అభిమానంతో అన్నాడు- "ఓ దూతా! నావంటి చెడ్డ సేవకునిచే భగవానుడు ఏమి చేస్తాడు? అందుచే వేరొక సేవ కుని నాకు బదులుగా వాహనంగా చేసుకొనుడు'' అని పోయి భగవానునితో చెప్పుము. భగవానునికి నా నమస్కారములు తెలుపుము. విజ్ఞులు అన్నారు—

నీతిశాస్త్ర పండితుడైన సేవకుని, సేవకుల గుణాలను గ్రహింపజాలని ప్రభువును సేవింపరాదు. చవిటి నేలలో చేసిన చక్కటి వ్యవసాయంవలె ఆ సేవవల్ల ఏమీ ఉపయోగం లేదు

మూ. దూత ఆహ– 'భో వైనతేయ! కదాచిదపి భగవంతం ప్రతి త్వయా నైతదభిహితమీదృక్. తత్కథయ కిం తే భగవతాఽపమానస్థానం కృతమ్'? గరుడ ఆహ– 'భగవదాశ్రయభూతేన సముద్రేణాస్మట్టిట్టిభాణ్డాన్యప హృతాని. తద్యది తస్య నిగ్రహం న కరోతి తదహం భగవతో న భృత్య ఇత్యేష నిశ్చయస్త్వయా వాచ్యః. తద్ద్రుతతరం గత్వా భవతా భగవతః సమీపే వక్తవ్యమ్ '

అ. దూత అన్నాడు- 'ఓ వినతానందనా! నీవు ఒకనాడును భగవానుని గూర్చి ఈ విధంగా మాట్లాడలేదు. కనుక భగవానునిచే నీకు గల్గిన అవమానం ఏమిటో తెల్పుము.' గరుడుడు చెప్పాడు- 'భగవానునికి ఆశ్రయమైన సముద్రుడు ఈ టిట్టిభపక్షి గ్రుడ్లను అపహరించాడు. అందుకు అతన్ని భగవానుడు శిక్షింపనిచో నేను భగవానుని సేవకుడను గాను. ఇది నా నిశ్చయం, అని చెప్పాలి. కనుక తాము మిక్కిలి త్వరగా పోయి భగవానునికి (ఈ విషయం) చెప్పండి'.

మూ. అథ దూతముఖేన ప్రణయకుపితం వైనతేయం విజ్ఞాయ భగ వాంశ్చిన్తయామాస– 'అహో, స్థానే కోపో వైనతేయస్య. తత్స్వయమేవ గత్వా సమ్మానపురస్సరం తమానయామి. ఉక్తం చ–

శ్లో. భక్తం శక్తం కులీనఞ్చ న భృత్యమవమానయేత్
పుత్రవల్లాలయేన్నిత్యం య ఇచ్ఛేచ్ఛ్రియమాత్మనః. 382

అన్యచ్చ—

శ్లో. రాజా తుష్టో హి భృత్యానామర్థమాత్రం ప్రయచ్ఛతి
తే తు సమ్మానితా స్తస్య ప్రాణైరప్యుపకుర్వతే. 383

ఇత్యేవం సమ్ప్రధార్య రుక్మపురే వైనతేయసకాశం సత్వరమగమత్.

అ. అప్పుడు దూత ద్వారా- 'గరుడుడు ప్రణయ కోపంతో ఉన్నాడు'- అని తెలిసికొని ఇలా తలంచాడు- 'ఆహా! గరుడుని కోపము సముచితమే. కనుక స్వయంగా పోతాను. గౌరవపూర్వకంగా అతన్ని తీసికొని వస్తాను'. విజ్ఞులిలా అన్నారు—

తనకు సంపదను గోరే ప్రభువెవ్వడూ- భక్తుడూ, సమర్థుడూ, సత్కులీనుడూ అయిన సేవకుని అవమానింపరాదు. పుత్రునివలె లాలించాలి.

మరియూ- రాజు సంతోషిస్తే సేవకులకు ధనం మాత్రం ఇస్తాడు. కాని ఆ సేవకులు సన్మానితులై తమ ప్రాణాలు ఒడ్డి ఉపకరిస్తారు.

ఇలా నిశ్చయించి రుక్మపురానికి (గరుడ నగరానికి) గరుడుని వద్దకు త్వరగా వెళ్లాడు.

మూ. వైనతేయోఽపి గృహాగతం భగవన్తమవలోక్య త్రపాఽధోముఖః ప్రణమ్యోవాచ- 'భగవన్, త్వదాశ్రయోన్మత్తేన సముద్రేణ మమ భృత్యస్యాణ్డాన్యపహృత్య మమాపమానో విహితః. పరం భగవల్లజ్జయా మయా విలమ్బితమ్, నో చేదేనమహంమద్యైవ స్థలాన్తరం నయామి. యతః స్వామి భయాచ్ఛునకోపరి ప్రహారో న దీయతే. ఉక్తఞ్చ—

శ్లో. యేన స్యాల్లఘుతా వాథ పీడా చిత్తే ప్రభోః క్వచిత్
ప్రాణత్యాగేఽపి తత్కర్మ న కుర్యాత్ కులసేవకః. 384

అ. వైనతేయుడును (గరుడుడును) ఇంటికి వచ్చిన భగవానుని చూచాడు- సిగ్గుతో తలవంచాడు. ప్రణమిల్లి ఇలా పల్కాడు — 'దేవా! తమ ఆశ్రయంచే సముద్రుడు గర్వోన్మత్తుడై నా సేవకుని గ్రుడ్లను అపహరించి నాకు అవమానం చేశాడు. అయినా భగవానుని యెడల సంకోచంచే నేను ఆలస్యం చేశాను. లేనిచో నేను ఇప్పుడే

ఇతన్ని మహోకచోటికి చేర్చేవాడను. యజమానుని భయంతో (అతని) కుక్కను గూడ కొట్టరు గదా? విజ్ఞులు అన్నారు—

ఏ కార్యంచే ప్రభువునకు గౌరవభంగంగానీ, విచారంగానీ కల్గుతుందో— అలాంటి కార్యాన్ని కులక్రమాగత సేవకుడు ప్రాణాపాయ స్థితిలోనూ చేయరాదు.

మూ. తచ్ఛ్రుత్వా భగవానాహ— 'భో వైనతేయ, సత్యమభిహితం భవతా. ఉక్తఞ్చ—

శ్లో. భృత్యాపరాధజో దణ్డః స్వామినో జాయతే యతః
తేన లజ్జాఽపి తస్యోత్థా న భృత్యస్య తథా పునః. 385

తదాగచ్ఛ యేనాణ్డాని సముద్రాదాదాయ టిట్టిభం సమ్భావయావః, అమరావతీం చ గచ్ఛావః'.

అ. దానిని విని భగవానుడు అన్నాడు— 'ఓ వైనతేయా! నీవు సత్యం పల్కావు. విజ్ఞులు అన్నారు—

సేవకుడు తప్పుచేస్తే, దానికి శిక్షను ప్రభువు అనుభవింపవలసిఉంటుంది. ఆ తప్పువలన గల్గే అవమానం ప్రభువునకు ఉన్నంతగా సేవకునికి ఉండదు.

అందువల్ల, రమ్ము! ఆ గ్రుడ్లను సముద్రునినుండి తీసికొని టిట్టిభాన్ని ఓదార్చుదాము— అమరావతికినీ పోదము'.

మూ. తథాఽనుష్ఠితే సముద్రో భగవతా నిర్భర్త్స్యాఽగ్నేయం శరం సన్ధాయాభిహితః— 'భో దురాత్మన్, దీయన్తాం టిట్టిభాణ్డాని. నో చేత్ స్థలతాం త్వాం నయామి.' తతః సముద్రేణ సభయేన టిట్టిభాణ్డాని తాని ప్రదత్తాని. టిట్టిభేనాపి భార్యాయై సమర్పితాని. అతోఽహం బ్రవీమి— 'శత్రోర్బలమవిజ్ఞాయ ఇతి. తస్మాత్పురుషేణోద్యమో న త్యాజ్యః'.

అ. అటుల చేసిన మీదట భగవానుడు ఆగ్నేయాస్త్రం ఎక్కుపెట్టి సముద్రుణ్ణి బెదరిస్తూ ఇలా చెప్పాడు— 'ఓరీ దురాత్మా! తీతువ (టిట్టిభం) గ్రుడ్లు ఇమ్ము. లేనిచో నిన్ను (మరు) భూమిగా చేస్తాను! అప్పుడు సముద్రుడు భయపడి టిట్టిభం గ్రుడ్లు తెచ్చి ఇచ్చాడు. టిట్టిభము వాటిని భార్యకు సమర్పించింది. అందుచే నేను

(దమనకుడను) చెప్పుచున్నాను- 'శత్రోర్బలమవిజ్ఞాయ'-(శత్రువు బలం తెలియక) ఇత్యాది. కనుక పురుషుడు ప్రయత్నంవీడరాదు.

మూ. తదాకర్ణ్య సఞ్జీవక స్తమేవం భూయోఽపి పప్రచ్ఛ- 'భో, మిత్ర! కథం జ్ఞేయో మయాఽసౌ దుష్టబుద్ధిరితి. ఇయ న్తం కాలం యావదు త్తరో త్తర స్నేహేన ప్రసాదేన చాహం దృష్టః. న కదాచి త్తద్వికృతిర్దృష్టా. తత్కథ్యతాం యేనాహమాత్మరక్షార్థం తద్వధాయోద్యమం కరోమి'.

అ. దానిని విని సంజీవకుడు మరలా ఇలా అడిగాడు- 'ఓ మిత్రమా! అతడు చెడుబుద్ధితో ఉన్నాడు అని నేను ఎలా గ్రహించాలి? ఇంతకాలం దినదినం ప్రవర్ధమాన స్నేహంతో, అనుగ్రహంతో నన్ను అతడు చూచాడు. ఒకనాడును భేదభావం కనబడలేదు అందుచే తెలుపుము- ఏ విధంగా ఆత్మరక్షణకై అతన్ని చంపే ప్రయత్నం చేస్తాను?

మూ. దమనక ఆహ- 'భద్ర, కిమత్ర జ్ఞేయమ్. ఏష తే ప్రత్యయః. యది ర క్తనేత్రస్త్రిశిఖాం భ్రుకుటిం దధానః సృక్కిణీ పరిలేలిహన్ త్వాం దృష్ట్వా భవతి, తద్దుష్టబుద్ధిః. అన్యథా సుప్రసాదశ్చేతి. తదాజ్ఞాపయ మాం, స్వాశ్రయం ప్రతి గచ్ఛామి. త్వయా చ యథాఽయం మన్త్రభేదో న భవతి తథా కార్యమ్. యది నిశాముఖం ప్రాప్య గన్తుం శక్నోషి తద్దేశత్యాగః కార్యః. యతః-

శ్లో. త్యజేదేకం కులస్యార్థే గ్రామస్యార్థే కులం త్యజేత్
గ్రామం జనపదస్యార్థే స్వాత్మార్థే పృథివీం త్యజేత్. 386

శ్లో. ఆపదర్థే ధనం రక్షేద్దారాన్ రక్షేద్ధనైరపి
ఆత్మానం సతతం రక్షేద్దారైరపి ధనైరపి. 387

అ. దమనకుడు చెప్పాడు - 'శుభమూర్తీ! ఇందులో తెలియదగింది ఏముంది? నిన్ను చూడగానే కన్నులు ఎఱ్ఱగాజేసి కనుబొమ్మలు పెనవేసి, పెదవులు (నాల్కతో) నాకుతూ ఉండెనేని దుష్టబుద్ధి అనియూ, అలా కానిచో ప్రసన్నుడు అనియు నీవు నిశ్చయించుకొనుము. నాకు సెలవు ఇమ్ము- నా నివాసం పోయెద.

ఈ రహస్యం బయటికి పొక్కనట్లుగా మీరు ప్రవర్తిల్లాలి. పోవడానికి శక్తుడవైనచో సంధ్యా-సమయంలో ఈదేశం విడువండి-ఏలననగా (పెద్దలు అన్నారు)-

కులక్షేమానికై ఒక వ్యక్తినీ,గ్రామక్షేమానికై ఒక కులాన్నీ, దేశక్షేమానికై ఒక గ్రామాన్నీ, తన రక్షణకై నివాసభూమినీ వదలి వేయాలి.

ఆపదలో ఉపయోగానికై ధనాన్ని రక్షించాలి. ధనం వ్యయంచేసి అయినా భార్యను రక్షించాలి. భార్యను ధనాన్ని పణంగాజేసి అయినా తనను నిత్యం రక్షించుకోవాలి.

మూ. బలవతాఽభిభూతస్య విదేశగమనం తదనుప్రవేశో వా నీతిః. తద్దేశత్యాగః కార్యః. అథవాఽఽత్మా సామాదిభిరుపాయైరభిరక్షణీయః ఉక్తఞ్చ-

శ్లో. అపి పుత్రకలత్రైర్వా ప్రాణాన్ రక్షేత పణ్డితః
విద్యమానైర్యతస్తైః స్యాత్ సర్వం భూయోఽపి దేహినామ్. 388

తథా చ--

శ్లో. యేన కేనాప్యుపాయేన శుభేనాప్యశుభేన వా
ఉద్ధరేద్దీనమాత్మానం సమర్థో ధర్మమాచరేత్. 389

శ్లో. యో మాయాం కురుతే మూఢః ప్రాణత్యాగే ధనాదిషు
తస్య ప్రాణాః ప్రణశ్యన్తి తైర్నష్టైర్నష్టమేవ తత్. 390

ఏవమభిధాయ దమనకః కరటకసకాశమగమత్.

అ. బలవంతునిచే అభిభూతునికి (ఆక్రాంతునకు-అవమానితునకు) పరదేశం వెళ్లడం—లేదా అతనికి లోబడి ఉండడం నీతి. అందువల్ల ఇప్పుడు దేశం వదలడమే శుభం. అలా కానిచో సామాది ఉపాయాలచే ఆత్మరక్షణ చేసికొనాలి. విజ్ఞులు చెప్పారు—

రాజనీతి పండితుడైనవాడు భార్యాపుత్రులను వదలియైనా ప్రాణాలను, రక్షించుకొనాలి. ప్రాణాలు ఉన్నచో మరలా వాటిని పొందవచ్చును.

ఆపదలో ఉండేవాడు ఏదో ఒక ఉపాయం-అది మంచిదైనా చెడ్డది అయినా ఆచరించి ఆత్మరక్షణ చేసికొనాలి. మరల సమర్థుడై ధర్మం ఆచరింపవచ్చును.

ఎవడు మూర్ఖుడై ప్రాణాలు పోవుచున్నా ధనాదికంపై మమతను(మాయను) ఉంచుకొనునో, వానికి ప్రాణాలు పోతాయి. అని పోగానే ధనాదికం నశించినట్లే. (తనవెంట ఏదీరాదు,)

ఇలా పలికి దమనకుడు కరటకునివద్దకు పోయాడు.

మూ. కరటకోఽపి తమాయాన్తం దృష్ట్వా ప్రోవాచ— 'భద్ర, కిం కృతం తత్రభవతా? దమనక ఆహ— 'మయా తావన్నీతిబీజనిర్వాపణం కృతమ్. పరతో దైవవిహితాయత్తమ్. ఉక్తఞ్చ—

శ్లో. పరాఙ్ముఖేఽపి దైవేఽత్ర కృత్యం కార్యం విపశ్చితా
ఆత్మదోషవినాశాయ స్వచిత్తస్తమ్భనాయ చ. 301

తథా చ—

శ్లో. ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీః
దైవం హి దైవమితి కాపురుషా వదన్తి,
దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః. 302

అ. కరటకుడు వచ్చే అతనిని (దమనకుని) చూచి ఇలా అన్నాడు— శుభమూర్తీ! పూజ్యులైన తాము ఏమి చేశారు ? దమనకుడు చెప్పాడు- 'నేను(భేద) నీతి-బీజాలను నాటాను. ఆ పైన దైవాధీనం. విజ్ఞులు తెలిపారు—

విద్వాంసుడైనవాడు దైవం ప్రతికూలంగా ఉన్నా, తన దోషాలను తొలగించుకొనేందుకు తన మనస్సుకు ధైర్యం గల్గేందుకు చేయదగిన పనిని చేయాలి.

అటులనే, ప్రయత్నపరుడైన పురుషశ్రేష్ఠుని వద్దకు విజయలక్ష్మి వస్తుంది. భాగ్యం భాగ్యం- అని పిఱికివారు అంటారు. భాగ్యాన్ని (అదృష్టాన్ని) తలంపక యథా శక్తి పురుషార్థానికి యత్నించాలి. ప్రయత్నించినా కార్యం సిద్ధింపనిచో అందు మన దోషం ఏమున్నది?''

మూ. కరటక ఆహ— 'తత్కథయ కీదృక్ త్వయా నీతిబీజం నిర్వాపితమ్'. సోఽబ్రవీత్— మయాఽన్యోన్యం తాభ్యాం మిథ్యాప్రజల్పనేన భేదస్తథా

విహితో యథా భూయోఽపి మన్త్రయన్తావేకస్థానస్థితౌ న ద్రక్ష్యసి'. కరటక ఆహ– 'అహో న యుక్తం భవతా విహితం యత్పరస్పరం తౌ స్నేహార్ద్రహృదయౌ సుఖాశ్రయౌ కోపసాగరే ప్రక్షిప్తౌ. ఉక్తఞ్చ–

శ్లో. అవిరుద్ధం సుఖస్థం యో దుఃఖమార్గే నియోజయేత్
జన్మజన్మాన్తరం దుఃఖీ స నరః స్యాదసంశయమ్. 393

అపరం త్వం యద్భేదమాత్రేణాపి హృష్టస్తదప్యయుక్తమ్. యతః సర్వోఽపి జనో విరూపకరణే సమర్థో భవతి నోపకర్తుమ్. ఉక్తఞ్చ–

శ్లో. ఘాతయితుమేవ నీచః పరకార్యం వేత్తి న ప్రసాధయితుమ్
పాతయితుమస్తి శక్తిర్వాయోర్వృక్షం న చోన్నమితుమ్. 394

అ. కరటకుడు అన్నాడు–'నీవు ఏలాటి (భేద) నీతి బీజం నాటావో, అది తెలుపుము !' అతడు (దమనకుడు) చెప్పాడు–'నేను ఒకరిమీద ఒకరికి అసత్యవాక్కుల ద్వారా భేదం (నాటాను) సృష్టించాను. ఇక మరలా వారిరువురు ఒకచోట కూర్చుండి ఆలోచన చేయడం నీవు చూడవు. కరటకుడు అన్నాడు–'అయ్యో! నీవు చేసినది మంచిపనిగాదు. పరస్పరం స్నేహార్ద్రహృదయులు, సుఖనిలయులూ అయిన వారిరువురినీ కోపసముద్రంలో పడవేశావు.' జ్ఞానులు ఇలా అన్నారు—

తనకు విరోధికానివాడూ, సుఖంగా ఉండేవాడూ అయిన మానవుని, ఎవడు దుఃఖమార్గంలో ప్రవేశపెట్టునో, ఆ మానవుడు జన్మజన్మాంతరాలు దుఃఖం అనుభవిస్తాడు. సందేహంలేదు.

మరియు నీవు (ఇరువురు మిత్రులలో) భేదం గల్గించడంచేతనే సంతోషిస్తున్నావు. అదియు సముచితంగాదు. ఏలనన–విరోధం గల్గించడంలో అందరూ సమర్థులే, ఉపకారం చేయడానికి పనికిరారు. విజ్ఞులు అన్నారు—

నీచుడు పరుల పనిని చెడగొట్టడం మాత్రం ఎరుగును. చక్కదిద్దడం చేయలేడు. వాయువు వృక్షాన్ని పడగొట్టగలదు. నిలబెట్టడం చేయలేదు.

మూ. దమనక ఆహ– 'అనభిజ్ఞో భవాన్ నీతిశాస్త్రస్య. తేనైతద్ బ్రవీషి. ఉక్తఞ్చ యతః–

శ్లో. జాతమాత్రం న యః శత్రుం వ్యాధిం చ ప్రశమం నయేత్
మహాబలోఽపి తేనైవ వృద్ధిం ప్రాప్య స హన్యతే. 395

తచ్ఛత్రుభూతోఽయమస్మాకం మన్త్రిపదాపహరణాత్. ఉక్తఞ్చ—

శ్లో. పితృపైతామహం స్థానం యో యస్యాత్ర జిగీషతే
స తస్య సహజః శత్రురుచ్ఛేద్యోఽపి ప్రియే స్థితః. 396

అ. దమనకుడు అన్నాడు—తమకు రాజనీతి శాస్త్రం తెలియదు. అందుచే ఇలా పల్కుచున్నారు. విజ్ఞులు చెప్పారు—

పుట్టగానే శత్రువునుగాని వ్యాధినిగాని ఎవడు అణచి వేయడో, వాడు ఎంత బలవంతుడైనా, వృద్ధినందిన ఆ—శత్రు—రోగాలవల్ల మరణిస్తాడు.

అందువల్ల ఈ సంజీవకుడు మన మంత్రిపదవిని హరించడంతో మనకు శత్రువయ్యాడు. పెద్దలు అన్నారు—

ఎవని తండ్రి తాతలనాటి స్థానాన్ని ఎవడు హరింపదలుస్తాడో, వాడు అతనికి సహజ శత్రువు వాడు (తన) మేలుకోరేవాడైనా ఛేదింపదగిన వాడు అగును.

మూ. తన్మయా స ఉదాసీనతయా సమానీతోఽభయప్రదానేన యావ త్తావదహమపి తేన సాచివ్యాత్ ప్రచ్యావితః. అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. దద్యాత్సాధుర్యది నిజపదే దుర్జనాయ ప్రవేశం
తన్నాశాయ ప్రభవతి తతో వాఞ్ఛమానః స్వయం సః,
తస్మాద్దేయో విపులమతిభిర్నావకాశోఽధమానాం
జారోఽపి స్యాత్ గృహపతిరితి శ్రూయతే వాక్యతోఽత్ర. 397

అ. నేను (మొదట) రాగద్వేషరహితంగా (ఉదాసీనతతో) అతనికి అభయదానం ఇచ్చి తెచ్చాను. కాని నేడు వెంటనే అతడు నన్ను మంత్రిపదవినుండి తొలగించాడు. పెద్దలు ఈ విషయం చక్కగా చెప్పారు—

ఎవడేని సజ్జనుడు తన స్థానంలో దుర్జనునికి ప్రవేశం గల్గిస్తే, ఆ దుర్జనుడు ఆతని (సజ్జనుని) స్థానంగోరుచూ అతనిని (సజ్జనుని) నాశముజేయ సమర్థుడు

అగును. అందుచే బుద్ధిమంతులు నీచులకు అవకాశం ఇవ్వరాదు. ఇలా లోకంలో జనశ్రుతి గలదు-మిండగాడు ఇంటికి యజమాని అగును.

మూ. తేన మయా తస్యోపరి వధోపాయ ఏష విరచ్యతే. దేశత్యాగాయ వా భవిష్యతి. తచ్చ త్వాం ముక్త్వాఽన్యో న జ్ఞాస్యతి, తద్యుక్తమేతన్మే స్వార్థాయానుష్ఠితమ్. ఉక్తఞ్చ-

శ్లో. నిస్త్రింశం హృదయం కృత్వా వాణీమిక్షురసోపమామ్
వికల్పోఽత్ర న కర్తవ్యో హన్యాత్తత్రాపకారిణమ్. 398

అ. అందుచే నేను అతన్ని చంపడానికి ఈ కుట్ర చేస్తున్నాను. అలా (చంపడం) కానిచో దేశత్యాగం గల్గవచ్చు ఇది నీకు దప్ప ఇతరులకు తెలియదు. స్వార్థానికై నేను ఇలా చేయడం సముచితమే. పెద్దలు అన్నారు-

హృదయాన్ని ఖడ్గంవలె కఠినంగాను, వాక్కును చెరకు రసంవలె తియ్యగా చేసికొని అపకారిని వధించాలి. ఇందు సందేహింపరాదు.

మూ. అపరం మృతోఽప్యస్మాకం భోజ్యో భవిష్యతి. తదేకం తావద్వైరసాధనమ్, అపరం సాచివ్యఞ్చ భవిష్యతి, తృప్తిశ్చేతి (తృతీయం ఫలమ్). తద్గుణత్రయేఽస్మిన్నుపస్థితే కస్మాన్మాం దూషయసి త్వం జాడ్యభావాత్. ఉక్తం చ-

శ్లో. పరస్య దూషణం కుర్వన్ స్వార్థసిద్ధిఞ్చ పణ్డితః
మూఢబుద్ధిర్న భక్షేత వనే చతురకో యథా.' 399

కరటక ఆహ- 'కథమేతత్?' స ఆహ-

అ. ఇంతేగాక (సంజీవకుడు) చచ్చినచో మనకు ఆహారం అగును. ఇలా ఒకటి పగ తీర్చుకొనడం, రెండు మంత్రి పదవి, మూడు తినడంవల్ల తృప్తి. ఇలా మూడు ఉపయోగాలు ఉండగా మందబుద్ధివై నన్ను ఎందుకు దూషిస్తావు? పెద్దలు అన్నారు-

రాజనీతిపండితులు ఇతరులను పీడించి అయినా తమ స్వార్థం అడవిలో చతురకునివలె సాధిస్తారు. మూఢచిత్తుడు (సింహంవలె) లభించినదాన్ని సైతం భక్షింపలేడు.

కరటకుడు అడిగాడు—'అది ఎట్లు?' అతడు(దమనకుడు) ఇలా చెప్పాడు-

## కథా_16

## సింహ-శృగాల-కథా

మూ. అస్తి కస్మింశ్చిద్వనోద్దేశే వజ్రదంష్ట్రో నామ సింహః. తస్య చతురక-క్రవ్యముఖనామానౌ శృగాలవృకౌ భృత్యభూతౌ సదైవానుగతౌ తత్రైవ ప్రతివసతః. అథాన్యదినే సింహేన కదాచిదాసన్నప్రసవా ప్రసవవేదనయా స్వయూథాద్ భ్రష్టోష్ట్ర్యుపవిష్టా కస్మింశ్చిద్వనగహనే సమాసాదితా. అథ తాం వ్యాపాద్య యావదుదరం స్ఫోటయతి తావజ్జీవన్ లఘుదాసేరకశిశుర్నిష్క్రాన్తః. సింహోఽపి దాసేరక్యాః పిశితేన సపరివారః పరాం తృప్తిముపాగతః. పరం స్నేహాద్ బాలదాసేరకం త్యక్తం గృహమానీయేదమూచే— 'భద్ర, న తేఽస్తి భయం మృత్యోర్మత్తో నాన్యస్మాదపి. తతః స్వేచ్ఛయాఽత్ర వనే భ్రామ్యతామితి. యతస్తే శఙ్కుసదృశౌ కర్ణౌ, తతః శఙ్కుకర్ణో నామ భవిష్యతి.'

అ. ఒకానొక అడవిలో వజ్రదంష్ట్రుడు అనే సింహం ఉంది. అతనికి చతురకుడు అనే నక్క, క్రవ్యముఖుడు అనే తోడేలు- ఇరువురు స్నేహితులు గలరు. వారు ఇరువురు నిత్యం అతనివెంట తిరుగుచూ ఆ అడవిలోనే నివసించేవారు. అంత ఒకదినం సింహానికి భయంకరమైన అడవిలో కాన్పు సమీపించడంవల్ల కాన్పు బాధతో తన గుంపునుండి విడిపోయి [ఒకచోట] కూర్చుండిన ఆడఒంటె దొరికింది. అప్పుడు దాన్ని చంపి పొట్టను చీల్చగానే అందుండి బ్రతికిఉండే ఒక ఒంటెకూన బయటికి వచ్చింది. సింహం ఆడఒంటె మాంసంతో పరివారసమేతంగా మిక్కిలి తృప్తిని పొందింది. కాని ప్రేమతో ఒంటెపిల్లను చంపలేదు. ఇంటికి తెచ్చి ఇలా చెప్పింది— 'భద్ర, నీకు నావలా, ఇతరులవల్లా మరణ భయంలేదు. కనుక స్వేచ్ఛగా ఈ అడవిలో తిరుగుచూ ఉండుము. నీ చెవులు శంకువులవలె ఉన్నాయి. అందుచే నీ పేరు శంకుకర్ణుడు' [అని పేరు పెట్టెదను].

మూ. ఏవమనుష్ఠితే చత్వారోఽపి త ఏకస్థానవిహారిణః పరస్పరమనేకప్రకారగోష్ఠీసుఖమనుభవన్తస్తిష్ఠన్తి. శఙ్కుకర్ణోఽపి యౌవనపదవీమారుఢః న

తం సింహం ముంచతి. అథ కదాచిద్వజ్రదంష్ట్రస్య కేనచిద్వన్యేన మత్తగజేన సహ యుద్ధమభవత్. తేన మదవీర్యాత్ స దన్తప్రహారై స్తథా క్షతశరీరో విహితో యథా ప్రచలితుం న శక్నోతి. తదా క్షుత్క్షామకణ్ఠస్తాన్ ప్రోవాచ– 'భోః, అన్విష్యతాం కిఞ్చిత్సత్త్వం యేనాహమేవంస్థితోఽపి తం వ్యాపాద్యాఽత్మనో యుష్మాకం చ క్షుత్ప్రణాశం కరోమి.' తచ్ఛ్రుత్వా తే త్రయోఽపి వనే సన్ధ్యాకాలం యావద్భ్రాన్తాః పరం న కిఞ్చిత్సత్త్వమాసాదితమ్.

అ. ఇలా అభయదానం ఇచ్చిన తర్వాత ఆ నల్గురు ఒకేచోట కలిసి విహరిస్తూ తమలో తాము బహువిధ చర్చలు చేస్తూ సుఖంగా ఉండదొడగిరి. శంకుకర్ణుడు క్రమంగా యౌవనం పొందాడు. క్షణకాలమైనా ఆ సింహాన్ని విడిచి ఉండేవాడు కాదు. అంత ఒకనాదు వజ్రదంష్టునికి ఒకానొక అడవి ఏనుగుతో యుద్ధం సంభవించింది. ఆ యుద్ధంలో మదపుటేనుగు (యొక్క) కోరల దెబ్బలచే అతడు మిక్కిలి గాయపడ్డాడు. ఒక అడుగుకూడ కదలలేని అవస్థపొందాడు. ఆకలిచే ఎండిన గొంతుతో తక్కిన ముగ్గురితో ఇలా అన్నాడు- 'ఓ మిత్రులారా! ఏదేని జంతువును వెదకండి. దానిని చంపి నాకు, మీకు ఆకలిని తొలగిస్తాను.' దానిని విని ఆ ముగ్గురు అడవిలో సాయంకాలం వరకు తిరిగారు. కాని ఏ ప్రాణీ లభించ లేదు.

మూ. అథ చతురకశ్చిన్తయామాస–'యది శఙ్కుకర్ణోఽయం వ్యాపాద్యేత తతః సర్వేషాం కతిచిద్దినాని తృప్తిర్భవతి. పరం నైనం స్వామీ మిత్రత్వాదాశ్రయసమాశ్రితత్వాచ్చ వినాశయిష్యతి. అథవా బుద్ధిప్రభావేణ స్వామినం ప్రతిబోధ్య తథా కరిష్యే యథా వ్యాపాదయిష్యతి. ఉక్తం చ-

శ్లో. అవధ్యం చాథవాగమ్యమకృత్యం నాస్తి కించన
లోకే బుద్ధిమతాం బుద్ధేస్తస్మాత్తాం వినియోజయేత్. 400

ఆ. అంత చతురకుడు తలంచాడు— 'ఈ శంకుకర్ణుని చంపితే అందరికి కొన్ని దినాలు తృప్తిగా ఉంటుంది, కాని మిత్రభావంతోనూ, ఆశ్రితుడు కావడంతోనూ ప్రభువు ఇతన్ని చంపడు. అయినా ప్రభువునకు బోధించి ఇతన్ని చంపేటట్లు చేస్తాను విజ్ఞులు చెప్పారు—

ఈ ప్రపంచంలో ప్రతిభావంతుల బుద్ధికి అవధ్యం, అగమ్యం, అకృత్యం అయినది ఏదీ లేదు. కనుక ఆ బుద్ధిని ఉపయోగించాలి.

మూ. ఏవం విచిన్త్య శఙ్కుకర్ణమిదమాహ–'భోః శఙ్కుకర్ణ, స్వామి తావత్ పథ్యం వినా క్షుధయా పరిపీడ్యతే. స్వామ్యభావాదస్మాకమపి ధ్రువం వినాశ ఏవ. తతో వాక్యం కిఞ్చిత్ స్వామ్యర్థే వదిష్యామి. తచ్ఛ్రూయతామ్.' శఙ్కుకర్ణ ఆహ– 'భోః శీఘ్రం నివేద్యతామ్, యేన తే వచనం శీఘ్రం నిర్వికల్పం కరోమి. అపరం స్వామినో హితే కృతే మయా సుకృతశతం కృతం భవిష్యతి.'

అ. ఇలా తలంచి శంకుకర్ణునితో ఇట్లు చెప్పాడు–' ఓ శంకుకర్ణా! స్వామి ఆహారంలేక ఆకలితో మిక్కిలి బాధ పడుచున్నాడు. స్వామిలేనిచో మనకు అందరికీ తప్పక వినాశమే. అందువల్ల స్వామి కొరకు ఒక చిన్నది చెప్పెదను వినుము' శంకుకర్ణుడు అన్నాడు—'మిత్రమా, శీఘ్రంగా తెలుపుము. నీ మాటను వెంటనే నిస్సందేహంగా ఆచరిస్తాను. మరియూ స్వామికి మేలుచేస్తే నూరంతలు పుణ్యం సంభవిస్తుంది.

మూ. అథ చతురక ఆహ– 'భో భద్ర, ఆత్మశరీరం ద్విగుణలాభేన స్వామినే ప్రయచ్ఛ. యేన తే ద్విగుణం శరీరం భవతి, స్వామినః పునః ప్రాణయాత్రా భవతి'. తదాకర్ణ్య శంకుకర్ణ ఆహ– 'భద్ర యద్యేవం తన్మదీయప్రయోజనమేతదుచ్యతామ్. స్వామ్యర్థః క్రియతామితి పరమత్ర ధర్మః ప్రతిభూః ఇతి. తే విచిన్త్య సర్వే సింహసకాశమాజగ్ముః. తతశ్చతురక ఆహ– 'దేవ, న కిఞ్చిత్ సత్త్వం ప్రాప్తమ్. భగవానాదిత్యోఽప్యస్తం గతః. త్వదది స్వామీ ద్విగుణం శరీరం ప్రయచ్ఛతి, తతః శఙ్కుకర్ణోఽయం ద్విగుణవృద్ధ్యా స్వశరీరం ప్రయచ్ఛతి ధర్మప్రతిభువా'. సింహ ఆహ– భో యద్యేవం సున్దరతరమ్ వ్యవహారస్యాస్య ధర్మః ప్రతిభూః క్రియతామ్' ఇతి.

అ. అంత చతురకుడు చెప్పాడు— ' ఓ శుభమూర్తీ! నీ శరీరాన్ని రెండంతలు లాభంతో (వడ్డీతో) ప్రభువునకు ఇమ్ము. అందుచే నీకు శరీరం రెండురెట్లు పెరుగును. ప్రభువునకును జీవయాత్ర జరుగుతుంది. దానిని విని శంకుకర్ణుడు

అన్నాడు—'అయ్యా! ఇలా అయితే నా యీ ప్రయోజనం (అభిప్రాయం) తెల్పండి, ప్రభువునకు శరీరం అర్పింపబడుతుంది. కాని ఈ విషయంలో ధర్మదేవతను సాక్షిగా ఉంచండి.' ఇలా ఆలోచించినారు ముగ్గురు (చతురకుడు-క్రవ్యాముఖుడు-శంకుకర్ణుడు) సింహంవద్దకు వచ్చారు. అప్పుడు చతురకుడు చెప్పాడు—'దేవా! ఏ ప్రాణీ లభింప లేదు. భగవానుడైన సూర్యుడును అస్తమించాడు. ప్రభువుల వారు రెండురెట్లు శరీరం ఇచ్చునట్లైనచో అప్పుడు ఈ శంకుకర్ణుడు రెండురెట్లు వృద్ధిపై (వడ్డీపై) ధర్మ దేవతను సాక్షిగా ఉంచుకొని తన శరీరం ఇస్తాడు! సింహం ఇలా అంది— 'ఓయీ! ఇలా అయితే మిక్కిలి అందంగా ఉంది. ఈ వ్యవహారానికి (ఋణస్వీకృతికి) ధర్మ దేవతను సాక్షిగా చేయండి.

మూ. అథ సింహవచనానంతరం వృకశృగాలాభ్యాం విదారితోభయ కుక్షిః శఙ్కుకర్ణః పంచత్వముపాగతః. అథ వజ్రదంష్ట్రశ్చతురకమాహ– 'భోశ్చతురక, యావదహం నదీం గత్వా స్నానం దేవతార్చనవిధిం కృత్వాఽఽ గచ్ఛామి, తావత్త్వయాఽత్రాఽప్రమత్తేన భావ్యమ్' ఇత్యుక్త్వా నదీం గతః. అథ తస్మిన్ గతే చతురకశ్చిన్తయామాస– కథం మమైకాకినో భోజ్యోఽయముష్ట్రో భవిష్యతి' ఇతి విచింత్య క్రవ్యముఖమాహ– భోః క్రవ్యముఖ! క్షుధాలుర్భవాన్. తద్యావదసౌ స్వామీ నాగచ్ఛతి, తావత్త్వమస్యోష్ట్రస్య మాంసం భక్షయ. అహం త్వాం స్వామినో నిర్దోషం ప్రతిపాదయిష్యామి.'

అ. సింహం అలా అనగానే తోడేలు, నక్క రెండూ శంకుకర్ణుని పొట్టలు రెండింటినీ చీల్చి చంపివేశాయి. అప్పుడు వజ్రదంష్ట్రుడు (సింహం) చతురకునితో అన్నాడు– 'నేను నదికిపోయి స్నానం దేవతాపూజ చేసి వచ్చేంతవరకు నీవు జాగ్ర త్తగా (ఇచ్చట కాపలా) ఉండుము, ఇలా చెప్పి వెళ్లాడు. అంత అతడు పోగానే చతురకుడు ఇలా ఆలోచించాడు– 'నాకు ఒక్కనికే ఈ ఒంటె ఎలా ఆహారం కాగ లదు?'– ఇలా ఆలోచించి క్రవ్యముఖునితో చెప్పాడు– 'ఓయీ క్రవ్యముఖా! నీవు ఆకలితో ఉన్నావు. ప్రభువు వచ్చేలోపల నీవు ఈ ఒంటె మాంసం తినుము. నేను నిన్ను ప్రభువునకు నిర్దోషిగా సిద్ధింపజేస్తాను.

మూ. సోఽపి తచ్ఛ్రుత్వా యావత్కిఞ్చిన్మాంసమాస్వాదయతి తావ చ్చతురకేణోక్తమ్– 'భోః క్రవ్యముఖ, సమాగచ్ఛతి స్వామీ. తత్ త్యక్త్వేనం దూరే తిష్ఠ యేనాస్య భక్షణం న వికల్పయతి.' తథాఽనుష్ఠితే సింహః సమాయాతో యావదుష్ట్రం పశ్యతి తావద్రిక్తీభూతహృదయో దాసేరకః. తతో భ్రుకుటిం కృత్వా పరుషతరమాహ– 'అహో, కేనైష ఉష్ట్ర ఉచ్ఛిష్టతాం నీతో యేన తమపి వ్యాపాదయామి. ఏవమభిహితే క్రవ్యముఖశ్చతురకమవలోకయతి. అథ చతురకో విహస్యోవాచ– 'భో, మామనాదృత్య పిశితం భక్షయిత్వాఽధునా మన్ముఖమవలోకయసి? తదాస్వాదయాస్య దుర్నయతరోః ఫలమ్' ఇతి. తదాకర్ణ్య క్రవ్యముఖో జీవనాశభయాద్దూరదేశం గతః.

అ. అతడును (క్రవ్యముఖుడును) దానిని విని కొంచెం మాంసం రుచిచూడగానే-చతురకుడు అన్నాడు– 'ఓయీ క్రవ్యముఖా! ప్రభువు వచ్చుచున్నాడు. అందుచే తినడం వదలి ప్రభువునకు సందేహం రానట్లు దూరంగా పొమ్ము. అలా చేయగానే సింహం వచ్చింది. ఒంటెను చూచింది. ఒంటెకు గుండెకాయ లేకపోవడం గుర్తించింది కనుబొమలు పెనవేసి క్రోధంతో పల్కింది– 'ఓరీ! ఎవడు ఈ ఒంటెను ఎంగిలి చేశాడు? వాణ్ణి కూడ సంహరిస్తాను.' ఇలా అనగానే క్రవ్యముఖుడు చతురకుని మొగంవైపు చూచాడు. అప్పుడు చతురకుడు నవ్వి ఇలా చెప్పాడు. 'ఓరీ! నన్ను నిర్లక్ష్యంచేసి మాంసం తిని ఇప్పుడు నా మొగం చూస్తున్నావు. కనుక ఈ పాపవృక్షఫలం రుచిచూడుము.' దానిని విని క్రవ్యముఖుడు ప్రాణభీతితో దూరంగా పారిపోయాడు.

మూ. ఏతస్మిన్నన్తరే తేన మార్గేణ దాసేరకసార్థో భారాక్రాన్తః సమాయాతః. తస్యాగ్రేసరోష్ట్రస్య కణ్ఠే మహతీ ఘణ్టా బద్ధా. తస్యాః శబ్దం దూరతోఽప్యాకర్ణ్య సింహో జమ్బుకమాహ– 'భద్ర, జ్ఞాయతాం కిమేష రౌద్రః శబ్దః శ్రూయతేఽశ్రుతపూర్వః? తచ్ఛ్రుత్వా చతురకః కిఞ్చిద్వనాన్తరం గత్వా సత్వరమభ్యుపేత్య ప్రోవాచ– స్వామిన్, గమ్యతాం గమ్యతాం యది శక్నోషి గన్తుమ్.' సోఽబ్రవీత్– భద్ర, కిమేవం మాం వ్యాకులయసి? తత్కథయ,

కిమేతత్? ఇతి చతురక ఆహ– 'స్వామిన్, ఏష ధర్మరాజ స్తవోపరి కుపితః యదనేన దానేరకోఽయమకాలే మదీయో వ్యాపాదితః. తత్సహస్రగుణముష్ట్రి మస్య సకాశాద్గ్రహీష్యామి– ఇతి నిశ్చిత్య బృహన్మానమాదాయాగ్రేసరోష్ట్రస్య గ్రీవాయాం ఘణ్టాం బద్ధ్వా వధ్యదానేరకసక్తానపి పితృపితామహానాదాయ వైర నిర్యాతనార్థమాయాత ఏవ'.

అ. ఇంతలో ఆ చారిన బరువులు (సామానులు) మోస్తూ ఒంటెల గుంపు వచ్చింది. అందు ముందు నడిచే ఒంటె మెడకు పెద్దగంట కట్టబడి ఉంది. దాని శబ్దం దూరం నుండియే విని సింహం నక్కతో ఇలా అంది– 'శుభమూర్తీ, తెలిసికొని రమ్ము ఏదో భయంకరశబ్దం వినబడుతూంది. ఇలాంటి శబ్దాన్ని మునుపెన్నడూ వినలేదు.' దానిని విని చతురకుడు అడవిలో కొంతదూరం పోయాడు– వేగంగా తిరిగి వచ్చాడు. ఇలా నొక్కి పలికాడు. 'స్వామీ! పరుగెత్తండి. పరుగెత్తే శక్తి ఉంటే పరుగెత్తండి. అతడు (వజ్రదంష్ట్రుడు)అడిగాడు– 'సౌమ్యమూర్తి! నన్నెందుకిలా వ్యాకులపరుస్తున్నావు? ఇదేమిటో (స్ఫుటంగా) చెప్పుము. చతురకుడు చెప్పాడు– 'ప్రభూ! కాలం తీరకముందే నా ఒంటెను వీడు చంపాడు– అని యమధర్మరాజు మీపై కోపం చెందాడు. అందువల్ల ఆ ఒంటెకు వెయ్యిఅంతలు ఇతనినుండి గ్రహిస్తాను– అని నిశ్చయించి, పెక్కు ఒంటెలను తీసికొన్నాడు– ముందు నడిచే ఒంటె మెడకు గంట కట్టాడు. చచ్చిన ఒంటెకు సంబంధించిన తండ్రి జేజయ్యలను వెంటనిడుకొని పగదీర్చుకోడానికి వచ్చాడు.

మూ. సింహోఽపి తచ్ఛ్రుత్వా సర్వతో దూరాదేవావలోక్య మృత ముష్ట్రం పరిత్యజ్య ప్రాణభయాత్ ప్రణష్టః. చతురకోఽపి శనైః శనై స్తస్యో ష్ట్రస్య మాంసం భక్షయామాస. అతోఽహం బ్రవీమి– 'పరస్య పీడనం కుర్వన్' ఇతి.

అ. సింహంకూడ దానిని విని అంతా దూరంనుండే చూచి చచ్చిన ఒంటెను విడిచిపెట్టి ప్రాణభయంతో కనబడకుండా పరుగెత్తింది. అందువల్ల నేను చెప్పుచు న్నాను– 'పరస్య పీడనం కుర్వన్'– (ఇతరులను బాధించి అయినా) ఇత్యాది.

మూ అథ దమనకే గతే సఞ్జీవకశ్చి న్తయామాస– 'అహో, కిమేత

న్మయాకృతమ్ ? యచ్ఛష్పాదోఽపి మాంసాశినస్తస్యానుగః సంవృత్తః. అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. అగమ్యాన్ యః పుమాన్ యాతి అసేవ్యాంశ్చ నిషేవతే
స మృత్యుమువగృహ్ణాతి గర్భమశ్వతరీ యథా. 401

తత్కిం కరోమి? క్వ గచ్ఛామి? కథం మే శాన్తిర్భవిష్యతి? అథవా తమేవ పిఙ్గలకం గచ్ఛామి. కదాచిన్మాం శరణాగతం రక్షతి. ప్రాణైర్న వియోజయతి యత ఉక్తఞ్చ—

శ్లో. ధర్మార్థం యతతామపీహ విపదో దైవాద్యది స్యుః క్వచిత్
తత్తాసాముపశాన్తయే సుమతిభిః కార్యో విశేషాన్నయః
లోకే ఖ్యాతిరుపాగతాత్ర సకలే లోకోక్తిరేషా యతో
దగ్ధానాం కిల వహ్నినా హితకరః సేకోఽపి తస్యోద్భవః. 402

అ. దమనకుడు వెళ్లగానే సంజీవకుడు ఇలా తలంచాడు- 'అయ్యో! నేను ఎందుకు ఇలా చేశాను, గడ్డి తినేవాడిని మాంసం తినేవానికి సేవకుడను అయ్యాను!' పెద్దలు ఇది సత్యమే చెప్పారు...

ఎవడు చేరగూడనివారిని చేరునో, సేవింపదగనివారిని సేవిస్తాడో, వాడు కంచరగాడిద (తన చావుకై) గర్భం ధరించినట్లు మరణిస్తాడు.

కనుక నేనేమి చేయాలి, ఎక్కడికి పోవాలి? నాకు శాంతి ఎలా లభిస్తుంది? లేక ఆ పింగళకుని వద్దకు పోతాను. ఒకవేళ శరణాగతుడైన నన్ను రక్షింపవచ్చు. ప్రాణాలు తీయక పోవచ్చు. ఏలననగా- పెద్దలు అన్నారు—

ఈ ప్రపంచంలో ధర్మంగా నడిచేవారికిని (ధర్మార్థం యత్నించేవారికిని), దైవవశమున ఒకప్పుడు ఆపదలు రావచ్చు. అప్పుడు వాటిశాంతికై బుద్ధిమంతులు అధికంగా మంచిమార్గం (నీతిమార్గం) అనుసరించాలి. లోకమంతటా ప్రసిద్ధం అయిన ఈ లోకోక్తి (సామెత) గలదు. అగ్నిచే కాలినవారికి- అగ్నిజన్యమైన ఉడుకు కాపడమే హితం గల్గిస్తుంది!

మూ. తథా చ—

శ్లో. లోకేఽథవా తనుభృతాం నిజకర్మపాకం
నిత్యం సమాశ్రితవతాం సుహితక్రియాణామ్,
భావార్జితం శుభమథాఽప్యశుభం నికామం
యద్భావి తద్భవతి నాత్ర విచారహేతుః. 403

అపరఞ్చాన్యత్ర గతస్యాపి కస్యచిద్దుష్టసత్త్వస్య మాంసాశినః సకాశాన్మృత్యుర్భవిష్యతి, తద్వరం సింహాత్. ఉక్తఞ్చ–

శ్లో. మహద్భిః స్పర్ధమానస్య విపదేవ గరీయసీ
దన్తభఙ్గోఽపి నాగానాం వరం గిరివిదారణే. 404

తథా చ–

శ్లో. మహతోఽపి క్షయం లబ్ధ్వా శ్లాఘ్యం నీచోఽపి గచ్ఛతి
దానార్థీ మధుపో యద్వత్ గజకర్ణసమాహతః. 405

అ. అటులనే– ఈ ప్రపంచంలో శరీరధారులకందరకూ కర్మఫలం అనుభవింపక తప్పదు. ప్రతిశరీరధారీ తాను సర్వ్వగా చేసే క్రియలద్వారా మంచి పనియో చెడ్డపనియో చేస్తూ ఉంటాడు ఆ కర్మఫలంగా మేలుగానీ, కీడుగానీ సంభవిస్తుంది. అందువల్ల ఏది జరగాలో అది జరుగుతుంది, ఇందు విచారింపదగింది లేదు.

మరియూ వేరేచోటికి పోయినా మాంసాహారి అయిన ఒకానొక దుష్టజంతువు ద్వారా మరణం సంభవించగలదు. దానికంటే సింహం వలననే ఉత్తమం. విజ్ఞులు అన్నారు—

మహాత్ములతో సంఘర్షణ పడేవానికి ఆపద వచ్చినా అది గౌరవహేతువే. కొండను చిల్చేటప్పుడు ఏనుగులకు కోరలు ఊడినా ప్రశంసనీయమే.

అటులనే. మహాపురుషుల వలన నీచుడు మరణం పొందియూ పొగడబడుచున్నాడు. తుమ్మెద, ఏనుగు మదజలం త్రాగబోయి దాని (ఏనుగు) చెవులచే కొట్టబడి చస్తుంది. అయినా లోకంలో గౌరవం పొందుతూంది.

మూ. ఏవం నిశ్చిత్య స స్ఖలితగతిర్మన్దం గత్వా సింహాశ్రయం పశ్యన్నపఠత్– 'అహో, సాధ్విదముచ్యతే–

శ్లో. అన్తర్లీనభుజఙ్గమం గృహమివ జ్వాలాకులం వా వనం
గ్రాహాకీర్ణమివాభిరామ-కమలచ్ఛాయాసనాథం సరః,
నానాదుష్టజనైరసత్యవచనాసక్తైరనార్యైర్వృతం
దుఃఖేన ప్రతిగమ్యతే ప్రచకితై రాజ్ఞాం గృహం వార్ధివత్. 408

ఏవం పఠన్ దమనోక్తాకారం పిఙ్గలకం దృష్ట్వా ప్రచకితః సంవృతశరీరో దూరతరం ప్రణామకృతిం వినాఽప్యుపవిష్టః. పిఙ్గలకోఽపి తథావిధం తం విలోక్య దమనకవాక్యం శ్రద్దధానః కోపాత్ తస్యోపరి పపాత. అథ సఞ్జీవకః ఖర-నఖర-వికర్తిత-పృష్టః శృఙ్గాభ్యాం హన్తుమిచ్ఛన్ యుద్ధాయాఽవస్థితః.

అ. ఇలా నిశ్చయించి అడుగులు తడబడుచుండగా మెల్లగాపోయి అతడు (సంజీవకుడు) సింహ నివాసస్థానం చూస్తూ ఈ శ్లోకం పఠించాడు—

అహా! పెద్దలు సత్యం చెప్పారు—

(శ్లోకభావం) పాములు (లోపల) దాగిన ఇల్లువలె, అగ్నిజ్వాలలు క్రమ్ముకొన్న అడవివలె- అందమైన తామరపూలచే అలంకృతంఅయినా మొసళ్లచే క్రిక్కిరిసిన సరోవరంవలెరాజగృహం భయంకరమైంది. మరియూ అది అసత్యప్రియులు, అనార్యులు అయిన బహువిధదుష్టజనులచే ఆవృతమై (కల్లోలిత) సముద్రంవలె ఉంటుంది. అచ్చటికి సజ్జనులు దుఃఖంతో అశుభశంకతో (తడబడచూ) పోయెదరు.

ఇలా పఠిస్తూ దమనకడు చెప్పిన ఆకారంతో ఉండే పింగళకుని చూచి (సంజీవకుడు) ఆశ్చర్యం పొందాడు. వెంటనే (తన్ను తాను సంభాళించుకొని) తేరుకొని ప్రణామం చేయకయే కూర్చున్నాడు. పింగళకుడును ఆ విధంగా ఉండే అతణ్ణి చూచాడు. దమనకుని వాక్యం సత్యం అని నమ్మాడు. కోపంతో అతనిపై పడినాడు. అంత సంజీవకుడు అతని వాడిగోళ్లచే వీపుచీల్చినా (తన) రెండు కొమ్ములతో అతని పొట్టను పొడిచాడు. ఏదోవిధంగా అతనికి దూరంగా పోయాడు. కొమ్ములచే (పొడిచి) చంపదలంచి యుద్ధానికి సన్నద్ధుడై నిలిచాడు.

మూ. అథ ద్వావపి తౌ పుష్పితపలాశసదృశౌ పరస్పరవధకాఙ్క్షిణౌ దృష్ట్వా కరటకో దమనకమాహ— 'భో మూఢమతే, అనయోర్విరోధం వితన్వతా త్వయా సాధు న కృతమ్. న చ త్వం నీతితత్త్వం వేత్సి. నీతివిద్భిరుక్తఞ్చ-

శ్లో. కార్యాణ్యుత్తమ-దణ్డ-సాహసఫలాన్యాయాససాధ్యాని యే
ప్రీత్యా సంశమయన్తి నీతికుశలాః సామ్నైవ తే మన్త్రిణః,
నిస్సారాల్పఫలాని యే త్వవిధినా వాఞ్ఛన్తి దణ్డోద్యమై
స్తేషాం దుర్ణయచేష్టితైర్నరపతేరారోప్యతే శ్రీస్తులామ్. 407

అ. అంత వారు ఇరువురూ (గాయాల రక్తంపల్ల) ఎఱ్ఱగా ఒకరినొకరు వధించే కోరికతో ఉన్నారు. ఇలా ఉండే వీరిరువురిని గాంచి కరటకుడు దమనకునితో అన్నాడు- 'ఓ మూఢబుద్ధీ! వీరు ఇరువురికి విరోధం పెంచావు. ఇది మంచిపని గాదు. నీతివేత్తలు అన్నారు—

ప్రబల యుద్ధాలకు సాహసకృత్యాలకు ఫలములై శ్రమసాధ్యాలైన కార్యాలను ప్రేమతో సామోపాయంతో ఎవరు శాంతింపజేస్తారో (నెరవేరుస్తారో) వారే మంత్రి పదవికి అర్హులు. ఇక ఎవరు (మంత్రులై) సారహీనాలు, అల్పప్రయోజనాలు అయిన కార్యాలను అన్యాయంతో దండనీతితో సాధింపనెంతురో, వారి అవినీతి కృత్యాలవలన ప్రభువు (యొక్క) రాజ్యలక్ష్మి తక్కెడను ఎక్కుతుంది (సందేహంలో పడుతుంది).

మూ. తద్యది స్వామ్యభిఘాతో భవిష్యతి, తత్కిం త్వదీయమన్త్రబుద్ధ్యా క్రియతే. అథ సఞ్జీవకో న వధ్యతే తథాప్యభవ్యమ్. యతః ప్రాణసన్దేహాత్ తస్య చ వధః (పరమావశ్యకః), తన్మూఢ, కథం త్వం మన్త్రిపదమభిలషసి? సామసిద్ధిం న వేత్సి. తద్వృథామనోరథోఽయం తే దణ్డరుచేః. ఉక్తఞ్చ-

శ్లో. సామాదిదణ్డపర్యన్తో నయః ప్రోక్తః స్వయంభువా
తేషాం దణ్డస్తు పాపీయాంస్తం పశ్చాద్వినియోజయేత్. 408

తథా చ-

శ్లో. సామ్నైవ యత్ర సిద్ధిర్న తత్ర దణ్డో బుధేన వినియోజ్యః
పిత్తం యది శర్కరయా శామ్యతి కోఽర్థః పటోలేన. 409

అ. ప్రభువు మరణిస్తే నీ మంత్రబుద్ధివలన ఉపయోగం ఏముంది? ఇక సంజీవకుడు చావనిచో? అలా జరుగరాదు. ఏలనన- ప్రభువుజీవితం సందేహంలో పడును. కనుక, అతని (సంజీవకుని) మరణం మిక్కిలి అవసరం. సామంద్వారా

కార్యసిద్ధిని ఎరుంగని నీవు మంత్రి పదవిని ఎట్లు గోరుచున్నావు? నీవంటి యుద్ధ ప్రియులకు ఈ కోరిక వృథా. విజ్ఞులు అన్నారు—

బ్రహ్మ సామంతో ఆరంభించి (దానం-భేదం) దండం వరకు రాజనీతిని తెన్నగా దెల్పాడు. వాటిలో (నాల్గింటిలో) దండనీతి మిక్కిలి అధమం అయినది. దానిని (అన్నీ వ్యర్థం అయితే) ఉపయోగించాలి.

అటులనే—ఎచ్చట సామంచేతనే కార్యసిద్ధి గలదో, అచ్చట దండనీతిని ప్రయోగింవరాదు. చక్కరవలననే పైత్యం తొలుగునట్లు ఉండినచో చేదుపొట్లతో అవసరం ఏముంది?

మూ. తథా చ—

శ్లో. ఆదౌ సామ ప్రయో_క్తవ్యం పురుషేణ విజానతా
సామసాధ్యాని కార్యాణి విక్రియాం యా_న్తి న క్వచిత్ 410

శ్లో. న చంద్రేణ న చౌషధ్యా న సూర్యేణ న వహ్నినా
సామ్నైవ విలయం యాతి విద్వేషప్రభవం తమః. 411

అ. అలాగే రాజనీతిజ్ఞుడైన పురుషుడు మొదట సామోపాయం ఉపయోగించాలి. అందువల్ల సిద్ధించిన కార్యాలు ఎన్నటికీ చెడిపోవు.

విద్వేషంవల్ల పుట్టిన నీకటిని సామోపాయం మాత్రమే తొలగిస్తుంది. ఆ చీకటిని చంద్రుడు, జ్యోతిష్మతీలత, సూర్యుడు, అగ్ని తొలగింపలేవు.

మూ. తథా య_త్త్వం మన్త్రిత్వమభిలషసి, తదప్యయు_క్తమ్. యత_స్త్వం మ_న్త్రిగతిం న వేత్సి. యతః పఞ్చవిధో మ_న్త్రిః. స చ కర్మణామారమ్భోపాయః, పురుషద్రవ్యసమ్పత్, దేశకాలవిభాగః, వినిపాతప్రతీకారః, కారసిద్ధిశ్చేతి. సోఽయం స్వామ్యమాత్యయోరేకతరస్య కిం వా ద్వయోరపి వినిపాతః సముత్పద్యతే లగ్నః. తద్యది కాచిచ్ఛ_క్తిర_స్తి తద్విచి_న్త్యతాం వినిపాతప్రతీకారః భిన్నసన్ధానే హి మ_న్త్రిణాం బుద్ధిపరీక్షా. తన్మూర్ఖ! తత్కర్తుమసమర్థ_స్త్వం యతో విపరీతబుద్ధిరసి. ఉ_క్తఞ్చ—

శ్లో. మ_న్త్రిణాం భిన్నసన్ధానే భిషజాం సాన్నిపాతికే
కర్మణి వ్యజ్యతే ప్రజ్ఞా స్వస్థే కో వా న పణ్డితః. 412

అన్యచ్చ—

శ్లో. ఘాతయితుమేవ నీచః పరకార్యం వేత్తి న ప్రసాధయితుమ్
పాతయితుమేవ శక్తిర్నాఖోరుద్ధర్తుమన్నపిటకమ్. 413

అ. నీవు మంత్రిపదవిని కోరుచున్నావు. అది అర్హంగాదు. కారణం— నీకు మంత్రి కర్తవ్యం తెలియకపోవడమే. మంత్రం అయిదు విధాలు: 1. కార్యారంభోపాయం, 2. అవసరమైన మనుష్యులను, ధనాన్ని సేకరించడం, 3. దేశ కాలవిభాగం, 4. వినిపాత (విఘ్న) ప్రతీకారం, 5. కార్యసిద్ధి.

ప్రస్తుతం ప్రభు-మంత్రులలో (పింగళక, సంజీవకులలో) ఒకరికిగాని లేక ఇరువురికిగాని మరణలగ్నం దాపురించింది శక్తి ఉంటే ఈ ఆపద తొలగేమార్గం ఆలోచింపుము. భిన్నులను (విరోధులను) కలుపడంలోనే మంత్రుల బుద్ధికి పరీక్ష గలదు. ఓరీ మూర్ఖ! అలాచేసే శక్తి నీకు లేదు. నీవు విపరీత బుద్ధివి. విజ్ఞులు అన్నారు —

భిన్నులను కలపడంలో మంత్రుల ప్రతిభ, సన్నిపాత రోగంలో వైద్యుల నేర్పు తెలియబడుతాయి. మంచిదశలో ఎవడు పండితుడుగాడు?(అందరూ గొప్పవారే).

మరియూ— నీచుడు పరుల కార్యాలు చెడగొట్టగలడేగాని, వాటిని సాధింపలేడు. ఎలుక అన్నంపాత్రను (పిటక) దొర్లించగలదేగాని, చక్కగా నిలుపలేదు.

మూ. అథవా న తే దోషోఽయమ్. స్వామినో దోషః, యస్తే వాక్యం శ్రద్దధాతి. ఉక్తఞ్చ—

శ్లో. నరాధిపా నీచజనానువర్తినో బుధోపదిష్టేన పథా న యాన్తి యే
విశన్త్యతో దుర్గమమార్గనిర్గమం సమస్త-సమ్బాధమనర్థపఞ్జరమ్. 414

తద్యది త్వమస్య మన్త్రీ భవిష్యసి తదాన్యోఽపి కశ్చిన్నాస్య సమీపే సాధుజనః సమేష్యతి. ఉక్తఞ్చ—

శ్లో. గుణాలయోఽప్యసన్మన్త్రీ నృపతిర్నాధిగమ్యతే
ప్రసన్న-స్వాదు-సలిలో దుష్టగ్రాహో యథా హ్రదః. 415

అ. ఇది నీ దోషం (మాత్రమే) అనరాదు. నీమాట విశ్వసించడంలో ప్రభువు దోషం కూడ ఉంది. విజ్ఞులు అన్నారు—

ఏ ప్రభువులు నీచుల మంత్రానుసారం (ఆలోచనబట్టి) ప్రవర్తిస్తూ, రాజనీతివేత్తలు బోధించిన మార్గాన పయనించరో, అట్టి ప్రభువులు సమస్తబాధలు గలదైన అనర్థరూప పంజరంలో ప్రవేశిస్తారు. ఇక అందుంచి వెలుపలికి రావడానికి దారియూ లభించదు.

నీవు ఈ ప్రభువునకు మంత్రివి అయినచో, అప్పుడు ఇతర సజ్జనుడు ఎవడునూ ఇతని దగ్గరకు రాడు. విజ్ఞులు అన్నారు—

ప్రభువు సద్గుణములు గలవాడైనా అతని మంత్రులు చెడ్డవారు అయితే ఎవరూ దగ్గరకు పోరు. చెరువులో నీరు ఎంత మధురం, నిర్మలం అయినా దుష్టమైన మొసళ్లు ఉంటే ఎవరూ ఆ చెరువువద్దకు పోరుగదా

మూ. తథా చ శిష్టజనరహితస్య స్వామినోఽపి నాశో భవిష్యతి. ఉక్తఞ్చ-

శ్లో. చిత్రాస్వాదకథైర్భృత్యైరనాయాసితకార్ముకైః
యే రమన్తే నృపాస్తేషాం రమన్తే రిపవః శ్రియా. 416

తత్కిం మూర్ఖోపదేశేన? కేవలం దోషో న గుణః. ఉక్తఞ్చ-

శ్లో. నానామ్యం నమతే దారు నాశ్మని స్యాత్ క్షురక్రియా
సూచీముఖం విజానీహి నాశిష్యాయోపదిశ్యతే. 417

దమనక ఆహ- కథమేతత్. సోఽబ్రవీత్-

అ. అలాగే సజ్జనులు లేని ప్రభువు నశిస్తాడు. పెద్దలు అన్నారు—

చిత్రములైన తియ్యని కథలు చెప్పువారూ (అవసరం వచ్చినచో), విల్లును ఎక్కుపెట్టలేనివారూ అయిన సేవకులతో ఏ ప్రభువులు ఆనందిస్తారో, ఆ ప్రభువుల శత్రువులు సంపదలతో ఆనందిస్తారు (అనగా వీరి సంపదలు శత్రువుల వశం ఆగును).

అయినా మూర్ఖునికి ఉపదేశించడం వలన ఉపయోగం ఏముంది? దోషమే కాని గుణం లేదు. విజ్ఞులు అన్నారు—

వంగని కట్టె (ఎండిన కట్టె) వంగదు. రాతిపై (బండపై) మంగలికత్తి పనిచేయదు. శిష్యుడుగానివానికి ఉపదేశింపరాదు. సూచీముఖం అనే పక్షి ఇందుకు ఉదాహరణగా గ్రహింపుము.

దమనకుడు అడిగాడు- 'అది ఎట్లు?' (అతడు) చెప్పాడు-

## కథా_17

## సూచీముఖ-వానర యూథ-కథా

మూ. అస్తి కస్మింశ్చిత్ పర్వతైకదేశే వానరయూథమ్. తచ్చ కదాచిద్ధేమన్తసమయేऽతికఠోర-వాత-సంస్పర్శ-వేపమాన-కళేబరం తుషారవర్షోద్ధతం ప్రవర్ష-ఘనధారా-నిపాత-సమాహతం న కథఞ్చిచ్ఛాన్తిమగమత్. అథ కేచిద్వానరా వహ్నికణసదృశాని గుఞ్జాఫలాన్యవచిత్య వహ్నివాఞ్ఛయా ఫూత్కుర్వన్తస్తస్థుః. అథ సూచీముఖో నామ పక్షీ తేషాం తం వృథాయాసమవలోక్య ప్రోవాచ- 'భోః సర్వే మూర్ఖా యూయమ్. నైతే వహ్నికణాః గుఞ్జాఫలాన్యేతాని. తత్కిం వృథా శ్రమేణ. నైతస్మాచ్ఛీతరక్షా భవిష్యతి. తదన్విష్యతాం కశ్చిన్నిర్వాతో వనప్రదేశో గుహా గిరికన్దరం వా. అద్యాపి సాటోపా మేఘా దృశ్యన్తే.

అ. ఒకానొక పర్వతభాగమున ఒక కోతులగుంపు కలదు. ఆ కోతుల గుంపు ఒకప్పుడు హేమంతఋతువులో (చలికాలంలో) మిక్కిలి తీవ్రంగా చలిగాలి తగులడంతో వణుకుతూన్నాయి. మంచువలె దట్టంగా క్రమ్ముకొన్న మేఘాలు ముసలధారలుగా (రోకళ్లవరున మాదిరి) వర్షిస్తూన్నాయి. అందువల్ల ఆ కోతులు అధికంగా బాధపొందాయి. ఏవిధంగానూ వాటికి శాంతి లభింపలేదు. అప్పుడు కొన్ని కోతులు నిప్పుకణికలవంటి (ఎఱ్ఱని) గురిగింజలను ఏరుకొని తెచ్చాయి. వాటిని (ఒకచోట ఉంచి) మంటను పుట్టించే కోరికతో ఊదుచూ చుట్టూ కూర్చున్నాయి. ఆసమయంలో సూచీముఖుడు అనే పక్షి, ఆకోతులయొక్క వ్యర్థమైన శ్రమను చూచింది. ఇలా నొక్కి చెప్పింది___ 'ఓయీ, మీరంతా మూర్ఖులు. ఇవి అగ్నికణాలు గావు- గురుగింజలివి. అందువల్ల వ్యర్థంగా ఎందుకు శ్రమపడెదరు? ఈ పనిచే చలిబాధ తొలగదు. ఏదేని గాలిలేని ప్రదేశం గుహగాని, కొండచరియగాని వెదకండి. ఇంకా మేఘాలు దట్టంగా (ఆటోపంగా) ఉన్నాయి.

మూ. అథ తేషామేకతమో వృద్ధవానరస్తమువాచ- 'భో మూర్ఖ, కిం తావదనేన వ్యాపారేణ? తద్గమ్యతామ్'. ఉక్తఞ్చ-

శ్లో. ముహుర్విఘ్నితకర్మాణం ద్యూతకారం పరాజితమ్
నాలాపయేద్ వివేకజ్ఞో యదీచ్ఛేత్ సిద్ధిమాత్మనః. 418

తథా చ–

శ్లో. ఆఖేటకం వృథాక్లేశం మూర్ఖం వ్యసనసంస్థితమ్
ఆలాపయతి యో మూఢః స గచ్ఛతి పరాభవమ్. 419

అ. అప్పుడు వాటిలో ఒక ముసలికోతి ఇలా అంది– 'ఓరీ మూర్ఖా! ఈ (మా) పనితో నీకేమి అవసరం? కనుక వెళ్లిపో. విజ్ఞులు ఇలా అన్నారు—

మాటిమాటికి చేసేపని చెడినవాడు, జూదగాడు, ఓటమి నందినవాడు– ఈ ముగ్గురితో తన సిద్ధిని (శుభం) కోరే వివేకి సంభాషింపరాదు.

అలాగే–వేటకాడు, వ్యర్థపరిశ్రమ చేసేవాడు, మూర్ఖుడు, వ్యసన లంపటుడు ఈ నల్గురితో మాట్లాడేవాడును మూర్ఖుడే. వాడు అవమానం పొందును.

మూ. సోఽపి తమనాదృత్య భూయోఽపి వానరాననవరతమాహ– 'భోః కిం వృథా క్లేశేన'? అథ యావదసౌ న కథఞ్చిత్ ప్రలపన్ విరమతి తావదేకేన వానరేణ వ్యర్థశ్రమత్వాత్ కుపితేన పక్షాభ్యాం గృహీత్వా శిలాయామాస్ఫాలిత ఉపరతశ్చ. అతోఽహం బ్రవీమి– 'నానమ్యం నమతే దారు–' ఇత్యాది.

అ. ఆ సూచీముఖుడును ఆకోతిని నిర్లక్ష్యంచేసి మరలా కోతులతో సందు లేకుండా–'ఏందుకు ఈ వృథా శ్రమ' –అని చెప్పసాగాడు. అతడు (పక్షి) ఇలా ప్రలాపించడం ఎంతకును మానలేదు. అంత వ్యర్థమైన శ్రమతో కోపం చెందిన ఒక కోతి, ఈ పక్షి రెక్కలను పట్టుకొంది–బండపై బాదింది. పక్షి చచ్చింది. అందుచే చెప్పుచున్నాను – 'నానామ్యం నమతే దారు– ఇత్యాది'–(వంగని కట్టె వంగదు–ఇత్యాది.)

మూ. తథా చ–

శ్లో. ఉపదేశోఽహి మూర్ఖాణాం ప్రకోపాయ న శాన్తయే
పయఃపానం భుజఙ్గానాం కేవలం విషవర్ధనమ్. 420

అన్యచ్చ–

శ్లో. ఉపదేశో న దాతవ్యో యాదృశే తాదృశే జనే
పశ్య వానరమూర్ఖేణ సుగృహీ నిర్గృహీకృతః. 421

దమనక ఆహ— 'కథమేతత్? సోఽబ్రవీత్—

అ. అలాగే ఉపదేశం మూర్ఖులకు కోపం గలిగించునేగాని శాంతిని గల్గింపదు. పాలు త్రాపడంవల్ల పాములకు విషమే వృద్ధి చెందుతుంది.

మరియూ- ఎటివంటివానికంతే అటువంటివానికి ఉపదేశం చేయరాదు. చూడు, ఒక మూర్ఖవానరంవల్ల సుగృహీ (మంచి ఇల్లుగలవాడు) గృహశూన్యుడు అయ్యాడు'.

దమనకుడు అడిగాడు -' అది ఎట్లు? అతడు (కరటకుడు) ఇలా చెప్పాడు-

## కథా-18

## వానర-చటకదమ్పతి-కథా

మూ. అస్తి కస్మింశ్చిద్వనోద్దేశే శమీవృక్షః. తస్య లమ్బమానశాఖాయాం కృతావాసావరణ్యచటకదమ్పతీ వసతః స్మ. అథ కదాచిత్తయోః సుఖసంస్థయో ర్హేమన్తమేఘో మన్దం మన్దం వర్షితుమారబ్ధః. అత్రాన్తరే కశ్చిచ్ఛాఖామృగో వాతాసారసమాహతః ప్రోద్ధూలితశరీరో దన్తవీణాం వాదయన్ వేపమానస్తచ్ఛమీ మూలమాసాద్యోపవిష్టః. అథ తం తాదృశమవలోక్య చటకా ప్రాహ 'భో భద్ర,

శ్లో. హస్తపాదసమోపేతో దృశ్యసే పురుషాకృతిః
శీతేన భిద్యసే మూఢ, కథం న కురుషే గృహమ్.' 422

అ. ఒకానొక అడవిలో జమ్మిచెట్టు ఒకటి ఉంది. దాని వ్రేలాడే కొమ్మపై గూడు కట్టుకొని అడవి పిచ్చుకలజంట నివసిస్తూ ఉండేది. అంత అవి సుఖంగా ఉండగా ఒకప్పుడు హేమంత ఋతు (చలికాల) మేఘం మెల్లమెల్లగా వర్షింప మొదలు పెట్టింది. [క్రమంగా గాలివాన అధికం అయింది] ఇంతలో ఒక కోతి గాలివానలో బాధ పడుతూ మిక్కిలి తడిసి (చలివల్ల) గడగడ వణకుచూ - పండ్లు టపటపలాడించుచూ వీణానాదం చేస్తూఉండగా- ఆ చెట్టు మొదలువద్దకు వచ్చి కూర్చుంది. అప్పుడు ఆడ పిచ్చుక - (చటకా) ఆ కోతినిచూచి ఇలా అంది - 'ఓ సౌమ్య, మీరు కాళ్లు చేతులు గల్గి యున్నారు—మగవారివలె కనబడుచున్నారు. చలిచే ఎందుకు బాధపడుచున్నాడు? ఓ మూర్ఖుడా, ఇల్లు ఎందుకు కట్టుకొనలేదు?

మూ. ఏతచ్ఛ్రుత్వా తాం వానరః సకోపమాహ - 'అధమే, కస్మాన్న త్వం మౌనవ్రతా భవసి? అహో ధార్ష్ట్యమస్యాః. అద్య మాముపహసతి-

శ్లో. సూచీముఖీ దురాచారా రణ్డా పణ్డితవాదినీ.
నాశఙ్కతే ప్రజల్పన్తీ తత్కిమేనాం న హన్మ్యహమ్.' 423

ఏవం సఞ్చిన్త్య స ఆహ- ముగ్ధే, కిం మమ చిన్తయా తవ ప్రయోజనమ్.? ఉక్తఞ్చ—

శ్లో. వాచ్యం శ్రద్ధాసమేతస్య పృచ్ఛతశ్చ విశేషతః
ప్రోక్తం శ్రద్ధావిహీనస్య చారణ్యరుదితోపమమ్. 424

అ. ఈ మాటలు విని కోతి - ఆ ఆడపిచ్చుకతో కోపంగా ఇలా అంది- 'నీచురాలా ? నీవు ఎందుకు మౌనంగా ఉండవు ?' [ఇలా అని-తన మనస్సులో ఇలా తలచింది.] 'ఆహా, దీనికెంత పొగరు? అవినయం). నేడు నన్ను ఎగతాళి చేస్తుంది.

సూదివంటి సన్నని నోరుగలదీ-దురాచార-జారిణి-తనను పండితురాలినిగా చెప్పుకొనేది-అయిన ఈ ఆడపక్షి వ్యర్థప్రలాపాలుచేస్తూ నిర్భయంగా (నిశ్శంకగా) ఉంది. కనుక దీన్ని నేనెందుకు చంపరాదు?'

ఇలా తలంచి ఆ కోతి, ఆడపిచ్చుకతో-'నన్ను గూర్చి విచారించడం వలన నీకు లాభం ఏమి?' పెద్దలు అన్నారు—

'శ్రద్ధ గలవారికి-తెలియగోరి అడిగేవారికి నీతిని బోధించాలి. శ్రద్ధాహీనునికి బోధించడం అరణ్యరోదనంతో సమానం.

మూ. తత్కిం బహునా తావత్? కులాయస్థితయా తయా పునరప్యభిహితః. స తావత్తాం శమీమారుహ్య తస్యాః కులాయం శతధా ఖణ్డశోఽకరోత్. అతోఽహం బ్రవీమి- 'ఉపదేశో న దాతవ్యః' ఇతి.

తన్మూర్ఖ, శిక్షావితోఽపి న శిక్షితస్త్వమ్. అథవా న తే దోషోఽస్తి యతః సాధోః శిక్షా గుణాయ సమ్పద్యతే. నాసాధోః. ఉక్తఞ్చ-

శ్లో. కిం కరోత్యేవపాణ్డిత్యమస్థానే వినియోజితమ్
అన్ధకారప్రతిచ్ఛన్నే ఘటే దీప ఇవాహితః. 425

అ. అట్టియెడ అధికంచే ఏమి లాభం ? గూటిలో ఉండే అడవిచ్చుక మరలా చెప్పింది. వెంటనే కోతి చెట్టును ఎక్కింది-ఆ గూటిని వంద ముక్కలు చేసింది. అందుచే నేను చెప్పుచున్నాను-'ఉపదేశో న దాతవ్యః—' ఇత్యాది (ఉపదేశం మూర్ఖులకు చెప్పరాదు.)

కనుక ఓ మూర్ఖా, (దమనకా!) నీవు ఉపదేశం పొందినా గ్రహించలేక పోయావు. అయినా ఇందు నీ దోషంలేదు. ఏలనన-సజ్జనులకు చేసిన నీతిబోధ ఫలితాన్ని ఇస్తుంది. దుష్టులకు అది వ్యర్థం. విజ్ఞులు ఇలా అన్నారు—

చీకటిచే నిండిన-కడవ (కుండ) మీద ఉంచిన దీపం ఎలా నిరుపయోగమో (దానిలోని చీకటిని పోగొట్టజాలదో), అలాగే అయోగ్యునికి చేసిన నీతిబోధ(పాండిత్యం) వ్యర్థం.

మూ. తద్వ్యర్థపాణ్డిత్యమాశ్రిత్య మమ వచనమశృణ్వన్నాత్మనః శాన్తిమపి వేత్సి. తన్మన్యేఽపజాతస్త్వమ్. ఉక్తఞ్చ-

శ్లో. జాతః పుత్రోఽనుజాతశ్చ అతిజాతస్తథైవ చ
అపజాతశ్చ లోకేఽస్మిన్ మన్తవ్యాః శాస్త్రవేదిభిః. 426

శ్లో. మాతృతుల్యగుణో జాతస్త్వనుజాతః పితుః సమః
అతిజాతోఽధికస్తస్మాదపజాతోఽధమాధమః. 427

శ్లో. ఆత్మనో వినాశం గణయతి న ఖలః పరవ్యసనహృష్టః
ప్రాయో మస్తకనాశే సమరముఖే నృత్యతి కబన్ధః. 428

అహో సాధ్విదముచ్యతే-

శ్లో. ధర్మబుద్ధిః కుబుద్ధిశ్చ ద్వావేతౌ విదితౌ మమ
పుత్రేణ వ్యర్థపాణ్డిత్యాత్ పితా ధూమేన ఘాతితః. 429

దమనక ఆహ- 'కథమేతత్? సోఽబ్రవీత్-

అ. ఆ విధంగా వ్యర్థ పాండిత్యాన్ని (అహంకారాన్ని) ఆశ్రయించావు—నా మాట వినలేదు - మనశ్శాంతినిగూడ గ్రహింపలేదు. కనుక నీవు అవశ్యం అపజాతుడవు. విజ్ఞులు అన్నారు—

ఈ ప్రపంచంలో శాస్త్రవేత్తలు, జాతుడు, అనుజాతుడు, అతిజాతుడు అప జాతుడు - అని పుత్రులను నాల్గు విధాలుగా చెప్పారు.

ఈ నలుగురి లక్షణాలను ఇలా చెప్పారు - తల్లివంటి గుణాలు గలవాడు జాతుడు, తండ్రివంటి గుణాలు గలవాడు అనుజాతుడు, తండ్రికంటె శ్రేష్ఠమైన గుణాలు గలవాడు అతిజాతుడు ఇక - అధమాధముడు (మిక్కిలి నీచుడు) అప జాతుడు అనబడును.

దుర్జనుడు ఇతరుల దుఃఖంచే సంతోషం పొందుతూ తన వినాశం సైతం లెక్కింపడు. యుద్ధంలో తల నరుకబడినా, మొండెం కొన్నియెడల (ఆవేశంతో) నృత్యం చేస్తుంది.

ఆహా! పెద్దలు చక్కగా చెప్పారు—

ధర్మబుద్ధి, పాపబుద్ధి - అనే ఈ ఇరువురిని నేను ఎరుంగుదును. పుత్రుడైన పాపబుద్ధి (యొక్క) వ్యర్థపాండిత్యంచే తండ్రి, పొగచే చంపబడ్డాడు.' దమనకుడు అడిగాడు-'—'అది ఎట్లు?' అతడు చెప్పాడు—

## కథా-19

## ధర్మబుద్ధి-పాపబుద్ధి-కథా

అస్తి కస్మింశ్చిదధిష్ఠానే ధర్మబుద్ధిః పాపబుద్ధిశ్చ ద్వే మిత్రే ప్రతివసతః స్మ. అథ కదాచిత్ పాపబుద్ధినా చిన్తితమ్— 'అహం తావన్మూర్ఖో దారిద్ర్యోపేతశ్చ. తదేనం ధర్మబుద్ధిమాదాయ దేశాన్తరం గత్వాఽస్యాఽఽశ్రయేణార్థోపార్జనం కృత్వైనమపి వఞ్చయిత్వా సుఖీ భవామి.' అథాఽన్యస్మిన్నహని పాపబుద్ధిర్ధర్మబుద్ధిం ప్రాహ— 'భో మిత్ర, వార్ధకభావే కిం త్వమాత్మవిచేష్టితం స్మరసి. దేశాన్తరమదృష్ట్వా కాం శిశుజనస్య వార్తాం కథయిష్యసి. ఉక్తఞ్చ-

శ్లో. దేశాన్తరేషు బహువిధభాషావేషాది యేన న జ్ఞాతమ్
భ్రమతా ధరణీపీఠే తస్య ఫలం జన్మనో వ్యర్థమ్. 430

తథా చ-

శ్లో. విద్యాం విత్తం శిల్పం తావన్నాప్నోతి మానవః సమ్యక్
యావద్ వ్రజతి న భూమౌ దేశాద్దేశాన్తరం హృష్టః. 431

అ. ఒకానొక నగరంలో ధర్మబుద్ధి పాపబుద్ధి అనే ఇద్దరు మిత్రులు ఉండే వారు అంత ఒకనాడు పాపబుద్ధి ఇలా తలంచాడు-'నేనైతే తెలివి లేనివాడను-దరిద్రుడను. అందుచే ఈ ధర్మబుద్ధిని వెంటతీసికొని దేశాంతరం పోతాను. ఇతని ఆశ్రయంతో (తెలివితో) ధనం సంపాదిస్తాను. తర్వాత ఇతన్నిగూడ మోసగిస్తాను. సుఖంగా ఉంటాను. అంత (ఆ ప్రకారం) మరియొక దినాన పాపబుద్ధి ధర్మబుద్ధితో ఇలా చెప్పాడు—' ఓ మిత్రమా! నీవు ముసలితనంలో, నీ యేయే పనులు జ్ఞాపకం చేసు కుంటావు ? ఇతర దేశాలు చూడక నీ బిడ్డలకు ఏ (వింత) వార్తలు చెప్పగలవు ? పెద్దలు అన్నారు—

ఎవడు ఇతరదేశాలు తిరిగి అనేక భాషలు వస్త్రధారణ మొదలైనవి తెలిసి కొనడో, అట్టివాడు ఈ భూమండలంలో పుట్టడం వ్యర్థం.

అలాగే - ఈ భూమిమీద సంతోషంతో ఒకదేశంనుండి మరొకదేశానికి పోవునంతవరకు మానవుడు, విద్య - ధనం - విజ్ఞానం (శిల్పం) చక్కగా పొందలేడు.'

మూ. అథ తస్య తద్వచనమాకర్ణ్య ప్రహృష్టమనాస్తేనైవ సహ గురు జనానుజ్ఞాతః శుభేఽహని దేశాన్తరం ప్రస్థితః. తత్ర చ ధర్మబుద్ధిప్రభావేణ భ్రమతా పాపబుద్ధినా ప్రభూతతరం విత్తమాసాదితమ్. తతశ్చ ద్వావపి తౌ ప్రభూతోపార్జితద్రవ్యౌ ప్రహృష్టౌ స్వగృహం ప్రత్యౌత్సుక్యేన నివృత్తౌ. ఉక్తఞ్చ

శ్లో. ప్రాప్తవిద్యార్థశిల్పానాం దేశాన్తర నివాసినామ్
క్రోశమాత్రోఽపి భూభాగః శతయోజనవద్భవేత్. 432

అ. అంత అతని మాటవిని ధర్మబుద్ధి మిక్కిలి సంతోషించాడు-గురుజనుల అంగీకారం పొందాడు - అతనితో (పాపబుద్ధితో) బాటు ఒక శుభదినాన దేశాంతరం వెళ్లాడు. అచ్చట ధర్మబుద్ధి (బుద్ధి) ప్రభావంవల్ల సంచరించే పాపబుద్ధి చాల ఎక్కువ ధనం సంపాదించాడు. పిమ్మట ఆ ఇరువురు అధిక ధనం పొందడంతో మిక్కిలి సంతుష్టులయ్యారు. ఉత్కంఠతో తమ యింటికి మరలారు. పెద్దలన్నారు—

విద్యా-ధన-విజ్ఞానాది నిమిత్తం దేశాంతరం వెళ్లినవారికి అవి లభింపగానే తమ ఇంటివైపు భూభాగం ఒక క్రోసు మాత్రంకూడ-వందయోజనాలుగా [40 క్రోసు లుగా] తోస్తుంది.

మూ. అథ స్వస్థానసమీపవర్తినా పాపబుద్ధినా ధర్మబుద్ధిరభిహితః– 'న సర్వమేతద్ధనం గృహం ప్రతి నేతుం యుజ్యతే. యతః కుటుమ్బినో బాన్ధవాశ్చ ప్రార్థయిష్యన్తే. తదత్రైవ వనగహనే క్వాపి భూమౌ నిక్షిప్య కిఞ్చిన్మాత్రమాదాయ గృహం ప్రవిశావః. భూయోఽపి ప్రయోజనే సఞ్జాతే తన్మాత్రం సమేత్యాస్మాత్ స్థానాన్నేష్యావః. ఉక్తం చ–

శ్లో. న విత్తం దర్శయేత్ ప్రాజ్ఞః కస్యచిత్ స్వల్పమప్యహో
మునేరపి యతస్తస్య దర్శనాచ్చలతే మనః. 433

తథా చ–

శ్లో. యథాఽఽమిషం జలే మత్స్యైర్భక్ష్యతే శ్వాపదైరపి
ఆకాశే పక్షిభిశ్చైవ తథా సర్వత్ర విత్తవాన్. 434

అ. పిమ్మట తమ నగర (స్థాన) సమీపం చేరగానే పాపబుద్ధి ధర్మబుద్ధితో ఇలా అన్నాడు – 'శుభ మూర్తీ! ఈ ధనం అంతా ఇంటికిచేర్చడం యుక్తం గాదు. ఏలనన–కుటుంబ భారంగలవారూ, బంధువులూ సహాయం అర్థిస్తారు. అందుచే దుర్గమం (చొరరానిది) అయిన ఈ అడవిలో ఏదో ఒక స్థలాన పాతిపెడుదాము. కొంత తీసుకొని ఇంటికి పోదాము మరలా అవసరం వచ్చినప్పుడు ఇచ్చటికి కలసివచ్చి ఆ మాత్రం తీసికొని పోదాము. విజ్ఞులు అన్నారు—

ప్రాజ్ఞుడైనవాడు ధనాన్ని స్వల్పంగానైనా ఎవరికిని చూపరాదు. ఏలనన – దాన్ని చూడడంవలన మునీశ్వరునికిని మనస్సు చలిస్తుంది. ఆశ్చర్యం.

అలాగే - మాంసం నీటిలో చేపలచేత, భూమిమీద హింసకప్రాణులచేత, ఆకాశంలో పక్షులచేత ఎట్లు భక్షింపబడునో–అట్లే ధనవంతుడును' (అందరికీ ఆహారం)

మూ. తదాకర్ణ్య ధర్మబుద్ధిరాహ– 'భద్ర, ఏవం క్రియతామ్'. తథానుష్ఠితే ద్వావపి తౌ స్వగృహం గత్వా సుఖేన సంస్థితవన్తౌ. అథాఽన్యస్మిన్నహని పాపబుద్ధిర్నిశీథేఽటవ్యాం గత్వా తత్సర్వం విత్తం సమాదాయ గర్తం పూరయిత్వా స్వభవనం జగామ. అథాఽన్యేద్యుర్ధర్మబుద్ధిం సమభ్యేత్య ప్రోవాచ– 'సఖే, బహుకుటుమ్బా వయమ్. విత్తభావాత్ సీదావః. తద్గత్వా తత్ర స్థానే కిఞ్చిన్మాత్రం ధనమానయావః'. సోఽబ్రవీత్– 'భద్ర ఏవం క్రియతామ్'.

అ. దానిని విని ధర్మబుద్ధి అన్నాడు- 'ఓ శుభమూర్తీ! అలాగే చేయుము.' అలా చేసినమీదట ఆ ఇరువురూ తమ ఇండ్లకుపోయి సుఖంగా ఉన్నారు. తరువాత ఒక దినం నడిరేయిని పాపబుద్ధి ఆ అడవికిపోయాడు. ఆ ధనం అంతా తీసికొన్నాడు. గుంతనుపూడ్చి తన ఇంటికి వచ్చాడు. పిమ్మట మరుదినం ధర్మబుద్ధి దగ్గరకుపోయి ఇలా పల్కాడు - 'మిత్రమా! మనం బహుకుటుంబంవారము. డబ్బులేక ఇబ్బంది పడుచున్నాము. అందుచే అచ్చటికిపోయి కొంతధనం తెచ్చుకుందాము'. అతడు (ధర్మబుద్ధి) అన్నాడు-'సౌమ్య, అలాగే చేయుదము.

మూ. అథ ద్వావపి గత్వా తత్స్థానం యావత్ ఖనతస్తావద్రిక్తం భాణ్డం దృష్టవన్తౌ. అత్రాన్తరే పాపబుద్ధిః శిరస్తాడయన్ ప్రోవాచ- 'భో ధర్మబుద్ధే, త్వయా హృతమేతద్ధనమ్ నాన్యేన, యతో భూయోఽపి గర్తాఽఽపూరణం కృతమ్. తత్ ప్రయచ్ఛ మే తస్యార్ధమ్. అన్యథాఽహం రాజకులే నివేదయామి' స ఆహ- 'భో దురాత్మన్, మైవం వద. ధర్మబుద్ధిః ఖల్వహమ్. నైతచ్చౌరకర్మ కరోమి. ఉక్తఞ్చ-

శ్లో. మాతృవత్ పరదారాణి పరద్రవ్యాణి లోష్టవత్
ఆత్మవత్సర్వభూతాని వీక్షన్తే ధర్మబుద్ధయః. 435

అ. తరువాత ఇరువురూపోయి ఆ చోట త్రవ్విచూడగా ధనశూన్యమైన (రిక్తం అయిన) పాత్ర కనబడింది. వెంటనే పాపబుద్ధి నెత్తిన కొట్టుకొంటూ బిగ్గరగా అరిచాడు - 'ఓ ధర్మబుద్ధీ! నీవు ఈ ధనం అపహరించావు. ఇతరుడు కాదు. ఏలనన - మరలా గుంత బాగా పూడ్చబడి ఉంది. కనుక దానిలో సగం నా కిమ్ము. నేను రాజసభలో ఫిర్యాదు చేస్తాను.' అతడు (ధర్మబుద్ధి)అన్నాడు- 'ఓ దురాత్ముడా! ఇలా అనవద్దు. నేను ధర్మబుద్ధిని గదా! ఈ దొంగపనిచేయను. పెద్దలు అన్నారు-

ధర్మబుద్ధి గలవారు, పరస్త్రీలను తల్లివలె, పరధనాన్ని మట్టిపెళ్లవలె, సర్వభూతాలను తనవలె చూచెదరు.

మూ. ఏవం ద్వావపి వివదమానౌ ధర్మాధికారిణం గతౌ. ప్రోచతుశ్చ పరస్పరం దూషయన్తౌ. అథ ధర్మాధికరణాధిష్ఠితైః పురుషైః దివ్యార్థే యావ

న్నియోజితౌ తావత్ పాపబుద్ధిరాహ– 'అహో న సమ్యగ్ దృష్టోఽయం న్యాయః ఉక్తఞ్చ–

శ్లో. వివాదేఽన్విష్యతే పత్రం తదభావే తు సాక్షిణః
సాక్ష్యాభావా త్తతో దివ్యం ప్రవద న్తి మనీషిణః. 436

తదత్రవిషయే మమ వృక్షదేవతాః సాక్షిభూతా స్తిష్ఠన్తి. తావప్యావయోరేకతరం చోరం సాధుం వా కరిష్య న్తి. అథ తైః సర్వైరభిహితమ్– భో, యుక్త ముక్తం భవతా. ఉక్తఞ్చ—

శ్లో అన్త్యజోఽపి యదా సాక్షీ వివాదే సమ్ప్రజాయతే
న తత్ర విద్యతే దివ్యం కిం పునర్యత్ర దేవతాః. 437

తదస్మాకమప్యత్ర విషయే మహత్ కౌతూహలం వర్తతే. ప్రత్యూషసమయే యువాభ్యామప్యస్మాభిః సహ తత్ర వనోద్దేశే గన్తవ్యమ్–ఇతి.

అ. ఇలా ఇరువురూ తగవులాడుతూ ధర్మాధికారివద్దకు వెళ్లారు. ఒకరి నొకరు దూషిస్తూ చెప్పారు. ధర్మాధికారులు దివ్యార్థం (దైవ సాక్షిగా ప్రమాణం) చేయ ఆజ్ఞాపింపగా పాపబుద్ధి ఇలా అన్నాడు – 'అయ్యా ! ఈ తీర్పు సరిగా లేదు విజ్ఞులు అన్నారు—

వివాదంలో మొదట (లిఖిత పత్రం) కోరబడుతుంది. అది లేనిచో సాక్షులు కోరబడుతారు. సాక్షులు లేనిచో దైవప్రమాణం కోరబడుతుంది – అని విజ్ఞులు వివరించారు.'

కనుక ఈ విషయంలో నాకు వృక్షదేవతలు సాక్షులై ఉన్నారు. వారే మా ఇరువురిలో ఒకరిని దొంగగానో, సజ్జనుసిగానో చేయగలరు.' అప్పుడు వారు (ధర్మాధి కారులు) అందరూ అన్నారు — 'అయ్యా ! నీవు చక్కగా చెప్పావు. విజ్ఞులు అన్నారు—

అన్త్యజుడైనా (కడజాతి వాడైనా) వివాదంలో ఎచ్చటనైనా సాక్షిగా లభిస్తే అచ్చట దివ్యప్రమాణం అవసరం లేదు. ఇక (వృక్ష) దేవతలే సాక్షులైనచో'' ఏమనాలి ?'

కనుక ఈ విషయంలో మాకూ మిక్కిలి కుతూహలం ఉంది. ప్రాతఃకాలాన మీరిరువురుకూడ మాతోబాటు ఆ అడవికి రావలెను

మూ. ఏతస్మిన్నంతరే పాపబుద్ధిః స్వగృహం గత్వా స్వజనకమువాచ- 'తాత ప్రభూతోఽయం మయార్థో ధర్మబుద్ధేశ్చోరితః. స చ తవ వచనేన పరిణతిం గచ్ఛతి. అన్యథాఽస్మాకం ప్రాణైః సహ యాస్యతి. స ఆహ- 'వత్స, ద్రుతం వద యేన ప్రోచ్య తద్ద్రవ్యం స్థిరతాం నయామి. పాపబుద్ధిరాహ- 'తాత, అస్తి తత్ప్రదేశే మహాశమీ, తస్యాం మహత్కోటరమస్తి. తత్ర త్వం సాంప్రతమేవ ప్రవిశ. తతః ప్రభాతే యదాఽహం సత్యశ్రావణం కరోమి, తదా త్వయా వాచ్యం యద్ధర్మబుద్ధిశ్చోర ఇతి.

ఆ ఈ లోపల పాపబుద్ధి తన యింటికి పోయి తన తండ్రితో ఇలా చెప్పాడు—'నాన్నా! ధర్మబుద్ధి (యొక్క అధిక) అనంత సంపదను దొంగిలించాను అది నీ మాటచే మనకు దక్కుతుంది. లేనిచో ప్రాణాలతో సహా పోతుంది.' అతడు (పాపబుద్ధి తండ్రి) అడిగాడు - 'బిడ్డా! త్వరగా చెప్పుము. నేను ఏమి చెప్పడం వలన ఆ ద్రవ్యము మనకు స్థిరం అవుతుంది.' పాపబుద్ధి తెలిపాడు—'నాన్నా! ఆ ప్రదేశంలో పెద్ద జమ్మిచెట్టు ఉంది. దానికి పెద్ద తొఱ్ఱ కలదు. ఆ తొఱ్ఱ లోనికి నీవు ఇప్పుడేపోయి దూరబడుము. తర్వాత ప్రాతఃకాలమున నేను సత్యం వినిపించగోర గానే నీవు ధర్మబుద్ధి 'దొంగ' - అని చెప్పాలి.'

మూ. తథాఽనుష్ఠితే ప్రత్యూషే స్నాత్వా పాపబుద్ధిర్ధర్మబుద్ధిపురస్సరో ధర్మాధికరణికైః సహ తాం శమీమభ్యేత్య తారస్వరేణ ప్రోవాచ-

శ్లో. ఆదిత్యచన్ద్రావనిలోఽనలశ్చ ద్యౌర్భూమి రాపో హృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సన్ధ్యే ధర్మో హి జానాతి నరస్య వృత్తమ్.

భగవతి, వనదేవతే, ఆవయోర్మధ్యే యశ్చోరస్తం కథయ' అథ పాపబుద్ధిపితా శమీకోటరస్థః ప్రోవాచ- 'భోః శృణుత శృణుత. ధర్మబుద్ధినా హృతమేతద్ధనమ్'. తదాకర్ణ్య సర్వే తే రాజపురుషా విస్మయోత్ఫుల్లలోచనా యావద్ధర్మబుద్ధేర్విత్తహరణోచితం నిగ్రహం శాస్త్రదృష్ట్యాఽవలోకయన్తి తావద్ధర్మ

బుద్ధినా తచ్ఛమీకోటరం వహ్నిభోజ్యద్రవ్యైః పరివేష్ట్య వహ్నినా సన్దీపితమ్. అథ జ్వలతి తస్మిన్ శమీకోటరేఽర్ధదగ్ధశరీరః స్ఫుటితేక్షణః కరుణం పరిదేవయన్ పాపబుద్ధేః పితా నిశ్చక్రామ. తతశ్చ తైః సర్వైః పృష్టః- 'భోః కిమిదమ్? ఇత్యుక్తే- 'ఇదం సర్వం కుకృత్యం పాపబుద్ధేః కారణాజ్జాతమ్'- ఇత్యుక్త్వా మృతః.

అ. తండ్రి అలాగే చేశాడు. పాపబుద్ధి వేరువనే స్నానం చేశాడు. ధర్మబుద్ధిని ముందుంచుకొన్నాడు. ధర్మాధికారులతోబాటు ఆ జమ్మి చెట్టును చేరాడు - బిగ్గరగా (తార స్వరంతో) ఇలా అన్నాడు—

సూర్యుడు చంద్రుడు వాయువు అగ్ని ఆకాశం భూమి నీరు హృదయం యముడు పగలు రాత్రి రెండు సంధ్యలు ధర్మదేవత - వీరంతా మానవుని చరిత్ర ఎరుంగుదురు.

ఓ భగవతీ? వనదేవతా! మా ఇరువురిలో దొంగ ఎవరో చెప్పుము., అప్పుడు జమ్మితొఱ్ఱలో ఉండే పాపబుద్ధితండ్రి గట్టిగా ఇలా చెప్పాడు—'ఓయీ, వినండి వినండి, ధర్మబుద్ధి ఈ ధనం దొంగిలించాడు.' ఆ రాజపురుషులందరు అది విన్నారు. ఆశ్చర్యంవల్ల వారి కన్నులు వికసించాయి. 'ధనం దొంగిలించినందుకు ధర్మబుద్ధికి న్యాయశాస్త్రం ప్రకారం ఏమి శిక్ష విధించాలి.' అని ఆలోచింపసాగారు. ఇంతలో ధర్మబుద్ధి అగ్నిభోజ్యద్రవ్యాలైన గడ్డీ గుడ్డపేలికలూ కిరసనాయిల్ మొదలైనవాటిని ఆ జమ్మి తొఱ్ఱలోవేసి నిప్పు పెట్టాడు. అప్పుడు జమ్మితొఱ్ఱ కాలుచుండగా సగంకాలిన శరీరంతో, మిడిగ్రుడ్లతో, దీనంగా విలపిస్తూ పాపబుద్ధి తండ్రి (తొఱ్ఱనుండి వెలుపలికి వచ్చాడు. అంత అందరూ— 'ఓయీ! ఇదేమి'? అని అడిగారు. 'ఈ చెడ్డ పని అంతా పాపబుద్ధి కారణంగా సంభవించింది' అని పల్కి అతడు మరణించాడు.

మూ. తతస్తే రాజపురుషాః పాపబుద్ధిం శమీశాఖాయాం ప్రతిలమ్బ్య ధర్మబుద్ధిం ప్రశంస్యేదమూచుః—'అహో సాధ్విదముచ్యతే—

శ్లో. ఉపాయం చిన్తయేత్ ప్రాజ్ఞస్తథాఽపాయం విచిన్తయేత్
పశ్యతో బకమూర్ఖస్య నకులేన హతా బకాః. 439

ధర్మబుద్ధిః ప్రాహ— 'కథమేతత్?' తే ప్రోచుః—

అ. అప్పుడు రాజపురుషులు పాపబుద్ధిని జమ్మికొమ్మకు వ్రేలాడగట్టించారు. ధర్మబుద్ధిని ప్రశంసించి ఇలా అన్నారు —'ఆహా! విజ్ఞులు చక్కగా చెప్పారు-

బుద్ధిమంతుడు ఉపాయంతోబాటు అందువల్ల వచ్చే అపాయం సైతం బాగుగా ఆలోచించాలి. ఏలననగా —తెలివిలేని కొంగ చూస్తూ ఉండగానే (దానిపిల్లలైన) కొంగలన్నీ ముంగిసచే (తినబడ్డాయి) చంపబడ్డాయి.

ధర్మబుద్ధి అడిగాడు—'అది యెట్లు ?'

వారు (రాజపురుషులు)—ఇలా చెప్పారు—

## కథా-20

## బక-నకుల-కథా

మూ. అస్తి కస్మింశ్చిద్వనోద్దేశే బహుబకసనాథో వటపాదపః. తస్య కోటరే కృష్ణసర్పః ప్రతివసతి స్మ. స చ బకబాలాకానజాతపక్షానపి సదైవ భక్షయన్ కాలం నయతి. అథైకో బక స్తేన భక్షితాన్యపత్యాని దృష్ట్వా శిశువైరాగ్యాత్ సరస్తీరమాసాద్య బాష్పపూరితనయనోఽధోముఖ స్తిష్ఠతి. తం చ తాదృక్చేష్టితమవలోక్య కులీరకః ప్రోవాచ— 'మాతుల, కిమేవం రుద్యతే భవతాఽద్య.' స ఆహ— 'భద్ర, కిం కరోమి? మమ మన్దభాగ్యస్య బాలకాః కోటరనివాసినా సర్పేణ భక్షితాః. తద్దుఃఖదుఃఖితోఽహం రోదిమి. తత్కథయ మే యద్యస్తి కశ్చిదుపాయ స్తద్వినాశాయ.'

అ. ఒకానొక అడవిలో మర్రిచెట్టు ఒకటి ఉంది. దానిమీద చాలా కొంగలు కలవు. ఆ వృక్షం తొఱ్ఱలో (నే) నల్లత్రాచు నివసిస్తుంది. ఆ త్రాచు రెక్కలురాని కొంగపిల్లలను భక్షిస్తూ కాలం గడుపుతూంది అంత ఒకనాడు ఒక కొంగ ఆ పాముచే తన బిడ్డలు తినబడడం చూచి౦చి — దుఃఖంతో చెరువు ఒడ్డుకు పోయుంది — కన్నీరు కారుస్తూ తలవంచుకొని కూర్చుంది. అలా ఉండే ఆ కొంగను చూచి (ఒక) ఎండ్రకాయ ఇలా అడిగింది — 'మామా, నేడు నీవు ఎందుకు ఇలా ఏడుస్తున్నావు ? అది (కొంగ) చెప్పింది— 'శుభమూర్తే, ఏమి చేయుదును? ఈ దౌర్భాగ్యుని పిల్లలను తొఱ్ఱలో ఉండే పాము తినివేసింది. ఆ దుఃఖంతో ఏడుస్తున్నాను. కనుక ఆ పామును చంపడానికి ఏదేని ఉపాయం ఉండినచో నాకు తెలుపుము.'

మూ. తదాకర్ణ్య కులీరకశ్చిన్తయామాస– ‘అయం తావదస్మజ్జాతి సహజవైరీ. తథోపదేశం ప్రయచ్ఛామి సత్యానృతం యథాఽన్యేఽపి బకాః సంక్షయమాయాన్తి. ఉక్తఞ్చ–

శ్లో. నవనీతసమాం వాణీం కృత్వా చిత్తం తు నిర్దయమ్
తథా ప్రబోధ్యతే శత్రుః సాన్వయో మ్రియతే యథా. 440

ఆహ చ– ‘మామ, యద్యేవం తన్మత్స్యమాంసఖణ్డాని నకులస్య బిలద్వారాత్ సర్పకోటరం యావత్ ప్రక్షిప, యథా నకులస్తన్మార్గేణ గత్వా తం దుష్టసర్పం వినాశయతి’. అథ తథాఽనుష్ఠితే మత్స్యమాంసానుసారిణా నకులేన తం కృష్ణసర్పం నిహత్య తేఽపి తద్వృక్షాశ్రయాః సర్వే బకాశ్చ శనైః శనైర్భక్షితాః. అతో వయం బ్రూమః– ‘ఉపాయం చిన్తయేత్’ ఇతి.

అ. దానిని విని ఎండ్రకాయ ఇలా తలంచింది– ‘ఈ కొంగ మా వంశానికి పుట్టుకతోడనే విరోధి. సత్యం అసత్యం కలిసిన ఉపదేశం చేస్తాను. అందువల్ల తక్కిన కొంగలన్నీ నశిస్తాయి. పెద్దలు అన్నారు—

వాక్కును వెన్నవలె (కోమలంగాను) మనస్సును దయాశూన్యంగాను చేసికొని శత్రువునకు వంశసమేతంగా నశించేటట్లు బోధించాలి.

(ఇలా తలంచి) చెప్పింది– ‘మామా, ఇలా అయితే, ముంగిస బొరియ దగ్గరనుండి పాము తొఱ్ఱవరకు చేపమాంసం ముక్కలను వేయుము, అప్పుడు ముంగిస ఆ దారినిపోయి ఆ దుష్టసర్పాన్ని చంపివేస్తుంది.’ అప్పుడు కొంగ అలాగే చేసింది. కాని చేపలమాంసం తింటూపోయిన ముంగిస నల్లత్రాచును చంపడంమాత్రమేకాక ఆచెట్టును ఆశ్రయించి ఉండే కొంగలను అన్నింటినీ మెల్లమెల్లగా తినివేసింది. అందుచే మేము చెప్పుచున్నాము– ‘ఉపాయం చిన్తయేత్–ఇత్యాది. (ఉపాయంతోబాటు అపాయం కూడ గుర్తించాలి అని)

మూ. తదనేన పాపబుద్ధినా ఉపాయశ్చిన్తితో నాపాయః. తతస్తత్ఫలం ప్రాప్తమ్. అతోఽహం బ్రవీమి– ‘ధర్మబుద్ధిః కుబుద్ధిశ్చేతి.

ఏవం త్వయాఽప్యుపాయశ్చిన్తితో నాపాయః పాపబుద్ధివత్. తన్న

భవసి త్వం సజ్జనః, కేవలం పాపబుద్ధిరసి. జ్ఞాతో మయా స్వామినః ప్రాణసన్దే
హోఽనయనాత్. ప్రకటీకృతం త్వయా స్వయమేవాత్మనో దుష్టత్వం కౌటిల్యం
చ. అథవా సాధ్విదముచ్యతే–

శ్లో. యత్నాదపి కః పశ్యేచ్ఛిఖినామాహారనిస్సరణమార్గమ్
యది జలదధ్వనిముదితాస్త ఏవ మూఢా న నృత్యేయుః. 441

యది త్వం స్వామినమేనాం దశాం నయసి తదస్మద్విధస్య కా గణనా?
తస్మాన్మమాసన్నేన భవతా న భావ్యమ్. ఉక్తఞ్చ–

శ్లో. తులాం లోహసహస్రస్య యత్ర ఖాదన్తి మూషకాః
రాజంస్తత్రహరేచ్ఛ్యేనో బాలకం నాత్ర సంశయః. 442

దమనక ఆహ– 'కథమేతత్? సోఽబ్రవీత్–

అ. కనుక ఈ పాపబుద్ధి ఉపాయాన్నే చింతించాడు. (దానివెంటనుండే) అపాయం చింతించలేదు. అందుకు ఫలితం అనుభవించాడు. ఇందువల్ల నేను చెప్పుచున్నాను–'ధర్మబుద్ధిః కుబుద్ధిశ్చ' అని.

ఓ మూర్ఖుడా! ఇలాగే నీవూ పాపబుద్ధివలె అపాయాన్నే చింతించావు గాని ఉపాయంగాదు. అందువల్ల నీవు సజ్జనుడవు గావు. కేవలం పాపబుద్ధివి. ప్రభువు ప్రాణాలను సందేహంలోనికి తెచ్చుటవల్ల నేను గ్రహించాను. నీవు స్వయంగా నీ దుష్టత్వాన్నీ వంచనాబుద్ధిని (కౌటిల్యం) ప్రకటించావు. విజ్ఞులు ఈ విషయం చక్కగా చెప్పారు—

అమాయకములైన నెమళ్లు మేఘాలధ్వనిని (ఉరుమును) విని సంతోషంతో తమకుతామే నృత్యం చేయనిచో ఆ నెమళ్ల(యొక్క) ఆహారనిర్గమనమార్గం (ఆహారం వెలుపలికి వచ్చేదారి - గుదస్థానం) ఎంత యత్నించినా ఎవడు చూడగలడు?

ప్రభువునకే నీవు ఇలాంటి అవస్థను గల్గించావు. ఇక మావంటివారు ఒక లెక్కయా! కనుక నీవు నా దగ్గర ఉండరాదు. విజ్ఞులు అన్నారు– 'వెయ్యి ఫలముల ఇనుపత్రాసును (సుమారు 31/2 మణుగులు బరువుగల త్రాసును) ఎలుకలు తినినచో ఓ రాజా! బాలుని గ్రద్ద ఎత్తుకొనిపోవడంలో సందేహం ఏముంది?

దమనకుడు అడిగాడు— 'అది ఎట్లు?' అతడు (కరటకుడు) ఇలాచెప్పాడు—

## కథా-21

## లోహతులా-వణిక్పుత్రి-కథా

మూ. అస్తి కస్మింశ్చిదధిష్ఠానే జీర్ణధనో నామ వణిక్పుత్రః. స చ విభవక్షయాద్దేశాన్తరగమనమనా వ్యచిన్తయత్—

శ్లో. యత్ర దేశేఽథవా స్థానే భోగాన్ భుక్త్వా స్వవీర్యతః
తస్మిన్ విభవహీనో యో వసేత్ స పురుషాధమః. 443

తథా చ—

శ్లో. యేనాహఙ్కారయుక్తేన చిరం విలసితం పురా
దీనో వదతి తత్రైవ యః పరేషాం స నిన్దితః. 444

తస్య చ గృహే సహస్రలోహభారఘటితా పూర్వపురుషోపార్జితా తులాఽఽసీత్. తాం చ కస్యచిచ్ఛ్రేష్ఠినో గృహే నిక్షేపభూతాం కృత్వా దేశాన్తరం ప్రస్థితః. తతః సుచిరం కాలం దేశాన్తరం యథేచ్ఛయా భ్రాన్త్వా పునః స్వపురమాగత్య తం శ్రేష్ఠినమువాచ— 'భోః శ్రేష్ఠిన్, దీయతాం మే సా నిక్షేపతులా' స ఆహ— 'భోః, నాస్తి సా త్వదీయా తులా. మూషకైర్భక్షితా'. జీర్ణధన ఆహ— 'భోః శ్రేష్ఠిన్ నాస్తి దోషస్తే యది మూషకైర్భక్షితేతి. ఈదృగేవాయం సంసారః, న కిఞ్చిదత్ర శాశ్వతమస్తి. పరమహం నద్యాం స్నానార్థం గమిష్యామి, తత్త్వమాత్మీయం శిశుమేనం ధనదేవనామానం మయా సహ స్నానోపకరణహస్తం ప్రేషయ' ఇతి.

అ. ఒకానొక నగరంలో జీర్ణధనుడు అనే వైశ్యపుత్రుడు ఉండేవాడు. అతడు సంపదనంతా పోగొట్టుకొన్నాడు. అందుచే దేశాంతరం పోదలంచి ఇలా తలచాడు—

'ఒక దేశంలో లేక స్థలంలో తన పరాక్రమంవలన భోగములు అనుభవించినవాడు, అదేచోట సంపదలేక వసింపరాదు. అలా నివసిస్తే వాడు అధముడే.

అలాగే— ఎవడు మొదట ఒకచోట, అభిమానంతో విలాసమయమైన

జీవితం గడుపువో, వాడు మరల అదేచోట, (అచ్చటివారి ముందు) దీన వాక్కులు పల్కుతూ ఉండడం నీచమైన విషయం.

అతనిఇంట్లో పెద్దలు సంపాదించినదైన వెయ్యి ఫలముల బరువుగల (సుమారు 3.1/2 మణుగుల బరువుగల) ఇనుప త్రాసు (తక్కెడ) ఉంది. దానిని ఒకానొక శ్రేష్ఠి ఇంట్లో తాకట్టుపెట్టి దేశాంతరం వెళ్లాడు. తర్వాత పరదేశంలో యథేచ్ఛగా చాలకాలం తిరిగాడు. మరల తన పట్టణం వచ్చాడు. ఆ శ్రేష్ఠిని ఇలా అడిగాడు – 'ఓ శ్రేష్ఠీ ! నేను తాకట్టుపెట్టిన త్రాసు నాకు ఇమ్ము.' శ్రేష్ఠి చెప్పాడు– ఆ నీ త్రాసు లేదు. దాన్ని ఎలుకలు తినివేశాయి. జీర్ణధనుడు అన్నాడు – 'ఓ శ్రేష్ఠీ! ఎలుకలు తినిఉంటే నీ దోషం ఏముంది ? ఈ ప్రపంచమే ఇలాంటిది. ఏదీ శాశ్వతం గాదు. కాని, నేను నదికి స్నానం చేయడానికి పోవుచున్నాను. అందువల్ల మీరు మీ పుత్రుడైన ఈ ధనదేవుడనే వానిని నా వెంట స్నానానికి అవసరమైన వస్తువులు ఇచ్చి పంపండి.'

మూ. సోఽపి చౌర్యభయాత్ తస్య శఙ్కితః స్వపుత్రమువాచ– 'వత్స! పితృవ్యోఽయం తవ స్నానార్థం నద్యాం యాస్యతి. తద్గమ్యతామనేన సార్ధం స్నానోపకరణమాదాయ ఇతి. అహో సాధ్విదముచ్యతే–

శ్లో. న భక్త్యా కస్యచిత్కోఽపి ప్రియం ప్రకురుతే నరః
ముక్త్వా భయం ప్రలోభం వా కార్యకారణమేవ వా. 445

తథా చ –

శ్లో. అత్యాదరో భవేద్యత్ర కార్యకారణవర్జితః
తత్ర శఙ్కా ప్రకర్తవ్యా పరిణామేఽసుఖావహః. 446

అ. అతడూ తనపై దొంగతనం అంటగట్టునేమో' — అనే భయంతో తన కొడుకుతో ఇలా అన్నాడు—'బిడ్డా! నీ పినతండ్రి స్నానానికి నదికి పోతున్నాడు— కనుక ఇతనివెంట స్నానసామగ్రిని తీసికొని పొమ్ము.' ఆహా విజ్ఞులు చెప్పారు—

భయం–ప్రలోభం (ఏదేని సాయం గల్గునని ఆశ) కార్యకారణభావం (ఈ సాయంచేస్తే ఆ సాయం చేస్తాడు ఇత్యాది) – ఈ మూటిలో కనీసం ఒకటియైన లేకుండ ఎవడు ఎవనికి ఏ ఇష్టమైన పనీ చేయడు—

ఎక్కడ ఏ విధమైన ప్రయోజన కాంక్షలేక అధికమైన ఆదరం గల్గుతుందో, అచ్చట కీడు ఊహించాలి. అది చివరకు పరిణామంలో దుఃఖం గల్గిస్తుంది.

మూ. అథాసౌ వణిక్శిశుః స్నానోపకరణమాదాయ ప్రహృష్టమనా స్తేనాభ్యాగతేన సహ ప్రస్థితః. తథాఽనుష్ఠితే వణిక్ స్నాత్వా తం శిశుం నదీగుహాయాం ప్రక్షిప్య తద్ద్వారం బృహచ్ఛిలయాఽఽచ్ఛాద్య సత్వరం గృహమాగతః పృష్టశ్చ తేన వణిజా– 'భో అభ్యాగత, కథ్యతాం కుత్ర మే శిశుర్యస్త్వయా సహ నదీం గతః' ఇతి? స ఆహ– నదీతటాత్ స శ్యేనేన హృత' ఇతి. శ్రేష్ఠ్యాహ– 'మిథ్యావాదిన్, కిం క్వచిచ్ఛ్యేనో బాలం హర్తుంశక్నోతి. తత్సమర్పయ మే సుతమ్. అన్యథా రాజకులే నివేదయిష్యామి' ఇతి.స ఆహ– భో సత్యవాదిన్, యథా శ్యేనో బాలం న నయతి తథా మూషకా అపి సహస్రలోహభారఘటితాం తులాం న భక్షయన్తి. తదర్పయ మే తులామ్యది దారకేణ ప్రయోజనమ్.'

అ. పిమ్మట వ్యాపారి కొడుకు స్నానసామగ్రిని తీసికొన్నాడు–సంతోషంతో ఆ అతిథి వెంట (జీర్ణధనునివెంట) వెళ్లాడు. జీర్ణధనుడు స్నానం చేశాడు. నదిలోని దరిలో (గుహలో) ఆ బాలుని ఉంచాడు. దాని ద్వారాన్ని పెద్దబండతో మూశాడు. త్వరగా ఇంటికి వచ్చాడు. అప్పుడు శ్రేష్ఠి అడిగాడు - 'ఓ అతిథీ ! నీ వెంట నదికి వచ్చిన నా పుత్రుడు ఎచ్చట ఉన్నాడో చెప్పుము ?' అతడు అన్నాడు – 'నదీ తీరంలో గ్రద్ద ఎత్తుకొని పోయింది.' శ్రేష్ఠి అన్నాడు – 'ఓ అసత్యవాదీ ! బాలుణ్ణి ఎచ్చటనైనా గ్రద్ద ఎత్తుకొని పోగలదా ? నా పుత్రుని అర్పింపుము. లేనిచో రాజసభలో విన్నవిస్తాను. అతడు (జీర్ణధనుడు) బదులు చెప్పాడు - 'ఓ సత్యవాదీ ! బాలుని ఎలా గ్రద్ద ఎత్తుకొని పోజాలదో, అలాగే వెయ్యి ఫలముల ఇనుపత్రాసును సైతం ఎలుకలు తినలేవు. అందుచే నీకు బాలుడు కావలని ఉంటే నా త్రాసును ఇమ్ము.

మూ. ఏవం వివదమానౌ తౌ ద్వావపి రాజకులం గతౌ. తత్ర శ్రేష్ఠీ తారస్వరేణ ప్రోవాచ– 'భోః, అబ్రహ్మణ్యమబ్రహ్మణ్యమ్. మమ శిశురనేన చోరేణాపహృతః'. అథ ధర్మాధికారిణ స్తమూచుః– భోః సమర్ప్యతాం శ్రేష్ఠి సుతః ? స ఆహ– 'కిం కరోమి? పశ్యతో మే నదీతటాచ్ఛ్యేనేనాపహృతః శిశుః' తచ్ఛ్రుత్వా తే ప్రోచుః– 'భోః, న సత్యమభిహితం భవతా. కిం శ్యేనః శిశుం

హర్తుం సమర్థో భవతి?' స ఆహ– భో భోః శ్రూయతాం మద్వచః.

శ్లో. తులాం లోహసహస్రస్య యత్ర ఖాదన్తి మూషకాః
రాజంస్తత్ర హరేచ్ఛ్యేనో బాలకం నాత్ర సంశయః. 447

తే ప్రోచుః– 'కథమేతత్? తతః శ్రేష్ఠీ సభ్యానామగ్రే ఆదితః సర్వం వృత్తాన్తం నివేదయామాస. తతస్తైర్విహస్య ద్వావపి తౌ పరస్పరం సమ్బోధ్య తులాశిశు ప్రదానేన సన్తోషితౌ. అతోఽహం బ్రవీమి– తులాం లోహసహస్రస్య' ఇతి.

అ. ఇలా వారు ఇరువురూ తగవులాడుచూ రాజసభకు పోయారు. అచ్చట శ్రేష్ఠి ఎలుగెత్తి (బిగ్గరగా) ఇలా చెప్పాడు – 'అయ్యలారా, అన్యాయం గొప్ప అన్యాయం. ఈ దొంగ నాపుత్రుణ్ణి అపహరించాడు. అప్పుడు ధర్మాధికారులు అతనితో అన్నారు —' ఓయీ, శ్రేష్ఠిగారి పుత్రుణ్ణి సమర్పించుము. అతడు (జీర్ణ ధనుడు) చెప్పాడు — 'ఏమి చేయుదును? నేను చూస్తూఉండగానే నదీతీరంలో బాలుని గ్రద్ద ఎత్తుకొని పోయింది.' దానిని విని వారు అన్నారు – ' ఓయీ, నీవు సత్యం చెప్పడం లేదు. గ్రద్ద శిశువును ఎత్తుకొని పోగలదా ?' అతడు అన్నాడు – 'అయ్యలారా ! నా మాట వినండి. ' ఓ ప్రభూ, వెయ్యిఫలముల ఇనుపత్రాసును ఎలుకలు తినగలిగినచో బాలుని గ్రద్ద ఎత్తుకొని పోగలదు. ఇందు సందేహం లేదు.

వారు (ధర్మాధికారులు) అన్నారు - 'ఇది ఏమి ? అంత జీర్ణధనుడు మొదటినుండీ విషయం అంతా తెలిపాడు. దానిని విని వారు నవ్వారు. ఇరువురికి బోధించి త్రాసును బాలుని ఇచ్చునట్లుచేసి (ఇరువురిని) సంతోష పఱచారు. అందుచే నేను చెప్పుచున్నాను – 'తులాం సహస్రస్య' అని (వెయ్యిఫలముల త్రాసును ఇత్యాది)

మూ. తన్మూర్ఖ, సఞ్జీవకప్రసాదమసహమానేన త్వయైతత్ కృతమ్. అహో, సాధ్విదముచ్యతే–

శ్లో. ప్రాయేణాత్ర కులాన్వితం కుకులజాః శ్రీవల్లభం దుర్భగాః
దాతారం కృపణా ఋజూననృజవో విత్తే స్థితం నిర్ధనాః.
వైరూప్యోపహతాశ్చ కాన్తవపుషం ధర్మాశ్రయం పాపినో
నానాశాస్త్రవిచక్షణం చ పురుషం నిన్దన్తి మూర్ఖాః సదా. 448

తథా చ-

శ్లో. మూర్ఖాణాం పణ్డితా ద్వేష్యా నిర్ధనానాం మహాధనాః
వ్రతినః పాపశీలానామసతీనాం కులస్త్రియః. 449

తన్మూర్ఖ, త్వయా హితమప్యహితం కృతమ్ ఉక్తం చ-

శ్లో. పణ్డితోఽపి వరం శత్రుర్న మూర్ఖో హితకారకః
వానరేణ హతో రాజా విప్రాశ్చోరేణ రక్షితాః. 450

దమనక ఆహ- 'కథమేతత్? సోఽబ్రవీత్-

అ. అందుచే ఓ మూర్ఖుడా! ప్రభువు సంజీవకునిపై దయతో ఉండడం ఓర్వలేక నీవు ఇలా చేశావు ఆహా, పెద్దలు చక్కగా చెప్పారు—

సామాన్యంగా ఈ ప్రపంచంలో - కులహీనులు సత్కులీనుని, అభాగ్యులు భాగ్యవంతుని, లోభులు దాతను, కపటవర్తనులు ఋజువర్తనుని, ధనహీనులు ధనికుని, కురూపులు రూపవంతుని, పాపాత్ములు ధార్మికుని, మూర్ఖులు బహుశాస్త్రవేత్త అయిన విద్వాంసుని నిందిస్తూ ఉంటారు.

అలాగే—మూర్ఖులకు పండితులు, ధనహీనులకు మహా ధనికులు, పాపులకు వ్రతనిష్ఠులు, జారిణులకు కులస్త్రీలు ద్వేషింపదగినవారై ఉందురు.

కనుక ఓ మూర్ఖుడా! నీవు మేలుకూడ కీడుగా చేశావు. విజ్ఞులు అన్నారు -

విద్వాంసుడు శత్రువైనా మంచిదే, మూర్ఖుడు మేలుకోరేవాడైనా ఉపయోగం లేదు. మేలుకోరే మూర్ఖవానరంచే రాజు చచ్చాడు. దొంగచే బ్రాహ్మణులు రక్షింపబడ్డారు.

దమనకుడు అడిగాడు - 'అది యెట్లు?' అతడు (కరటకుడు) చెప్పాడు—

## కథా-22

## నృపసేవకవానర-కథా

మూ. కస్యచిద్రాజ్ఞో నిత్యం వానరోఽతిభక్తిపరోఽఙ్గసేవకోఽన్తఃపురేఽప్యప్రతిషిద్ధప్రసరోఽతివిశ్వాసస్థానమభూత్. ఏకదా, రాజ్ఞో నిద్రాం గతస్య వానరే వ్యజనం నీత్వా వాయుం విదధతి రాజ్ఞో వక్షస్థలోపరి మక్షికోపవిష్టా. వ్యజనేన ముహుర్ముహుర్నిషిధ్యమానాఽపి పునః పునస్తత్రైవోపవిశతి. తతస్తేన

స్వభావచపలేన మూర్ఖేణ వానరేణ క్రుద్ధేన సతా తీక్ష్ణం ఖడ్గమాదాయ తస్యో ఉపరి ప్రహారో విహితః. తతో మక్షికోడ్డీయ గతా. తేన శితధారేణాసినా రాజ్ఞో వక్షో ద్విధాజాతం రాజా మృతశ్చ. తస్మాచ్చిరాయురిచ్ఛతా నృపేణ మూర్ఖోఽనుచరో న రక్షణీయః.

అ. ఒకరాజు దగ్గర మిక్కిలి విశ్వాసపాత్రమైన ఒకకోతి ఉండేది. అది రాజునకు అధికభక్తితో శరీరపరిచర్యలుచేస్తూ అంతఃపురంలోనూ నిరాటంకంగా తిరుగగల్గేది. ఒకనాడు రాజు నిద్రిస్తూ ఉంటగా అది చామరం వీస్తూఉంది. ఇంతలో ఒక ఈగ వచ్చి రాజు రొమ్ముపై కూర్చుంది. చామరంతో ఎన్నిమారులు తోలినా మళ్ళీమాటికి అది అచ్చటనే కూర్చుండేది. అప్పుడు సహజంగానే చపలం అయిన ఆ తెలివితక్కువ కోతికి కోపం వచ్చింది. వెంటనే అది వాడియైన ఖడ్గం తీసికొని ఈగపై దెబ్బ వేసింది. కాని ఈగ మాత్రం ఎగిరిపోయింది. ఆ పదునైన ఖడ్గం దెబ్బచే రాజు వక్షస్థలం రెండుగా చీలింది. రాజు మరణించాడు. అందుచే దీర్ఘాయువుగోరే ప్రభువు మూర్ఖుడైన సేవకుని దగ్గర ఉంచుకోరాదు.

## కథా-23

## చౌరబ్రాహ్మణ-కథా

మూ. అపరమేకస్మిన్నగరే కోఽపి విప్రో మహావిద్వాన్ పరం పూర్వ జన్మయోగేన చోరో వర్తతే. స తస్మిన్ పురేఽన్యదేశాదాగతాంశ్చతురో విప్రాన్ బహూని వస్తూని విక్రీణతో దృష్ట్వా చింతితవాన్ 'అహో, కేనోపాయేనైషాం ధనం లభే' ఇతి విచింత్య తేషాం పురోఽనేకాని శాస్త్రోక్తాని సుభాషితాని చాతి ప్రియాణి మధురాణి వచనాని జల్పతా తేషాం మనసి విశ్వాసముత్పాద్య సేవా కర్తుమారబ్ధా. అథవా సాధ్విదముచ్యతే.

శ్లో. అసతీ భవతి సలజ్జా క్షారం నీరఞ్చ శీతలం భవతి
దమ్భీ భవతి వివేకీ ప్రియవక్తా భవతి ధూర్తజనః. 451

అ. రెండవ కథ—ఒకానొక నగరంలో మహావిద్వాంసుడైన బ్రాహ్మణుడు ఉండేవాడు. కాని పూర్వజన్మ సంస్కారవశంచే అతడు దొంగ అయ్యాడు. అతడు ఆ నగరంలో పరదేశీయులైన నల్గురు బ్రాహ్మణులను, పెక్కు వస్తువులు అమ్ముచుండగా చూచాడు. తనలో ఇలా తలంచాడు – 'అహో, ఏ ఉపాయంతో వీరి ధనం

పొందగలను ?'—ఇలా తలంచి శాస్త్రోక్తములైన పెక్కు సూక్తులతోను ప్రియమైన మధుర మైన వాక్కులతోను వారి మనస్సున నమ్మకం గల్గించాడు - వారిని సేవింపసాగాడు. పెద్దలు చక్కగా దీనిని చెప్పారు — జారిణి చక్కగా సిగ్గును అభినయిస్తుంది. ఉప్పు నీరు చల్లగా ఉంటుంది. దంభాచారులు జ్ఞానులుగా నటిస్తారు. వంచకుడు మధురంగా మాట్లాడుతాడు.

మూ. అథ తస్మిన్ సేవాం కుర్వతి తైరంపైః సర్వవస్తూని విక్రీయ బహుమూల్యాని రత్నాని క్రీతాని. తతస్తాని జఙ్ఘామధ్యే తత్సమక్షం ప్రక్షిప్య స్వదేశం ప్రతి గన్తుముద్యమో విహితః. తతః స ధూర్తవిప్రస్తాన్ విప్రాన్ గన్తుముద్యతాన్ ప్రేక్ష్య చిన్తావ్యాకులితమనాః సఞ్జాతః— 'అహో, ధనమేతన్న కిఞ్చిన్మమ చటితమ్. అథైభిః సహ యామి. పథి క్వాఽపి విషం దత్త్వైతా న్నిహత్య సర్వరత్నాని గృహ్ణామి.

అ. అంత అతడు సేవిస్తూంపగా ఆ బ్రాహ్మణులు సమస్త వస్తువులు అమ్మారు. ఆ ధనంతో మిక్కిలి విలువైన రత్నాలు కొన్నారు. పిమ్మట వాటిని పిక్కల మధ్య అతని ఎదుటనే ఉంచుకొని తమదేశం వెళ్లే ప్రయత్నంలో ఉన్నారు. అప్పుడు ఆ కపటబ్రాహ్మణుడు ప్రయాణయత్నంలో ఉండే ఆ బ్రాహ్మణులను చూచి విచార పడుచూ ఇలా తలంచాడు— 'అయ్యో, ఈ ధనం అల్పమైనా నా చేతికి అందలేదు వీరితోపాటు వెళుతాను. మార్గంలో ఎచ్చటనైనా విషం ఇచ్చి వీరిని చంపుతాను. రత్న ములన్నీ గ్రహిస్తాను.'

మూ. ఇతి విచింత్య తేషామగ్రే సకరుణం విలప్యేదమాహ— 'భో మిత్రాణి, యూయం మామేకాకినం ముక్త్వా గన్తుముద్యతాః. తన్మే మనో భవద్భిః సహ స్నేహపాశేన బద్ధం భవద్విరహనామ్నైవాకులం సఞ్జాతం యథా ధృతిం క్వాఽపి న ధత్తే. యూయమనుగ్రహం విధాయ సహాయభూతం మామపి సహైవ నయత. తద్వచః శ్రుత్వా తే కరుణార్ద్రచిత్తాస్తేన సమమేవ స్వదేశం ప్రతి ప్రస్థితాః. అథాధ్వని తేషాం పఞ్చానామపి పల్లీపురమధ్యే వ్రజతాం ధ్వాఙ్క్షాః కథయితుమారబ్ధాః— 'రే కిరాతాః, ధావత ధావత, సపాదలక్షధనినో యాన్తి. ఏతాన్నిహత్య ధనం నయత'.

అ ఇలా తలంచి వారి యెదుట దీనంగా విలపించి ఇలా చెప్పాడు— 'ఓ మిత్రులారా! మీరు నన్ను ఒంటరిగా విడిచివెళ్లే యత్నంలో ఉన్నారు. అందువల్ల మీ స్నేహపాశంతో బద్ధమైన నా మనస్సు మీ ఎడబాటు మాటచేతనే కలతచెంది ఏ విధం గాను ధైర్యం పొందలేనిదై ఉంది. మీరు అనుగ్రహించి సహాయంగా నన్నుగూడ వెంటతీసికొని పోండు'. ఆ మాటవిని వారు దయార్ద్రచిత్తులై అతనితోబాటు తమ దేశా నికి ప్రయాణంచేసారు. అలా వారు అయిదుగురు ప్రయాణమై పోతూఉండగా దారిలో పల్లెలు, నగరాలు వస్తున్నాయి. వారిని చూచి కాకులు ఇలా చెప్పసాగాయి— "ఓరీ కిరాతకులారా! పరుగెత్తండి పరుగెత్తండి. లక్షా ఇరువదివేలుగల ధనికులు పోతూ ఉన్నారు. వారిని చంపి ధనం పొందండి."

మూ. తతః కిరాతైర్ధ్వాజ్క్షవచనమాకర్ణ్య సత్వరం గత్వా తే విప్రా లగుడప్రహారైర్జర్జరీకృత్య వస్త్రాణి మోచయిత్వా విలోకితాః. పరం ధనం కిఞ్చిన్న లబ్ధమ్. తదా తైః కిరాతైరభిహితమ్— 'భోః పాన్థాః! పురా కదాపి ధ్వాఙ్క్షవచనమనృతం నాసీత్. తతో భవతాం సన్నిధౌ క్వాపి ధనం విద్యతే. తద ర్పయత. అన్యథా సర్వేషామపి వధం విధాయ చర్మ విదార్య ప్రత్యఙ్గం ప్రేక్ష ధనం నేష్యామః.

అ. అప్పుడు కిరాతులు కాకుల మాట విన్నారు. వెంటనే వచ్చారు, ఆ బ్రాహ్మణులను కఱ్ఱలతో ఎముకలు విరుగ (జర్జరితులుగా) గొట్టారు. గుడ్డలు విప్పి చూచారు. కాని ధనం ఏమీ లభింపలేదు. అంత కిరాతులు ఇలా అన్నారు— 'ఓ బాట సారులారా! పూర్వం ఎప్పుడూ కాకుల వాక్కు అసత్యం కాలేదు. అందువల్ల ఎచ్చటనో ధనం ఉంది. దాన్ని సమర్పించండి. లేనిచో అందరినీ చంపి చర్మం ఒలిచి ప్రతి అంగం పరీక్షించి ధనం తీసికొంటాము.'

మూ. తదా తేషామీదృశం వచనమాకర్ణ్య చోరవిప్రేణ మనసి చింతి తమ్— 'యదేషాం విప్రాణాం వధం విధాయాఙ్గం విలోక్య రత్నాని నేష్యన్తి, తదాఽపి మాం వధిష్యంతి. తతోఽహం పూర్వమేవాత్మానమరత్నం సమర్ప్యై తాన్ ముఞ్చామి. ఉక్తఞ్చ—

శ్లో. మృత్యోర్బిభేషి కిం బాల న స భీతం విముఞ్చతి
అద్య వాఽబ్దశతాన్తే వా మృత్యుర్వై ప్రాణినాం ధ్రువః. 452

తథా చ—

శ్లో. గవార్థే బ్రాహ్మణార్థే చ ప్రాణత్యాగం కరోతి యః
సూర్యస్య మణ్డలం భిత్త్వా స యాతి పరమాం గతిమ్. 453

ఇతి నిశ్చిత్యాభిహితమ్— 'భోః కిరాతాః యద్యేవం మాం పూర్వం నిహత్య విలోకయత.' తతస్తైస్తథాఽనుష్ఠితే తం ధనరహితమవలోక్యాపరే చత్వారోఽపి ముక్తాః. అతోఽహం బ్రవీమి. 'పణ్డితోఽపి వరం శత్రు' ఇతి.

అ. అప్పుడు వారి ఇలాంటి మాటవిని దొంగ అయిన బ్రాహ్మణుడు మనస్సులో ఇలా విచారించాడు- 'ఈ బ్రాహ్మణులను చంపి అవయవాలు పరిశీలించి రత్నాలు తీసుకున్నా తర్వాత నన్నూ చంపెదరు. అందువల్ల మొదటనే రత్నశూన్యతనైన నన్ను సమర్పించి వీరిని విడిపిస్తాను. విజ్ఞులు అన్నారు—

'ఓ అజ్ఞానీ!(బాలుడా) మృత్యువునకేల భయపడెదవు? భయపడినా అది వదలదు. నేడుగానీ నూరేండ్లకుగానీ ప్రాణులకు మృత్యువు తప్పదు.

మరియూ- గోవులను, బ్రాహ్మణులను రక్షించేందుకై ఎవడు ప్రాణాలు విడునో, వాడు సూర్యమండలం భేదించి పరమగతిని (ముక్తిని) పొందును.

ఇలా నిశ్చయించి (కిరాతులతో) అన్నాడు- 'ఇలా అయితే ముందు నన్ను చంపి చూడండి.' అప్పుడు వారు (కిరాతులు) అలాగే చేసారు. అతని శరీరంలో ఏ విధమైన ధనం కనబడలేదు. అందుచే తక్కినవారిని వదలివేశారు. అందుచే నేను చెప్పుచున్నాను- 'పండితోఽపి వరం శత్రుః' ఇత్యాది.

మూ. అథైవం సంవదతోస్తయోః సఞ్జీవకః క్షణమేకం పిఙ్గలకేన సహ యుద్ధం కృత్వా తస్య ఖరనఖరప్రహారాభిహతో గతాసుర్వసున్ధరాపీఠే నిపపాత. అథ తం గతాసుమవలోక్య పిఙ్గలకస్తద్గుణస్మరణార్ద్రహృదయః ప్రోవాచ- 'భోః, అయుక్తం మయా పాపేన కృతం సఞ్జీవకం వ్యాపాదయతా. యతో విశ్వాసఘాతాదన్యన్నాస్తి పాపతరం కర్మ. ఉక్తఞ్చ—

శ్లో. మిత్రద్రోహీ కృతఘ్నశ్చ యశ్చ విశ్వాసఘాతకః
తే నరా నరకం యాన్తి యావచ్చన్ద్రదివాకరమ్. 454

శ్లో. భూమిక్షయే రాజవినాశ ఏవ భృత్యస్య వా బుద్ధిమతో వినాశే
నో యుక్తముక్తం హ్యనయోః సమత్వం నష్టాపి భూమిః సులభా న
భృత్యాః. 455

తథా మయా సభామధ్యే స సదైవ ప్రశంసితః. తత్కిం కథయిష్యామి తేషామగ్రతః. ఉక్తఞ్చ-

శ్లో. ఉక్తో భవతి యః పూర్వం గుణవానితి సంసది
న తస్య దోషో వక్తవ్యః ప్రతిజ్ఞాభఙ్గభీరుణా. 456

అ. వారు ఇరువురు (కరటక-దమనకులు) ఇలా సంవాదం చేస్తుండగా సంజీవకుడు ఒకక్షణం పింగళకునితో యుద్ధంచేసి అతని వాడిగోళ్ల దెబ్బలచే ప్రాణాలు గోల్పోయి నేలపై పడినాడు. అప్పుడు పింగళకుడు మరణించిన అతని చూచాడు. అతని సుగుణాలను తలుస్తూ ఆర్ద్రహృదయుడై ఇలా పల్కాడు- 'అయ్యో, సంజీవకుని చంపి నేను చాలపాపం చేశాను. నమ్మకద్రోహంకంటె వేఱే గొప్ప పాపకర్మ లేదు. విజ్ఞులు అన్నారు—

మిత్రులకు ద్రోహంచేసినవాడు, చేసిన మేలును మరచినవాడు, నమ్మినవారిని మోసం చేసినవాడు-ఈ ముగ్గురు చంద్రసూర్యులు ఉన్నంతకాలం నరకంలో ఉందురు.

రాజ్యంపోయినా, బుద్ధిమంతుడైన సేవకుడు నశించినా రాజునకు వినాశం సంభవిస్తుంది. కాని ఈ రెండింటినీ సమానంగా తలంచడం ఉచితంగాదు. పోయిన రాజ్యాన్ని మరలా సంపాదించవచ్చు. నశించిన సేవకులు మరల లభింపరు.

మరియు నేను అతని సభలో నిత్యం ప్రశంసించాను. ఇప్పుడు వారి (సభ్యుల) ముందు ఏమి చెప్పుదును? పెద్దలు అన్నారు—

ఎవడేని ఎవనినైనా సభలో మొదట 'ఇతడు గుణవంతుడు' అని చెప్పియున్నచో, 'తనమాట అసత్యం అగును'- అనే భయంతో అతని దోషం చెప్పరాదు.

మూ. ఏవంవిధం ప్రలపన్తం దమనకః సమేత్య సహర్షమిదమాహ- 'దేవ!. అతికాతరతమస్తవైష న్యాయో యద్ద్రోహకారిణం శష్పభుజం హత్వేత్థం

శోచసి. తన్నైతదుపపన్నం భూభుజామ్. ఉక్తఞ్చ-

శ్లో. పితా వా యది వా భ్రాతా పుత్రో భార్యాఽథ వా సుహృత్
ప్రాణద్రోహం యదాగచ్ఛేద్ధన్తవ్యో నాస్తి పాతకమ్. 457

తథా చ-

శ్లో. రాజా ఘృణీ బ్రాహ్మణః సర్వభక్షీ స్త్రీ చాత్రపా దుష్టమతిః సహాయః
ప్రేష్యః ప్రతీపోఽధికృతః ప్రమాదీ త్యాజ్యా అమీ యశ్చ కృతం న వేత్తి.

అపి చ-

శ్లో. సత్యానృతా చ పరుషా ప్రియవాదినీ చ
హింస్రా దయాలురపి చార్థపరా వదన్యా.
భూరివ్యయా ప్రచురవిత్తసమాగమా చ
వేశ్యాఙ్గనేవ నృపనీతిరనేకరూపా. 459

అపి చ-

శ్లో. అకృతోపద్రవః కశ్చిన్మహానపి న పూజ్యతే
పూజయంతి నరా నాగాన్ న తార్క్ష్యం నాగఘాతినమ్. 460

తథా చ-

శ్లో. అశోచ్యానన్వశోచస్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే
గతాసూనగతాసూంశ్చ నానుశోచన్తి పణ్డితాః. 461

ఏవం సమ్బోధితః పింగలకః సఞ్జీవకశోకం త్యక్త్వా దమనకసాచివ్యేన రాజ్యమకరోత్.

ఇతి శ్రీ విష్ణుశర్మవిరచితే పఞ్చతన్త్రే మిత్రభేదం నామ ప్రథమం తన్త్రమ్.

అ. ఆ విధంగా విలపించే పింగళకునివద్దకు దమనకుడు వచ్చి ఇలా అన్నాడు— 'ప్రభూ! ద్రోహకారియైన ఈ గడ్డితినేవానిని చంపి విలపించే నీ నీతి పిఱికితనంతో గూడినట్టిది. అది భూపాలురకు సముచితంగాదు. విజ్ఞులు అన్నారు—

తండ్రి, సోదరుడు, పుత్రుడు, భార్య, మిత్రుడు- వీరిలో ఎవరైనా అగుదురు గాక. తన ప్రాణానికి ముప్పుతలపెట్టినచో అట్టివానిని చంపడంలో పాపం లేదు.

అలాగే- దయగల ప్రభువు, అన్నింటినీ తినే బ్రాహ్మణుడు, సిగ్గులేని స్త్రీ, దుష్టబుద్ధిగల సహాయకుడు, ప్రతికూల వర్తనుడైన సేవకుడు, ప్రమాది అయిన (తప్పులుచేసే) అధికారి, చేసిన మేలు మఱచేవాడు- వీరు అందరూ విడువదగినవారు.

మరియూ- రాజనీతి వేశ్యవలె సత్యముగా తోచునట్లు చేస్తూ అసత్యం మాట్లాడుతుంది. మధురంగా మాట్లాడుచున్ననూ (మనస్సులో) కాఠిన్యం గలది, దయ గలదిగాతోస్తూ హింసకం అయింది. ఉదారంగా కనబడుచున్నా ధనలోభం గలది, అధికంగా ఖర్చుచేయుచున్నా అధికంగా ధనాన్ని రాబట్టేది. ఇలా విరుద్ధగుణాలతో అనేక రూపాలతో ఉంటుంది.

మరియూ- కీడు చేయనివాడు ఎంత గొప్పవాడైనా పూజింపబడడు. మానవులు పాములను పూజిస్తారు. పాములను చంపే గరుత్మంతుని పూజింపరు.

అలాగే- నీవు దుఃఖింపదగనివారి గూర్చి దుఃఖించుచున్నావు. పండితునివలె మాట్లాడుచున్నావు. పండితులు చచ్చినవారినిగూర్చి గాని బ్రతికినవారినిగూర్చి గాని విచారింపరు.

ఇలా దమనకుడు బోధింపగా పింగళకుడు సంజీవకునిచంపిన దుఃఖం విడిచి పెట్టాడు. దమనకుని మంత్రిత్వంతో రాజ్యం పాలించాడు.

ఇది శ్రీవిష్ణుశర్మ రచించిన పంచతంత్రంలో మిత్రభేదానికి శ్రీ జీరెడ్డి వాల చెన్నారెడ్డి చేసిన ఆంధ్రానువాదం.

శుభం

॥ శ్రీః ॥

# పఞ్చతన్త్రమ్

## మిత్రప్రాప్తికమ్

### ద్వితీయం తన్త్రమ్

మూ. అథేదమారభ్యతే మిత్రసంప్రాప్తిర్నామ ద్వితీయం తన్త్రమ్. యస్యాయమాద్యః శ్లోకః—

అ. మిత్రసంప్రాప్తి అనే రెండవ తంత్రం ఆరంభం చేయబడుతూంది. దానికి ఇది మొదటిశ్లోకం—

శ్లో. అసాధనా అపి ప్రాజ్ఞా బుద్ధిమన్తో బహుశ్రుతాః
సాధయన్త్యాశు కార్యాణి కాకాఖుమృగకూర్మవత్. 1

అ. పెక్కు శాస్త్రములు తెలిసినవారు బుద్ధిమంతులు ప్రతిభాశాలురు అయిన వారు తగిన సాధనసంపద లేకపోయినా కాకి, ఎలుక, జింక, తాబేలువలె తమ కార్యాలు శీఘ్రంగా సాధిస్తారు.

మూ. తద్యథాఽనుశ్రూయతే. అస్తి దక్షిణాత్యే జనపదే మహిలారోప్యం నామ నగరమ్. తస్య నాతిదూరస్థో మహోచ్ఛ్రాయవాన్ నానావిహఙ్గోపభుక్తఫలః కీటైరావృతకోటరశ్ఛాయాఽశ్వాసితపథికజనసమూహో న్యగ్రోధపాదపో మహాన్. అథవా యుక్తమ్—

శ్లో. ఛాయాసుప్తమృగః శకున్తనివహైర్విష్వగ్విలుప్తచ్ఛదః
కీటైరావృతకోటరః కపికులైః స్కన్ధే కృతప్రశ్రయః.
విశ్రబ్ధం మధుపైర్నిపీతకుసుమః శ్లాఘ్యః స ఏవ ద్రుమః
సర్వాఙ్గైర్బహుసత్త్వసఙ్గసుఖదో భూభారభూతోఽపరః. 2

అ. ఇలా ప్రసిద్ధి గలదు— దక్షిణాపథంలో మహిలారోప్యం అనే నగరం ఉంది. దానికి కొలది దూరంలో మిక్కిలి ఎత్తైన పెద్దమఱ్ఱిచెట్టు గలదు. దాని పండ్లను పక్షులు ఎన్నియో భక్షిస్తూంటాయి. దాని తొఱ్ఱలలో కీటకాలు (పాములు తేళ్లు మొదలైనవి) ఎన్నో నివసిస్తూంటాయి. దాని నీడను బాటసారులెందరో విశ్రాంతిసుఖం అనుభవిస్తూంటారు. ఇది సముచితమే—

ఏచెట్టునీడలో జంతుసంతానం నిద్రిస్తుందో, పక్షులసమూహం నివసించడంతో అంతటా ఆకులు కనబడవో, తొఱ్ఱలు పురుగులచే నిండిఉంటాయో, కొమ్మలపై కోతులగుంపులు గంతులువేస్తుంటాయో, మకరందం(పుష్పరసం) తుమ్మెదలచే నిస్సంకోచంగా పానం చేయబడుతుందో, ఇలా తన అవయవాలన్నింటిద్వారా అనేక ప్రాణులకు సుఖంగల్గించే-ఆ చెట్టుమాత్రమే కొనియాడదగినది. తక్కిన వృక్షాలన్నీ భూమికి భారములే.(2)

## కథా-1
## చిత్రగ్రీవవృత్తాన్తః

మూ. తత్ర చ లఘుపతనకో నామ వాయసః ప్రతివసతి స్మ. స కదాచిత్ ప్రాణయాత్రార్థం పురముద్దిశ్య ప్రచలితో యావత్ పశ్యతి, తావజ్జాలహస్తోఽతికృష్ణ-తనుః స్ఫుటితచరణ, ఊర్ధ్వకేశో, యమకింకరాకారో, నరః సమ్ముఖో బభూవ. అథ తం దృష్ట్వా శఙ్కితమనా వ్యచింతయత్– 'యదయం దురాత్మాఽద్య మమా శ్రయ-వటపాదపసమ్ముఖోఽభ్యేతి. తన్న జ్ఞాయతే కిమద్య వటవాసినాం విహంగమానాం సంక్షయో భవిష్యతి న వా?' ఏవం బహువిధం విచిన్త్య తత్క్షణాన్నివృత్య తమేవ వటపాదపం గత్వా సర్వాన్ విహంగమాన్ ప్రోవాచ– భోః! అయం దురాత్మా లుబ్ధకో జాల-తణ్డులహస్తః సమభ్యేతి. తత్సర్వథా తస్య న విశ్వసనీయమ్. ఏష జాలం ప్రసార్య తణ్డులాన్ ప్రక్షేప్స్యతి. తే తండులా భవద్భిః సర్వైరపి కాలకూటసదృశా ద్రష్టవ్యాః.

అ. అచ్చట లఘుపతనకుడు అనే కాకి నివసిస్తూ ఉంది. అది ఒకనాడు ఆహారం సంపాదించుకొనేందుకై నగరం దిక్కుగా పోవుచుండగా చేతిలో వలలు

పట్టుకొని ఒక మనుష్యుడు (వేటకాడు) ఎదురైనాడు. వాడికాళ్లు ఉబ్బి ఉన్నాయి. తల వెండ్రుకలు పైకి నిక్కపొడుచుకున్నాయి. మిక్కిలి నల్లగా యముని దూతవలె ఉన్నాడు. వానినిచూచి కీడుశంకించి ఇలా తలంచింది– 'ఈ దుష్టుడు నేడు నేను నివసించే మర్రిచెట్టుపై ఉండే పక్షులకు ఏమి కీడురాగలదో తెలియదు'– ఇలా బహు విధాలుగా విచారించింది. వెంటనే వెనుకకు మరలింది. మర్రివద్దకు వచ్చింది. పక్షులు అన్నిటితో ఇలానొక్కి చెప్పింది– 'ఓ మిత్రులారా! ఈ దుష్టుడైన వేటకాడు గింజలు వల చేతపట్టుకొని వస్తున్నాడు. ఇతనిని మాత్రం నమ్మరాదు. వీడు వలనువేసి గింజలు చల్లగలడు. ఆ గింజలను మీరు కాలకూటంగా చూడాలి.

మూ. ఏవం వదతస్తస్య స లుబ్ధకస్తత్ర వటతల ఆగత్య జాలం ప్రసార్య సిన్ధువార-సదృశాం స్తండులాన్ ప్రక్షిప్య నాతిదూరం గత్వా నిభృతః స్థితః. అథ యే పక్షిణ స్తత్ర స్థితాస్తే లఘుపతనకవాక్యార్గలయా నివారితాస్తాం స్తండులాన్ హాలాహలాఙ్కురానివ వీక్షమాణా నిభృతా స్తస్థుః. అత్రాన్తరే చిత్రగ్రీవో నామ కపోతరాజః సహస్రపరివారః ప్రాణయాత్రార్థం పరిభ్రమంస్తాం స్తండులాన్ దూరతోఽపి పశ్యల్లఘుపతనకేన నివార్యమాణోఽపి జిహ్వాలౌల్యా ద్భక్షణార్థమపతత్. సపరివారో నిబద్ధశ్చ. అథవా సాధ్విదముచ్యతే–

శ్లో. జిహ్వాలౌల్యప్రసక్తానాం జలమధ్యనివాసినామ్
అచిన్తితో వధోఽజ్ఞానాం మీనానామివ జాయతే. ౬

అ. అతడు ఇలా చెప్పుచూండగా ఆ వేటకాడు ఆ మర్రిచెట్టు క్రిందికివచ్చాడు. వల వేశాడు. కొండగోగుపూలవంటి (సింధువారపుష్పతుల్యాలైన) గింజలు చల్లాడు. కొలదిదూరం పోయిదాగికూర్చున్నాడు. ఆ చెట్టుమీద వసించే పక్షులు లఘుపతనకునివాక్యం అనే అర్గలంచే (గడియమ్రానుచే) నివారితులై ఆ బియ్యంగింజలను హాలాహలపువపు మొక్కలుగాచూస్తూ నిశ్చలంగా కూర్చున్నాయి. ఇంతలో చిత్రగ్రీవుడు అనే పావురములరాజు తన పరిజనమైన వెయ్యిపావురములును వెంటరాగా ఆహారార్థం తిరుగుచూ ఆ బియ్యంగింజలను దూరంనుండియే చూచాడు. లఘుపతనకుడు నివారిస్తున్నా నాల్కచాపల్యంచే తినడానికై వ్రాలాడు. సపరివారంగా వలలో బంధింపబడినాడు. పెద్దలు చక్కగా చెప్పారు—

నాలుక చాపల్యంతో చిక్కుకున్నవై నీటిలో నివసించే చేపలకువలె, మూర్ఖులకు అకస్మాత్తుగా(అచింతితంగా) మృత్యువు దాపురిస్తుంది.(3)

శ్లో. పౌలస్త్యః కథమన్య-దార-హరణం దోషం న విజ్ఞాతవాన్
రామేణాపి కథం న హేమహరిణస్యాసమ్భవో లక్షితః.
అక్షైశ్చాపి యుధిష్ఠిరేణ సహసా ప్రాప్తో హ్యనర్థః కథం
ప్రత్యాసన్న-విపత్తి-మూఢ మనసాం ప్రాయో మతిః క్షీయతే. 4

అ. రావణుడు పరస్త్రీహరణం పాపం అని ఎందుకు గ్రహింపలేదు? రాముడును బంగారులేడి అసంభవం (ఉండదు) అని ఏల తలంపలేదు? ధర్మరాజు పాచికలతో జూదం ఆడి అకస్మాత్తుగా ఆపదను ఏల పొందాడు? విపత్తు దాపురించడంతో భ్రాంతమైన మనస్సుగలవారికి సామాన్యంగా బుద్ధి నశిస్తుంది.

శ్లో. కృతాన్తపాశబద్ధానాం దైవోపహతచేతసామ్
బుద్ధయః కుబ్జగామిన్యో భవంతి మహతామపి. 5

అ. యమపాశబద్ధులూ(చావు దాపురించినవారూ) ప్రారబ్ధవశమున మనస్సు చెడినవారూ అయిన మహాత్ములకునూ బుద్ధులు చెడుదారిని ప్రవర్తిస్తాయి.

మూ. అత్రాన్తరే లుబ్ధకస్తాన్ బద్ధాన్ విజ్ఞాయ ప్రహృష్టమనాః ప్రోద్యతయష్టిస్తద్వధార్థం ప్రధావితః. చిత్రగ్రీవోఽప్యాత్మానం సపరివారం బద్ధం మత్వా లుబ్ధకమాయాంతం దృష్ట్వా తాన్ కపోతానూచే- 'అహో న భేతవ్యమ్. ఉక్తఞ్చ-

శ్లో. వ్యసనేష్వేవ సర్వేషు యస్య బుద్ధిర్న హీయతే
స తేషాం పారమభ్యేతి తత్ప్రభావాదసంశయమ్. 6

అ. ఇంతలో వేటకాడు అవి బంధింపబడినట్లు గ్రహించాడు. మిక్కిలి సంతోషించాడు. కట్టనెత్తుకొని వాటిని చంపడానికి పరుగెత్తాడు. చిత్రగ్రీవుడును తాను పరివారసమేతంగా బంధింపబడడం తెలుసుకొన్నాడు. వచ్చే వేటకాణ్ణి చూచాడు. ఆ పావురములతో ఇలా అన్నాడు- ఓ మిత్రులారా! భయపడకుడు. విజ్ఞులు అన్నారు—

ఎవని బుద్ధి ఆపదలు వచ్చినప్పుడు భ్రష్టంకాదో, అట్టివాడే అట్టిబుద్ధి

ప్రభావంచే ఆపదలు తరిస్తాడు. ఇందు సందేహం లేదు.(6)

శ్లో. సమ్పత్తౌ చ విపత్తౌ చ మహతామేకరూపతా
ఉదయే సవితా రక్తో రక్తశ్చాస్తమయే తథా. 7

అ. సంపదలందూ ఆపదలందూ మహాత్ములు ఒకేవిధంగా ఉంటారు. సూర్యుడు ఉదయించేటప్పుడు అలాగే అస్తమించేటప్పుడు ఎఱ్ఱగానే ఉండును.

మూ. తత్సర్వే వయం హేలయోడ్డీయ సపాశజాలా అస్యాదర్శనం గత్వా ముక్తిం ప్రాప్నుమః. నో చేద్భయవిక్లబాః సన్తో హేలయా సముత్పాతం న కరిష్యథ, తతో మృత్యుమవాప్స్యథ. ఉక్తఞ్చ.

శ్లో. తనవోఽప్యాయతా నిత్యం తన్తవో బహులాః సమాః
బహూన్ బహుత్వాదాయాసాన్ సహన్తీత్యుపమా సతామ్. 8

అ. కనుక మనం అందరం తేలికగా(హేలగా) వలతోగూడ ఎగిరిపోదాం. వీనికి కనబడకుండాపోయిన తర్వాత బంధం వదిలించుకుందాం. లేనిచో భయంవల్ల గాబరాపడి ఎగిరిపోనిచో మృత్యువువాత పడెదము. ప్రాజ్ఞులు ఇలా అన్నారు—

దారములు సన్ననివీ, పొడవైనవీ అయినా అనేకములు సమానంగా (క్రమ పద్ధతిలో) చేరి బరువులను సహిస్తున్నాయి. ఇదియే సజ్జనులకు పోలిక.(8)

మూ. తథాఽనుష్ఠితే లుబ్ధకో జాలమాదాయాఽఽకాశే గచ్ఛతాం తేషాం పృష్ఠతో భూమిస్థోఽపి పర్యధావత్. తత ఊర్ధ్వాననః శ్లోకమేనమపఠత్.

శ్లో. జాలమాదాయ గచ్ఛన్తి సంహతాః పక్షిణోఽప్యమీ
యావచ్చ వివదిష్యన్తే పతిష్యంతి న సంశయః. 9

అ. అలాగే చేశాయి. వేటకాడు వలతీసికొని ఆకాశంలో పోయేపక్షుల వెనుక భూమిమీద నుండియే పరుగెత్తాడు. తల ఎత్తిపైకి చూస్తూ ఈ శ్లోకం పఠించాడు.

ఈ పక్షులు కలిసికట్టుగా(సంఘీభావంతో) వల ఎత్తుకొని పోవుచున్నవి. ఎప్పుడు పరస్పరం తగవులాడునో అప్పుడు పడిపోతాయి. సంశయం లేదు.(9)

మూ. లఘుపతనకోఽపి ప్రాణయాత్రాక్రియాం త్యక్త్వా కిమత్ర భవిష్యతీతి కుతూహలాత్ తత్పృష్ఠతోఽనుసరతి. అథ దృష్టేరగోచరతాం గతాన్

నిర్భయంగా మహిలారోప్యనగరానికి ఈశాన్యదిశకు ప్రయాణం సాగించండి. అచ్చట నా మిత్రుడు హిరణ్యకుడు అనే ఎలుక ఉంది. అతడు అందరికి పాశవిముక్తిని గల్గిస్తాడు. విజ్ఞులు అన్నారు—

మానవులకందరికీ ఆపదవచ్చినచో మిత్రుడుతప్ప ఇతరులు ఎవ్వరూ మాటమాత్రంగానైనా సాయపడరు.(12)

మూ. ఏవం తే కపోతాశ్చిత్రగ్రీవేణ సమ్బోధితా మహిలారోప్యనగరే హిరణ్యకబిలదుర్గం ప్రాపుః. హిరణ్యకోఽపి సహస్రముఖ-బిలదుర్గం ప్రవిష్టః సన్ అకుతోభయః సుఖేనాస్తే. అథవా సాధ్విదముచ్యతే-

శ్లో. దంష్ట్రావిరహితో సర్పో మదహీనో యథా గజః
సర్వేషాం జాయతే వశ్యో దుర్గహీనస్తథా నృపః. 13

అ. ఇలా చిత్రగ్రీవుడు చెప్పగానే ఆ పావురములు మహిలారోప్యనగరంలో హిరణ్యకుని బిలదుర్గం చేరాయి హిరణ్యకుడును వెయ్యిదారులుగల బొరియ అనే కోటను ప్రవేశించి దేనివల్లనూ భయంలేనివాడై సుఖంగా ఉన్నాడు. విజ్ఞులు చక్కగా చెప్పారు—

కోరలులేని త్రాచువలె, మదంలేని ఏనుగువలె, కోటలేని రాజు అందరికి లొంగిపోతాడు. (13)

మూ. తథా చ-

శ్లో. న గజానాం సహస్రేణ న చ లక్షేణ వాజినామ్
తత్కార్యం సిద్ధ్యతే రాజ్ఞాం దుర్గేణైకేన యద్రణే. 14

శ్లో. శతమేకోఽపి సన్ధత్తే ప్రాకారస్థో ధనుర్ధరః
తస్మాద్దుర్గం ప్రశంసంతి నీతిశాస్త్రవిదో జనాః. 15

అ. అటులనే-యుద్ధంలో వెయ్యిఏనుగులచేతనూ, లక్షగుఱ్ఱాలచేతనూ ఏ పని సిద్ధించదో అది ఒక కోటచే సిద్ధిస్తుంది. (14)

కోట(గోడ)పై ఉండే ఒక విలుకాడు వందమంది వీరులతో యుద్ధంచేయగలడు. అందుచే నీతిశాస్త్రజ్ఞులు కోటను ప్రశంసిస్తారు. (15)

విజ్ఞాయ లుబ్ధకో నిరాశః శ్లోకమపఠన్ నివృత్తశ్చ.

శ్లో. న హి భవతి యన్న భావ్యం భవతి చ భావ్యం వినాపి యత్నేన
కరతలగతమపి నశ్యతి యస్య హి భవితవ్యతా నాస్తి. 10

అ. లఘుపతనకుడును ఆహారం వెదకడం మాని 'ఇందేమి అగునో' అను ఉత్కంఠతో వారి వెనుక అనుసరించాడు. పక్షులు కన్నులకు కనపడకుండా పోగానే వేటకాడు నిరాశచెందాడు. ఈ శ్లోకం పఠిస్తూ మరలాడు. న హి భవతి –ఇత్యాది.

ఏది జరుగరాదో అది (ఎంత యత్నించినా) జరుగదు. ఏది జరుగవలయునో అది ప్రయత్నంలేకయే జరుగును. అదృష్టంలేనివానికి అరచేతిలో ఉండేదికూడ నశిస్తుంది.(10)

మూ. తథా చ–

శ్లో. పరాఙ్ముఖే విధౌ చేత్ స్యాత్ కథఞ్చిద్ద్రవిణోదయః
తత్సోఽన్యదపి సఙ్గృహ్య యాతి శఙ్ఖనిధిర్యథా. 11

అ. దైవం(భాగ్యం) ప్రతికూలం అయితే ఏదోవిధంగా కొంతధనం లభించినా అది పూర్వార్జితమైన ఇతర ధనాన్ని తీసికొని శంఖనిధివలె నశిస్తుంది.

మూ. తదాస్తాం తావద్విహఙ్గాఽమిషలోభో యావత్కుటుమ్బవర్తనోపాయభూతం జాలమపి మే నష్టమ్,' చిత్రగ్రీవోఽపి లుబ్ధకమదర్శనీభూతం జ్ఞాత్వా తానువాచ– 'భోః నివృత్తః స దురాత్మా లుబ్ధకః. తత్సర్వైరపి స్వస్థైర్గమ్యతాం మహిలారోప్యస్య ప్రాగుత్తరదిగ్భాగే. తత్ర మమ సుహృద్ధిరణ్యకో నామ మూషకః సర్వేషాం పాశచ్ఛేదం కరిష్యతి. ఉక్తఞ్చ–

శ్లో. సర్వేషామేవ మర్త్యానాం వ్యసనే సముపస్థితే
వాఙ్మాత్రేణాపి సాహాయ్యం మిత్రాదన్యో న సందధే. 12

అ. పక్షులమాంసంపై లోభం అటుండనిమ్ము. కుటుంబపోషణకు ఆధారం అయిన వల కూడ నాకు మిగులలేదు (పోయింది) అని విచారించాడు. చిత్రగ్రీవుడును వేటకాడు కనబడకపోవడం గ్రహించి తన వారితో ఇలా అన్నాడు– 'మిత్రులారా! ఆ దురాత్ముడైన వేటకాడు మరలిపోయాడు. ఇక అందరూ

మూ. అథ చిత్రగ్రీవో బిలమాసాద్య తారస్వరేణ ప్రోవాచ– భో భో మిత్ర, హిరణ్యక! సత్వరమాగచ్ఛ. మహతీ మే వ్యసనాఽవస్థా వర్తతే. తచ్ఛ్రుత్వా హిరణ్యకోఽపి బిలదుర్గాంతర్గతః సన్ ప్రోవాచ– 'భోః కో భవాన్? కిమర్థమాయాతః? కిం కారణమ్? కీదృక్తే వ్యసనాఽవస్థానమ్? తత్ కథ్యతామ్ ఇతి. తచ్ఛ్రుత్వా చిత్రగ్రీవ ఆహ– 'భోః చిత్రగ్రీవో నామ కపోతరాజోఽహం తే సుహృత్. తత్ సత్వరమాగచ్ఛ. గురుతరం ప్రయోజనమస్తి. తదాకర్ణ్య పులకితతనుః ప్రహృష్టాఽఽత్మా స్థిరమనాస్త్వరమాణో నిష్క్రాంతః. అథవా సాధ్విదముచ్యతే-

శ్లో. సుహృదః స్నేహసమ్పన్నా లోచనానన్దదాయినః
గృహే గృహవతాం నిత్యం నాగచ్ఛంతి మహాత్మనామ్. 16

అ. అంత చిత్రగ్రీవుడు బొఱియవద్దకు పోయాడు. బిగ్గరగా ఇలా పిలిచాడు– ఓ ఓ మిత్రమా! హిరణ్యకా! తొందరగా రమ్ము. నాకు గొప్ప ఆపదవచ్చింది. దానిని విని హిరణ్యకుడు బిలదుర్గంలోనుండియే ఇలా బదులుపల్కాడు– 'అయ్యా! తాము ఎవ్వరు? ఎందులకు వచ్చారు?కారణం ఏమి? నీ ఆపద ఎలాంటిది? దానిని వినిపింపుము.' అందుకు చిత్రగ్రీవుడు అన్నాడు– 'ఓ మిత్రమా, నేను చిత్రగ్రీవుడు అనే కపోత (పావురముల) రాజును, నీ మిత్రుడను. కనుక త్వరగా రమ్ము. నీతో మిక్కిలి గొప్ప అవసరం(ఉపయోగం) ఉంది. దానిని వినగానే హిరణ్యకుడు ఎంతగానో ఆనందం పొందాడు. ఒడలు పులకరించింది. భయం తొలగింది. వెలుపలికి వచ్చాడు. పెద్దలు చక్కగా చెప్పారు–

స్నేహమూర్తులూ (చూడగానే) కన్నులకు ఆనందం గల్గించేవారూ అయిన స్నేహితులు గృహస్థుల ఇండ్లకు నిత్యంరారు. (తక్కువగా వస్తారు–అనిభావం).(16)

శ్లో. ఆదిత్యస్యోదయస్తాత! తామ్బూలం భారతీ కథా
ఇష్టా భార్యా సుమిత్రఞ్చ అపూర్వాణి దినే దినే. 17

అ. నాయనా (బిడ్డా) సూర్యోదయం అనగా జ్ఞానమయంగా పవిత్రంగా ఉండడం (వెలుగు జ్ఞానానికి సంకేతం) పరిమళద్రవ్యయుక్తతాంబూలసేవనం –

మహాభారతకథ-అనురక్తయిన భార్య-మంచిమిత్రుడు ఈ అయిదు పదార్థాలు దినం దినం క్రొంగ్రొత్త సుఖాలను గల్గిస్తాయి.

శ్లో. సుహృదో భవనే యస్య సమాగచ్ఛంతి నిత్యశః
చిత్తే చ తస్య సౌఖ్యస్య న కిఞ్చిత్ ప్రతిమం సుఖమ్. 18

అ. ఎవనియింటికి నిత్యం మిత్రులు వస్తూంటారో, ఆ సుఖానికి సాటియైన సుఖం ఏదీలేదు.

మూ. అథ చిత్రగ్రీవం సపరివారం పాశబద్ధమాలోక్య హిరణ్యకః సవిషాదమిదమాహ– 'భోః! కిమేతత్?' స ఆహ– 'జానన్నపి కిం పృచ్ఛసి? ఉక్తఞ్చ. యతః–

శ్లో. యస్మాచ్చ యేన చ యదా చ యథా చ యచ్చ
యావచ్చ యత్ర చ శుభాశుభమాత్మకర్మ.
తస్మాచ్చ తేన చ తదా చ తథా చ తచ్చ
తావచ్చ తత్ర చ కృతాన్తవశాదుపైతి. 19

అ. అంత చిత్రగ్రీవుణ్ణి పరివారసమేతంగా బద్ధుడై ఉండడంచూచి హిరణ్యకుడు విషాదంతో ఇలా అడిగాడు- 'ఓ మిత్రమా! ఇది ఏమి? అతడు(చిత్రగ్రీవుడు) ఇలా చెప్పాడు– 'తెలిసియు ఏల అడిగెదవు? పెద్దలు అన్నారు. ఎందుకనగా–

మానవుడు తన పూర్వజన్మలో దేనివలన ఏ కారణంచే ఏ సమయంలో ఎట్లు దేనిని ఏ పరిమాణంలో ఏ ప్రదేశంలో శుభంగాని లేక అశుభం గాని అయిన కర్మచేయునో దాని ఫలంగా ఈ జన్మలో, అందువలన ఆ కారణంచే ఆ సమయంలో (అది ప్రారబ్ధభోగ్యమైనప్పుడు) అట్లు దానిని (మంచిగాని-చెడ్డగానీ) అంతపరిమాణంలో ఆ ప్రదేశంలో పొందును.(19)

మూ. తత్ప్రాప్తం మయైతత్ బన్ధనం జిహ్వాలౌల్యాత్. సాంప్రతం త్వం సత్వరం పాశవిమోక్షం కురు. తదాకర్ణ్య హిరణ్యకః ప్రాహ–

శ్లో. అర్ధార్ధాద్యోజనశతాదామిషం వీక్షతే ఖగః
సోఽపి పార్శ్వస్థితం దైవాద్బంధనం న చ పశ్యతి. 20

అ. 'అందువల్ల నేను ఈ వలలో నాల్క-చాపల్యం వలన చిక్కాను. ప్రస్తుతం నీవు వెంటనే ఈ వలనుండి నాకు విముక్తి గల్గింపుము'. దానిని విని హిరణ్యకుడు అన్నాడు —

పక్షి ఏబది యోజనాలదూరంలో ఉండే ఆహారం చూస్తుంది. ఆ పక్షియే దైవికంగా తనప్రక్కనఉండే బంధనాన్ని గుర్తించలేదు. (20)

మూ. తథా చ-

శ్లో. రవినిశాకరయోర్గ్రహపీడనం గజ-భుజఙ్గ-విహంగమబన్ధనమ్
మతిమతాఞ్చ విలోక్య దరిద్రతాం విధిరహో బలవానితి మే మతిః. 21

అ. అలాగే, సూర్యుడు, చంద్రుడు రాహువుచే మింగబడటం- ఏనుగులు, పాములు, పక్షులు బందింపబడటం, జ్ఞానులు దారిద్ర్యం అనుభవించటం చూచి విధి (కర్మఫలం) మిక్కిలి బలంకలది అని తలంతును.

మూ. తథా చ-

శ్లో. వ్యోమైకాన్తవిచారిణోఽపి విహగాః సమ్ప్రాప్నువన్త్యాపదం
బధ్యన్తే నిపుణైరగాధసలిలాన్మీనాః సముద్రాదపి.
దుర్నీతం కిమిహాస్తి కిఞ్చ సుకృతం కః స్థానలాభే గుణః
కాలః సర్వజనాన్ ప్రసారితకరో గృహ్ణాతి దూరాదపి. 22

అ. అలాగే కేవలం ఆకాశంలో తిరిగేవి అయినా పక్షులు ఆపదలను పొందుచున్నాయి. చేపలు సముద్రంలో అగాధజలంలో ఉన్నా నేర్పరులచే పట్టుబడుచున్నాయి. ఈ ప్రపంచంలో పాపం పుణ్యం ఏముంది? ఉన్నతస్థానం వల్ల ఉపయోగం ఏముంది? కాలం, (ప్రారబ్ధం) చేతులుచాపి దూరంనుండియే అందరిని ఆకర్షిస్తూంది (గ్రహిస్తుంది.)

మూ. ఏవముక్త్వా చిత్రగ్రీవస్య పాశం ఛేత్తుముద్యతం స తమాహ- 'భద్ర, మా మైవం కురు. ప్రథమం మమ భృత్యానాం పాశచ్ఛేదం కురు. తదను మమాపి చ. తచ్ఛ్రుత్వా కుపితో హిరణ్యకః ప్రాహ- 'భోః, న యుక్తముక్తం భవతా. యతః స్వామినోఽనంతరం భృత్యాః.' స ఆహ- 'భద్ర మా మైవం

వద. మదాశ్రయాః సర్వే ఏతే వరాకాః. అపరం స్వకుటుమ్బం పరిత్యజ్య సమాగతాః. తత్కథమేతావన్మాత్రమపి సమ్మానం న కరోమి. ఉక్తఞ్చ—

శ్లో. యః సమ్మానం సదా ధత్తే భృత్యానాం క్షితిపోఽధికమ్.
విత్తాఽభావేఽపి తం దృష్ట్వా తే త్యజంతి న కర్హిచిత్. 23

అ. ఇలా అని చిత్రగ్రీవుని బంధనములను ఛేదించడానికి ప్రయత్నించిన అతనితో (హిరణ్యకునితో) చిత్రగ్రీవుడు అన్నాడు—' శుభమూర్తీ! వద్దు ఇలాచేయవద్దు. మొదట నా భృత్యుల బంధనములను ఛేదింపుము, ఆ తర్వాత నావి.' దానిని విని హిరణ్యకుడు కోపించి ఇలా అన్నాడు—' మిత్రమా! నీ మాట సరిగాలేదు. ఏలనన ప్రభువు తర్వాతనే సేవకులు ' అందుకు అతడు చెప్పాడు — 'భద్ర, వద్దు, అలా చెప్పవద్దు. ఈ దీనులు అందరూ నన్ను ఆశ్రయించి ఉన్నారు ; తమ కుటుంబం వదలి వచ్చారు. అలాంటప్పుడు ఇంత మాత్రం అయినా గౌరవం ఎలా చేయకుందును. విజ్ఞులు చెప్పారు—

ఏ ప్రభువు భృత్యులను నిత్యం అధికంగా గౌరవిస్తాడో, ఆ ప్రభువు కాలవశాన ధనహీనుడైనా వారు అతన్ని ఎప్పటికీ విడువరు.(23)

మూ. తథా చ—

శ్లో. విశ్వాసః సమ్పదాం మూలం తేన యూథపతిర్గజః
సింహో మృగాధిపత్యేఽపి న మృగైః పరివార్యతే. 24

అ. అలాగే — విశ్వాసం సంపదలకు కారణం. అందువల్ల ఏనుగు యూథపతి అయ్యింది. అనగా ఇతరాలైన ఏనుగులు దాని చుట్టు ఉండును. మృగరాజైనా దానిచుట్టూ ఏ మృగాలూ ఉండవు.

మూ. అపరం మమ పాశచ్ఛేదం కుర్వతస్తే దంతభఙ్గో భవతి. అథవా దురాత్మా లుబ్ధకః సమభ్యేతి. తన్నూనం మమ నరకపాత ఏవ. ఉక్తఞ్చ—

శ్లో. సదాచారేషు భృత్యేషు సంసీదత్సు చ యః ప్రభుః
సుఖీ స్యాన్నరకం యాతి పరత్రేహ చ సీదతి. 25

అ మరొక్క విషయం — నా పాశములను ఛేదిస్తూ ఉండగా నీకు పండ్లు

ఊడిపోవచ్చు, లేక ఆ దుర్మార్గుడైన వేటకాడు రావచ్చు. అప్పుడు తప్పక నాకు నరక ప్రాప్తియే. పెద్దలు చెప్పారు...

సద్వ్రతులైన సేవకులు నశిస్తూఉండగా ఏ ప్రభువు సుఖంగా ఉంటాడో, అతడు పరలోకంలో నరకం పొందుతాడు. ఈ లోకంలో నశిస్తాడు.(25)

మూ. తచ్ఛ్రుత్వా ప్రహృష్టో హిరణ్యకః ప్రాహ— 'భోః, వేద్మ్యహం రాజధర్మమ్. పరం మయా తవ పరీక్షా కృతా. తత్ సర్వేషాం పూర్వం పాశచ్ఛేదం కరిష్యామి. భవానప్యనేన విధినా బహుకపోతపరివారో భవిష్యతి. ఉక్తఞ్చ-

శ్లో॥ కారుణ్యం సంవిభాగశ్చ యస్య భృత్యేషు సర్వదా
సమ్భవేత్ స మహీపాలస్త్రైలోక్యస్యాపి రక్షణే. 26

అ. దానిని విని హిరణ్యకుడు సంతుష్టుడై ఇలా అన్నాడు— 'మిత్రమా! రాజధర్మం నాకు తెలియును. అయినా నేను నిన్ను పరీక్షించాను. అందుచే వారందరి బంధాలు తొలగిస్తాను. ఈ పద్ధతిచే నీవూ పెక్కు పావురాల పరివారం గలవాడవు అగుదువు. పెద్దలు అన్నారు—

సేవకులయందు దయ, సమాన సుఖదుఃఖభావం గల్గిన ప్రభువు ముల్లోకాలను రక్షింప సమర్థుడు అగును (26).

మూ. ఏవముక్త్వా సర్వేషాం పాశచ్ఛేదం కృత్వా హిరణ్యకశ్చిత్రగ్రీవమాహ— 'మిత్ర, గమ్యతామధునా స్వాశ్రయం ప్రతి భూయోఽపి వ్యసనే ప్రాప్తే సమాగన్తవ్యమ్,' ఇతి తాన్ సంప్రేష్య పునరపి దుర్గం ప్రవిష్టః. చిత్రగ్రీవోఽపి సపరివారః స్వాశ్రయమగమత్. అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. మిత్రవాన్ సాధయత్యర్థాన్ దుఃసాధ్యానపి వై పునః
తస్మాన్మిత్రాణి కుర్వీత సమానాన్యేవ చాత్మనః. 27

అ. ఇలా అని హిరణ్యకుడు అందరి బంధాలు తొలగించి చిత్రగ్రీవునితో ఇట్లు చెప్పాడు - 'మిత్రమా? ఇప్పుడు నీ నివాసానికి పొమ్ము. మరల ఆపద ఏదేని వస్తే రమ్ము.' ఇలాఅని వారిని సాగనంపి తనకోటలో ప్రవేశించాడు. చిత్రగ్రీవుడును పరివారసమేతంగా తన నివాసం చేరాడు. పెద్దలు చక్కగా చెప్పారు—

మంచిమిత్రులు గలవాడు అసాధ్య కార్యాలనుగూడ సాధిస్తాడు. అందువల్ల (బుద్ధిమంతుడు) తనతో సమానులను మిత్రులనుగా చేసికొనవలయును. (27)

మూ. లఘుపతనకోఽపి వాయసః సర్వం తం చిత్రగ్రీవబన్ధమోక్షమవలోక్య వ్యచిన్తయత్– 'అహో, బుద్ధిరస్య హిరణ్యకస్య శక్తిశ్చ దుర్గసామగ్రీ చ. తదీదృగేవ విధిర్విహఙ్గానాం బన్ధనమోక్షాత్మకః. అహం న కస్యచిద్ విశ్వసిమి, చలప్రకృతిశ్చ. తథాఽప్యేనం మిత్రం కరోమి. ఉక్తఞ్చ–

శ్లో. అపి సమ్పూర్ణతాయుక్తైః కర్తవ్యాః సుహృదో బుధైః
నదీశః పరిపూర్ణోఽపి చన్ద్రోదయమపేక్షతే. 28

అ. లఘుపతనకుడును పరివారంతో చిత్రగ్రీవుడు బంధవిముక్తిని పొందడం చూచాడు. ఆశ్చర్యంతో గూడినవాడై ఇలా తలంచాడు–'ఆహా, హిరణ్యకుని బుద్ధిని ఏమని పొగడుదును.?' అలాగే శక్తి, దుర్గనిర్మాణనైపుణ్యం కూడ, పక్షులు బంధవిముక్తిని పొందడానికి ఇదియే (సరియైన) పద్ధతి. నేను ఎవరినీ నమ్మను. చంచల స్వభావం గలవాడను. అయినా ఇతనిని మిత్రునిగా చేసికొంటాను. విజ్ఞులు అన్నారు–

(సర్వవస్తు) సంపూర్ణులై ఉన్నా బుద్ధిమంతులు, మిత్రులను అనేకులను సంపాదించుకోవాలి. సముద్రుడు నదులచే పరిపూర్ణుడైనా చంద్రోదయం అపేక్షిస్తాడు.(28)

## కథా–2

## లఘుపతనక-హిరణ్యక-సంవాద

మూ. ఏవం సమ్ప్రధార్య పాదపాదవతీర్య బిలద్వారమాశ్రిత్య చిత్రగ్రీవవచ్ఛబ్దేన హిరణ్యకం సమాహూతవాన్–'ఏహ్యేహి, భో హిరణ్యక, ఏహి.' తచ్ఛబ్దం శ్రుత్వా హిరణ్యకో వ్యచిన్తయత్– 'కిమన్యోఽపి కశ్చిత్ కపోతో బన్ధనశేషస్తిష్ఠతి. యేన మాం వ్యాహరతి.' ఆహ చ– 'భోః కో భవాన్?' స ఆహ– 'అహం లఘుపతనకో నామ వాయసః. తచ్ఛ్రుత్వా విశేషాదన్తర్లీనో హిరణ్యక ఆహ– 'భోః ద్రుతం గమ్యతామస్మాత్ స్థానాత్.' వాయస ఆహ– 'అహం తవ పార్శ్వే గురుకార్యేణ సమాగతః. తత్కిం న క్రియతే మయా సహ దర్శనమ్? హిరణ్యక ఆహ–'న మేఽస్తి త్వయా సహ సఙ్గమేన ప్రయోజనమ్– ఇతి.

అ. ఇలా తలంచి వృక్షంనుండి దిగాడు. బొఱియద్వారంవద్దకు వెళ్ళాడు- చిత్రగ్రీవునివంటి (మధురమైన) గొంతుతో హిరణ్యకుని ఇలా పిలిచాడు- 'రమ్ము రమ్ము, ఓ హిరణ్యకా! రమ్ము.' దానిని విని హిరణ్యకుడు ఇలా విచారించాడు.— 'ఏమి? ఇంకా ఎవ్వైనా పక్షి బంధనములు తొలగనిదే ఉందా? అందుచేనన్ను మరల పిలుచుచున్నాడు.' ఇట్లు తలంచి అన్నాడు - 'ఓయీ! నీవు ఎవ్వరవు? అది అంది. 'నేను లఘుపతనకుడు అనే కాకిని'. దానిని విని మరికొంత లోనికిపోయి హిరణ్యకుడు చెప్పాడు.—'ఓయీ, తొందరగా ఇచ్చటినుండి తొలగిపొమ్ము.' కాకి చెప్పింది - 'నేను నీవద్దకు గొప్ప పనిమీద వచ్చాను. అలాంటియెడ నాకు ఎందుకు కనబడవు?' హిరణ్యకుడు అన్నాడు - 'నీతో కలియడంవల్ల నాకు ఉపయోగం లేదు.'

మూ. స ఆహ– 'భోః చిత్రగ్రీవస్య మయా తవ సకాశాత్ పాశ మోక్షణం దృష్టమ్. తేన మమ మహతీ ప్రీతిః సఞ్జాతా. తత్కదాచిన్మమాపి బన్ధనే జాతే తవ పార్శ్వాన్ముక్తిర్భవిష్యతి. తత్క్రియతాం మయా సహ మైత్రీ. హిరణ్యక ఆహ– 'అహో, త్వం భోక్తా అహఞ్చ తవ భోజ్యభూతః. తత్కా త్వయా సహ మమ మైత్రీ? తద్గమ్యతామ్. మైత్రీ, విరోధభావాత్ కథమ్? ఉక్తఞ్చ–

శ్లో. యయోరేవ సమం విత్తం యయోరేవ సమం కులమ్
తయోర్మైత్రీ వివాహశ్చ న తు పుష్టవిపుష్టయోః. 29

అ. అతడు (లఘుపతనకుడు) అన్నాడు- 'అయ్యా, చిత్రగ్రీవుడు నీవలన బంధవిముక్తిని పొందడం నేను చూచాను. అందువల్ల నాకు చాల ప్రీతి గల్గింది. కనుక ఎప్పుడైనా నాకూ బంధనం సంభవిస్తే నీవలన విముక్తి లభిస్తుంది. అందుచే నాతో స్నేహం చేయుము'. హిరణ్యకుడు అన్నాడు— 'ఆశ్చర్యం, నీవు భోక్తవు, నేను నీకు భోజ్యం అయినవాడను. అట్టియెడ నీతో మైత్రి యెట్లు? అందుచే వెళ్లుము. విరోధంగల చోట మైత్రి పొసగదు. విజ్ఞులు అన్నారు—

ఎవరికైతే ధనం, కులం సమానంగా ఉంటాయో, వారికే మైత్రిగానీ, వివాహంగానీ శుభంగా ఉంటుంది. బలవంతులకు, బలహీనులకు సరిపడదు. (29)

మూ. తథా చ–

శ్లో. యో మిత్రం కురుతే మూఢ ఆత్మనోఽసదృశం కుధీః
హీనం వాఽప్యధికం వాపి హాస్యతాం యాత్యసౌ జనః. 30

అ. అలాగే ఏ అజ్ఞాని దుర్బుద్ధితో తనకంటే తక్కువగానీ లేక ఎక్కువగానీ అనమానునితో మైత్రిచేస్తాడో వాడు అపహాస్యం పాలు అగును.(30)

మూ. తద్గమ్యతామ్ ఇతి. వాయస ఆహ— 'భో హిరణ్యక ఏషోఽహం తవ దుర్గద్వార ఉపవిష్టః. యది త్వం మైత్రీ న కరోషి, తతోఽహం ప్రాణమోక్షణం తవాగ్రే కరిష్యామి. అథవా ప్రాయోపవేశనం మే స్యాత్' ఇతి. హిరణ్యక ఆహ—'భోః త్వయా వైరిణా సహ కథం మైత్రీం కరోమి. ఉక్తఞ్చ—

శ్లో. వైరిణా న హి సన్దధ్యాత్ సుశ్లిష్టేనాపి సన్ధినా
సుతప్తమపి పానీయం శమయత్యేవ పావకమ్. 31

అ. అందుచే వెళ్లుము! కాకి అన్నది— 'ఓ హిరణ్యక! ఇదిగో నేను నీ కోటవాకిట్లో కూర్చున్నాను. నీవు స్నేహం చేయనిచో నీఎదుటనే ప్రాణాలు విడిచెద. లేక నిరాహారదీక్షతో మరణిస్తాను.' హిరణ్యకుడు చెప్పాడు— 'ఓయీ? విరోధిఅయిన నీతో స్నేహం ఎలా చేస్తాను?' అభిజ్ఞులు అన్నారు—

ప్రమాణపూర్వకం అయిన సంధితో అయినా శత్రువుతో కలిసిమెలిసి ఉండరాదు. లెస్సగా కాగిన నీరుకూడ అగ్నిని చల్లారుస్తూనే ఉంది. (31)

మూ. వాయస ఆహ— భోః త్వయా సహ దర్శనమపి నాస్తి. కుతో వైరమ్? తత్కిమనుచితం వదసి? హిరణ్యక ఆహ— ద్వివిధం వైరం భవతి. సహజం కృత్రిమం చ. తత్సహజవైరీ త్వమస్మాకమ్. ఉక్తఞ్చ—

శ్లో. కృత్రిమం నాశమభ్యేతి వైరం ద్రాక్ కృత్రిమైర్గుణైః
ప్రాణదానం వినా వైరం సహజం యాతి న క్షయమ్. 32

అ. కాకి ఇలా అంది— 'అయ్యా! నీదర్శనం కూడ లేదు. ఇక వైరం ఎట్లు? అలాంటిస్థితిలో అనుచితంగా ఎందుకు మాట్లాడెదవు?' అందుకు హిరణ్యకుడు ఇలా చెప్పాడు— 'వైరం రెండువిధాలు. ఒకటి సహజం, రెండు కృత్రిమం. నీవు మాకు విరోధివి. విజ్ఞులు అన్నారు—

'కొన్ని కారణాలవలన వచ్చినవైరం (కృత్రిమవైరం) విరోధకారణాలు తొలగగానే వెంటనే నశిస్తుంది. సహజవైరం ప్రాణాలు తీయక నశింపదు.'(32)

మూ. వాయస ఆహ- 'భోః ద్వివిధస్య వైరస్య లక్షణం శ్రోతు మిచ్ఛామి. తత్కథ్యతామ్. హిరణ్యక ఆహ– 'భోః, కారణేన నిర్వృత్తం కృత్రిమమ్. తత్ తదర్హోపకారకరణాద్ గచ్ఛతి. స్వాభావికం పునః కథమపి న గచ్ఛతి. తద్యథా నకుల-సర్పాణామ్, శష్పభుఙ్నఖాయుధానామ్, జల–వహ్న్యోః, దేవ-దైత్యానామ్, సారమేయ-మార్జారాణామ్, ఈశ్వర-దరిద్రాణామ్, సపత్నీనామ్, సింహ–గజానామ్, లుబ్ధక-హరిణానామ్, శ్రోత్రియ–భ్రష్టక్రియాణామ్ మూర్ఖ–పండితానామ్, పతివ్రతా–కులటానామ్, సజ్జన–దుర్జనానామ్, న కశ్చిత్ కేనాపి వ్యాపాదితః, తథాపి ప్రాణాన్ సన్తాపయన్తి.

అ. కాకి అడిగింది- 'అయ్యా! రెండు విధములైన వైరలక్షణాలు వినగోరుచున్నాను. కనుక తెలుపండి.' హిరణ్యకుడు చెప్పాడు- 'అయ్యా! ఏదేని కారణం ద్వారా సంభవించిన విరోధం కృత్రిమం. అది దానికి తగిన ఉపాకారం చేయడంతో పోతుంది. సహజమైన వైరం ఏ విధంగానూ పోదు. అందుకు ఉదాహరణం- ముంగిసలకు పాములకు, గడ్డితినేవాటికి (ఎద్దు, మేక మొదలైనవాటికి)- గోళ్లు ఆయుధాలుగా ఉండేవాటికి (సింహాలు, పులులు మొదలైనవాటికి), నీటికి అగ్నికి, దేవతలకు రాక్షసులకు, పిల్లులకు కుక్కలకు, ధనికులకు దరిద్రులకు, సవతులకు, సింహాలకు ఏనుగులకు, వేటకాండ్రకు జింకలకు, వేదవేత్తలకు ఆచారభ్రష్టులకు, మూర్ఖులకు పండితులకు, పతివ్రతలకు జారిణులకు, సజ్జనులకు దుర్జనులకు ఉండే విరోధం. వీరిలో ఎవరు ఎవరికి అంతకుముందు ఏకీడు చేయకపోయినా ప్రాణాలకు అపాయంగానే ప్రవర్తిసారు.'

మూ. వాయస ఆహ– 'భోః అకారణమేతత్. శ్రూయతాం మే వచనమ్___

శ్లో. కారణాన్మిత్రతాం యాతి కారణాదేతి శత్రుతామ్
తస్మాన్మిత్రత్వమేవాత్ర యోజ్యం వైరం న ధీమతా. 33

అ. కాకి అంది- 'అయ్యా! ఇది కారణంలేనిది. నామాట వినండి- కారణం వల్లనే మైత్రిగానీ, విరోధంగానీ సంభవిస్తాయి. అందువల్ల ఈ ప్రపంచంలో బుద్ధిమంతుడు మైత్రినే సంపాదించాలి. విరోధం వద్దు.(33)

మూ. తస్మాత్ కురు మయా సహ సమాగమం మిత్రధర్మార్థమ్.

అందువల్ల మిత్రధర్మమునకై (మైత్రికై) నాతో కలువండి?

మూ. హిరణ్యక ఆహ– 'భోః శ్రూయతాం నీతిసర్వస్వమ్–

శ్లో. సకృద్దుష్టమపీష్టం యః పునః సన్ధాతుమిచ్ఛతి
స మృత్యుముపగృహ్ణాతి గర్భమశ్వతరీ యథా. 34

అ. హిరణ్యకుడు అన్నాడు- 'అయ్యా! నేను తెల్పే నీతిసారమైన ధనం వినండి—

మిత్రుడైనా ఒకసారి కీడుచేసినచో మరలా వానితో మైత్రిని గోరరాదు! అలా కోరువాడు కంచరగాడిద గర్భంధరించినట్లు తన మృత్యువును గ్రహిస్తున్నాడు.(34)

మూ. అథవా గుణవానహమ్, న మే కిఞ్చిద్వైరయాతనాం కరిష్యతి. ఏతదపి న సమ్భావ్యమ్. ఉక్తఞ్చ–

శ్లో. సింహో వ్యాకరణస్య కర్తురహరత్ ప్రాణాన్ ప్రియాన్ పాణినేః
మీమాంసాకృతమున్మమాథ సహసా హస్తీ మునిం జైమినిమ్.
ఛన్దోజ్ఞాననిధిం జఘాన మకరో వేలాతటే పింగల
ఞ్చాజ్ఞానావృతచేతసామతిరుషాం కోఽర్థ స్తిరశ్చాంగుణైః 35

అ. అదియూగాక- నేను గుణవంతుడను, నాకు ఎవడూ కీడుచేయడు, అనియూ తలంపరాదు. విజ్ఞులు అన్నారు—

సింహం వ్యాకరణశాస్త్ర నిర్మాత అయిన పాణినిమహర్షి ప్రియమైన ప్రాణాలను హరించింది. ఏనుగు మీమాంసాశాస్త్ర రచయిత అయిన జైమినిముసిని తటాలున చంపింది. మొసలి ఛందోజ్ఞాన నిధి అయిన పింగళకుని సముద్రతీరాన మ్రింగివేసింది. (హతులందరూ మహాత్ములే) అజ్ఞానంచే ఆవృతులై క్రోధాంధులై పశువృత్తిలో ఉండే వారికి, ఇతరుల గుణాలతో అవసరం ఏముంది?'

మూ. వాయస ఆహ– అస్త్యేతత్. తథాఽపి శ్రూయతామ్–

శ్లో. ఉపకారాచ్చ లోకానాం నిమిత్తాన్మృగపక్షిణామ్
భయాల్లోభాచ్చ మూర్ఖాణాం మైత్రీ స్యాద్దర్శనాత్ సతామ్. 36

అ. కాకి ఇలా అంది- 'అదిసరే! అయినా (నామాట) వినండి—

మైత్రిఅనేది మానవులకు ఉపకారంవలనా. పశుపక్షులకు ఏదేని కారణం వలనా, మూర్ఖులకు భయలోభాలవలనా గల్గుతుంది. సజ్జనులకు మాత్రం అది (ఒక సారి) పరస్పర సందర్శనం వలననే సిద్ధిస్తుంది.(36)

శ్లో. మృద్ఘట ఇవ సుఖభేద్యో దుస్సన్ధానశ్చ దుర్జనో భవతి
సుజనస్తు కనకఘట ఇవ దుర్భేద్యః సుకరసన్ధిశ్చ. 37

అ. దుర్జనస్నేహం మట్టికుండవంటిది. అది తేలికగా పగులుతుంది. అతికించడం కష్టం. సజ్జనస్నేహం బంగారుకడవ వంటిది. అది తేలికగా పగులదు, పగిలినా అతికించడం తేలిక.

శ్లో. ఇక్షోరగ్రాత్ క్రమశః పర్వణి పర్వణి యథా రసవిశేషః
తద్వత్ సజ్జనమైత్రీ విపరీతానాన్తు విపరీతా. 38

అ. చెఱకుగడ పైగణుపునుండి క్రిందిగణుపునకు వచ్చినట్లు సజ్జనుల మైత్రి క్రమంగా రససమృద్ధం అగును. ఇందుకు విపరీతంగా దుర్జనమైత్రి, చెఱకుగడ క్రింది నుండి పైకిపోయినట్లు క్రమంగా రసహీనం అగును.(38)

మూ. తథా చ–

శ్లో. ఆరమ్భగుర్వీ క్షయిణీ క్రమేణ లఘ్వీ పురా వృద్ధిమతీ చ పశ్చాత్
దినస్య పూర్వార్ధపరార్ధభిన్నా ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్. 39

అ. అటులనే— దుర్జనస్నేహం ఉదయంపూట నీడవలె మొదట గొప్పగా ఉండి తర్వాత మెల్లమెల్లగా క్షీణిస్తుంది. సజ్జనస్నేహం సాయంకాలపు నీడవలె మొదట అల్పంగాఉండి తర్వాత మెల్లమెల్లగా వృద్ధిపొందుతుంది.(39)

మూ. తస్మాత్ సాధురహమ్ అపరం త్వాం శపథాదిభిర్నిర్భయం కరిష్యామి.' స ఆహ– 'న మేఽస్తి తే శపథైః ప్రత్యయః. ఉక్తఞ్చ–

శ్లో. శపథైః సన్ధితస్యాపి న విశ్వాసం వ్రజేద్రిపోః
శ్రూయతే శపథం కృత్వా వృత్రః శక్రేణ సూదితః. 40

అ. కనుక నేను సజ్జనుడను. మరియూ ప్రతిజ్ఞాదులద్వారా నీ భయం తొలగిస్తాను. (దానిని విని) అతడు అన్నాడు - 'నాకు నీ ప్రతిజ్ఞలచే నమ్మకం కల్గదు' విజ్ఞులు చెప్పారు—

ప్రతిజ్ఞలచే సంధిచేసుకొన్నా శత్రువును నమ్మరాదు. ప్రతిజ్ఞ చేసిన ఇంద్రుడు వృత్రుణ్ణి చంపడం ప్రసిద్ధం గదా ! (అందరూ విన్నారు 40)

శ్లో. న విశ్వాసం వినా శత్రోర్దేవానామపి సిద్ధ్యతి
విశ్వాసాత్ త్రిదశేన్ద్రేణ దితేర్గర్భో విదారితః. 41

అ. విశ్వాసం గల్గించనిచో దేవతలును తమ శత్రువుల విషయంలో కార్య సిద్ధిని పొందలేరు. విశ్వాసం గల్గించియే ఇంద్రుడు దితి గర్భం ఖండించాడు. (41)

మూ. అన్యచ్చ-

శ్లో. బృహస్పతేరపి ప్రాజ్ఞస్తస్మాన్నైవాత్ర విశ్వసేత్
య ఇచ్ఛేదాత్మనో వృద్ధిమాయుష్యం చ సుఖాని చ. 42

అ. మరియూ, తనవృద్ధిని దీర్ఘాయువును సుఖాన్ని కోరే ప్రాజ్ఞుడు ఈ ప్రపంచంలో బృహస్పతి విషయంలోను నమ్మకం ఉంచరాదు.

మూ. తథా చ-

శ్లో. సుసూక్ష్మేణాపి రన్ధ్రేణ ప్రవిశ్యాభ్యన్తరం రిపుః
నాశయేచ్చ శనైః పశ్చాత్ ప్లవం సలిలపూరవత్. 43

అ. అలాగే - చిన్న బెజ్జంద్వారా ప్రవేశించిన నీటివెల్లువ, నావను ముంచు నట్లు, అల్పదోషం ద్వారా ప్రవేశించిన శత్రువు సర్వనాశనం చేస్తాడు,

శ్లో. న విశ్వసేదవిశ్వస్తే విశ్వస్తేఽపి న విశ్వసేత్
విశ్వాసాద్భయముత్పన్నం మూలాన్యపి నికృన్తతి. 44

అ. విశ్వసింపదగని వానిని విశ్వసించరాదు. విశ్వసించినవానిని అతిగా విశ్వసింపరాదు. విశ్వాసంద్వారా (విశ్వస్తుని ద్వారా) సంభవించే కీడు తనను సమూలంగా నాశనం చేస్తుంది.

శ్లో. న వధ్యతే హ్యవిశ్వస్తో దుర్బలోఽపి బలోత్కటైః
విశ్వస్తాశ్చాశు వధ్యన్తే బలవంతోఽపి దుర్బలైః. 45

అ. నమ్మనివాడు బలహీనుడైనా బలవంతులచే చంపబడును. నమ్మిన బలవంతులుకూడ వెంటనే బలహీనులచే చంపబడెదరు.

శ్లో. సుకృత్యం విష్ణుగుప్తస్య మిత్రాప్తిర్భార్గవస్య చ
బృహస్పతేరవిశ్వాసో నీతిసన్ధిస్త్రిధా స్థితః. 46

అ. చాణుక్యుని మతానుసారం 'కార్యం చక్కగా నిర్వహించడం. శుక్రాచార్యుని మతానుసారం మిత్రులను సంపాదించడం, బృహస్పతి మతానుసారం 'ఎవరినీ నమ్మక పోవడం ' – అని నీతి సిద్ధాంతం మూడు విధాలుగా ఉంది.

మూ. తథా చ–

శ్లో. మహతాఽప్యర్థసారేణ యో విశ్వసితి శత్రుషు
భార్యాసు సువిరక్తాసు తదన్తం తస్య జీవితమ్. 47

అ. అలాగే—ఏ మనుష్యుడు మహత్తరధనంద్వారా శత్రువులయెడనూ మిక్కిలి విరక్తితో ఉండే భార్యలయెడనూ విశ్వాసం ఉంచుతాడో, వాని జీవితం అంతటితో (ఆఖరు) ముగుస్తుంది. మరణిస్తాడు అని భావం.'

మూ. తచ్ఛ్రుత్వా లఘుపతనకోఽపి నిరుత్తరశ్చింతయామాస– 'అహో బుద్ధిప్రాగల్భ్యమస్య నీతివిషయే. అథవా స ఏవాస్యోపరి మైత్రీపక్షపాతః స ఆహ– భో హిరణ్యక!

శ్లో. సతాం సాప్తపదం మైత్రమిత్యాహుర్విబుధా జనాః
తస్మాత్ త్వం మిత్రతాం ప్రాప్తో వచనం మమ తచ్ఛృణు. 48

అ. దానిని విని లఘుపతనకునికి బదులు చెప్పడానికి ఏమీతోచలేదు. తనలో ఇలా తలంచాడు – ' ఆహా, నీతి విషయంలో ఇతని బుద్ధినైపుణ్యం అద్భుతం. ఇందువల్లనే ఇతనితోడి మైత్రిపై నాకు ఇంతగా ఆసక్తి గల్గింది.' ఇలా తలంచి హిరణ్యకునితో అన్నాడు – ఓ హిరణ్యకా ?

విద్వాంసులు సజ్జనమైత్రిని సాప్తపదం (ఏడు మాటలు మాట్లాడడంవల్లగాని ఏడడుగులు కలిసి నడువడంవల్ల గాని సంభవించేది) అందురు. అందుచే నీవు నాకు మిత్రుడవు అయినావు. కనక నా మాటను వినుము (48)

మూ. దుర్గస్థేనాఽపి త్వయా మయా సహ నిత్యమేవాలాపో గుణదోషసుభాషితగోష్ఠీకథాః సర్వథా కర్తవ్యాః,యద్యేవం న విశ్వసిషి. తచ్ఛ్రుత్వా హిరణ్యకోఽపి వ్యచిన్తయత్— 'విదగ్ధవచనోయం దృశ్యతే సత్యవాక్యశ్చ. తద్యుక్తమనేన మైత్రీకరణమ్. ఆహ చ— పరం కదాచిన్మమ దుర్గే చరణపాతోఽపి త్వయా న కార్యః. ఉక్తఞ్చ—

శ్లో. భీతభీతైః పురా శత్రుర్మన్దం మన్దం విసర్పతి
భూమౌ ప్రహేలయా పశ్చాజ్జారహస్తోఽఙ్గనాస్వివ. 49

అ. నమ్మనిచో కోటలో నుండియే నిత్యం నాతో సంభాషణలు - గుణదోష పరామర్శలు - సూక్తులు - గోష్ఠులు - సత్కథాచర్చలు ఇత్యాదులు చేస్తూ ఉండండి. దానిని విని హిరణ్యకుడు ఇలా తలంచాడు - 'ఈ లఘుపతనకుడు మాటల నేర్పరిగాను సత్యం పల్కువాడుగాను కనబడుచున్నాడు. కనుక ఇతనితోడి మైత్రి సముచితం' ఇలా తలంచి అతనితో అన్నాడు – 'కాని నీవు నా యింటిలో ఎప్పుడును అడుగు పెట్టరాదు. విజ్ఞులు అన్నార—

జారుని హస్తం పరస్త్రీలయందువలె, శత్రువు మొదట మన యింటిలో మిక్కిలి భయంతో భూమిపై తడబడే అడుగులువేస్తూ మెల్ల మెల్లగా ప్రవేశించి ఆ మీదట ప్రహేలగా (నిర్భయంగా - అమర్యాదగా) ప్రవర్తిస్తాడు. (49)

మూ. తచ్ఛ్రుత్వా వాయస ఆహ— 'భద్ర! ఏవం భవతు' ఇతి. తతః ప్రభృతి తౌ ద్వావపి సుభాషితగోష్ఠీసుఖమనుభవన్తౌ తిష్ఠతః. పరస్పరం కృతోపకారౌ కాలం నయతః. లఘుపతనకోఽపి మాంసశకలాని మేధ్యాని బలిశేషాణ్యన్యాని వాత్సల్యాహృతాని పక్వాన్నవిశేషాణి హిరణ్యకార్థమానయతి. హిరణ్యకోఽపి తండులానన్యాంశ్చ భక్ష్యవిశేషాంల్లఘుపతనకార్థం రాత్రావాహృత్య తత్కాలాయాతస్యార్పయతి. అథవా యుజ్యతే ద్వయోరప్యేతత్. ఉక్తఞ్చ—

శ్లో. దదాతి ప్రతిగృహ్ణాతి గుహ్యమాఖ్యాతి పృచ్ఛతి
భుఙ్క్తే భోజయతే చైవ షడ్విధం ప్రీతిలక్షణమ్. 50

అ. దానిని విని కాకి చెప్పింది – 'ఓ శుభమూర్తీ ! ఇలాగే అగుగాత !'

అది మొదలు ఆ ఇరువురూ సుభాషిత గోష్ఠి సుఖం అనుభవిస్తూ ఉండే వారు. ఒకరికొకరు ఉపకారం చేసుకుంటూ కాలం గడిపేవారు. లఘుపతనకుడును మాంసపు ముక్కలు, రుచికరములైన (పవిత్రములైన) బలిశేషాలు, ఇతరములైన పిండివంటలు ప్రేమతో తెచ్చి హిరణ్యకునికి ఇచ్చేవాడు. హిరణ్యకుడును బియ్యం గింజలూ, ఇతరములైన భక్ష్యవిశేషాలను రాత్రివేళ తెచ్చి ఆ సమయంలో వచ్చి నట్టి అతనికి అర్పించేవాడు. ఇరువురికి ఇది తగినదియే. విజ్ఞులు అన్నారు—

ఇవ్వడం, తీసికొనడం, రహస్యం చెప్పడం, రహస్యం అడుగడం, తినడం, తినిపించడం, అనే ఈ ఆరు మిత్ర లక్షణములు. (50)

శ్లో. నోపకారం వినా ప్రీతిః కథఞ్చిత్ కస్యచిద్భవేత్
ఉపయాచితదానేన యతో దేవా అభీష్టదాః. 51

అ. ఉపకారం లేనిచో ఎవనికి ఏ విధంగానూ ప్రీతి గల్గదు. మ్రొక్కుబడిగా నైవేద్యాదికం సమర్పించడవల్లనే దేవతలుగూడ (భక్తుల) కోరికలను నెరవేర్చు చున్నారు.

శ్లో. తావత్ ప్రీతిర్భవేల్లోకే యావద్దానం ప్రదీయతే
వత్సః క్షీరక్షయం దృష్ట్వా పరిత్యజతి మాతరమ్. 52

అ. ఈ ప్రపంచంలో దానం ఇచ్చినంతకాలమే ప్రేమ నిలుస్తుంది. పొదుగులో పాలులేకపోవడం చూచి తల్లిని దూడ వదలివేస్తుంది.

శ్లో. పశ్య దానస్య మాహాత్మ్యం సద్యః ప్రత్యయకారకమ్
యత్ప్రభావాదపి ద్వేషీ మిత్రతాం యాతి తత్క్షణాత్. 53

అ. వెంటనే విశ్వాసం గల్గించే దానమాహాత్మ్యాన్ని చూడండి దాని ప్రభావం వల్ల శత్రువుగూడ తత్క్షణమె మిత్రుడు అగుచున్నాడు.

శ్లో. పుత్రాదపి ప్రియతరం ఖలు తేన దానం
మన్యే పశోరపి వివేకవివర్జితస్య.
దత్తే ఖలే తు నిఖిలం ఖలు యేన దుగ్ధం
నిత్యం దదాతి మహిషీ ససుతాఽపి పశ్య. 54

అ. తెలివిలేని పశువునకు పుత్రునికంటెను దానం మిక్కిలి ప్రియమైనదని నేను తలంచుచున్నాను. ఖలం (గానుగపిండి) పెట్టగానే దూడగలబఱ్ఱె, పాలను అన్నింటిని ప్రతిదినం (పితికేవానికే) ఇస్తుంది. చూడండి—

మూ. కిం బహునా—

శ్లో. ప్రీతిం నిరన్తరాం కృత్వా దుర్భేద్యాం నఖమాంసవత్
మూషకో వాయసశ్చైవ గతౌ కృత్రిమమిత్రతామ్. 55

అ. అధికం ఏల? గోళ్లూ మరియూ గోళ్ల క్రింది మాంసంవలె, విడదీయరానిదీ, వ్యవధానం లేనిదీ అయిన ప్రేమను పరస్పరదానం ద్వారా చేసి, ఎలుకయు కాకియు కృత్రిమమైన మైత్రిని పొందాయి.

మూ. ఏవం స మూషకస్తదుపకారరఞ్జిత స్తథావిశ్వస్తో యథా తస్య పక్షమధ్యే ప్రవిష్టస్తేన సహ సర్వదైవ గోష్ఠిం కరోతి. అథాన్యస్మిన్నహని వాయసోఽశ్రుపూర్ణనయనః సమభ్యేత్య సగద్గదం తమువాచ— 'భద్ర హిరణ్యక, విరక్తిః సఞ్జాతా మే సామ్ప్రతం దేశస్యాస్యోపరి తదన్యత్ర యాస్యామి. హిరణ్యక ఆహ— భద్ర, కిం విరక్తేః కారణమ్'? స ఆహ— 'భద్ర! శ్రూయతామ్. అత్రదేశే మహత్యాఽనావృష్ట్యా దుర్భిక్షం సఞ్జాతమ్. దుర్భిక్షత్వాజ్జనో బుభుక్షాపీడితః కోఽపి బలిదానమపి న ప్రయచ్ఛతి. అపరం గృహే గృహే బుభుక్షితైర్జనై ర్విహఙ్గానాం బన్ధనాయ పాశాః ప్రగుణీకృతాః సన్తి. అహమప్యాయుఃశేషతయా పాశేన బద్ధ ఉద్ధారితోఽస్మి. ఏతద్విరక్తేః కారణమ్. తేనాహం విదేశం చలిత ఇతి బాష్పమోక్షం కరోమి.

అ. ఇలా ఆ ఎలుక, దాని (కాకి) ఉపకారములచే మిక్కిలి సంతుష్టిని పొందింది. దాని ఱెక్కల మధ్యనదూరి నిత్యం ఏదో చేయునంతగా దాన్ని నమ్మింది. అంత ఒకనాడు కాకి కన్నుల నీరునింపుకొన్నదై— దానిని సమీపించి గద్గదస్వరంతో ఇలా అంది— 'మిత్రమా, హిరణ్యకా! ప్రస్తుతం నాకు ఈ దేశంపై విరక్తి పుట్టింది. అందుచే వేఱేచోటికి పోతాను.' హిరణ్యకుడు అడిగాడు— 'మిత్రమా, విరక్తికి కారణం ఏమి?' అతడు (లఘుపతనకుడు) అన్నాడు— 'మిత్రమా, వినుము—

ఈ దేశంలో గొప్ప అనావృష్టివలన కఱువు వచ్చింది. కఱువువల్ల జనులు ఆకలిచే నక నకలాడుచున్నారు. అందుచే ఎవ్వరూ పిండదానం కూడ చేయడంలేదు. మరియూ ఇంటింటా జనులు ఆకలిగొన్నవారై పక్షులను పట్టుకొనడానికై వలలువేస్తున్నారు. నేనూ వలలో చిక్కుకొనియూ, ఆయువు మిగిలిఉండడంచే (ఎలాగో) తప్పించుకొన్నాను. విరక్తికి కారణం ఇది. ఇందువల్ల విదేశం పోవుచున్నాను అని కన్నీరు విడుస్తున్నాను.'

మూ. హిరణ్యక ఆహ— 'అథ భవాన్ క్వ ప్రస్థితః? స ఆహ—అస్తి దక్షిణాపథే వనగహనమధ్యే మహాసరః. తత్ర త్వత్తోఽధికః పరమసుహృద్ కూర్మో మన్థరకో నామ. స చ మే మత్స్యమాంసఖణ్డాని దాస్యతి. తద్భక్షణాత్ తేన సహ సుభాషితగోష్ఠీసుఖమనుభవన్ సుఖేన కాలం నేష్యామి. నాహమత్ర విహఙ్గానాం పాశబన్ధనేన క్షయం ద్రష్టుమిచ్ఛామి. ఉక్తఞ్చ—

శ్లో. అనావృష్టిహతే దేశే సస్యే చ ప్రలయం గతే
ధన్యాస్తాత! న పశ్యన్తి దేశభఙ్గం కులక్షయమ్. 56

అ. హిరణ్యకుడు అడిగాడు— 'శుభం తాము ఎచ్చటికి పోవుచున్నారు?' అతడు (లఘుపతనకుడు) చెప్పాడు— 'దక్షిణాపథంలో దట్టమైన అడవి నడుమ పెద్ద సరస్సు ఉంది. ఆ సరస్సులో మంథరకుడు అనే తాబేలు కలదు. అతడు నాకు నీ కంటెను పరమమిత్రుడు. అతడు చేపల మాంసం ముక్కలను ఇస్తాడు. వాటిని తింటూ అతనితో సుభాషితగోష్ఠులుచేస్తూ సుఖంగా కాలంగడుపుతాను. ఇచ్చట పక్షులు వలలో చిక్కి చావడం నేను చూడజాలను. విజ్ఞులు అన్నారు—

'నాయనా! ఎవరైతే అనావృష్టి కారణంగా పైరులునాశనమై దేశం కులం క్షీణించడం చూడరో అట్టివారే ధన్యులు. (56)

శ్లో. కోఽతిభారః సమర్థానాం కిం దూరం వ్యవసాయినామ్
కో విదేశః సవిద్యానాం కః పరః ప్రియవాదినామ్. 57

అ. సమర్థులకు కష్టమైన పనిలేదు. ప్రయత్నశీలురకు దూరభూమిలేదు. విద్యావంతులకు పరదేశం లేదు. మధురంగా మాట్లాడేవారికి శత్రువులేడు.

శ్లో. విద్వత్త్వఞ్చ నృపత్వఞ్చ నైవ తుల్యం కదాచన
స్వదేశే పూజ్యతే రాజా విద్వాన్ సర్వత్ర పూజ్యతే. 58

అ. పాండిత్యం, ప్రభుత్వం ఎప్పటికీ సమానములు కావు. ఏలనన రాజు తన దేశంలోనే పూజింపబడును. విద్వాంసుడు అంతటా పూజింపబడును.'

మూ. హిరణ్యక ఆహ 'యద్యేవం తదహమపి త్వయా సహ గమిష్యామి. మమాఽపి మహద్దుఃఖం వర్తతే. వాయస ఆహ- 'భోః, తవ కిం దుఃఖమ్? తత్కథయ. హిరణ్యక ఆహ- 'భోః బహువక్తవ్యమస్త్యత్ర విషయే తత్రైవ గత్వా సర్వం సవిస్తరం కథయిష్యామి' వాయస ఆహ- 'అహం తావదాకాశగతిః తత్కథం భవతో మయా సహ గమనమ్. స ఆహ- 'యది మే ప్రాణాన్ రక్షసి, తదా స్వపృష్ఠమారోప్య మాం తత్ర ప్రాపయిష్యసి. నాన్యథా మమ గతిరస్తి. తచ్ఛ్రుత్వా సానన్దం వాయస ఆహ. యద్యేవం తద్ధన్యోఽహం యద్భవతాఽపి సహ తత్ర కాలం నయామి. అహం సమ్పాతాదికానష్టవుడ్డీనగతి విశేషాన్ వేద్మి. తత్సమారోహ మమ పృష్ఠమ్, యేన సుఖేన త్వాం తత్సరః ప్రాపయామి.

అ. హిరణ్యకుడు- ఇలా అయితే నేనుగూడ నీతోబాటు వస్తాను. నాకూ చాలా దుఃఖంగా ఉంది.

లఘుపతనకుడు— 'ఓ మిత్రమా! నీ దుఃఖం ఏమిటో చెప్పుము.'

హిరణ్య—'మిత్రమా! ఈ విషయంలో చెప్పవలసింది చాలా ఉంది. పోయిన తర్వాత అచ్చటనే విస్తరంగా తెల్పెదను.

లఘు — నేనైతే ఆకాశంలో పోయేవాడను. అలాంటప్పుడు నాతో నీవు ఎలా రాగలవు?

హిరణ్య—నీవు నా ప్రాణాలు రక్షింపదలిస్తే నీ వీపున నన్ను ఎక్కించుకొని అచ్చటికి చేర్చగలవు. అంతకుమించి వేరే గతి లేదు.

లఘు — (దానిని విని ఆనందంతో) ఇలా అయితే నేను ధన్యుడను. ఏలనన - అచ్చట నీతోనూ కాలం గడుపగలను. నేను సంపాతాదులైన ఎనిమిది ఉడ్డీన (ఎగిరిపోయే) గమనాలను ఎరుంగుదును. అందుచే నా వీపుపై ఎక్కుము. సుఖంగా నిన్ను ఆ సరస్సు చేరుస్తాను.

మూ. హిరణ్యక ఆహ- ఉడ్డీనానాం నామాని శ్రోతుమిచ్ఛామి. స ఆహ

శ్లో. సమ్పాతం విప్రపాతం చ మహాపాతం నిపాతనమ్
వక్రం తిర్యక్ తథాచోర్ధ్వమష్టమం లఘుసంజ్ఞకమ్. 59

అ. హిరణ్య—నేను ఉడ్డీనముల పేర్లునిన గోరుచున్నాను.

లఘు — 1) సంపాతము=సమాన భావనతో ఎగిరిపోవడం-దీనియందు ఱెక్కలు చాచబడి కదలక ఉండును.
2) విప్రపాతము=ఱెక్కలు ఆడిస్తూ ఎగరడం.
3) మహాపాతం=పైకి వేగంగా ఎగరడం - వేగంగా పడడం
4) నిపాతనం=క్రింద క్రిందుగా పోవడం.
5) వక్రం = వంకరగా తిరుగుచూ పోవడం
6) తిర్యక్ = ఒక ప్రక్కకు వంగి (అడ్డంగా) పోవడం,
7) ఊర్ధ్వం= తలపైకెత్తి పైకి నిలువుగా పోవడం
8) లఘుసంజ్ఞకం=(వేగంగా) తేలికగా - అనాయాసంగా పోవడం

మూ. తచ్ఛ్రుత్వా హిరణ్యకస్తత్క్షణాదేవ తదుపరి సమారూఢః. సోఽపి శనైః శనైస్తమాదాయ సమ్పాతోడ్డీనప్రస్థితః క్రమేణ తత్సరః ప్రాప్తః. తతో లఘుపతనకం మూషకాఽధిష్ఠితం విలోక్య దూరతోఽపి దేశకాలవదసామాన్య కాకోఽయమితి జ్ఞాత్వా సత్వరం మన్థరకో జలే ప్రవిష్టః. లఘుపతనకోఽపి తీరస్థితతరుకోటరే హిరణ్యకం ముక్త్వా శాఖాగ్రమారుహ్య తారస్వరేణ ప్రోవాచ– 'భో మన్థరక! ఆగచ్ఛాఽగచ్ఛ. తవ మిత్రమహం లఘుపతనకో నామ వాయసః. చిరాత్సోత్కణ్ఠం సమాయాతః. తదాగత్యాఽలిఙ్గయ మామ్. ఉక్తఞ్చ-

శ్లో. కిం చన్దనైః సకర్పూరైస్తుహినైః కిఞ్చ శీతలైః
సర్వే తే మిత్రమాత్రస్య కలాం నార్హన్తి షోడశీమ్. 60

ఆ. దానిని విని హిరణ్యకుడు వెంటనే అతని వీపు నెక్కాడు. అతడూ సంపాతం అనే (రెక్కలుకదలని) ఉడ్డీనగమనంలో మెల్ల మెల్లగా ప్రయాణం సాగించాడు - క్రమంగా ఆ సరస్సు చేరాడు. ఎలుకను వీపునమోసే లఘుపతనకుణ్ణి

దూరం నుండియే మంథరుడు చూచాడు — 'ఇది సామాన్యమైన కాకిగాదు, దేశాన్ని కాలాన్ని చక్కగా ఎరిఁగినది, అని తలంచాడు - వెంటనే నీటిలో ప్రవేశించాడు. లఘుపతనకుడు తీరంనందలి చెట్టు తొఱ్ఱలో హిరణ్యకుని వదిలాడు. చెట్టుకొమ్మనెక్కి బిగ్గరగా ఇలా పిలిచాడు- 'ఓ మిత్రమా, మంథరకా ! రమ్ము రమ్ము, నేను నీ మిత్రుడను. లఘుపతనకుడు అనే కాకిని. చిరకాలానికి ఉత్కంఠతో వచ్చాను. వచ్చి నన్ను కౌగలించుకొనుము. విజ్ఞులు అన్నారు—

కర్పూర మిశ్రితాలైన చందనాదులను పూయడంచేత, చల్లని మంచుకణముల చేత ఉపయోగం ఏముంది? ఇవిఅన్నీ మిత్రునికి (మిత్రాలింగనానికి) పదునారవ భాగంకూడ సాటిరావు (60).

మూ. తథా చ-

శ్లో. కేనామృతమిదం సృష్టం మిత్రమిత్యక్షరద్వయమ్
ఆపదాం చ పరిత్రాణం శోకసన్తాపభేషజమ్. 61

అ. అలాగే, ఆపదలకు రక్షకం - దుఃఖాది సంతాపాలకు ఔషధం-అమృత రూపం అయిన 'మిత్ర' అనే రెండు అక్షరాలను ఎవడు సృష్టించాడో !

మూ. తచ్ఛ్రుత్వా నిపుణతరం పరిజ్ఞాయ సత్వరం సలిలాన్నిష్క్రమ్య పులకితతనురానన్దాశ్రుపూరితనయనో మన్థరకః ప్రోవాచ– 'ఏహ్యేహి మిత్ర, ఆలిఙ్గయ మామ్. చిరకాలాన్మయా త్వం న సమ్యక్ పరిజ్ఞాతః. తేనాహం సలిలాన్తఃప్రవిష్టః ఉక్తఞ్చ-

శ్లో. యస్య న జ్ఞాయతే వీర్యం న కులం న విచేష్టితమ్
న తేన సఙ్గతం కుర్యాదిత్యువాచ బృహస్పతిః. 62

అ. దానిని విని మన్థరకుడు అతనిని (లఘుపతనకుని) జాగ్రత్తగా గుర్తించాడు. వెంటనే నీటినుండి వెలుపలికి వచ్చాడు. మేను గగుర్పాటునొందగా, కన్నుల ఆనందాశ్రువులు నిండగా ఇలా అన్నాడు- 'ఓ మిత్రమా! రమ్ము రమ్ము నన్ను కౌగలించుకొనుము. చాలకాలం గడవడంతో నిన్ను (వెంటనే) చక్కగా గుర్తింపలేకపోయాను. అందుచే నీటిలోనికి చొఱబడ్డాను. విజ్ఞులు అన్నారు—

'ఎవని బలం కులం చేష్టలు (సరిగా) తెలియవో, వానితో స్నేహం చేయ రాదు'- అని బృహస్పతి చెప్పాడు. (62)

మూ. ఏవము క్తే లఘుపతనకో వృక్షాదవతీర్య తమాలిఙ్గితవాన్. అథవా సాధ్విదముచ్యతే-

శ్లో. అమృతస్య ప్రవాహైః కిం కాయక్షాలనసమ్భవైః
చిరాన్మిత్రపరిష్వంగో యోఽసౌ మూల్యవివర్జితః. 63

అ. ఇలా (మంథరకుడు) చెప్పగా లఘుపతనకుడు వృక్షంనుండి దిగాడు- అతన్ని కౌగిలించుకున్నాడు.

పెద్దలు ఈ విషయం చక్కగానే చెప్పారు- శరీరాన్ని మాత్రమే పరిశుద్ధంగా చేసుకొనడానికి ఉపయోగపడే అమృతతుల్యాలైన నీటిధారలచే ఉపయోగం ఏముంది? చిరకాలం ఎడబాటు తర్వాత లభించే మిత్రాలింగన సుఖానికి విలువ కట్టలేము. (63)

మూ. ఏవం ద్వావపి తౌ విహితాలిఙ్గితౌ పరస్పరం పులకితశరీరౌ వృక్షాదధః సముపవిష్టౌ ప్రోచతురాత్మచరితవృత్తాన్తమ్. హిరణ్యకోఽపి మన్థరకస్య ప్రణామం కృత్వా వాయసాఽభ్యాశే సముపవిష్టః. అథ తం సమాలోక్య మన్థరకో లఘుపతనకమాహ- 'భోః కోఽయం మూషకః? కస్మాత్ త్వయా భక్ష్యభూతోఽపి పృష్ఠమారోప్యాఽఽనీతః. తన్నాత్ర స్వల్పకారణేన భావ్యమ్. తచ్ఛ్రుత్వా లఘుపతనక ఆహ- భోః, హిరణ్యకో నామ మూషకోఽయమ్. మమ సుహృద్ ద్వితీయమివ జీవితమ్. తత్కిం బహునా-

అ. ఇలా వారు పరస్పరం ఆలింగనంచేసికొని పులకిత శరీరులు అయినారు. వృక్షంక్రింద కూర్చొండి తమతమ చరిత్రను చెప్పుకొనసాగారు. హిరణ్యకుడును మంథరకునికి వందనంచేసి లఘుపతనకుని ప్రక్కన కూర్చున్నాడు. అప్పుడు అతన్ని చూచి మంథరకుడు లఘుపతనకునితో ఇలా అన్నాడు—'మిత్రమా! ఈ ఎలుక ఎవ్వరు? నీకు ఆహారభూతుడైనా వీపున ఎక్కించుకొని ఎందుకు తెచ్చావు? ఇందుకు కారణం అల్పంగా ఉండదు.' దానిని విని లఘుపతనకుడు చెప్పాడు- 'మిత్రమా! ఈ ఎలుక పేరు హిరణ్యకుడు. నాకు మిత్రుడు. రెండవప్రాణం వంటివాడు. అధికమేల?

శ్లో. పర్జన్యస్య యథా ధారా యథా చ దివి తారకాః
సికతారేణవో యద్వత్ సంఖ్యయా పరివర్జితాః. 64
గుణాః సంఖ్యా పరిత్యక్తాస్తద్వదస్య మహాత్మనః
పరం నిర్వేదమాపన్నః స ప్రాప్తోఽయం తవాన్తికమ్. 65

అ. మేఘం (యొక్క) వర్షధారలు, ఆకాశంలోని నక్షత్రాలు, ఇసుకరేణువులు - ఎలా లెక్కించడం సాధ్యంగాదో, అలాగే ఈ మహాత్ముని సద్గుణాలను గణింప నలవిగానివి. కాని ప్రస్తుతం మిక్కిలి విరక్తిని పొంది నీవద్దకు చేరినాడు. (64-65).

మూ. మన్థరక ఆహ - 'కిమస్య వైరాగ్యకారణమ్?' వాయస ఆహ - పృష్టో మయా. పరమనేనాఽభిహితమ్, యద్ బహువక్తవ్యమితి తత్ తత్రైవ కథయిష్యామి. మమాపి న నివేదితమ్. తద్భద్ర, హిరణ్యక, ఇదానీం నివేద్యతాముభయోరప్యావయో స్తదాత్మనో వైరాగ్యకారణమ్' సోఽబ్రవీత్ —

అ. మంథరకుడు అడిగాడు - 'ఇతని వైరాగ్య కారణం ఏమి?' కాకి అంది - "నేను అడిగాను, కాని ఇతడు 'చెప్పవలసినది చాలఉంది. అందుచే అచ్చటనే చెప్పెదను' - అని నాకును తెలుపలేదు.' ఇలా అని హిరణ్యకునిచూచి మిత్రమా! హిరణ్యకా? ఇప్పుడు మా ఇరువురికి నీ వైరాగ్యకారణం తెలుపుము? అతడు (హిరణ్యకుడు) ఇలా చెప్పాడు—

## కథా - 3

## హిరణ్యకవృత్తాన్తః

మూ. అస్తి దాక్షిణాత్యే జనపదే మహిలారోప్యం నామ నగరమ్. తస్య నాతిదూరే మఠాయతనం భగవతః శ్రీమహాదేవస్య. తత్ర చ తామ్రచూడో నామ పరివ్రాజకః ప్రతివసతి స్మ. స చ నగరే భిక్షాటనం కృత్వా ప్రాణయాత్రాం సమాచరతి. భిక్షాశేషఞ్చ తత్రైవ భిక్షాపాత్రే నిధాయ తద్భిక్షాపాత్రం నాగదన్తేఽవలమ్బ్య పశ్చాద్రాత్రౌ స్వపితి. ప్రత్యూషే చ తదన్నం కర్మకరాణాం దత్త్వా సమ్యక్ తత్రైవ దేవతాయతనే సమ్మార్జనోపలేపనమణ్డనాదికం సమాజ్ఞాపయతి.

అ. దక్షిణాపథంలో మహిలారోప్యం అనే నగరం ఉంది. దానికి కొంచెం దూరంలో భగవానుడైన మహాదేవుని (శివుని) మందిరం కలదు. అందు తామ్రచూడుడు - అనే సన్యాసి నివసించేవాడు. అతడు నగరంలో భిక్షచేస్తూ జీవయాత్ర సాగించేవాడు. తినగా మిగిలిన భిక్షాన్నమును భిక్షాపాత్రలోనే ఉంచి ఆ భిక్షాపాత్రను కొయ్యకు (నాగదంతానికి) వ్రేలాడ గట్టేవాడు. పిమ్మట (నిశ్చింతగా) రాత్రి నిద్రించేవాడు. పిమ్మట ఉదయం ఆ అన్నం కూలివారికి పెట్టేవాడు. మందిరాన్ని ఊడ్చడం, కడుగడం, ముగ్గు వేయడం, అలంకరించడం ఇత్యాదులైన పనులకై వారిని ఆజ్ఞాపించేవాడు.

మూ. అథాన్యస్మిన్నహని మమ బాన్ధవైర్నివేదితమ్ – 'స్వామిన్! మఠాయతనే సిద్ధమన్నం మూషకభయాత్ తత్రైవ భిక్షాపాత్రే నిహితం నాగదన్తేఽవలమ్బితం తిష్ఠతి సదైవ. తద్వయం భక్షయితుం న శక్నుమః. స్వామినః పునరగమ్యం కిఞ్చిదపి నాస్తి. తత్కిం వృథాఽటనేనాఽన్యత్ర. అద్య తత్ర గత్వా యథేచ్ఛం భుఞ్జామహే తవ ప్రసాదాత్'. తదాకర్ణ్యాఽహం సకలయూథ-పరివృతస్తత్క్షణాదేవ తత్ర గతః. ఉత్పత్య చ తస్మిన్ భిక్షాపాత్రే సమారూఢః. తత్ర భక్ష్యవిశేషాణి సేవకేభ్యో దత్త్వా పశ్చాత్ స్వయమేవ భక్షయామి. సర్వేషాం తృప్తౌ జాతాయాం భూయః స్వగృహం గచ్ఛామి. ఏవం నిత్యమేవ తదన్నం భక్షయామి. పరివ్రాజకోఽపి యథాశక్తి రక్షతి. పరం యదైవ నిద్రాఽన్తరితో భవతి తదాహం తత్రాఽరుహ్యాఽత్మకృత్యం కరోమి. అథ కదాచిత్ తేన మమ రక్షణార్థం మహాన్ యత్నః కృతః. జర్జరవంశః సమానీతః. తేన సుప్తోఽపి మమ భయాద్భిక్షాపాత్రం తాడయతి. అహమప్యభక్షితేఽప్యన్నే ప్రహారభయాదపసర్పామి. ఏవం తేన సహ సకలాం రాత్రిం విగ్రహపరస్య (మమ) కాలో వ్రజతి.

అ. ఒకనాడు బంధువులు అయిన ఎలుకలు నాతో ఇలా అన్నాయి— 'స్వామీ! ఈ మందిరంలో అన్నం మన ఎలుకల భయంవల్ల నిత్యం భిక్షాపాత్రలో ఉంచి కొయ్యకు వ్రేలాడగట్టుతున్నారు. అది మాకు తినడానికి వీలుగావడం లేదు.

ప్రభువులకు పోరాని స్థలంలేదు. అలాంటప్పుడు (వేరేచోట్ల) వ్యర్థంగా తిరుగడం దేనికి? నేడు అచ్చటకుపోయి తన అనుగ్రహంవలన స్వేచ్ఛగా మేమంతా తినెదము. దానిని విని నేను సేవకులు అందరూ వెంటరాగా అచ్చటికి పోయాను. ఎగిరి ఆ భిక్షాపాత్ర పైకి ఎక్కాను. అచ్చట వివిధభక్ష్యపదార్థాలను సేవకులకుపెట్టి తర్వాత నేను తిన్నాను. అందరికి సంతృప్తి గల్గిన మీదట నివాసం చేరాను. ఇలా ప్రతిదినం ఆహారభక్షణ జరుగుచూండేది. సన్యాసియూ శక్తికొలది రక్షించేవాడు. కాని అతడు నిద్రపోగానే నేను అచ్చటికి ఎక్కి నా పనిని చేసేవాడను. అంత ఒకనాడు అతడు నానుండి (ఆహార) రక్షణకై గొప్ప ప్రయత్నం చేశాడు. పాత చీలిన వెదురు కఱ్ఱ తెచ్చాడు. నా భయంతో నిద్రించేటప్పుడు కూడ ఆ కఱ్ఱతో భిక్షాపాత్రను కొట్టే వాడు. నేనూ దెబ్బ భయంతో ఆహారం తినకయే తొలగిపోయేవాణ్ణి. ఇలా రాత్రి అంతా అతనితో యుద్ధం చేస్తూండగానే గడచిపోయేది.

మూ. అథాన్యస్మిన్నహని తస్య మఠే బృహత్స్ఫిఙ్నామా పరివ్రాజక స్తస్య సుహృత్తీర్థయాత్రాప్రసఙ్గేన పాన్థః ప్రాఘుణికః సమాయాతః. తం దృష్ట్వా ప్రత్యుత్థానవిధినా సమ్భావ్య ప్రతిపత్తిపూర్వకమభ్యాగతక్రియయా నియోజితః. తతశ్చ రాత్రావేకత్ర కుశసంస్తరే ద్వావపి ప్రసుప్తౌ ధర్మకథాం కథయితుం సమారబ్ధౌ. అథ బృహత్స్ఫిక్-కథాగోష్ఠీషు స తామ్రచూడో మూషకత్రాసార్థం వ్యాక్షిప్తమనా జర్జరవంశేన భిక్షాపాత్రం తాడయంస్తస్య శూన్య ప్రతివచనం ప్రయచ్ఛతి. తన్మయో న కిఞ్చిదుదాహరతి. అథాఽసావభ్యాగతః పరం కోపముపాగతస్తమువాచ– 'భోస్తామ్రచూడ, పరిజ్ఞాతో న త్వం సమ్యక్ సుహృత్. తేన మయా సహ సాహ్లాదం న జల్పసి. తద్రాత్రావపి త్వదీయం మఠం త్యక్త్వాఽన్యత్ర మఠే యాస్యామి. ఉక్తఞ్చ–

శ్లో. ఏహ్యాగచ్ఛ సమాశ్రయాసనమిదం, కస్మాచ్చిరం దృశ్యసే
కా వార్తా, హ్యతిదుర్బలోఽసి, కుశలం, ప్రీతోఽస్మి తే దర్శనాత్.
ఏవం యే సముపాగతాన్ ప్రణయినః ప్రహ్లాదయన్త్యాదరాత్
తేషాం యుక్తమశఙ్కితేన మనసా హర్మ్యాణి గన్తుం సదా. 66

అ. అంత ఒకదినాన ఆ మఠానికి ఆతని మిత్రుడైన 'బృహత్స్ఫిక్' అనే సన్యాసి తీర్థయాత్రలు చేస్తూ అతిథిగా వచ్చాడు. తామ్రచూడుడు అతనిని చూచి ఎదురేగి స్వాగతం పల్కాడు. ఆదరపూర్వకంగా సత్కారాలు చేశాడు. పిమ్మట రాత్రివేళ ఇరువురూ ఒకేచోట దర్భచాపపై పడుండి ధార్మికకథలు చెప్పుకొనసాగారు. కానీ తామ్రచూడుడు ఎలుకలను బెదరించడానికై పాతవెదురు కర్రతో భిక్షాపాత్రను కొట్టుచూ అన్యమనస్కంగా ఉంటున్నాడు. అందువల్ల బృహత్స్ఫిక్కు ప్రశ్నలకు అతని సమాధానాలు చాలా నీరసంగా ఉన్నాయి. తన్మయంగా దేనినీ ఉదాహరించడు. అప్పుడు అభ్యాగతుడు (బృహత్స్ఫిక్కు) మిక్కిలి కోపం పొందాడు. ఇలా అన్నాడు— 'ఓ తామ్రచూడా, నీవు నాకు మంచి మిత్రుడవు కాదు అని గ్రహించాను. ఏలననగా— నాతో సంతోషంగా మాట్లాడటంలేదు కనుక రాత్రిఅయినా ఈ నీ మఠం వదలి వేరే మఠానికి పోతాను. విజ్ఞులు ఇలా అన్నారు—

'దయచేయండి, దయచేయండి. ఈ ఆసనంపై కూర్చోండి. ఏమి చాలకాలానికి కనబడినారు? విషయం ఏమి, మిక్కిలి బలహీనంగా కనబడుచున్నారు? కుశలమా? మీదర్శనంవల్ల సంతోషం పొందాను. ఈవిధంగా ఇంటికి వచ్చిన అతిథులను ప్రేమపూర్వకంగా ఎవరు ఆదరించి సంతోషం గలిగిస్తారో, అలాంటివారి ఇంటికే ఎలాంటి సందేహంలేక పోవడం సముచితం." (66)

శ్లో. గృహీ యత్రాగతం దృష్ట్వా దిశో వీక్షేత వాఽప్యధః
తత్ర యే సదనం యాంతి తే శృఙ్గరహితా వృషాః. 67

అ. ఏ గృహస్వామి, అతిథిని చూడగానే అటుఇటు దిక్కులనుగానీ, క్రింద నేలను గానీ చూచునో— ఆయింటికి పోయేవారు (అతిథులు) కొమ్ములులేని ఎద్దులతో సమానం.

శ్లో. నాభ్యుత్థాన క్రియా యత్ర నాలాపా మధురాక్షరాః
గుణదోషకథా నైవ తత్ర హర్మ్యం న గమ్యతే. 68

అ. (అతిథిరాగానే) లేవడం ఎదురుగాపోవడం, మధురంగా మాట్లాడడం, మంచిచెడ్డలు అడగడం ఇత్యాదికం లేదో ఆ యింటికి పోరాదు.

మూ. తదేకమఠప్రాప్త్యాఽపి త్వం గర్వితః, త్యక్తః సుహృత్స్నేహః

నై తద్వేత్సి, యత్త్వయా మఠాశ్రయవ్యాజేన నరకోపార్జనం కృతమ్. ఉక్తఞ్చ-

శ్లో. నరకాయ మతిస్తే చేత్ పౌరోహిత్యం సమాచర

వర్షం యావత్ కిమన్యేన మఠచిన్తాం దినత్రయమ్. 69

తన్మూర్ఖ! శోచితవ్య స్త్వం గర్వం గతః. తదహం త్వదీయం మఠం పరిత్యజ్య యాస్యామి.'

ఆ. నీవు ఒక్క మఠాధిపత్యంవల్లనే గర్వం చెందావు. మిత్రునిపై స్నేహం వదలి పెట్టావు 'ఈ పెత్తనంద్వారా నరకం సంపాదించబోతున్నాను'- అనే దానిని తెలిసి కొనలేదు. పెద్దలు అన్నారు—

'నరకం పొందాలనే కోరిక ఉంటే ఒక్క సంవత్సరం పౌరోహిత్యం చేయుము. ఇతరం చేయడం దేనికి? మఠాధిపత్యం అయితే మూడు దినాలు చాలు.(69)

ఓరీ, మూర్ఖుడా, నిన్ను గూర్చి దుఃఖిస్తున్నాను. నీవు గర్వం పొందావు. అందు వల్ల నేను నీ మఠం వదలి వెళ్ళిపోతాను.'

మూ. అథ తచ్ఛ్రుత్వా భయత్రస్తమనాస్తామ్రచూడస్తమువాచ-'భో భగవన్, మైవం వద. న త్వత్సమోఽన్యో మమ సుహృత్ కశ్చిదస్తి. పరం తచ్ఛ్రూయతాం గోష్ఠీశైథిల్యకారణమ్. ఏష దురాత్మా మూషకః ప్రోన్నతస్థానే ధృతమపి భిక్షాపాత్రముత్ప్లుత్యాఽఽరోహతి, భిక్షాశేషం చ తత్రస్థం భక్షయతి. తదభావాదేవ మఠే మార్జనక్రియాపి న భవతి. తన్మూషకత్రాసార్థమేతేన వంశేన భిక్షాపాత్రం ముహుర్ముహుస్తాడయామి, నాన్యత్కారణమితి.అపరమేతత్ కుతూహలం పశ్యాస్య దురాత్మనో యన్మార్జాలమర్కటాదయోఽపి తిరస్కృతా అస్యోత్పతనేన.

ఆ. అప్పుడు తామ్రచూడుడు ఆమాటను విని మిక్కిలి భయపడినాడు. అతనితో ఇలా విన్నవించాడు- 'పూజ్యపాదా! అలా అనవద్దు. నీతో సాటిఅయిన మిత్రుడు నాకు ఇతరుడు ఎవ్వడూ లేడు. కాని ధార్మికచర్చలో శిథిలచిత్తంతో ఉండడానికి కారణం వినండి. ఇదిగో ఈ దుష్టబుద్ధి అయిన ఎలుక మిక్కిలి ఎత్తైనచోట భిక్షాపాత్రను ఉంచినా గంతువేసి (ఎగిరి) ఎక్కుతుంది. అందులోని భిక్షాశేషం తినివేస్తుంది.

ఆ భిక్షాశేషం లేనందున మందిరంలో కనవు ఊడ్చడం ఇత్యాదికంకూడ సరిగా జరగడం లేదు. అందుచే ఎలుకను భయపెట్టేందుకు ఈ వెదురుకఱ్ఱతో భిక్షాపాత్రను మాటిమాటికి కొట్టుచున్నాను. వేతేకారణం లేదు. మరియూ ఆసక్తికరం అయిన విషయం ఏమంటే ఈ దురాత్ముని ఉత్పతన(ఎగిరే) నైపుణ్యం ముందు పిల్లులయు కోతులయు నేర్పు (అల్పంగా) తిరస్కరింప బడుతూంది.'

మూ. బృహత్స్ఫిగాహ - 'అథ జ్ఞాయతే తస్య బిలం కస్మింశ్చిత్ప్ర దేశే'? తామ్రచూడ ఆహ- 'భగవన్, న వేద్మి సమ్యక్. స ఆహ- 'నూనం నిధానస్యోపరి తస్య బిలమ్. నిధానోష్మణా ప్రకూర్దతే. ఉక్తఞ్చ-

శ్లో. ఊష్మాపి విత్తజో వృద్ధిం తేజో నయతి దేహినామ్
కిం పునస్తస్య సమ్భోగస్త్యాగకర్మసమన్వితః. 70

అ. బృహత్స్ఫిక్కు—'దాని తొఱ్ఱ ఎచ్చటనో తెలియునా?
తామ్రచూడుడు—'భగవన్, సరిగా తెలియదు.
బృహత్స్ఫిక్కు—నిధిమీద (కూడబెట్టిన ధాన్యాదినిధిదగ్గర) దాని తొఱ్ఱ తప్పక ఉండును. నిధి (మూలధనం) గర్వపు వేడిమిచే అది ఎగురుచున్నది. విజ్ఞులు అన్నారు—

ధనంవల్ల జనించిన వేడిమి ప్రాణులతేజస్సు వృద్ధినొందిస్తుంది. ఇక దానాది కర్మలతోటిదైన దాని ఉపభోగంవల్ల గల్గిన శక్తిని ఏమనవచ్చును?

మూ. తథా చ -

శ్లో. నాకస్మాచ్ఛాణ్డిలీ మాతర్విక్రీణాతి తిలైస్తిలాన్
లుఞ్చితానితరైర్యేన హేతురత్ర భవిష్యతి. 71

అ. అలాగే-ఓ తల్లీ! అకస్మాత్తుగా (కారణంలేకయే) ఈ శాండిలి శుభ్రం చేసిన నూవులు ఇచ్చి వాటికిబదులుగా అదేపరిమాణంతో శుభ్రంచేయని నూవులు గ్రహింపదు. ఇందు కారణం ఉండును.

మూ. తామ్రచూడ ఆహ- 'కథమేతత్? సోఽబ్రవీత్—

అ. తామ్రచూడుడు అడిగాడు- 'అది యెట్లు?' అతడు (బృహత్స్ఫిక్కు) ఇలా చెప్పాడు—

## కథా-4

## తిలచూర్ణవిక్రయ-కథా

మూ. యదాఽహం కస్మింశ్చిత్ స్థానే ప్రావృట్కాలే వ్రతగ్రహణ నిమిత్తం కఞ్చిద్ బ్రాహ్మణం వాసార్థం ప్రార్థితవాన్. తతశ్చ తద్వచనాత్తేనాపి శుశ్రూషితః సుఖేన దేవార్చనపరస్తిష్ఠామి. అథాఽన్యస్మిన్నహని ప్రత్యూషే ప్రబుద్ధోఽహం బ్రాహ్మణ-బ్రాహ్మణీసంవాదే దత్తావధానః శృణోమి. తత్ర బ్రాహ్మణ ఆహ– 'బ్రాహ్మణి, ప్రత్యూషే దక్షిణాయనసఙ్క్రాన్తిరనన్తదాన ఫలదా భవిష్యతి. తదహం ప్రతిగ్రహార్థం గ్రామాన్తరం యాస్యామి. త్వయా బ్రాహ్మణస్యైకస్య భగవతః సూర్యస్యోద్దేశేన కిఞ్చిద్ భోజనం దాతవ్యమ్' ఇతి.

అ. ఒకప్పుడు ఒకానొకస్థలంలో వర్షాకాలాన వ్రత(చాతుర్మాస్య వ్రత) స్వీకారనిమిత్తం ఒక బ్రాహ్మణుని నివసించేందుకై (అతనిగృహం) అర్థించాను. పిమ్మట అతని (అంగీకార) వాక్కువలన అతని శుశ్రూషలు పొందుచూ దేవతార్చన తత్పరుడనై (అతనియింట) సుఖంగా ఉన్నాను. అంత ఒకనాడు ప్రాతఃకాలంలో నిద్ర లేచిన నేను ఆ బ్రాహ్మణీ-బ్రాహ్మణుల సంభాషణను శ్రద్ధతో ఇలా విన్నాను–

బ్రాహ్మణుడు- ప్రాతః కాలమున అనంతదానం ఇచ్చే దక్షిణాయన సంక్రాంతి సంభవిస్తుంది. కనుక నేను దానస్వీకారార్థం గ్రామాంతరం వెళ్లుచున్నాను. నీవు ఒక బ్రాహ్మణునికి భగవానుడైన సూర్యుని ఉద్దేశించి కొంత భోజనం దానం చేయాలి.

మూ. అథ తచ్ఛ్రుత్వా బ్రాహ్మణీ పరుషతరవచనైస్తం భర్త్సయమానా ప్రాహ– కుతస్తే దారిద్ర్యోపహతస్య (గృహేఽన్యస్య) భోజనప్రాప్తిః? తత్కిం న లజ్జస ఏవం బ్రువాణః? అపి చ న మయా తవ హస్తలగ్నయా క్వచిదపి లబ్ధం సుఖమ్. న మిష్టాన్నస్యాఽఽస్వాదనమ్, న చ హస్తపాదకణ్ఠాది భూషణమ్.' తచ్ఛ్రుత్వా భయత్రస్తోఽపి విప్రో మన్దం మన్దం ప్రాహ– బ్రాహ్మణి, నైతద్యుజ్యతే వక్తుమ్. ఉక్తఞ్చ–

శ్లో. గ్రాసాదపి తదర్థఞ్చ కస్మాన్నో దీయతేఽర్థిషు
ఇచ్ఛానురూపో విభవః కదా కస్య భవిష్యతి. 72

అ. దానిని విని బ్రాహ్మణి మిక్కిలి పరుషములైన వాక్కులతో అతనిని

బెదిరిస్తూ ఇలాపల్కింది. దారిద్ర్యంచే పీడితుడైన నీ యింటిలో ఇతరునికి భోజనం ఎలా ప్రాప్తిస్తుంది. ఇలా చెప్పడానికి సిగ్గుకల్గడం లేదా? నీ చేతిలోపడిన నేను దేని విషయంలోనూ సుఖానికి నోచుకొనలేదు. శుద్ధమైన భోజనం రుచిచూడడంలేదు. చేతులు కాళ్లు మెడ మొదలైనవాటికి ఎట్టిసొమ్ములు లేవు? ఆ మాటలువిని అధికంగా భయపడినా విప్రుడు మెల్లమెల్లగా(మరల) ఇలా అన్నాడు— 'బ్రాహ్మణి, ఇలా చెప్పడం ఉచితం గాదు. విజ్ఞులు అన్నారు-

(తానుతినే) ముద్దలో సగభాగం అయినా యాచకులకు ఎందుకుదానం చేయ రాదు? (అలాచేస్తే) ఎవనికి కోరిన సంపద ఎప్పుడు సంభవింపదు. సర్వదా సర్వత్ర లభించును అని భావం (72)

శ్లో. ఈశ్వరా భూరిదానేన యల్లభన్తే ఫలం కిల
దరిద్రస్తచ్చ కాకిణ్యా ప్రాప్నుయాదితి నః శ్రుతిః. 73

అ. మేము విన్నది ఏమనగా-ఐశ్వర్యసంపన్నులు అధికంగా దానం చేయ డంచే ఏ ఫలం పొందెదరో, దానిని దరిద్రుడు ఒకపైసా దానంచేతనే పొందగలడు.

శ్లో. దాతా లఘురపి సేవ్యో భవతి న కృపణో మహానపి సమృద్ధ్యా
కూపోఽన్తఃస్వాదుజలః ప్రీత్యై లోకస్య న సముద్రః. 74

అ. దాత అయినవాడు అల్పధనంగలవాడైనా సేవింపదగినవాడు అగును. లోభి ఐశ్వర్యసమృద్ధుడైనా అసేవ్యుడే. లోపల (అల్పంగా) తియ్యని నీరుగల బావిని జనులు ప్రేమతో ఆశ్రయిస్తారు. సముద్రంవద్దకు పోరు.

శ్లో. అకృతత్యాగమహిమ్నా మిథ్యా కిం రాజరాజశబ్దేన
గోప్తారం న నిధీనాం కథయన్తి మహేశ్వరం విబుధాః. 75

అ. దానమహిమలేని మిథ్యఅయిన రాజరాజశబ్దంచే కుబేరునికి గల్గిన ఉప యోగం ఏముంది? ధననిధులకు రక్షకుడైన అతనిని విద్వాంసులు మహేశ్వరుడు అని చెప్పరు.

శ్లో. సదా దానపరిక్షీణః శస్త ఏవ కరీశ్వరః
అదానః పీనగాత్రోఽపి నిన్ద్య ఏవ హి గర్దభః. 76

అ. నిత్యం (మదజలం స్రవించడంచే-దానంచేయడంచే) కృశించినా ధన హీనుడైనా గజరాజు (దాతఅయిన మానవుడు) ప్రశంసాయోగ్యులగుచున్నారు. అదాని యైన (మదజలంలేని - దానంచేయని) గాడిదవంటి మానవుడు బలిసినవాడైనా నిందార్హుడే అగును.

శ్లో. సుశీలోఽపి సువృత్తోఽపి యాత్యదానాదధో ఘటః
పునః కుబ్జాఽపి కాణాఽపి దానాదుపరి కర్కటీ. 77

అ. సుశీలం (చక్కగా చేయబడింది-మంచిశీలం గలవాడు) సువృత్తం (మిక్కిలి గుండ్రంగాఉండేది-మంచినడవడిక గలవాడు) అయినా దానగుణం లేనందున కడవ బావిలో అడుగునకు పోతూఉంది. గూనిదైనా గ్రుడ్డిదైనా ఎండ్రకాయ దానగుణం వలన నీటిలో పైకి వచ్చుచున్నది.

శ్లో. యచ్ఛృఙ్ఖలమపి జలదో వల్లభతామేతి సకలలోకస్య
నిత్యం ప్రసారితకరో మిత్రోఽపి న వీక్షితుం శక్యః. 78

అ. మేఘం (సాధారణమైనది) నీటిని దానంచేస్తూ సర్వలోకప్రేమను పొందుచూఉంది. మిత్రుడు సూర్యుడు; (నిత్యంచేయిచాపేవాడు.) కిరణాలు వ్యాపింప చేసేవాడు; చూడటానికి అశక్యంగా ఉన్నవాడు.

మూ. ఏవం జ్ఞాత్వా దారిద్ర్యాభిభూతైరపి స్వల్పాత్ స్వల్పతరం కాలే పాత్రే చ దేయమ్ ఉక్తఞ్చ-

శ్లో. సత్పాత్రం మహతీ శ్రద్ధా దేశే కాలే యథోచితే
యద్దీయతే వివేకజ్ఞైస్తదనన్తాయ కల్పతే. 79

తథా చ-

శ్లో. అతితృష్ణా న కర్తవ్యా తృష్ణాం నైవ పరిత్యజేత్
అతితృష్ణాభిభూతస్య శిఖా భవతి మస్తకే. 80

బ్రాహ్మణ్యాహ- 'కథమేతత్? స ఆహ—

అ. ఇలాగ్రహించి దారిద్ర్యంచే పీడింపబడేవారు కూడ స్వల్పంలో అతి స్వల్పంగానైనా కాలం, పాత్రత గుర్తించి దానం చేయాలి.

పిజ్ఞులు అన్నారు-దేశం కాలం గుర్తించి అధికశ్రద్ధతో వివేకవంతులై యోగ్యునికి చేసేదానం అనంతఫలం గలిగిస్తుంది.

అలాగే అత్యాశ పడరాదు. ఆశనుపూర్తిగా వదలరాదు. అత్యాశగలవానికి నెత్తికి జుట్టువచ్చును. (సర్వనాశం సంభవిస్తుంది. (80)

బ్రాహ్మణి అడిగింది— 'అదిఎట్లు' అతడు ఇలా చెప్పాడు—

## కథా-5

## శబర-శూకర-కథా

మూ. అస్తి కస్మింశ్చిద్వనోద్దేశే కశ్చిత్పులిన్దః. స చ పాపర్ధిం కర్తుం వనం ప్రతి ప్రస్థితః. అథ తేన ప్రసర్పతా మహానఞ్జనపర్వతశిఖరాకారః క్రోడః సమాసాదితః. తం దృష్ట్వా కర్ణాన్తాకృష్టనిశితసాయకేన సమాహతః, తేనాఽపి కోపావిష్టేన చేతసా బాలేన్దుద్యుతినా దంష్ట్రాగ్రేణ పాటితోదరః పులిన్దో గతాసుర్భూతలేఽపతత్. అథ లుబ్ధకం వ్యాపాద్య సూకరోఽపి శరప్రహారవేదనయా పఞ్చత్వం గతః.

అ. ఒకానొక అడవిలో ఒక బోయవాడు గలడు. వాడు వేటకై అడవికి బయలుదేరాడు. (వేటకై) తిరిగే అతనికి ఒక పెద్ద పంది కనబడింది. అది కాటుక కొండ శిఖరంవలె చాల నల్లగా ఉంది. దానిని చూచి అల్లెత్రాడు చెవి వరకు లాగి వాని బాణంతో కొట్టాడు. ఆ దెబ్బ తగులగానే పంది క్రోధావేశంతో బాలచంద్రునివంటి తెల్లని కోరలమొనచే వేటకాని పొట్టను చీల్చివేసింది. వాడు ప్రాణాలు విడి నేల గూలాడు. వాణ్ణిచంపి పందియు బాణపుదెబ్బ బాధచే మరణం పొందింది.

మూ. ఏతస్మిన్నన్తరే కశ్చిదాసన్నమృత్యుః శృగాల ఇతస్తతో నిరాహారతయా పీడితః పరిభ్రమంస్తం ప్రదేశమాజగామ. యావద్వరాహపులిన్దౌ ద్వావపి పశ్యతి తావత్ ప్రహృష్టో వ్యచిన్తయత్—'భోః, సానుకూలో మే విధిః. లేనైతదప్యచిన్తితం భోజనముపస్థితమ్. అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. అకృతేఽప్యుద్యమే పుంసామన్యజన్మకృతం ఫలమ్
శుభాశుభం సమభ్యేతి విధినా సంనియోజితమ్. 81

అ. ఇంతలో ఒకానొక నక్క, చావుదాపురించినదై ఆకలిచే బాధపడుచూ, అటుఇటు తిరుగుచూ ఆ ప్రదేశానికి వచ్చింది. పందిని వేటకాణ్ణి చూచింది. అధిక సంతోషం పొంది ఇలా తలంచింది. 'ఆహా, నాకు దైవం అనుకూలంగా ఉన్నాడు. అందుచే ఊహించని ఈ ఆహారం దగ్గరకు వచ్చింది. విజ్ఞులు ఇది చక్కగా తెలిపారు—

ప్రయత్నం చేయకపోయినా, పూర్వజన్మలో చేసిన మంచిచెడ్డల ఫలం మానవులకు ఈ జన్మలో దైవప్రేరణచే లభిస్తుంది. (81)

మూ. తథా చ–

శ్లో. యస్మిన్ దేశే చ కాలే చ వయసా యాదృశేన చ
కృతం శుభాశుభం కర్మ తత్తథా తేన భుజ్యతే. 82

తదహం తథా భక్షయామి యథా బహూన్యహాని మే ప్రాణయాత్రా భవతి. తత్తావదేనం స్నాయుపాశం ధనుష్కోటిగతం భక్షయామి ఉక్తఞ్చ–

శ్లో. శనైః శనైశ్చ భోక్తవ్యం స్వయం విత్తముపస్థితమ్
రసాయనమివ ప్రాజ్ఞైర్హేలయా న కదాచన. 83

అ. అలాగే, పూర్వజన్మలో ఏ స్థానమున, ఏ సమయమున ఎటువంటి వయస్సులో శుభాశుభకర్మలను (మానవుడు) చేయునో వాటి ఫలాన్ని ఈ జన్మలో ఆ విధంగానే అనుభవిస్తాడు. (82)

అందుచే నేను దీనిని చాలదినాలు నా జీవితయాత్ర జరిగేటట్లు భుజిస్తాను. కనుక (మొదట) విల్లుకొమ్మున ఉండే ఈ నరాన్ని భక్షిస్తాను. పెద్దలు చెప్పారు—

బుద్ధిమంతుడు తాను సంపాదించిన ధనాన్ని కొద్దికొద్దిగా ఔషధం వలె తినవలయును. నిర్లక్ష్యంగా ఒకేసారి తినరాదు. (83)

మూ. ఇత్యేవం మనసా నిశ్చిత్య చాప–ఘటిత–కోటిం ముఖమధ్యే ప్రక్షిప్య స్నాయుం భక్షితుం ప్రవృత్తః. తతశ్చ త్రుటితే పాశే తాలుదేశం విదార్య చాపకోటిర్మస్తకమధ్యేన నిష్క్రాన్తా. సోఽపి తద్వేదనయా తత్క్షణాన్మృతః. అతోఽహం బ్రవీమి– 'అతితృష్ణా న కర్తవ్యా–'ఇతి. స పునరప్యాహ 'బ్రాహ్మణి! న శ్రుతం భవత్యా–

శ్లో. ఆయుః కర్మ చ విత్తఞ్చ విద్యా నిధనమేవ చ
పఞ్చైతాని హి సృజ్యన్తే గర్భస్థస్యైవ దేహినః. 84

అ. ఇలా ఆ నక్క, మనస్సులో నిశ్చయించింది- విల్లుకొమ్మును నోటిలో ఉంచుకొంది. నరాన్ని తినడానికి ఆరంభించింది. నరం తెగగానే విల్లుఅంచు దవడలను చీల్చివేసి తలనడుమగా దూసుకుపోయింది. అప్పుడు నక్క ఆ బాధచే మరణించింది అందుచే నేను చెప్పుచున్నాను. 'అతితృష్ణా న కర్తవ్యా అత్యాశపడరాదు' అని. అతడు (బ్రాహ్మణుడు) మరలా ఇలా అన్నాడు. 'ఓ బ్రాహ్మణీ! నీవు వినలెదా !

ప్రాణికి గర్భంలో ఉండగానే ఆయువు, కర్మ, ధనం, విద్యా, మరణం ఈ అయిదూ నిశ్చయింపబడుతాయి.(84)

మూ. అథైవం సా తేన ప్రబోధితా బ్రాహ్మణ్యాహ- 'యద్యేవం తదస్తి మే గృహే స్తోకస్తిలరాశిః. తతస్తిలాన్ లుఞ్చిత్వా తిలచూర్ణేన బ్రాహ్మణం భోజయిష్యామి' ఇతి. తతస్తద్వచనం శ్రుత్వా బ్రాహ్మణో గ్రామాంతరం గతః. సాఽపి తిలానుష్ణోదకేన సమ్మర్ద్య కుటిత్వా సూర్యాతపే దత్తవతీ. అత్రాన్తరే తస్యా గృహకర్మవ్యగ్రాయాస్తిలానాం మధ్యే కశ్చిత్ సారమేయో మూత్రోత్సర్గం చకార. తం దృష్ట్వా సా చిన్తితవతీ- అహో, నైపుణ్యం పశ్య పరాఙ్ముఖీభూతస్య విధేః. యదేతే తిలా అభోజ్యాః కృతాః. తదహమేతాన్ సమాదాయ కస్యచిద్గృహం గత్వా లుఞ్చితైరలుఞ్చితానానయామి. సర్వోఽపి జనోఽనేన విధినా ప్రదాస్యతి' ఇతి.

అ. అంత బ్రాహ్మణుడు ఇలా బోధింపగా బ్రాహ్మణి ఇలా అంది. 'ఈ విధంగా అయితే (దానానికి ఇంత పుణ్యఫలం ఉంటే) నా యింటిలో కొద్దిగా నువ్వులు ఉన్నాయి- వాటిని శుభ్రంచేసి ఆ నువ్వులపిండితో బ్రాహ్మణునికి భోజనం ఏర్పాటు చేస్తాను.' అప్పుడు ఆ మాటవిని బ్రాహ్మణుడు గ్రామం వెళ్లాడు. ఆమెయూ నూవులను వేడినీటిలోవేసి పిసిగి కూటించి వెలుపలికి తీసి ఎండలో ఆరబెట్టింది. పిమ్మట ఆమె ఇంటిపనులలో మునిగియుండగా (తటాలున) ఒకకుక్కవచ్చి ఆ నువ్వులపై మూత్రవిసర్జనం చేసింది, దానిని గాంచి ఆమె ఇలా విచారించింది-'అయ్యో, ప్రతికూలం అయిన

విధి (యొక్క) నైపుణ్యం చూడండి. ఈ నువ్వులు తినడానికి అయోగ్యాలుగా చేయబడ్డాయి. కనుక నేను వీటిని తీసికొని ఎవరి యింటికైనా పోతాను. శుభ్రమైన వీటికి బదులుగా శుభ్రం చేయబడని వాటిని తెస్తాను. ఈ పద్ధతచే ఎవరైనా నాకు (వేటే నూవులు) ఇవ్వగలరు.

మూ. అథ యస్మిన్ గృహేఽహం భిక్షార్థం ప్రవిష్టస్తత్ర గృహే సాఽపి తిలానాదాయ ప్రవిష్టా విక్రయం కర్తుమ్. ఆహ చ– గృహ్ణాతు కశ్చిద లుఞ్చితైర్లుఞ్చితాంస్తిలాన్'. అథ తద్గృహగృహిణీ గృహం ప్రవిష్టా, యావదలుఞ్చితైర్లుఞ్చితాన్ గృహ్ణాతి, తావదస్యాః పుత్రేణ కామన్దకీశాస్త్రం దృష్ట్వా వ్యాహృతమ్– 'మాతః, అగ్రాహ్యాః ఖల్విమే తిలాః. నాస్యా అలుఞ్చితైర్లుఞ్చితా గ్రాహ్యాః. కారణం కించిద్భవిష్యతి. తేనైషాఽలుంచితైర్లుంచితాన్ ప్రయచ్ఛతి. తచ్ఛ్రుత్వా తయా పరిత్యక్తాస్తే తిలాః. అతోఽహం బ్రవీమి– 'నాకస్మాచ్ఛాణ్డిలీ మాతః' ఇతి.

అ. నేను ఏ ఇంటికి భిక్షకై వెళ్లానో ఆ యింటికే ఆమె నువ్వుల విక్రయానికి (మార్పుచేయడానికి) వచ్చింది. ఇలా చెప్పింది ఎవరైనా ఈ శుభ్రం చేసిన నూవులు తీసికొని శుభ్రం చేయని నూవులు ఇవ్వండి' దానిని విని ఆ యింటి ఇల్లాలు ఇంటిలోనికి వెళ్లింది. శుభ్రంచేయని నూవులు తెచ్చి శుభ్రం చేసిన నూవులు తీసికొనడానికి సిద్ధపడింది. ఇంతలో ఆమె పుత్రుడు కామందకీనీతిశాస్త్రం పఠిస్తూ ఇలా అన్నాడు. 'అమ్మా ఈ నువ్వులు గ్రహింపదగినవి కావు. ఈమెకు అశుభమైన నూవులు ఇచ్చి (ఈమెనుండి) శుభ్రంచేసినవి గ్రహింపవద్దు. కారణం ఏదో ఉంటుంది. అందువల్లనే ఈమె శుద్ధంచేసిన వాటిని శుద్ధంచేయనివాటికి ఇస్తూ ఉంది.దానిని విని ఆమె ఆ నువ్వులను వదలివేసింది. అందుచే నేను (బృహత్ స్ఫిక్కు) 'నాకస్మాచ్ఛాణ్డిలీ మాతః' అని చెప్పుచున్నాను.

మూ. ఏవముక్త్వా స భూయోఽపి ప్రాహ– 'అథ జ్ఞాయతే తస్య క్రమణమార్గః'? తామ్రచూడ ఆహ 'భగవన్, జ్ఞాయతే, యత ఏకాకీ న సమాగచ్ఛతి. కిన్త్వసంఖ్యయూథపరివృతః పశ్యతో మే పరిభ్రమన్నితస్తతః

సర్వజనేన సహోఽగచ్ఛతి. యాతి చ. అభ్యాగత ఆహ-'అస్తి కించిత్ ఖనిత్ర కమ్? స ఆహ- 'బాఢమస్తి. ఏషా సర్వలోహమయీ స్వహస్తికా. అభ్యాగత ఆహ- తతః ప్రత్యూషే త్వయా మయా సహ స్థాతవ్యమ్, యేన ద్వావపి జన చరణామలినాయాం భూమౌ తత్పదానుసారేణ గచ్ఛావః.

అ. ఈ కథచెప్పి అతడు (బృహత్స్ఫిక్కు) మరలా అడిగాడు- అది తిరిగే దారి తెలియునా?

తామ్రచూడుడు-'భగవన్! తెలియును. అది ఒంటరిగా రాదు. లెక్కలేనంత గుంపుతోగూడి వస్తుంది, పోతుంది.

బృహత్స్ఫిక్కు- త్రవ్వటకు ఏదేని సాధనం ఉందా?

తామ్ర- ఆ, ఉంది. పూర్తి ఇనుపదైన త్రవ్వకోల (గుద్దలి) కలదు.

బృహ- అయితే ప్రాతఃకాలాన నీవు నాతోపాటు ఉండుము. మనం ఇరువురం మనుష్యుల అడుగులచే ఎలుకలుపోయిన దారి చెడిపోకముందే వాటి అడుగులను బట్టి పోవుదము.

మూ. మయాఽపి తద్వచనమాకర్ణ్య చింతితమ్-'అహో, వినష్టోఽస్మి యతోఽస్య సాభిప్రాయవచాంసి శ్రూయన్తే. నూనం యథా నిధానం జ్ఞాతం తథా దుర్గమప్యస్మాకం జ్ఞాస్యతి. ఏతదభిప్రాయాదేవ జ్ఞాయతే. ఉక్తఞ్చ-

శ్లో. సకృదపి దృష్ట్వా పురుషం విబుధా జానంతి సారతాం తస్య
హస్తతులయాఽపి నిపుణాః పలప్రమాణం విజానన్తి. 85

అ. నేనును (హిరణ్యకుడు అను నేను) అతనిమాట విని ఇలా విచారించాను 'అయ్యో వినాశం పొందాను. ఇతని మాటలు ఎంతో భావపూర్ణంగా వినబడుచున్నాయి. ఎలా నిధిని (నేనుదాచిన ఆహారనిధిని గుర్తించాడో అలాగే మా బొఱియనుగూడ తెలిసికొనగలడు. ఇది ఇతని మాటవల్లనే తెలుస్తూంది. విజ్ఞులు అన్నారు—

విద్వాంసులు ఎవనినైన ఒకసారిచూడగానే అతని శక్తిని తెలిసికోగలరు, నేర్పరులు సువర్ణాదికం చేతితో అలా ఎత్తిచూచియే అది ఎన్ని పలాల బరువు ఉండో గ్రహిస్తారు. (85)

శ్లో. వాక్త్వైవ సూచయతి పూర్వతరం భవిష్యం
పుంసాం యదన్యతనుజం త్వశుభం శుభం వా.
విజ్ఞాయతే శిశురజాతకలాపచిహ్నః
ప్రత్యుద్గతైరపసరన్ సరలః కలాపీ. 86

అ. మానవులకు పూర్వజన్మ కర్మను అనుసరించి ఈ జన్మలో జనించిన కోరికయే రాబోయే మంచినిగాని చెడ్డనగాని సూచిస్తుంది. పింఛరూపం అయిన చిహ్నం ఏర్పడకపోయినా నెమలిపిల్ల, తన అందమైన శీవితో గూడిన అడుగలతో నడుస్తూ 'ఇది నెమలి' అని తెలియబడుతూన్నది.

మూ. తతోఽహం భయత్రస్తమనాః సపరివారో దుర్గమార్గం పరిత్యజ్యాన్యమార్గేణ గన్తుం ప్రవృత్తః. సపరిజనో యావదగ్రతో గచ్ఛామి, తావత్ సమ్ముఖో బృహత్కాయో మార్జారః సమాయాతి. స చ మూషక-బృన్దమవలోక్య తన్మధ్యే సహసోత్పపాత. అథ తే మూషకా మాం కుమార్గగామినమవలోక్య గర్హయన్తో హతశేషా రుధిరప్లావితవసున్ధరాస్తమేవ దుర్గం ప్రవిష్టాః, అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. ఛిత్త్వా పాశమపాస్య కూటరచనాం భఙ్క్త్వా బలాద్వాగురాం
పర్యన్తాగ్నిశిఖా-కలాప-జటిలాన్నిర్గత్య దూరం వనాత్.
వ్యాధానాం శరగోచరాదపి జవేనోత్పత్య ధావన్ మృగః
కూపాన్తః పతితః కరోతు విధురే కిం వా విధౌ పౌరుషమ్. 87

అ. అప్పుడు నేను మిక్కిలి భయపడిన మనస్సుతో బొరియ (దుర్గ మార్గం వదిలాను. వేరేదారిన పరివారంతో పోసాగాను. కొంతముందుకు అలా పోయానో లేదో స్థూలశరీరంతో ఒక పిల్లి ఎదురైంది ఎలుకలగుంపును చూచింది. వెంటనే వాటి నడుమ దూకింది. అంత ఆ ఎలుకలు చెడుదారిలో పోయిన నన్ను దూషిస్తూ చావగా మిగిలినవి నెత్తుటితో భూమిని తడుపుతూ (శరీరంనుండి నెత్తురు కారుచుండగా) అదే బొరియలో దూరాయి. పెద్దలు ఈ విషయంలో చక్కగా చెప్పారు—

ఒక లేడి, వేటకాని వలను త్రెంచుకొంది. చుట్టుఉంచిన కంచెను తొలగించుకొంది.

ఉచ్చులను బలంచూపి ముక్కలు చేసింది. దావున ఉండే (అగ్నిజ్వాలాసమూహ దుర్గమారణ్యాన్ని) అగ్నిజ్వాలల సమూహంచే దుర్గమం అయిన అడవిని దాటిదూరంగా వచ్చింది. ఇంతలో వేటకాండ్రు బాణప్రయోగం చేయగా వేగంగా ఎగిరి గుఱిని తప్పించుకొంది. ఇలా అన్ని తొలగించుకొని పఱుగెత్తివస్తూ బావిలో పడింది. దైవం ప్రతికూలం అయినప్పుడు కేవలపురుషప్రయత్నం ఏమి సాధింపగలదు?(87)

మూ. అథాహమేకోఽన్యత్ర గతః. శేషా మూఢతయా తత్రైవ దుర్గే ప్రవిష్టాః. అత్రాన్తరే స దుష్టపరివ్రాజకో రుధిరబిన్దుచర్చితాం భూమిమవలోక్య తేనైవ దుర్గమార్గేణాఽగత్యోపస్థితః. తతశ్చ స్వహస్తికయా ఖనితుమారబ్ధః. అథ తేన ఖనతా ప్రాప్తం తన్నిధానం, యస్యోపరి సదైవాహం కృతవసతిః, యస్యోష్మణా మహాదుర్గమపి గచ్ఛామి. తతో హృష్టమనాస్తామ్రచూడమిదమూచేఽభ్యాగతః-'భో భగవన్, ఇదానీం స్వపిహి నిశ్శఙ్కః. అస్యోష్మణా మూషకస్తే జాగరణం సమ్పాదయతి.' ఏవముక్త్వా నిధానమాదాయ మఠాభిముఖం ప్రస్థితౌ ద్వావపి.

ఆ. అంత నేను ఒంటరిగా మఱియొక చోటికిపోయాను. మిగిలిన ఎలుకలు మూర్ఖంగా అదే బొఱియలో దూరాయి. ఇంతలో ఆ దుష్టసన్యాసి నెత్తుటిబొట్టు గుర్తులతోడి నేలను చూచాడు. వాటిననుసరించి బొఱియను (దుర్గం) చేరాడు. అచ్చట నిలిచాడు. పిమ్మట గుద్దేటితో త్రవ్వసాగాడు. త్రవ్వుచూ నేను ప్రోగుచేసిన నిధిని (ఆహారాది సామగ్రిని) చూచాడు. దానిమీదనే నేను నిత్యం నివసించేవాణ్ణి. దాని బలంవల్లనే మహాదుర్గమప్రదేశం కూడ పోయేవాడిని. ఆ నిధినిగాంచి అతిథి (బృహత్స్ఫిక్కు) సంతోషించి తామ్రచూడునితో ఇలా అన్నాడు- ' ఓ పూజ్యుడా! ఇక నిశ్చింతగా నిద్రింపుము. దీని (నిధియొక్క) బలంవల్లనే ఎలుక నీకు నిద్దురలేకుండ చేస్తూ ఉంది.

ఇలా అని నిధిని తీసికొని ఇరువురూ మఠానికి బయలుదేరారు.

మూ. అహమపి యావన్నిధానరహితం స్థానమాగచ్ఛామి, తావదరమణీయముద్వేగకారకం తత్స్థానం వీక్షితుమపి న శక్నోమి. అచిన్తయఞ్చ కిం కరోమి? క్వ గచ్ఛామి? కథం మే స్యాన్మనసః ప్రశాన్తిః? ఏవం చిన్తయతో

మహాకష్టేన స దివసో వ్యతిక్రాన్తః. అథాస్తమితేఽర్కే సోద్వేగో నిరుత్సాహ స్తస్మిన్ మఠే సపరివారః ప్రవిష్టః.

అ నేనూ ఆ ప్రదేశానికి వచ్చాను. అది నిధిపోవడంతో కళావిహీనమై బాధాకరంగా ఉంది. దాన్ని చూడలేకపోయాను. ఇలా విచారించాను- 'ఏమి చేయాలి? ఎచ్చటికి పోవాలి? ఎలా నామనస్సుకు ప్రశాంతి లభిస్తుంది? ఇలా విచారిస్తూ మిక్కిలి కష్టంగా ఆ పగలు గడిపాను. ప్రొద్దుగుంకగానే బాధతో నిరుత్సాహంగా (మిగిలిన) పరిజనం వెంటరాగా ఆ మఠంలో ప్రవేశించాను.

మూ. అథాస్మత్పరిగ్రహశబ్దమాకర్ణ్య తామ్రచూడోఽపి భూయో భిక్షాపాత్రం జర్జరవంశేన తాడయితుం ప్రవృత్తః. అథాసావభ్యాగతః ప్రాహ- 'సఖే, కిమద్యాపి నిశ్శఙ్కో న నిద్రాం గచ్ఛసి'? స ఆహ- 'భగవన్, భూయోఽపి సమాయాతః సపరివారః స దుష్టాత్మా మూషకః. తద్భయాజ్జర్జరవంశేన భిక్షాపాత్రం తాడయామి'. తతో విహస్యాభ్యాగతః ప్రాహ- 'సఖే, మా భైషీః. విత్తేన సహ గతోఽస్య కూర్దనోత్సాహః. సర్వేషాం జన్తూనామియమేవ స్థితిః. ఉక్తఞ్చ-

శ్లో. యదుత్సాహీ సదా మర్త్యః పరాభవతి యజ్జనాన్
యదుద్ధతం వదేద్వాక్యం తత్సర్వం విత్తజం బలమ్. 88

అ మా పరిజన (సేవకజన) శబ్దం విని తామ్రచూడుడు మరల భిక్షాపాత్రను పాతవెదురుకఱ్ఱతో కొట్టసాగాడు. అప్పుడు ఆ అభ్యాగతుడు అడిగాడు- 'మిత్రమా! ఎందుకు నేడునూ నిస్సంకోచంగా నిద్రించడం లేదు? అతడు (తామ్రచూడుడు) చెప్పాడు- 'భగవన్, ఆ దుష్టమూషికం మరల పరివార సమేతంగా వచ్చింది. దాని భయంవల్ల పాతవెదురుకఱ్ఱతో భిక్షాపాత్రను కొట్టుచున్నాను.' అంతట నవ్వి అభ్యాగతుడు (బృహత్స్ఫిక్కు) ఇలా అన్నాడు- 'మిత్రమా! భయపడకుము. ధనంతోబాటు దాని ఎగిరే ఉత్సాహంకూడ పోయింది. అన్నిప్రాణుల అవస్థయూ ఇంతే. విజ్ఞులు అన్నారు—

మానవుడు ఉత్సాహంగా ఉండడం, ఇతర మానవులను పరాభవించడం,

గర్వంగా మాట్లాడడం ఇదంతా ధనంవల్ల పుట్టిన బలమే.(88)

మూ. అథాహం తచ్ఛ్రుత్వా కోపావిష్టో భిక్షాముద్దిశ్య విశేషాదుత్కూర్దితోఽప్రాప్త ఏవ భూమౌ నిపతితః. తచ్ఛ్రుత్వాఽసౌ మే శత్రుర్విహస్య తామ్రచూడమువాచ– 'భోః పశ్య పశ్య కౌతూహలమ్. ఆహ చ–

శ్లో॥ అర్థేన బలవాన్ సర్వోఽప్యర్థయుక్తః స పణ్డితః
పశ్యైనం మూషకం వ్యర్థం సజాతేః సమతాం గతమ్. 89

అ. నేను దానిని విన్నాను, కోపావేశం పొందాను, శక్తినంతా ఉపయోగించి భిక్షాపాత్రనుద్దేశించి ఎగిరాను, కాని పాత్రను చేరకయే భూమిపై పడిపోయాను. దానిని (పడినశబ్దం)విని ఆ నా శత్రువు (బృహత్స్ఫిక్కు) నవ్వి తామ్రచూడునితో ఇలా అన్నాడు– 'మిత్రమా, చూడుము, ఆశ్చర్యం చూడు'– (ఇలా అని మరల) చెప్పాడు–

అందరు ధనంచేతనే బలవంతులు అగుదురు. ధనంగలవాడే పండితుడు. చూడుము– ధనంపోవడంతో ఈఎలుక, తన జాతి ఎలుకలతో సమానం అయింది(89)

మూ. తత్ స్వపిహి త్వం గతశఙ్కః.యదస్యోత్పతనకారణం తదాఽఽవయోర్హస్తగతం జాతమ్. అథవా సాధ్విదముచ్యతే–

శ్లో. దంష్ట్రావిరహితః సర్పో మదహీనో యథా గజః
తథాఽర్థేన విహీనోఽత్ర పురుషో నామధారకః. 90

అ. అందుచే నీవు సంశయం వీడి నిద్రింపుము. దీని ఎగిరే బలకారణం అయిన (దీని) నిధి మన ఇరువురి చేతులలోనికి వచ్చింది. పెద్దలు చక్కగాచెప్పారు–

ఈ ప్రపంచంలో కోరలు విరిగినపాము, మదంపోయిన ఏనుగు, ఎలా నామమాత్రానికే అగునో, అలాగే ధనంపోగొట్టుకున్న పురుషుడూ నామమాత్రానికే అగును(90)

మూ. తచ్ఛ్రుత్వాఽహం మనసా విచిన్తితవాన్– 'యతోఽఙ్గులిమాత్రమపి కూర్దనశక్తిర్నాస్తి, తద్ధిగర్థహీనస్య పురుషస్య జీవితమ్. ఉక్తఞ్చ–

శ్లో. అర్థేన తు విహీనస్య పురుషస్యాల్పమేధసః
ఉచ్ఛిద్యన్తే క్రియాః సర్వా గ్రీష్మే కుసరితో యథా. 91

అ. ధనహీనుడూ అందువల్లనే అల్పబుద్ధియూ అయిన మానవుని పనులు అన్నీ ఎండకాలంలోని చిన్న నదులలోని నీరువలె విచ్ఛిన్నాలు అగును.

శ్లో. యథా కాకయవాః ప్రోక్తా యథారణ్యభవాస్తిలాః
నామమాత్రా న సిద్ధౌ హి ధనహీనాస్తథా నరాః. 92

అ. ఏలాగు కాకయవధాన్యం, అడవి నువ్వులు పేరునకే గాని ఏ కార్యమునకు ఉపయోగపడవో, అలాగే ధనంలేని మానవులును ఎందుకూ పనికిరారు.

శ్లో. సన్తోఽపి న హి రాజన్తే దరిద్రస్యేతరే గుణాః
ఆదిత్య ఇవ భూతానాం, శ్రీర్గుణానాం ప్రకాశినీ. 93

అ. దరిద్రునికి ఇతర సద్గుణాలెన్నియున్నా, అవి ప్రకాశింపవు. సూర్యుడు సర్వభూతాలను ప్రకాశింపజేయునట్లు, లక్ష్మి, అన్ని గుణాలను ప్రకాశింపజేయును.

శ్లో. న తథా బాధ్యతే లోకే ప్రకృత్యా నిర్ధనో జనః
యథా ద్రవ్యాణి సమ్ప్రాప్య తైర్విహీనోఽసుఖే స్థితః. 94

అ. ఈ లోకంలో మొదట ధనం సంపాదించి దాన్ని పోగొట్టుకొని సుఖహీనంగా ఉండే మానవుడు బాధపడినంతగా, సహజంగా ధనహీనుడైన మానవుడు బాధ నొందడు.

శ్లో. శుష్కస్య కీటఖాతస్య వహ్నిదగ్ధస్య సర్వతః
తరోరప్యూషరస్థస్య వరం జన్మ న చార్థినః. 95

అ. ఎండినదీ, పురుగులచే తొలవబడినదీ, అన్నివైపులా అగ్నిచే కాల్చబడినదీ, చవిటి నేలలో ఉన్నదీ అయిన వృక్షం జన్మ, యాచకుని జన్మకంటె ఎంతో శ్రేష్ఠం.

శ్లో. శఙ్కనీయా హి సర్వత్ర నిష్ప్రతాపా దరిద్రతా
ఉపకర్తుమపి ప్రాప్తం నిస్వం సన్త్యజ్య గచ్ఛతి. 96

అ. శక్తిరహితం (నిష్ప్రతాపం) అయిన దారిద్ర్యం సందేహాలన్నిటికీ గురి అగుచున్నది. దరిద్రుడు ఇతరునికి ఏదేని ఉపకారం చేయడానికి పోయినా, 'నాది ఏది కోరునో' అని శంకించి, ప్రతివాడు అతనిని (దరిద్రుని) దగ్గరకు రానివ్వడు (వదలిపెట్టును.)

శ్లో. ఉన్నమ్యోన్నమ్య తత్రైవ నిర్ధనానాం మనోరథాః
హృదయేష్వేవ లీయన్తే విధవాస్త్రీ స్తనావివ. 97

అ. విధవరాలి చన్నుల వలె దరిద్రుని కోరికలు మనస్సులో పొంగి పొంగి పొరలి అచ్చటనే అణగారి పోతాయి.

శ్లో. వ్యక్తేఽపి వాసరే నిత్యం దౌర్గత్యతమసావృతః
అగ్రతోఽపి స్థితో యత్నాన్న కేనాపీహ దృశ్యతే. 98

అ. ఈ ప్రపంచంలో దరిద్రం అనే చీకటిచే కప్పబడిన మానవుని పగలు స్పుటంగావచ్చినా, ఎదురుగా ఉన్నా, ప్రయత్నపూర్వకంగానైనా ఎవడూ చూడడు.

మూ. ఏవం విలప్యాహం భగ్నోత్సాహస్తన్నిధానం గణ్డోపధానీకృతం దృష్ట్వా స్వం దుర్గం ప్రభాతే గతః. తతశ్చ మద్భృత్యాః ప్రభాతే గచ్ఛన్తో మిథో జల్పన్తి– 'అహో, అసమర్థోఽయముదరపోషణేఽస్మాకమ్. కేవలమస్య పృష్ఠలగ్నానాం బిడాలాదివిపత్తయః. తత్కిమనేనారాధితేన? ఉక్తఞ్చ–

శ్లో. యత్సకాశాన్న లాభః స్యాత్ కేవలాః స్యుర్విపత్తయః
స స్వామీ దూరతస్త్యాజ్యో విశేషాదనుజీవిభిః. 99

అ. ఇలా విలపించి నేను నిరుత్సాహం పొందాను. నా నిధి వారి చెంపలకు దిండుగా ఉండడం చూచాను. వేకువన నా దుర్గం (బొరియ) చేరాను. అప్పుడు నా సేవకులు వేకువవేళ వెళ్లుచూ తమలో తాము, ఇలా మాటాడుకొంటున్నారు— 'అయ్యో, ఇతడు మన పొట్టనింపుటకు (మనల పోషించుటకు) అసమర్థుడు. ఇతని వెంటపోయేవారికి పిల్లి మొదలైన వానివలన ఆపదలు 'లవు' అందుచే ఇతని ఆరాధించడంవలన లాభం ఏముంది? పెద్దలు అన్నారు—

ఏ ప్రభువువలన లాభంలేదో, ఆపదలు మాత్రం సంభవిస్తాయో, అలాంటి ప్రభువును సేవకులు విశేషించి దూరం నుండియే విడిచి పెట్టాలి. (99)

మూ. ఏవం తేషాం వచాంసి శ్రుత్వా స్వదుర్గం ప్రవిష్టోఽహమ్. యావన్న కశ్చిన్మమ సమ్ముఖేఽభ్యేతి తావన్మయా చిన్తితమ్– ధిగియం దరిద్రతా, అథవా సాధ్విదముచ్యతే–

శ్లో. మృతో దరిద్రః పురుషో మృతం మైథునమప్రజమ్
మృతమశ్రోత్రియం శ్రాద్ధం మృతో యజ్ఞస్త్వదక్షిణః. 100

అ. ఇలా వారి మాటలను విని నేను నా కోటను(బొఱియను) ప్రవేశించాను. ఎవడూ నా యెదుటకు రాలేదు. అప్పుడు నేను ఇలా చింతించాను, 'ఛీ' దరిద్రం. ఈ విషయంలో పెద్దలు చక్కగా చెప్పారు—

దరిద్రుడైన పురుషుడు, సంతానం గల్గింపజాలని మైథునం, (దాంపత్యం) వేదవేత్తలేని శ్రాద్ధకర్మ, దక్షిణలేని యజ్ఞం, ఇవన్నీ మృతతుల్యాలు - అనగా నిష్ఫలాలు.

మూ. ఏవం మే చిన్తయతస్తే భృత్యా మమ శత్రూణాం సేవకా జాతాః. తే చ మామేకాకినం దృష్ట్వా విడమ్బనాం కుర్వన్తి. అథ మయైకాకినా యోగ నిద్రాం గతేన భూయో విచిన్తితమ్— యత్తస్య కుతపస్వినః సమాశ్రయం గత్వా తద్గణ్డోపధానవర్తికృతాం విత్తపేటీం శనైః శనైర్విదార్య తస్య నిద్రా వశం గతస్య స్వదుర్గే తద్విత్తమానయామి. యేన భూయోఽపి మే విత్తప్రభావేణాఽధిపత్యం పూర్వవద్భవిష్యతి. ఉక్తఞ్చ—

శ్లో. వ్యథయంతి పరం చేతో మనోరథశతైర్జనాః
నానుష్ఠానైర్ధనైర్హీనాః కులజా విధవా ఇవ. 101

అ. నేను ఇలా విచారిస్తూ ఉండగా నా అనుచరులు నా శత్రువులకు సేవకులు అయినారు. మరియూ ఒంటరిగా ఉండే నన్ను చూచి పరిహసింపసాగారు. అప్పుడు ఒంటరినైన నేను యోగనిద్రలో (కన్నులు మూసికొని ఏకాగ్రంగా) ఇలా విచారించాను- 'ఆ దుష్టతాపసుడు ఉండేచోటుకు పోతాను, అతడు గాఢ నిద్రలో ఉండడం గుర్తిస్తాను.అతడు దిండుగా చేసికొనిన ధనపేటికను (ధనం పెట్టెను) మెల్ల మెల్లగా ఛేదిస్తాను. ఆ ధనాన్ని నా దుర్గానికి (బొఱియకు) తెస్తాను. ఆ ధనప్రభావంచే నాకు మరల మొదటివలె ఆధిపత్యం (రాజరికం) లభిస్తుంది. విజ్ఞులు అన్నారు—

ధనహీనులైన మానవులు, సత్కుల సంజాతలైన విధవలవలె వందల కొలది కోరికలతో కేవలం మనస్సుకు బాధ గల్గిస్తుంటారు.తమ కోరికలను ఆచరణ ద్వారా పూర్తి చేసికొని ఆనందింపజాలరు. (101)

శ్లో. దౌర్గత్యం దేహినాం దుఃఖమవమానకరం పరమ్
యేన స్వైరపి మన్యన్తే జీవన్తోఽపి మృతా ఇవ. 102

అ. దరిద్రత మానవులకు దుఃఖాన్ని మిక్కిలి అవమానాన్ని గల్గిస్తుంది. దరిద్రులు జీవించియుండియూ తమవారిచేతనే మృతులుగా తలంపబడుతారు.

శ్లో. దైన్యస్య పాత్రతామేతి పరాభూతేః పరం పదమ్
విపదామాశ్రయః శశ్వద్దౌర్గత్యకలుషీకృతః. 103

అ. దరిద్రతచే మలినుడైన మానవుడు, నిత్యం దీనతకు పాత్రుడు, తిరస్కారానికి ముఖ్యస్థానం, ఆపదలకు ఇల్లు అగును.

శ్లో. లజ్జన్తే బాన్ధవా స్తేన సమ్బన్ధం గోపయంతి చ
మిత్రాణ్యమిత్రతాం యాంతి యస్య న స్యుః కపర్దకాః. 104

అ. ఎవని వద్ద పైసలు (కపర్దకములు) ఉండవో వానిని గాంచి బంధువులు సిగ్గుపడుదురు. బాంధవ్య సంబంధాన్ని దాచిపెట్టుదురు. మిత్రులు శత్రువులు అగుదురు.

శ్లో. మూర్తం లాఘవమేవైతదపాయానామిదం గృహమ్
పర్యాయో మరణస్యాయం నిర్ధనత్వం శరీరిణామ్. 105

అ. ఈ దరిద్రత, మానవులకు రూపుదాల్చిన లాఘవం, (చులకన భావం) ఆపదలకు ఇది ఇల్లు, చావునకు ఇది మారు పేరు.

శ్లో. అజాధూలిరివ త్రస్తైర్మార్జనీరేణువజ్జనైః
దీపఖట్వోత్థచ్ఛాయేవ త్యజ్యతే నిర్ధనో జనైః. 106

అ మేక నడిచేటప్పుడు లేచిన దుమ్మువలె, చీపురుతో ఊడ్చేటప్పుడు ఎగిరే ముఱికినివలె, క్రింద దీపం ఉండడంతో పైకి వచ్చిన మంచం నీడనువలె అమంగళంగా భావించి భయంతో జనులు దరిద్రుని పరిత్యజిస్తారు.

శ్లో. శౌచాఽవశిష్టయాప్యస్తి కిఞ్చిత్కార్యం క్వచిన్మృదా
నిర్ధనేన జనేనైవ న తు కిఞ్చిత్ ప్రయోజనమ్. 107

అ. శౌచక్రియ తర్వాత (అవయవాలను శద్ధిచేసిన తర్వాత) మిగిలిన మట్టికైనా ఎచ్చటనైనా ఏదేని ఉపయోగం గల్గవచ్చును. కాని ధనహీనుడైన మానవుని వలన ఏ స్వల్పప్రయోజనం కూడ ఉండదు.

శ్లో. అధనో దాతుకామోఽపి సమ్ప్రాప్తో ధనినాం గృహమ్
మన్యతే యాచకోఽయం ధిగ్ దారిద్ర్యం ఖలు దేహినామ్. 108

అ. ధనహీనుడు ఏదేని ఇచ్చుటకై ధనికుల ఇండ్లకు పోయినచో 'ఇతడు యాచకుడే'- అని తలుస్తారు. ఛీ మానవుల ఈ దరిద్రతకు ధిక్కారం.

మూ. అతో విత్తాపహారం విదధతో యది మే మృత్యుః స్యాత్, తథాపి శోభనమ్. ఉక్తఞ్చ-

శ్లో. స్వవిత్తహరణం దృష్ట్వా యో హి రక్షత్యసూన్నరః
పితరోఽపి న గృహ్ణంతి తద్దత్తం సలిలాఞ్జలిమ్. 109

అందువల్ల ధనం తెచ్చే ప్రయత్నంలో నాకు మరణం సంభవించినా శుభమే. విజ్ఞులు అన్నారు—

ఎవడు తన ధనం అవహరింప బడటం చూచి ప్రాణాలను రక్షించుకొంటాడో, వాడు ఇచ్చే తర్పణజలాన్ని పితృదేవతలు గ్రహింపరు.

మూ. తథా చ-

శ్లో. గవార్థే బ్రాహ్మణార్థే చ స్త్రీవిత్తహరణే తథా
ప్రాణాం స్త్యజతి యో యుద్ధ తస్య లోకాః సనాతనాః 110

అ. అటులనే - గోరక్షణకై, బ్రాహ్మణరక్షణకై, స్త్రీ రక్షణకై, తన ధనం హరింపబడేటప్పుడు యుద్ధభూమిలో ఎవడు ప్రాణాలు వీడునో, వానికి అక్షయ పుణ్య లోకాలు లభిస్తాయి. (వాడు స్వర్గానికి పోవును).

మూ. ఏవం నిశ్చిత్య రాత్రౌ తత్ర గత్వా నిద్రావశముపాగతస్య పేటి కాయాం మయా ఛిద్రం కృతం యావత్, తావత్ ప్రబుద్ధో దుష్టతాపసః తతశ్చ జర్జరవంశప్రహారేణ శిరసి తాడితః కథఞ్చిదాయుః శేషతయా నిర్గతోఽహమ్, న మృతశ్చ. ఉక్తఞ్చ-

శ్లో. ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యో దేవోఽపి తం లఙ్ఘయితుం న శక్తః
తస్మాన్న శోచామి న విస్మయో మే యదస్మదీయం న హి తత్పరేషామ్.

కాకకూర్మౌ పృచ్ఛతః- 'కథమేతత్? హిరణ్యక ఆహ-

అ. ఇలా నిశ్చయించి రాత్రివేళ అచ్చటికి వెళ్లాను. సన్యాసి గాఢ నిద్రలో ఉండడం గుర్తించాను. కాని పెట్టెకు బెజ్జం వేయునంతలో అతడు మేల్కొన్నాడు- పాతవెదురు కఱ్ఱతో నా తలపై బాదాడు. ఏదో విధంగా ఆయువు మిగిలి ఉండడంతో చావక బయట పడ్డాను. విజ్ఞులు అన్నారు—'మనుష్యుడు తన అదృష్టంలో (భాగ్యంలో) వ్రాయబడిన (ప్రాప్తవ్య) వస్తువును పొందును. దైవం కూడ దాన్ని అతిక్రమింప జేయలేడు. అందువల్ల నేను దుఃఖింపను, నాకు ఆశ్చర్యంలేదు. ఏది మనదో అది ఇతరులది కాజాలదు. (111)

కాకియు తాబేలు అడిగాయి— 'ఇది ఎట్లు?' హిరణ్యకుడు చెప్పాడు—

## కథా-6

## వణిక్పుత్ర-కథా

మూ. అస్తి కస్మింశ్చిన్నగరే సాగరగుప్తో నామ వణిక్. తత్సూనునా రూప్యకశతేన విక్రీయమాణపుస్తకం గృహీతమ్. తస్మింశ్చ లిఖితమస్తి-

శ్లో. ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యో దేవోఽపి తం లఙ్ఘయితుం న శక్తః
తస్మాన్న శోచామి న విస్మయో మే యదస్మదీయం న హి తత్పరేషామ్.

అ. ఒకానొక నగరంలో సాగరగుప్తుడు అనే వ్యాపారి గలడు. అతని పుత్రుడు నూరు రూపాయలకు అమ్మబడే ఒక పుస్తకం కొన్నాడు. అందు ఇలా వ్రాయబడి ఉంది.

'మానవుడు తన భాగ్యంలో ఉన్నదాన్ని పొందును. దేవుడును దాన్ని నిరోధింపలేడు. అందుకు నేను దుఃఖింపను. ఆశర్యం పొందను. నాదైనది పరులది కాజాలదు.

మూ. తద్దృష్ట్వా సాగరదత్తేన తనుజః పృష్టః- 'పుత్ర! కియతా మూల్యేనైతత్ పుస్తకం గృహీతమ్.' సోఽబ్రవీత్-'రూప్యకశతేన. తచ్ఛ్రుత్వా సాగరదత్తోఽబ్రవీత్- 'ధిఙ్మూర్ఖ, త్వం లిఖితైకశ్లోకం రూప్యకశతేన యద్గృహ్ణాసి, ఏతయా బుద్ధ్యా కథం ద్రవ్యోపార్జనం కరిష్యసి? తదద్య ప్రభృతి త్వయా మే గృహే న ప్రవేష్టవ్యమ్.' ఏవం నిర్భర్త్స్య గృహాన్నిస్సారితః.

స చ తేన నిర్వేదేన విప్రకృష్టం దేశాన్తరం గత్వా కిమపి నగరమాసాద్యావ స్థితః. అథ కతిపయదివసైస్తన్నగరనివాసినా కేనచిదసౌ పృష్టః— 'కుతో భవానాగతః? కిం నామధేయో వా? ఇతి. అసావబ్రవీత్— 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః. అథాన్యేనాపి పృష్టేనానేన తథైవోత్తరం దత్తమ్. ఏవఞ్చ తస్య నగరస్య మధ్యే ప్రాప్తవ్యమర్థ ఇతి తస్య ప్రసిద్ధం నామ జాతమ్.

అ. దానిని గాంచి సాగరదత్తుడు పుత్రుని అడిగాడు.— 'ఈ పుస్తకం ఎంత వెలకు కొన్నావు'. అతడు (పుత్రుడు) చెప్పాడు — 'నూరు రూపాయలకు'. దానిని విని సాగరదత్తుడు ఇలా అన్నాడు— 'ఛీ మూర్ఖుడా! ఒక శ్లోకం వ్రాయబడిన పుస్తకం నూరు రూపాయలకు కొన్నావు. ఇలాంటి బుద్ధితో ధనం ఎలా సంపాదిస్తావు. అందుచే నేటినుండి నీవు నా యింటిలోనికి రావద్దు'. ఇలా బెదరించి ఇంటినుండి వెళ్ల గొట్టాడు. అతడూ ఆ అవమానంవలని విరక్తితో దూరదేశం పోయాడు— ఏదో నగరం చేరి నివసింపసాగాడు. అంతకొన్ని దినాలకు ఆ నగరవాసి ఒకడు అడిగాడు— 'తాము ఎచ్చటినుండి వచ్చారు? పేరు ఏమి'? ఇతడు చెప్పాడు — 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' (మానవుడు ప్రాప్తవ్యమైన వస్తువును పొందును). తర్వాత మఱి యొకడును అడుగగా ఇతడు అదే సమాధానం చెప్పాడు. ఇలా (చెప్పడంతో) ఆ నగరంలో ఇతనికి 'ప్రాప్తవ్యమర్థుడు', అనే పేరు ప్రసిద్ధం అయింది.

మూ. అథ రాజకన్యా చన్ద్రవతీ నామాఽభిరూపయౌవనసమ్పన్నా సఖీద్వితీయైకస్మిన్ మహోత్సవదివసే నగరం నిరీక్షమాణాఽస్తి. తత్రైవ చ కశ్చిద్రాజపుత్రోఽతీవరూపసమ్పన్నో మనోరమశ్చ కథమపి తస్యా దృష్టిగోచరే గతః. తద్దర్శనసమకాలమేవ కుసుమబాణాఽహతయా తయా నిజసఖ్యభిహితా 'సఖి, యథా కిలానేన సహ సమాగమో భవతి. తథాఽద్య త్వయా యతితవ్యమ్ ఏవం చ శ్రుత్వా సా సఖీ తత్సకాశం గత్వా శీఘ్రమవాదీత్— యదహం చన్ద్రవత్యా తవాన్తికం ప్రేషితా. భణితం చ త్వాం ప్రతి, 'త్వయా యన్మమ త్వద్దర్శనాన్మనోభవేన పశ్చిమావస్థా కృతా. తద్యది శీఘ్రమేవ మదంతికే న సమేష్యసి తదా మే మరణం శరణమ్.' ఇతి శ్రుత్వా తేనాభిహితమ్— 'యద్యవశ్యం

మయా తత్రాగంతవ్యం తత్కథయ కేనోపాయేన ప్రవేష్టవ్యమ్. అథ సఖ్యాఽభిహితమ్– రాత్రౌ సౌధావలమ్బితయా దృఢవరత్రయా త్వయా తత్రారోఢవ్యమ్.' సోఽబ్రవీత్– 'యద్యేవం నిశ్చయో భవత్యాస్తదహమేవం కరిష్యామి. ఇతి నిశ్చిత్య సఖీ చన్ద్రవతీసకాశం గతా.

అ. అంత ఒకప్పుడు ఆ నగరంలో ఏదో పెద్ద తిరుణాల (మహోత్సవం) జరిగింది. అప్పుడు నగరశోభను చూడడానికై రాజపుత్రికయైన చంద్రవతి చెలికత్తెను తోడుగా తీసికొని వచ్చింది. ఆ రాజకన్య సహజంగానే అందగత్తె. నూతన యౌవనం హొంగుతో మరింత అందంగా ఉంది. అలా నగరశోభను చూచే ఆమెకు రూపసంపద గల ఒక రాజపుత్రుడు ఏదో విధంగా (అకస్మాత్తుగా) కనబడినాడు. అతనిని చూడగానే ఆమె కామంచే పీడిత అయింది— చెలికత్తెతో ఇలా అంది— 'సఖీ, నేడు అతనితో నాకు సమాగమం గల్గేటట్లు ప్రయత్నం చేయుము'. దానిని విని చెలికత్తె అతని వద్దకు వెంటనే పోయి ఇలా చెప్పింది— "నన్ను చంద్రవతి నీ వద్దకు పంపింది. ఆమె నిన్ను ఉద్దేశించి ఇలా చెప్పింది— 'శీఘ్రంగా నా దగ్గరకు రావేని నాకు మరణమే శరణం ?". దానిని విని అతడు (రాజపుత్రుడు) అన్నాడు— 'నేను తప్పక అచ్చటికి రావలసి యున్నచో, ఏ ఉపాయంతో (అంతఃపురం) ప్రవేశించాలో తెలుపుము'. అప్పుడు చెలికత్తె చెప్పింది— 'రాత్రివేళ ప్రాసాదానికి గట్టిత్రాడు వ్రేలాడుతూ ఉంటుంది. దానిని పట్టుకొని పైకి ఎక్కిరావాలి ? అతడు అన్నాడు—' మీరు ఎలా నిశ్చయం చేస్తే నేను అలాగే చేస్తాను ? ఇట్లు నిశ్చయం చేసుకొని చెలికత్తె చంద్రవతి దగ్గరకు పోయింది.

మూ. అథాఽగతాయాం రజన్యాం స రాజపుత్రః స్వచేతసా వ్యచింతయత్– 'అహో, మహదకృత్యమేతత్. ఉక్తం చ–

శ్లో. గురోః సుతాం మిత్రభార్యాం స్వామిసేవక గేహినీమ్
యో గచ్ఛతి పుమాంల్లోకే తమాహుర్బ్రహ్మఘాతినమ్ 112

అ. అంత రాత్రిరాగానే ఆ రాజపుత్రుడు తన మనస్సులో ఇలా తలంచాడు. అయ్యో ? ఇది చాల తగని పని. విజ్ఞులు అన్నారు—

ఈ లోకంలో ఎవడైతే గురుపుత్రితో, మిత్రుని భార్యతో, యజమాని

భార్యతో, సేవకుని భార్యతో పొందు చేస్తాడో, వాడు బ్రహ్మహత్యతో సమానం అయిన పాపఫలం అనుభవిస్తాడు (112)

మూ. అపరం చ-

శ్లో. అయశః ప్రాప్యతే యేన యేన చాప్యగతిర్భవేత్
స్వార్థాచ్చ భ్రశ్యతే యేన తత్కర్మ న సమాచరేత్. 113

అ. మరియూ ఏ పనిచే అపకీర్తి, నీచయోనుల జన్మించడం, స్వర్గ సుఖ భ్రష్టతా సంభవిస్తాయో, ఆ పనిని చేయరాదు.

మూ. ఇతి సమ్యగ్విచార్య తత్సకాశం న జగామ. అథ ప్రాప్తవ్యమర్థః పర్యటన్ ధవలగృహే పార్శ్వే రాత్రావవలమ్బిత-వరత్రాం దృష్ట్వా కౌతుకాఽవిష్టహృదయస్తామాలమ్బ్యాధిరూఢః. తయా చ రాజపుత్ర్యా స ఏవాయమిత్యాఽశ్వస్తచిత్తయా స్నాన-ఖాదన-పానాఽచ్ఛాదనాదినా సమ్మాన్య తేన సహ శయనతలమాశ్రితయా తదఙ్గసంస్పర్శసఞ్జాతహర్షరోమాఞ్చితగాత్రయోక్తమ్- 'యుష్మద్దర్శనమాత్రాఽనురక్తయా మయాఽఽత్మా ప్రదత్తోఽయమ్. త్వద్వర్జమన్యో భర్తా మనస్యపి మే న భవిష్యతి ఇతి. తత్కస్మాన్మయా సహ న బ్రవీషి? సోఽబ్రవీత్- 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః.' ఇత్యుక్తే తయాఽన్యోఽయమితి మత్వా ధవలగృహాదుత్తార్య ముక్తః. స తు ఖణ్డదేవకులే గత్వా సుప్తః.

అ. ఇట్లు లెస్సగా విచారించి ఆమె వద్దకు పోలేదు. ప్రాప్తవ్య మర్థుడు రాత్రియందు తిరుగుచు ధవల సౌధం (తెల్లని భవనం) ప్రక్కన వ్రేలాడే త్రాడును చూచాడు. మనస్సులో కుతూహలం ఆవేశించింది. దాన్ని పట్టుకొని పైకి ఎక్కాడు. రాజకుమారియు 'అతడే ఇతడు' అని తలంచింది. మిక్కిలి ఊరడిల్లింది (ఆనందం పొందింది). స్నాన భోజన పాన వస్త్రాదికంచే అతనిని సత్కరించింది అతనితోబాటు శయ్యను చేరింది. అతని అవయవ సంస్పర్శచే గల్గిన ఆనందంతో ఒడలు పులకరింపగా ఇలా అంది— 'మిమ్ము చూడగానే అనురక్తని (ప్రేమను) పొందాను. ఈ శరీరం మీకు అర్పించాను. మీరు తప్ప ఇతరుడు మనస్సులోనూ నాకు భర్త కాజాలడు అట్టి యెడ

ఎందుకు నాతో మాట్లాడవు?'. అతడు ఇలా సమాధానం చెప్పాడు— 'ప్రాప్తవ్య మర్థం లభతే మనుష్యః (మనుష్యుడు భాగ్యంలో ఉన్నదాన్ని పొందును)' ఇలా చెప్పగా (రాజపుత్రి) 'ఇతడు వెఱ్ఱివాడు' అని తలంచింది. అతనిని ధవల సౌధంనుండి క్రిందికి దించి వదలివేసింది. అతడూ పాడుపడిన దేవాలయంలోనికి పోయి నిద్రించాడు. (ఖండదేవుడు అనే దేవతామందిరం అనియూ కొందరు అందురు).

మూ. అథ తత్ర కయాచిత్ స్వైరిణ్యా దత్తసఙ్కేతకో యావద్దణ్డపాశకః ప్రాప్తః, తావదసౌ పూర్వప్రసుప్తేన దృష్టో రహస్యసంరక్షణార్థమభిహితశ్చ– 'కో భవాన్? సోఽబ్రవీత్– 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' ఇతి శ్రుత్వా దణ్డపాశకేనాభిహితమ్– 'యచ్ఛూన్యం దేవగృహమిదమ్. తదత్ర మదీయస్థానే గత్వా స్వపిహి' తథా ప్రతిపద్య స మతివిపర్యాసాదన్యశయనే సుప్తః. అథ తస్య రక్షకస్య కన్యా వినయవతీ నామ రూపయౌవనసమ్పన్నా కస్యాపి పురుషస్యానురక్తా సఙ్కేతం దత్త్వా తత్ర శయనే సుప్తాఽఽసీత్. అథ సా తమాయాతం దృష్ట్వా 'స ఏవాయమస్మద్వల్లభ ఇతి రాత్రౌ ఘనతరాన్ధకారవ్యామోహితోత్థాయ భోజనాఽఽచ్ఛాదనాదిక్రియాం కారయిత్వా గాన్ధర్వవివాహేనాఽఽత్మానం వివాహయిత్వా తేన సమం శయనే స్థితా వికసితవదనకమలా తమాహ– 'కిమద్యాపి మయా సహ విశ్రబ్ధం భవాన్న బ్రవీతి'? సోఽబ్రవీత్– 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' ఇతి శ్రుత్వా తయా చింతితమ్–యత్కార్యమసమీక్షితం క్రియతే తస్యేదృశ్ఫలవిపాకో భవతి' ఇతి. ఏవం విమృశ్య సవిషాదయా తయా నిస్సారితోఽసౌ.

ఆ. అంత నగర రక్షకుడైన కొత్వాలు ఏదో జారిణి (స్వైరిణి) చే సంకేతం పొందినవాడై అచ్చటికి (ఆ దేవాలయానికి) వచ్చాడు. అంతకు పూర్వమే నిద్రించెడి ఇతనిని చూచాడు. తన రహస్యం దాచేందుకై ఇలా అడిగాడు— 'తాము ఎవరు?'. అతడు చెప్పాడు— 'ప్రాప్తవ్య మర్థం లభతే మనుష్యః'- (మనుష్యుడు భాగ్యంలో ఉన్న దానిని పొందును). దానిని విని కొత్వాలు అన్నాడు- 'ఇది శూన్యమైన దేవాలయం. అందుచే ఇచ్చట (ఇచ్చటికి దగ్గర ఉండే) నా స్థానమున పోయి నిద్రింపుము'. అతడు

అటులనే అచ్చటికి పోయాడు— కాని పొరపాటున వేఱే పడకపై శయనించాడు. (ఇటు) ఆ కొత్వాలు పుత్రికయూ, అందగత్తెయూ జవరాలూ అయిన వినయవతి అనే కన్యక ఎవనినో పురుషుని ప్రేమించినదై అతనిని అచ్చటికి రావలసినదిగా సంకేతం పంపి ఆపడకపైన శయనించి ఉంది. ఆమె వచ్చిన ఇతనిని చూచింది— రాత్రియందు కటిక చీకటివల్ల 'ఇతడే ఆ నా ప్రియుడు'. అని భ్రమపడింది. లేచి భోజన వస్త్రాది సత్కారాలు చేసింది. గాంధర్వ పద్ధతిచే అతనిని వివాహమాడింది. అతనితో కలిసి ఆ శయనంపై కూర్చుండి విచ్చిన తామరవంటి మోముగలదై (ఆనందంతో) అతనితో ఇలా అంది— 'ఏమి ఇప్పటికీ తాము నాతో మనస్సు విప్పి (విశ్రబ్ధంగా) మాట్లాడరు'. అతడు ఇలా అన్నాడు— 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః'. దానిని విని ఆమె ఇలా చింతించింది— 'చక్కగా ఆలోచింపక చేసిన పనికి ఇలాంటి పరిణామం లభిస్తుంది'. ఇలా తలంచి దుఃఖంతో అతనిని వెడలగొట్టింది.

మూ. స చ యావద్వీథీమార్గేణ గచ్ఛతి తావదన్యవిషయవాసీ వరకీర్తిర్నామ వరో మహతా వాద్యశబ్దేనాఽగచ్ఛతి. ప్రాప్తవ్యమర్థోఽపి తైః సమం గన్తుమారబ్ధః. అథ యావత్ ప్రత్యాసన్నే లగ్నసమయే రాజమార్గాఽసన్నశ్రేష్ఠిగృహద్వారే రచితమండపవేదికాయాం కృతకౌతుకమఙ్గలవేషా వణిక్సుతాఽస్తి తావన్మదమత్తో హస్త్యారోహకం హత్వా ప్రణశ్యజ్జనకోలాహలేన లోకమాకులయంస్తమేవోద్దేశం ప్రాప్తః. తం చ దృష్ట్వా సర్వే వరానుయాయినో వరేణ సహ ప్రణశ్య దిశో జగ్ముః.

అ. అతడు రాజవీథిని పోవుచున్నాడు. ఇంతలో ఇతర ప్రాంత(ఇతర గ్రామ) నివాసి అయిన వరకీర్తి అనే పెండ్లి కుమారుడు గొప్ప మేళతాళాలతో ఊరేగింపుగా (ఆ వీథిలో) వస్తూన్నాడు. ప్రాప్తవ్యమర్థుడును ఆ పెండ్లి వారితో పోసాగాడు. మగ పెండ్లి వారి ఈ ఊరేగింపు లగ్నపువేళకు కొంచెం ముందుగా కళ్యాణ మండపం చేరింది. (ఇటు) పెండ్లి కూతురు శ్రీమంతుడైన శ్రేష్ఠిగారి పుత్రిక. కన్యాదాత భవనం రాజవీథిలోనే ఉంది. భవనంముందె కళ్యాణ మండపం నిర్మించారు. పెండ్లికూతురు లగ్నపు వేళకు కొంత ముందుగానే వివాహమంగళవేషంతో కళ్యాణ వేదికను చేరింది. ఇంతలో ఒక ఏనుగు మత్తిల్లి మావటివాణ్ణి చంపి (అదుపుదప్పి) చరింపసాగింది.

జనులు ప్రాణభయంతో పారిపోవడంవల్ల పెద్ద గగ్గోలు గందరగోలం చెలరేగెంది. ఇలా బీభత్సం సృష్టించి ఆ మదపుటేనుగు వివాహవేదికను సమీపించింది. దానిని గాంచి వరునిపక్షం వారు వరునితోనహ కనబడకుండ నలుదెసలకు పారిపోయారు.

మూ. అథాస్మిన్నవసరే భయతరలలోచనామేకాకినీం కన్యామవలోక్య 'మా భైషీః, అహం పరిత్రాతా'– ఇతి సుధీకం స్థిరీకృత్య దక్షిణపాణౌ సఙ్గృహ్య మహాసాహసికతయా ప్రాప్తవ్యమర్థః పరుషవాక్యైర్హస్తినం నిర్భర్త్సితవాన్. తతః కథమపి దైవయోగాదపాయే హస్తిని స సుహృద్బాన్ధవేనాతిక్రాన్తలగ్నసమయే వరకీర్తినాఽఽగత్య తావత్ తాం కన్యామన్యహస్తగతాం దృష్ట్వాఽభిహితమ్– 'భోః శ్వశుర, విరుద్ధమిదం త్వయాఽనుష్ఠితం యన్మహ్యం ప్రదాయ కన్యాఽన్యస్మై ప్రదత్తా' ఇతి. సోఽబ్రవీత్– 'భోః, అహమపి హస్తిభయపలాయితో భవద్భిః సహాఽయాతో న జానే కిమిదం వృత్తమ్. ఇత్యభిధాయ దుహితరం ప్రష్టుమారబ్ధః– 'వత్సే, న త్వయా సున్దరం కృతమ్. తత్కథ్యతాం కోఽయం వృత్తాన్తః? సాఽబ్రవీత్– 'యదహమనేన ప్రాణసంశయాద్రక్షితా, తదేనం ముక్త్వా మమజీవన్త్యా నాన్యః పాణిం గ్రహీష్యతి' ఇతి. అనేన వార్తావ్యతికరేణ రజనీ వ్యుష్టా.

అ. ఈ సందర్భంలో ప్రాప్తవ్యమర్థుడు (వేదికపై) ఒంటరిగా ఉంటునదీ, భయంచే చలించే కన్నులు గలదీ అయిన కన్యకను చూచాడు— అధిక పరాక్రమంతో 'భయపడకుము, నేను నీకు రక్షకుడను', అని ధైర్యం గల్గించాడు. ఆమె కుడిచేతిని పట్టుకున్నాడు. మిక్కిలి సాహసంతో పరుషంగా ఏనుగును బెదరించాడు. అంత ఏదో విధంగా ఏనుగు తొలగిపోయింది. వివాహలగ్నం గూడ దాటిపోయింది. అప్పుడు (పెండ్లి కుమారుడైన) వరకీర్తి మిత్రులతో బంధువులతో వచ్చాడు— పెండ్లి కూతురు చెయ్యి వేఱేవానిచేతిలో ఉండడం చూచాడు. ఇలా (మామతో) అన్నాడు— 'మామా! మీరు విరుద్ధంగా ప్రవర్తించారు. నాకు కన్యను వాగ్దానం (నిశ్చితార్థం) చేసి ఇతరునికి ఇచ్చారు'. అతడు (కన్యాపిత) ఇలా అన్నాడు— 'నేను ఏనుగు భయంతో పఱుగెత్తి పోయి మీతో బాటు వచ్చాను. ఏమి జరిగిందో తెలియదు'. ఇలా అని పుత్రికను అడుగదొడగాడు— 'బిడ్డా! నీ పని అందంగాలేదు. విషయం ఏమియో తెలుపుము'.

ఆమె ఇలా చెప్పింది— 'నేను ప్రాణాపాయస్థితిలో ఇతనిచే రక్షింపబడినాను. అందుచే నేను బ్రతికి ఉండగా వేరేవాని చెయ్యి పట్టుకొనను'. ఈ చర్చతో రాత్రి గడిచి పోయింది.

మూ. అథ ప్రాతస్తత్ర సఞ్జాతే మహాజనసముదాయే వార్తావ్యతికరం శ్రుత్వా రాజదుహితా తముద్దేశమాగతా. కర్ణపరమ్పరయా శ్రుత్వా దణ్డపాశకసుతాఽపి తత్రైవాఽగతా. అథ తం మహాజనసముదాయం శ్రుత్వా రాజాఽపి తత్రాఽజగామ. (రాజా) ప్రాప్తవ్యమర్థం ప్రాహ– 'భోః, విశ్రబ్ధం కథయ. కీదృశోఽసౌ వృత్తాన్తః?' అథ సోఽబ్రవీత్– 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' ఇతి. రాజకన్యా స్మృత్వా ప్రాహ– 'దేవోఽపి తం లఙ్ఘయితుం న శక్తః' ఇతి. తతో దణ్డపాశసుతాఽబ్రవీత్– 'తస్మాన్న శోచామి న విస్మయో మే' ఇతి. తమఖిలలోకవృత్తాన్తమాకర్ణ్య వణిక్సుతాఽబ్రవీత్– 'యదస్మదీయం న హి తత్పరేషామ్? ఇతి. తతోఽభయదానం దత్త్వా రాజా పృథక్ పృథక్ వృత్తాన్తాన్ జ్ఞాత్వాఽవగతతత్త్వస్తస్మై ప్రాప్తవ్యమర్థాయ స్వదుహితరం సబహుమానం గ్రామసహస్రేణ సమం సర్వాలఙ్కారపరివారయుతాం దత్త్వా త్వం మే పుత్రోఽసీతి నగరవిదితం తం యౌవరాజ్యేఽభిషిక్తవాన్. దణ్డపాశకేనాపి స్వదుహితా స్వశక్త్యా వస్త్రదానాదినా సమ్భావ్య ప్రాప్తవ్యమర్థాయ ప్రదత్తా.

అ. అంత తెల్లవారగనే జనులెందరో అచ్చట ప్రోగయ్యారు. ఈ విషయం విని రాజపుత్రిక ఆ ప్రదేశానికి వచ్చింది. కర్ణపరంపరగా విని దండపాశక (కొత్వాలు) పుత్రికయూ అచ్చటికి వచ్చింది. అప్పుడు ఇలా జనసముదాయం చేరడం విని రాజు కూడ అచ్చటికి వచ్చాడు. ప్రాప్తవ్యమర్థుని ఇలా అడిగాడు– 'ఓయీ, నిర్భయంగా చెప్పుము. విషయం ఏమిటి?' అందుకు అతడు చెప్పాడు– 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' (=భాగ్యంలో ఉండేదాన్ని మానవుడు పొందును). రాజపుత్రిక జ్ఞాపకం చేసికొని (స్మృతికి తెచ్చుకొని) ఇలా అంది– 'దేవోఽపి తం లఙ్ఘయితుం న శక్తః' (=దైవంకూడ దాన్ని ఆపలేడు). తర్వాత దండపాశకపుత్రిక (కొత్వాలు పుత్రిక)ఇలా

చెప్పింది– 'తస్మాన్నశోచామి న విస్మయో మే' (=అందుకు నేను దుఃఖించను, నాకు ఆశ్చర్యం లేదు.) ఈ సమాచారం అంతా విని వైశ్యపుత్రిక అంది– 'యదస్మదీయం న హి తత్ పరేషామ్' (=ఏది మనదో అది ఇతరులది కాజాలదు). అప్పుడు రాజు అభయప్రదానం చేసి విడివిడిగా విషయం అంతా తెలుసుకున్నాడు. సర్వాలంకార పరివార సమేతంగా, సగౌరవంగా వెయ్యి గ్రామాలతోబాటు తనబిడ్డను ప్రాప్తవ్యమర్థునికి ఇచ్చాడు. 'నీవు నాకు పుత్రునివంటివాడవు' అని నగరవాసుల సమక్షంలో ప్రకటించి యువరాజుగా అభిషిక్తుని జేశాడు. దండపాశకుడును శక్తికొలది వస్త్రాదికంచే సత్కరించి తన పుత్రికను ఇచ్చాడు.

మూ. అథ ప్రాప్తవ్యమర్థేనాపి స్వీయమాతాపితరౌ సమస్త కుటుమ్బావృతౌ తస్మిన్నగరే సమ్మానపురస్సరం సమానీతౌ. అథ సోఽపి స్వగోత్రేణ సహ వివిధభోగానుపభుఞ్జానః సుఖేనావస్థితః. అతోఽహం బ్రవీమి– 'ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః' ఇతి

అ. తర్వాత ప్రాప్తవ్యమర్థుడును తన తల్లిదండ్రులను సమస్తకుటుంబ సమేతంగా ఆ నగరానికి సగౌరవంగా పిలిపించుకొన్నాడు. తన బంధువులతో వివిధ భోగాలు అనుభవిస్తూ సుఖంగా ఉన్నాడు. అందుచే నేను (హిరణ్యకుడు అను నేను) చెప్పుచున్నాను–ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః'.

మూ. తదేతత్సకలం సుఖదుఃఖమనుభూయ పరం విషాదముపాగతోఽనేన మిత్రేణ త్వత్సకాశమానీతః. తదేతన్మే వైరాగ్యకారణమ్.' మన్థరక ఆహ– 'భద్ర, భవతి సుహృదయమసన్దిగ్ధం, యః క్షుత్క్షామోఽపి శత్రుభూతం త్వాం పృష్ఠమారోప్యాఽనయతి, న మార్గేఽపి భక్షయతి. ఉక్తఞ్చ–

శ్లో. వికారం యాతి నో చిత్తం విత్తే యస్య కదాచన
మిత్రం స్యాత్ సర్వకాలే చ కారయేన్మిత్రముత్తమమ్. 114

అ. ఈ సుఖదుఃఖాలను అన్నింటిని అనుభవించి మిక్కిలి దుఃఖితుడను అయ్యాను. (ఇప్పుడు) ఈ మిత్రునిద్వారా నీ వద్దకు తేబడినాను. ఇదియే నా వైరాగ్యానికి కారణం. మంథరకుడు అన్నాడు— 'శుభమూర్తీ, ఇతడు (లఘుపతనకుడు)

నీకు నమ్మదగిన (సంశయింపరాని) మిత్రుడు. ఏలననగా ఆకలిచే బాధపడుచుండియూ శత్రువూ భోజనపదార్థం అయిన నిన్ను వీపున ఎక్కించుకొని తెచ్చాడు. మార్గంలో తిన లేదు. విజ్ఞులు అన్నారు—

ఎవడు ధనం పొందినా మనస్సులో వికారం (మార్పు) ఎప్పటికీ పొందడో, సర్వావస్థలయందును (సర్వకాలాలలోను) మిత్రునిగా నిలుస్తాడో, అట్టి ఉత్తమునినే మిత్రునిగా చేసికొనవలయును. (114)

శ్లో. విద్వద్భిః సుహృదామత్ర చిహ్నైరేతై రసంశయమ్
పరీక్షాకరణం ప్రోక్తం హోమాగ్నేరివ పణ్డితైః. 115

అ. విద్వాంసులైనవారు ఈ గుర్తులద్వారా హోమాగ్నినివలె మిత్రులను సంశయరహితంగా పరీక్షించాలి అని పండితులు తెల్పారు.

మూ. తథా చ—

శ్లో. ఆపత్కాలే తు సమ్ప్రాప్తే యన్మిత్రం మిత్రమేవ తత్
వృద్ధికాలే తు సమ్ప్రాప్తే దుర్జనోఽపి సుహృద్భవేత్. 116

అ. అటులనే ఆపదవచ్చిన సమయంలోనూ ఎవడు మిత్రునిగా నిలుస్తాడో వాడే నిజమైన మిత్రుడు. తన అభివృద్ధికాలంలో దుర్జనుడును మిత్రుడు అగును.

మూ. తన్మమాప్యద్యాస్య విషయే విశ్వాసః సముత్పన్నో, యతో నీతివిరుద్ధేయం మైత్రీ మాంసాశిభిర్వాయసైః సహ జలచరాణామ్. అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. మిత్రం కోఽపి న కస్యాఽపి నితాన్తం న చ వైరకృత్
దృశ్యతే మిత్రవిధ్వస్తాత్ కార్యాద్వైరీ పరీక్షితః. 117
(దృశ్యన్తే మిత్రవిధ్వస్తాః కార్యాద్వైరివివర్ధితాః (పాఠాన్తరం)

అ. అందువల్ల నేడు నాకును ఇతని (కాకి) విషయంలో నమ్మకం కల్గింది ఏలననగా మాంసం భుజించే కాకులతో నీటిలో తిరిగేవానికి (చేపలు తాబేళ్లు మొదలైన వానికి) మైత్రి నీతివిరుద్ధం అయింది. పెద్దలు ఈ విషయంలో లెస్సగా చెప్పారు—

ఎవడు ఎవరికీ నిత్యం మిత్రుడు కాడు. అలాగే శత్రువూ కాడు

కార్యవశాన మిత్రులచే నాశనమైనవారూ, శత్రువులచే వృద్ధిపొందినవారూ కనబడు చున్నారు.(117)

మూ. తత్స్వాగతం భవతః. స్వగృహవదాస్యతామత్ర సర స్తీరే. యచ్చ విత్తనాశో విదేశవాసశ్చ సఞ్జాత స్తత్ర విషయే సన్తాపో న కర్తవ్యః. ఉక్తఞ్చ—

శ్లో. అభ్రచ్ఛాయా ఖలప్రీతిః సిద్ధమన్నఞ్చ యోషితః
కిఞ్చిత్కాలోపభోగ్యాని యౌవనాని ధనాని చ. 118

అ. కనుక నీకు స్వాగతం. ఈ చెరువు ఒడ్డున నీ యింటిలోవలె ఉండుము. ధననాశం పరస్థలనివాసం గలిగినందులకు విచారింపకుము. విజ్ఞులు అన్నారు—

మేఘముల నీడ, దుర్జనుల మైత్రి, వండిన అన్నం, స్త్రీలు, యౌవనం, ధనం ఇవన్నీ స్వల్పకాలభోగ్యాలు. స్థిరంగా ఉండవు. (118)

మూ. అత ఏవ వివేకినో జితాత్మానో ధనస్పృహాం న కుర్వన్తి. ఉక్తఞ్చ-

శ్లో. సుసఞ్చితై ర్జీవనవత్ సురక్షితై
ర్నిజేఽపి దేహే న వియోజితైః క్వచిత్.
పుంసో యమాన్తం వ్రజతోఽపి నిష్ఠురై
రేతై ర్ధనైః పఞ్చపదీ న దీయతే. 119

అ. అందువల్ల ఇంద్రియవిజేతలైన జ్ఞానులు ధనంపై ఆశనుంచరు. విజ్ఞులు అన్నారు—

బాగుగా కూడబెట్టబడినదీ, ప్రాణతుల్యంగా రక్షింపబడినదీ తన శరీర విషయంలోనూ ఎప్పుడు ఖర్చుచేయబడినదీ అయిన ఈ ధనం మిక్కిలి కఠినం అయినది. మానవుడు యమునివద్దకు పోవునప్పుడు (మరణించేటప్పుడు) అయిదు అడుగులైనా తోడుగా రాదు. (119)

మూ. అన్యచ్చ-

శ్లో. యథాఽఽమిషం జలే మత్స్యైర్భక్ష్యతే శ్వాపదై ర్భువి
ఆకాశే పక్షిభిశ్చైవ తథా సర్వత్ర విత్తవాన్. 120

అ. మరియూ. ఎలా మాంసం నీటిలో చేపలచేత, భూమిపై హింసక ప్రాణులచేత, ఆకాశంలో పక్షులచేత తినబడుతుందో అలాగే ధనవంతుడు అంతట భక్షింపబడును.

శ్లో. నిర్దోషమపి విత్తాఢ్యం దోషైర్యోజయతే నృపః
నిర్ధనః ప్రాప్తదోషోఽపి సర్వత్ర నిరుపద్రవః. 121

అ. ధనవంతుడు నిర్దోషి అయినా ప్రభువు ఏవో దోషాలు ఆరోపిస్తాడు. (దోషాలు ఆరోపించి జుల్మానారూపంగా ధనం వసూలు చేస్తాడు) ధనహీనుడు దోషాలు చేసినా ఎలాంటి ఉపద్రవాలకు పొందడు.

శ్లో. అర్థానామార్జనే దుఃఖమార్జితానాఞ్చ రక్షణే
నాశే దుఃఖం వ్యయే దుఃఖం ధిగర్థాన్ కష్టసంశ్రయాన్. 122

అ. ధనాన్ని సంపాదించడంలోనూ, సంపాదించినదాన్ని రక్షించడంలోను దుఃఖం ఉంది. ఇక చోరాదులవల్ల నశించినా ఖర్చుఅయినా దుఃఖంగలదు. ఇలా అన్ని విధాలా దుఃఖదాయకం అయిన ధనానికి ధిక్కారం.

శ్లో. అర్థార్థీ యాని కష్టాని మూఢోయం సహతే జనః
శతాంశేనాపి మోక్షార్థీ తాని చేన్మోక్షమాప్నుయాత్. 123

అ. ఈ మూర్ఖుడైన మానవుడు ధనం సంపాదించేందుకై ఎన్ని కష్టాలు సహిస్తున్నాడో, అందులో నూరవభాగం కష్టాలనైనా మోక్షం సంపాదించేందుకై భరిస్తే తప్పక మోక్షం పొందగలడు.

మూ. అపరం విదేశవాసజమపి వైరాగ్యం త్వయా న కార్యమ్. యతః—

శ్లో. కో ధీరస్య మనస్వినః స్వవిషయః కో వా విదేశః స్మృతో
యం దేశం శ్రయతే తమేవ కురుతే బాహుప్రతాపార్జితమ్,
యద్దంష్ట్రానఖలాఙ్గులప్రహరణైః సింహో వనం గాహతే
తస్మిన్నేవ హత-ద్విపేన్ద్ర-రుధిరైస్తృష్ణాం ఛినత్త్యాత్మనః. 124

అ. ధీరుడైన జ్ఞానికి స్వదేశం ఏది? విదేశం ఏది? (సమస్తం సమానమే). ఏ దేశంలో ఉండునో దానినే తన భుజబలంచే స్వాధీనం చేసుకుంటాడు. ఎట్లనగా—

సింహం తన కోరలు గోళ్లు తోక అనే ఆయుధాలతో ఏ అడవిలో ప్రవేశిస్తుందో అందే గజరాజముల సంహరిస్తుంది. వాటి రక్తంతో తన దాహం తీర్చుకుంటుంది.

మూ. అర్థహీనః పరే దేశే గతోఽపి యః ప్రజ్ఞావాన్ భవతి స కథఞ్చిదపి న సీదతి. ఉక్తఞ్చ—

శ్లో. కోఽతిభారః సమర్థానాం కిం దూరం వ్యవసాయినామ్
కో విదేశః సువిద్యానాం కః పరః ప్రియవాదినామ్. 125

అ. ధనహీనుడు పరదేశంపోయినా అతడు ప్రజ్ఞావంతుడైనచో బాధ సందడు. విజ్ఞులు అన్నారు—

సమర్థులైనవారికి మిక్కిలి భారం అయింది లేదు. ప్రయత్న శీలునకు దూర దేశం లేదు. మంచివిద్యావంతులకు పరదేశం లేదు. ప్రేమగా (మధురంగా) మాట్లాడే వారికి పరాయివాడు లేడు (అందరూ ఆత్మీయులే). (125)

మూ. తత్త్వంప్రజ్ఞానిధిర్భవాన్, న ప్రాకృతపురుషతుల్యః. అథవా—

శ్లో. ఉత్సాహసమ్పన్నమదీర్ఘసూత్రం క్రియావిధిజ్ఞం వ్యసనేష్వసక్తమ్
శూరం కృతజ్ఞం దృఢసౌహృదం చ లక్ష్మీః స్వయం మార్గతి వాసహేతోః. 126

అ. నీవు ప్రతిభలో సముద్రంవంటివాడవు. సాధారణపురుషులవంటివాడవు గావు. మరియూ

ఉత్సాహవంతుడు, దీర్ఘాలోచనలతో కార్యములందు ఆలస్యం చేయనివాడు, కార్యముల పద్ధతి తెలిసినవాడు, దుర్వ్యసనములు లేనివాడు, పరాక్రమవంతుడు, చేసిన మేలు మఱువనివాడు, స్థిరమైన మిత్రులుగలవాడు అయిన పురుషుని నివాస నిమిత్తమై లక్ష్మి స్వయంగా వెదకును (వెదుకుచూవచ్చి చేరును). (126)

మూ. అపరం ప్రాప్తోఽప్యర్థః కర్మప్రాప్త్యా నశ్యతి. తదేతావన్తి దినాని (తద్ధనం)త్వదీయమాసీత్. ముహూర్తమప్యనాత్మీయం భోక్తుం న లభ్యతే. స్వయమాగతమపి విధినాఽపహ్రియతే.

శ్లో. అర్థస్యోపార్జనం కృత్వా నైవ భోగం సమశ్నుతే
అరణ్యం మహదాసాద్య మూఢః సోమిలకో యథా. 127

హిరణ్యక ఆహ— 'కథమేతత్?' స ఆహ—

అ. మరియూ ధనం లభించినా (దుష్టప్రారబ్ధ) కర్మమునుబట్టి నశిస్తుంది. అందుచే ఇన్ని దినాలు (ఆ ధనం) నీదిగా ఉన్నది. మనదికానిది ముహూర్తకాలం గూడ అనుభవించడానికి నిలువదు. స్వయంగా వచ్చిందికూడ విధిచే నపహరింపబడుతుంది.

ధనం సంపాదించియూ గాఢారణ్యంలో గాబరాపడిన (మూఢుడైన)సోమిలకునివలె (విధి ప్రతికూలం అయితే) మానవుడు ఆ ధనాన్ని అనుభవింపలేడు. (127)

హిరణ్యకుడు అడిగాడు. 'అది ఎట్లు'? అతడు (మంథరకుడు) అన్నాడు—

## కథా-7

## మన్దభాగ్య సోమిలక-కథా

మూ. కస్మింశ్చిదధిష్ఠానే సోమిలకో నామ కౌలికో వసతి స్మ. స చానేకవిధ-పట్ట-రచనారఞ్జితాని పార్థివోచితాని సదైవ వస్త్రాణ్యుత్పాదయతి. పరం తస్య చానేకవిధపట్టరచనానిపుణస్యాపి న భోజనాచ్ఛాదనాభ్యధికం కథ మప్యర్థమాత్రం సమ్పద్యతే. అథాన్యే యత్ర సామాన్యకౌలికాః స్థూలవస్త్ర-సమ్పాదన-విజ్ఞానినో మహర్ధిసమ్పన్నాః. తానవలోక్య స్వభార్యా మాహ- 'ప్రియే పశ్యైతాన్ స్థూల-పట్ట-కారకాన్ ధనకనకసమృద్ధాన్. తద ధారణకం మమైతత్ స్థానమ్. తదన్యత్రోపార్జనాయ గచ్ఛామి'. సా ప్రాహ- 'భోః ప్రియతమ! మిథ్యాప్రలపితమేతద్యదన్యత్ర గతానాం ధనం భవతి, స్వస్థానే న భవతీతి. ఉక్తఞ్చ-

శ్లో. ఉత్పతన్తి యదాకాశే నిపతన్తి మహీతలే
పక్షిణాం తదపి ప్రాప్త్యా నాదత్తముపతిష్ఠతి. 128

అ. ఒకానొక నగరంలో సోమిలకుడు అనే సాలెవాడు గలడు. అతడు నానా విధములైన నేత పద్ధతుల నెఱింగి ఎంతో అందంగా వస్త్రములు తయారు చేసేవాడు. మహారాజులకునూ అతని వస్త్రాలు ధారణయోగ్యాలై ఉండేవి. కాని ఇలా బహువిధ వస్త్రనిర్మాణ నిపుణుడైనా అతనికి తిండికి గుడ్డకు మించి ధనం లభించేది గాదు. మంద మైన (ముతక) వస్త్రములునేసే తెలివిగల మామూలు సాలెవాండ్లు ఘన కనక

సమృద్ధులై ఉన్నారు. అదిగాంచి అతడు భార్యతో ఇలా అన్నాడు-'ప్రియురాలా!ముతక గడ్డలు నేసే వీరు (ఎంత) ధనకనక సమృద్ధులై ఉన్నారో చూడుము. కనుక నాకు ఈ స్థలం సరిగా లేదు. అందుచే వేఱేచోటకు సంపాదనకై పోయెదను. దానిని విని ఆమె ఇలా అంది- 'ఓ ప్రియతమా! ఇతర స్థలం పోయినవారికి ధనం లభిస్తుంది. స్వస్థానం లో లభింపదు అనడం మిథ్యయైనమాట. విజ్ఞులు అన్నారు—

ఆకాశంలో ఎగిరే పక్షులు భూమిపై పడుచూన్నాయి. ఇదంతా వాని ప్రారబ్ధ ప్రాప్తి. పెట్టనిది (పూర్వజన్మలో ఇవ్వనిది) ఏదీ లభింపదు. (128)

మూ. తథా చ-

శ్లో. న హి భవతి యన్న భావ్యం భవతి చ భావ్యం వినాఽపి యత్నేన
కరతలగతమపి నశ్యతి యస్య తు భవితవ్యతా నాస్తి. 129

అ. ఏది సంభవింపకూడదో అది సంభవింపదు. ఏది సంభవింపవలయునో అది ప్రయత్నం లేకపోయినా సంభవిస్తుంది. భాగ్యంలో లేనిది చేతికి వచ్చినా నశిస్తుంది.

శ్లో. యథా ధేనుసహస్రేషు వత్సో విన్దతి మాతరమ్
తథా పురాకృతం కర్మ కర్తారమనుగచ్ఛతి. 130

అ. ఎలా వెయ్యి ఆవులు ఉన్నా దూడ తన తల్లిని (గుర్తించి) చేరుతుందో అలాగే పూర్వజన్మ కర్మ మానవుని వెంట వస్తుంది.

శ్లో. శేతే సహ శయానేన గచ్ఛన్తమనుగచ్ఛతి
నరాణాం ప్రాక్తనం కర్మ తిష్ఠేత్ త్వథ సహాఽఽత్మనా. 131

అ. మానవులకును పూర్వజన్మ కర్మ నిత్యం ఆత్మతో అంటిఉంటుంది. శయనించినచో శయనించును. పోవుచుండినచో వెంటపోవును (విడిచిపెట్టదు).

శ్లో. యథా ఛాయాఽఽతపౌ నిత్యం సుసమ్బద్ధౌ పరస్పరమ్
ఏవం కర్మ చ కర్తా చ సంశ్లిష్టావితరేతరమ్. 132

తస్మాదత్రైవ వ్యవసాయపరో భవ.'

అ. ఎలా నీడ ఎండ ఈ రెండూ పరస్పరం నిత్యం పూర్తిగా కలిసి (బంధితములై)ఉండునో అలాగే కర్మ దానికర్తయైన మానవుడు పూర్తిగా విడదీయరాని

విధంగా కలిసి ఉందురు. (132)

అందుచే ఇచ్చటనే వ్యాపారం (వృత్తిని) శ్రద్ధగా చేయుము.

మూ. కౌలిక ఆహ– ప్రియే న సమ్యగభిహితం భవత్యా. వ్యవసాయం వినా కర్మ న ఫలతి. ఉక్తఞ్చ-

శ్లో. యథైకేన హస్తేన తాలికా న సమ్ప్రపద్యతే
తథోద్యమపరిత్యక్తం న ఫలం కర్మణః స్మృతమ్. 133

అ. సాలెవాడు ఇలా అన్నాడు– 'ప్రియురాలా! నీవు చెప్పింది సరిగాలేదు. ప్రయత్నం లేనిచో కర్మ ఫలింపదు. పెద్దలు అన్నారు—

ఒకచేతితో తాళం వాగదు. అలాగే ప్రయత్నంలేనిచో కర్మకు ఫలం లభింపదు.(133)

శ్లో. పశ్య కర్మవశాత్ప్రాప్తం భోజ్యకాలేఽపి భోజనమ్
హస్తోద్యమం వినా వక్త్రే ప్రవిశేన్న కథఞ్చన. 134

అ. చూడుము. భోజనసమయాన పూర్వకర్మవశాన లభించిన భోజనం కూడ చేతితోడి వ్యాపారంలేక ఏ విధంగానూ నోటిలోనికి పోదు.

మూ. తథా చ–

శ్లో. ఉద్యోగినం పురుషసింహముపైతి లక్ష్మీ
ర్దైవం హి దైవమితి కాపురుషా వదన్తి.
దైవం నిహత్య కురు పౌరుషమాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః. 135

అ. అటులనే ప్రయత్నశీలుడైన పురుషశ్రేష్ఠుని లక్ష్మి(స్వయంగా) చేరును. పిరికివారు దైవం దైవం అని పల్కుచుందురు. దైవాన్ని వదలివేసి శక్తికొలది పురుషార్థానికి యత్నింపుము. ప్రయత్నం చేసినా లభింపకపోయినచో అందు నీ దోషం ఏముంది?

మూ. తథా చ–

శ్లో. ఉద్యమేన హి సిద్ధ్యన్తి కార్యాణి న మనోరథైః
న హి సింహస్య సుప్తస్య ప్రవిశన్తి ముఖే మృగాః. 136

అ. అటులనే ప్రయత్నంచేతనే కార్యములు సిద్ధిస్తాయి. (కేవలం) కోరికచే గాదు. నిద్రించే సింహంనోటిలో మృగాలు ప్రవేశింపవుగదా!

శ్లో. ఉద్యమేన వినా రాజన్ న సిద్ధ్యన్తి మనోరథాః
కాతరా ఇతి జల్పంతి యద్భావ్యం తద్భవిష్యతి. 137

అ. ఓ రాజా! ప్రయత్నంలేక కోరికలు నెఱవేరవు. 'ఏది కావలయునో అది అగును'- అని సోమరులు (పిరికివారు) పల్కుదురు.

శ్లో. స్వశక్త్యా కుర్వతః కర్మ న చేత్ సిద్ధిం ప్రయచ్ఛతి
నోపాలభ్యః పుమాంస్తత్ర దైవాంతరితపౌరుషః. 138

అ. తనశక్తిని అనుసరించి పనిచేసే పురుషుడు కార్యసిద్ధి నందనిచో ఆతనిని నిందింపరాదు. అచ్చట అతని పురుషప్రయత్నం దైవంచే (భాగ్యంచే) చెడ గొట్టబడింది.

మూ. తన్మయాఽవశ్యం దేశాన్తరం గన్తవ్యమ్.' ఇతి నిశ్చిత్య వర్ధమానపురం గతః. తత్ర చ వర్షత్రయం స్థిత్వా సువర్ణశతత్రయోపార్జనం కృత్వా భూయః స్వగృహం ప్రస్థితః. అథార్ధపథే గచ్ఛతస్తస్య కదాచిదటవ్యాం పర్యటతో భగవాన్ రవిరస్తముపాగతః. తదాఽసౌ వ్యాలభయాత్ స్థూలతరవటస్కన్ధమారుహ్య యావత్ ప్రసుప్తస్తావన్నిశీథే స్వప్నే ద్వౌ పురుషౌ రౌద్రాకారౌ పరస్పరం ప్రజల్పన్తావశృణోత్.

అ. అందువల్ల నేను తప్పక దేశాన్తరం వెళ్లవలయును. ఇలా నిశ్చయించి వర్ధమానపురం వెళ్లాడు. అచ్చట మూడు సంవత్సరాలు ఉన్నాడు. మూడువందల బంగారునాణెములు సంపాదించాడు. మరల తన యింటికి ప్రయాణమైనాడు. మార్గంలో (సుమారు) సగందూరం పోగా ఒకచోట అడవివచ్చింది. ఆ అడవిలో ప్రయాణం చేస్తుండగా భగవానుడైన సూర్యుడు అస్తమించాడు. అప్పుడు ఏనుగు మొదలైన జంతువుల భయంవల్ల పెద్దమఱ్ఱి చెట్టుబోదెను ఎక్కి (అచ్చట) నిద్రించాడు. అర్ధరాత్రంలో కలవచ్చింది. ఆ కలలో భయంకరరూపులైన ఇరువురు పురుషులు పరస్పరం సంభాషించడం విన్నాడు-

మూ. తత్రైకః ప్రాహ– 'భోః కర్తః, త్వం కిం సమ్యఙ్న వేత్సి? యదస్య సోమిలకస్య భోజనాచ్ఛాదనాభ్యధికా సమృద్ధిర్నాస్తి. తత్కిం త్వయాఽస్య సువర్ణశతత్రయం ప్రదత్తమ్? స ఆహ– 'భోః కర్మన్! మయాఽవశ్యం దాతవ్యం వ్యవసాయినామ్. తత్ర చ తస్య పరిణతిస్త్వదాయత్తా' ఇతి. అథ యావదసౌ కౌలికః ప్రబుద్ధః సువర్ణగ్రన్థిమవలోకయతి తావద్రిక్తం పశ్యతి. తతః సాక్షేపం చిన్తయామాస– అహో, కిమేతత్? మహతా కష్టేనోపార్జితం విత్తం హేలయా క్వాపి గతమ్. తద్వ్యర్థశ్రమోఽకిఞ్చనః కథం స్వపత్న్యా మిత్రాణాం చ ముఖం దర్శయిష్యామి, ఇతి నిశ్చిత్య తదేవ పత్తనం గతః.

అ. వారిలో ఒకడు (కర్మాధిష్ఠానదేవత) అన్నాడు–'ఓకర్తా! ఈసోమిలకుని భాగ్యంలో తిండికి గుడ్డకు మించి అధికమైన సంపద లేదు అనే విషయం నీవు సరిగా గుర్తింపలేదు. అందువల్లనే ఇతనికి నీవు మూడువందల బంగారు నాణెములు ఇచ్చావు.' అతడు (కర్తృత్వాధిష్ఠానదేవత) అన్నాడు– 'ఓకర్మా? నేను తప్పక ప్రయత్నపరులకు ఇవ్వాలి. ఆమీదట దాని పరిణామం (అదిఉండటం–తొలగిపోవడం) నీఅధీనంలో ఉంది' ఇలా కలగాంచి కౌలికుడు (సాలెవాడు) మేల్కొన్నాడు. బంగారునాణెముల నంచిని చూచాడు. అది ఖాళీగా ఉంది. అప్పుడు అతడు తన దురదృష్టానికి ఇలా విచారించాడు– 'అయ్యో! ఇది ఏమిటి? ఎంతో కష్టపడి సంపాదించిన ధనం తేలికగా (అకస్మాత్తుగా) ఎక్కడికో పోయింది. శ్రమ అంతా వ్యర్థం అయింది. దరిద్రుణ్ణి అయ్యాను. భార్యకు మిత్రులకు ముఖం ఎలా చూపగలను? ఇలా తలంచి (మరల) ఆ నగరమే వెళ్లాడు.

మూ. తత్ర చ వర్షమాత్రేణైవ సువర్ణశతపఞ్చకముపార్జ్య భూయోఽపి స్వస్థానం ప్రతి ప్రస్థితః. యావదర్ధపథే భూయోఽటవీగతస్య భగవాన్ భానురస్తం జగామ. అథ సువర్ణనాశభయాత్ సుశ్రాన్తోఽపి న విశ్రామ్యతి. కేవలం కృతగృహోత్కణ్ఠః సత్వరం వ్రజతి. అత్రాన్తరే ద్వౌ పురుషౌ తాదృశౌ దృష్టిదేశే సమాగచ్ఛన్తౌ జల్పన్తౌ చాశృణోత్. తత్రైకః ప్రాహ– 'భోః కర్తః కిం త్వయైతస్య సువర్ణశతపఞ్చకం ప్రదత్తమ్. తత్కిం న వేత్సి, యద్భోజనాచ్ఛాదనాభ్యధికమస్య న కిఞ్చిన్నాస్తి'. స ఆహ– 'భోః కర్మన్!

మయాఽవశ్యం దేయం వ్యవసాయినామ్. తస్య పరిణామ స్త్వదాయ త్తః. తత్కిం మాముపాలభసి? తచ్ఛ్రుత్వా సోమిలకో యావద్గ్రన్థిమవలోకయతి తావత్సు వర్ణం నా స్తి,

ఆ. అప్పుడు ఒక్క సంవత్సరంలోనే అయిదువందల బంగారు నాణెలు సంపాదించాడు. మరల స్వస్థానానికి బయలుదేరాడు. సగందారిలో మరల అడవిలో ప్రయాణం చేస్తూండగా భగవానుడైన సూర్యుడు అస్తమించాడు. అయినా 'ధనం పోవును'— అనే భయంతో మిక్కిలి అలసిఉన్నా అతడు విశ్రమింపలేదు. కేవలం ఇల్లు చేరాలనే ఉత్కంఠతో వేగంగా పోవుచుండెను. ఇంతలో ఇరువురు పురుషులు అలాంటివారే (వెనుకస్వప్నంలో చూచినట్టివారు) ఎదురుగా వస్తూండడం చూచాడు. వారు ఇలా పరస్పరం మాట్లాడుకొనడం విన్నాడు కూడ. వారిలో ఒకడు (కర్మాధిష్ఠానదేవత) ఇలా అన్నాడు— 'ఓకర్తా! నీవు ఎందుకు ఇతనికి ఇచ్చావు. తిండికి గుడ్డకుమించి అధికం కొంచెం గూడ ఇతనికి (భాగ్యంలో) లేదు.' అతడు (కర్తృత్వాధిష్ఠానదేవత) ఇలా సమాధానం చెప్పాడు- 'ఓకర్మా! ప్రయత్న తత్పరులకు నేను తప్పక ఇవ్వాలి. దాని పరిణామం అనగా ఉండడం పోవడం నీఆధీనంలో ఉంది. కనుక ఎందుకు నన్ను నిందిస్తావు?. దానిని విని సోమిలకుడు (బంగారు) మూటను చూచుకున్నాడు. అందులో బంగారం లేదు.

మూ. తతః పరం దుఃఖమాపన్నో వ్యచి న్తయత్— 'అహో కిం మమ ధనరహితస్య జీవితేన? యదత్ర వటవృక్ష ఆత్మానముద్బధ్య ప్రాణాం స్త్యజామి. ఏవం నిశ్చిత్య దర్భమయీం రజ్జుం విధాయ స్వకణ్ఠే పాశం నియోజ్య శాఖాయా మాత్మానం నిబధ్య యావత్ ప్రక్షిపతి తావదేకః పుమానాకాశస్థ ఏవేదమాహ— 'భో భోః సోమిలక, మైవం సాహసం కురు. అహం తే వి త్తాపహారకః. న తే భోజనాఽచ్ఛాదికాభ్యధికాం వరాటికామపి సహామి. తద్గచ్ఛ స్వగృహం ప్రతి. అన్యచ్చ భవదీయసాహసేనాహం తుష్టః తథా మే న స్యాద్వ్యర్థం దర్శనమ్. తత్ ప్రార్థ్యతామభీష్టో వరః కశ్చిత్? సోమిలక ఆహ— 'యద్యేవం తద్దేహి మే ప్రభూతం ధనమ్. స ఆహ— 'భోః కిం కరిష్యసి? భోగరహితేన ధనేన యత స్తవ భోజనాఽచ్ఛాదనాభ్యధికప్రా ప్తిరపి నా స్తి. ఉ క్తఞ్చ—

శ్లో. కిం తయా క్రియతే లక్ష్మ్యా యా వధూరివ కేవలా
యా న వేశ్యేవ సామాన్యా పథికైరుపభుజ్యతే. 139

అ. అంతట మిక్కిలి దుఃఖంపొంది ఇలా విచారించాడు_ అయ్యో! ధనం లేని నేను జీవించడం ఎందులకు? ఈమర్రిచెట్టుకు ఉరిపోసుకొని చస్తాను.' ఇలా నిశ్చయించుకొని దర్భలతో త్రాడు తయారుచేసికొన్నాడు. తనమెడకు (ఒకప్రక్కన) ఉచ్చుగా బిగించుకొన్నాడు. ఇంకొక కొనను చెట్టుకొమ్మకు బంధించాడు. బిగువుగా చేసికొని దుముకడానికి సిద్ధపడినాడు. కాని ఇంతలో ఒక పురుషుడు ఆకాశంలో ఉండియే ఇలా అన్నాడు_ 'ఓ సోమిలక! ఇలా సాహసం చేయవద్దు. నేను నీధనంహరించినవాడను నీకు తిండికి గుడ్డకు మించి అధికం ఒక గవ్వగూడ ఉండడం సహింపను. అందుచే నీఇంటికి పొమ్ము. మరియూ నేను నీసాహసంచే సంతోషం పొందాను. అలాగే నాదర్శనం వ్యర్థంగాదు. కనుక నీకు ఇష్టం అయిన వరం ఏదేని కోరుకొనుము. (దానిని విని) సోమిలకుడు అన్నాడు-' అలా అయితే అధికంగా ధనం ఇమ్ము. అతడు అన్నాడు- 'ఓయీ! భోగరహితం అయిన (ఉపయోగానికిరాని) ధనంచే ఏమిచేస్తావు? ఏలననగా- నీకుతిండికి గుడ్డకు మించి అధికధనప్రాప్తి లేదు. విజ్ఞులు అన్నారు—

కేవలం భార్యవలె ఉండేధనంచే (లక్ష్మిచే)ఏమిలాభం ఉంది? (ఒకరికే ఉపయోగపడుతుంది) వేశ్యవలె సర్వసామాన్యంఅయి బాటసారులకు ఉపయోగపడునట్లు ఉండాలి. (139)

మూ. సోమిలక ఆహ— 'యద్యపి తస్య ధనస్య భోగో నాస్తి, తథాపి తద్భవతు. ఉక్తఞ్చ—

శ్లో. కృపణోఽప్యకులీనోఽపి సజ్జనైర్వర్జితః సదా
సేవ్యతే స నరో లోకే యస్య స్యాద్విత్తసఞ్చయః. 140

అ. సోమిలకుడు అన్నాడు- '(భాగ్యంతో) ఆ ధనానికి అనుభవించడం లేనట్లు ఉన్నా ఆ ధనం కావాలి(నాకు). విజ్ఞులు అన్నారు—

ఎవనివద్ద ధనరాశి ఉంటుందో, వాడు లోభి అయినా, కులహీనుడు అయినా సజ్జనులచే విడువబడినవాడైనా జనులు అతనిని సేవిస్తారు. (140)

మూ. తథా చ-

శ్లో. శిథిలౌ చ సుబద్ధౌ చ పతతః పతతో న వా
నిరీక్షితౌ మయా భద్రే దశవర్షాణి పఞ్చ చ. 141

పురుష ఆహ- 'కథమేతత్? సోఽబ్రవీత్-

అ. అటులనే- ఓశుభమూర్తీ! నేను పదునైదు ఏండ్లవరకు త్రేలాడేవీ, కాని బాగుగా బంధింపబడినవీ అయిన (ఎద్దు) వృషణాలను జారిపడునో పడవో నిరీక్షించాను (141)

పురుషుడు అడిగాడు-'అది ఏట్లు'?
అతడు ఇలాచెప్పాడు-

## కథా-8

## వృషభానుగశృగాల-కథా

మూ. కస్మింశ్చిదధిష్ఠానే తీక్ష్ణవిషాణో నామ మహావృషభః ప్రతివసతి స్మ. స చ మదాతిరేకాత్ పరిత్యక్తనిజయూథః శృఙ్గాభ్యాం నదీతటాని విదారయన్ స్వేచ్ఛయా మరకతసదృశాని శష్పాణి భక్షయన్నరణ్యచరో బభూవ. అథ తత్రైవ వనే ప్రలోభకో నామ శృగాలః ప్రతివసతి స్మ. స కదాచిత్ స్వభార్యయా సహ నదీతీరే సుఖోపవిష్టస్తిష్ఠతి. అత్రాన్తరే స తీక్ష్ణవిషాణో జలార్థం తదేవ పులినమవతీర్ణః. తతశ్చ తస్య లమ్బమానౌ వృషణావవలోక్య శృగాల్యా శృగాలోఽభిహితః. 'స్వామిన్! పశ్యాస్య వృషభస్య మాంసపిణ్డౌ లమ్బమానౌ యథా స్థితౌ. తదేతౌ క్షణేన ప్రహరేణ వా పతిష్యతః. ఏవం జ్ఞాత్వా భవతా పృష్ఠానుయాయినా భావ్యమ్.' శృగాల ఆహ- 'ప్రియే, న జ్ఞాయతే కదాచిదేతయోః పతనం భవిష్యతి వా న వా. తత్కిం వృథా శ్రమాయ మాం నియోజయసి? అత్రస్థస్తావజ్జలార్థమాగతాన్ మూషకాన్ భక్షయిష్యామి సమం త్వయా మార్గోఽయం యతస్తేషామ్. అపరం యది త్వాం ముక్త్వాఽస్య తీక్ష్ణవిషాణస్య వృషభస్య పృష్ఠే గమిష్యామి, తదాఽఽగత్యాన్యః కశ్చిదేతత్స్థానం సమాశ్రయిష్యతి. నైతద్యుజ్యతే కర్తుమ్. ఉక్తఞ్చ-

శ్లో. యో ధ్రువాణి పరిత్యజ్య అధ్రువాణి నిషేవతే
ధ్రువాణి తస్య నశ్యన్తి అధ్రువం నష్టమేవ చ. 142

అ. ఒకానొకచోట తీక్ష్ణవిషాణుడు (వాడికొమ్ములు గలవాడు) అనే గొప్ప ఎద్దు నివసించుచుండెను. అది మదాధిక్యంవల్ల తనగుంపును వదలిపెట్టింది నదీతీరాలను కొమ్ములతో చీల్చుచు మరకతమణులవలె విరాజిల్లే గరికను తింటూ అరణ్యసంచారి అయినది. ఆ అడవిలోనే ప్రలోభకుడు అనే నక్క నివసిస్తూ ఉంది. అది ఒకనాడు తన భార్యతో నదీతీరాన సుఖంగా కూర్చొనిఉంది. ఇంతలో ఆ తీక్ష్ణవిషాణుడు నీటికై ఆ ఇసుక తిన్నెపై దిగాడు. అప్పుడు దాని వ్రేలాడే రెండువృషణాలను చూచి ఆడునక్క మగనక్కతో ఇలా అంది— 'స్వామీ! ఈఎద్దుయొక్క వ్రేలాడే మాంసపిండాలు రెండు ఎలా ఉన్నాయో చూడుము అందుచే ఇవి క్షణంలోగానీ జాములో (మూడుగంటల్లో) గాని పడిపోతాయి ఇలా తెలిసికొని తాము దానివెనుక పోవాలి' మగనక్క అంది— 'ప్రియురాలా! ఇవి ఎప్పటికైనా పడేదీ లేనిదీ తెలియదు. అలాంటప్పుడు ఎందుకునన్ను వ్యర్థమైన శ్రమకు నియోగిస్తున్నావు? ఇచ్చట ఉండి నీటికివచ్చే ఎలుకలను నీతోబాటు భుజిస్తాను. ఏలనన- ఇది వాటి(ఎలుకల)దారి. మఱియూ నిన్ను వదలి ఈతీక్ష్ణ విషాణునివెంట పోయినచో అప్పుడు మఱియొకడు వచ్చి ఈచోటు ఆశ్రయిస్తాడు. ఇది చేయడం యుక్తం గాదు! విజ్ఞులుఅన్నారు—

ఎవడు ధ్రువములను (నిశ్చితంఅయినవాటిని) వదలి అధ్రువాలను సేవిస్తాడో, వానిధ్రువాలు నశిస్తాయి. అధ్రువం (మొదటినుండి)నశించినదియేగదా! (142)

మూ. శృగాల్యాహ— 'భోః కాపురుష స్త్వమ్. యత్కిఞ్చిత్ ప్రాప్తం తేనాపి సన్తోషం కరోషి. ఉక్తఞ్చ—

శ్లో. సుపూరా స్యాత్ కునదికా సుపూరా మూషకాఞ్జలిః
సుసన్తుష్టః కాపురుషః స్వల్పకేనాపి తుష్యతి. 143

అ. ఆడునక్క అన్నది— 'ఓయీ, నీవు నీచపురుషుడవు. ఏలనన లభించిన అల్పంతోనే సంతుష్టుడవగుచున్నావు. విజ్ఞులు అన్నారు—

చిన్నవాగు కొద్దినీటితోనే నిండిపోతుంది. ఎలుకదోసిలి అల్పవస్తువులతో నిండిపోతుంది. నీచపురుషుడు అల్పలాభం తోనే మిక్కిలిసంతోషం పొందుతాడు (143)

మూ. తస్మాత్ పురుషేణ సదైవోత్సాహవతా భావ్యమ్. ఉక్తఞ్చ—

శ్లో. యత్రోత్సాహసమారమ్భో యత్రాలస్యవిహీనతా
నయ-విక్రమ-సంయోగస్తత్ర శ్రీరచలా ధ్రువమ్. 144

అ. అందువల్ల పురుషుడు నిత్యం ఉత్సాహవంతుడై ఉండాలి. విజ్ఞులు అన్నారు—

ఎచ్చట ఉత్సాహంతో కార్యారంభం, సోమరితనం లేకపోవడం, నీతివిక్రమ సంయోగం ఉంటాయో, అచ్చట లక్ష్మి (సంపద) స్థిరంగా ఉంటుంది (144)

శ్లో. తద్దైవమితి సఞ్చిన్త్య త్యజేన్నోద్యోగమాత్మనః
అనుయోగం వినా తైలం తిలానాం నోపజాయతే. 145

అ. అది భాగ్యాధీనం అని తలంచి తన (పురుష) ప్రయత్నం విడువరాదు. మర్దనం చేయకపోతే నువ్వులనుండి నూనెరాదు.

మూ. అన్యచ్చ-

శ్లో. యస్స్తోకేనాపి సన్తోషం కురుతే మన్దధీర్జనః
తస్య భాగ్యవిహీనస్య దత్తా శ్రీరపి మార్జ్యతే. 146

అ. మఱియూ- ఏమందబుద్ధియైన మానవుడు అల్పంతోనే సంతుష్టుడు అగునో, అట్టిభాగ్యవిహీనునికి లభించిన సంపదకూడ తుడిచిపెట్టుకొని పోవును.

శ్లో. కృతనిశ్చయినో వన్ద్యా తుఙ్గిమా న ప్రశస్యతే
చాతకః కో వరాకోఽయం యస్యేన్ద్రో వారివాహకః. 147

అ. స్థిరమైన నిశ్చయం గలవారు వందనీయులు. (కార్యశూరతలేని) గొప్పతనం ప్రశంసార్హంగాదు. దీనమైన చాతకపక్షి ఏపాటిది. (కాని దృఢనిశ్చయం కారణంగా) ఇంద్రుడు దానికి నీరు ఇచ్చుచున్నాడు.

మూ. అపరం మూషకమాంసస్య నిర్విణ్ణాఽహమ్. ఏతౌ చ మాంసపిణ్డౌ పతనప్రాయౌ దృశ్యేతే. తత్ సర్వథా నాన్యథా కర్తవ్యమ్ ఇతి. అథాసౌ తదాకర్ణ్య మూషకప్రాప్తిస్థానం పరిత్యజ్య తీక్ష్ణవిషాణస్య పృష్ఠమన్వగచ్ఛత్. అథవా సాధ్విదముచ్యతే-

శ్లో. తావత్ స్యాత్ సర్వకృత్యేషు పురుషోఽత్ర స్వయం ప్రభుః
స్త్రీవాక్యాఙ్కుశవిక్షుణ్ణో యావన్నో ధ్రియతే బలాత్. 148

అ. మరియూ ఎలుకల మాంసం తిని తిని వెగటు చెందాను. ఈ రెండు మాంస పుముద్దలు పడడానికి సిద్ధంఅయి ఉన్నాయి. కనుక అన్నివిధాల వేఱుగా చేయవద్దు.' అంత ఆ మగనక్క దానిని విని ఎలుకలు దొరికేచోటు వదిలివేసింది— తీక్ష్ణవిషాణుని (ఎద్దు)వెనుక తిరుగసాగింది. పెద్దలు ఈవిషయం తెన్నగా చెప్పారు—

ఈ ప్రపంచంలో స్త్రీవాక్యం అనే అంకుశంచే పొడువబడినవాడై బలాత్కారంగా దారి మళ్ళింపబడేటంతవరకు పురుషుడు సర్వకార్యాలయందు స్వయం ప్రభువుగా (స్వతంత్రునిగా) ఉంటాడు. (148)

శ్లో. అకృత్యంం మన్యతే కృత్యమగమ్యం మన్యతే సుగమ్
అభక్ష్యం మన్యతే భక్ష్యం స్త్రీవాక్యప్రేరితో నరః. 149

మూ. ఏవం స తస్య పృష్ఠతః సభార్యః పరిభ్రమంశ్చిరకాలమనయత్. న చ తయోః పతనమభూత్. తతశ్చ నిర్వేదాత్ పఞ్చదశే వర్షే శృగాలః స్వభార్యామాహ— 'శిథిలౌ చ సుబద్ధౌ చ' ఇత్యాది. తయోస్తత్పశ్చాదపి పాతో న భవిష్యతి. తత్తదేవ స్వస్థానం గచ్ఛావః'. అతోఽహం బ్రవీమి—'శిథిలౌ చ సుబద్ధౌ చ' ఇతి.

అ. ఇలా ఆ నక్క ఆ ఎద్దువెనుక భార్యతోపాటు తిరుగుచు చాలాకాలం గడిపింది. ఆ వృషణాలు పడడం సంభవించలేదు. అప్పుడు విరక్తితో పదునైదవ యేట మగనక్క తనభార్యతో ఇలా అంది— 'శిథిలౌ చ సుబద్ధౌ చ' ఇత్యాది (శిథిలాలు అయినా బాగుగా బంధింపబడిఉన్నాయి- ఇత్యాది) 'ఈ రెండు అండకోశాలకు (వృషణాలకు) ఇకమీదటకూడ పతనం సంభవింపదు. అందువల్ల ఆచోటికే పోవుదము.' కనుక నేను (సోమిలకుడను) చెప్పుచున్నాను—'శిథిలౌ చ సుబద్ధౌ చ' (141 శ్లోకభావం చూడుడు)

మూ. పురుష ఆహ— 'యద్యేవం తద్గచ్ఛ భూయోఽపి వర్ధమానపురమ్. తత్ర ద్వౌ వణిక్పుత్రౌ వసతః. ఏకో గుప్తధనః, ద్వితీయ ఉపభుక్తధనః. తతస్తయోః స్వరూపం బుద్ధ్వైకస్య వరః ప్రార్థనీయః. యది తే ధనేన ప్రయోజనమభక్షితేన, తతస్త్వామపి గుప్తధనం కరోమి. అథవా దత్తభోగ్యేన ధనేన తే ప్రయోజనం తదుపభుక్తధనం కరోమి' ఇతి. ఏవముక్త్వాఽదర్శనం గతః.

ఆ. పురుషుడు (కర్మాధిష్ఠానపురుషుడు) ఇలా అన్నాడు— ఇలా అయితే మరల వర్ధమానపురం పొమ్ము. అక్కడ ఇద్దరు వైశ్యపుత్రులు నివసిస్తున్నారు. ఒకని పేరు గుప్తధనుడు. రెండవవానిపేరు ఉపభుక్తధనుడు. ఆ ఇరువురి స్వరూపం (ధనం దాచడం-ధనం అనుభవించడం) గ్రహించి ఒకరిని ఎన్నుకొనుము. అనుభవంలేని ధనం ఉపయోగకరంగా ఎంతువేని నిన్ను గుప్తధనుని చేస్తాను. అలాకాక దత్తభోగ్యమైన (దానంచేయడం అనుభవించడం గల) ధనం ఉపయోగంగా భావింతువేని ఉపభుక్తధనుని చేస్తాను" ఇలాపల్కి అదృశ్యమైనాడు.

మూ. సోమిలకోఽపి విస్మితమనా భూయోఽపి వర్ధమానపురం గతః. అథ సన్ధ్యాసమయే శ్రాన్తః కథమపి తత్పురం ప్రాప్తో గుప్తధనగృహం పృచ్ఛన్ కృచ్ఛ్రాల్లబ్ధ్వాఽస్తమితసూర్యే ప్రవిష్టః. అథాసౌ భార్యాపుత్రసమేతేన గుప్తధనేన నిర్భర్త్స్యమానో హఠాత్ గృహం ప్రవిశ్యోపవిష్టః. తతశ్చ భోజనవేలాయాం తస్యాపి భక్తివర్జితం కిఞ్చిదశనమ్ దత్తమ్. తతశ్చ భుక్త్వా తత్రైవ యావత్ సుప్తో నిశీథే పశ్యతి తావత్ తావపి ద్వౌ పురుషౌ మన్త్రయతః. తత్రైకః ప్రాహ— 'భోః కర్తః, కిం త్వయాఽస్య గుప్తధనస్యాన్యోఽధికో వ్యయో నిర్మితో, యత్ సోమిలకస్యానేన భోజనం దత్తమ్, తదయుక్తం త్వయా కృతమ్' స ఆహ— 'భోః కర్మన్, న మమాత్ర దోషః. మయా పురుషస్య లాభప్రాప్తిర్దాతవ్యా. తత్పరిణతిః పునస్త్వదాయత్తా' ఇతి.

అ. సోమిలకుడును(దానిని విని)ఆశ్చర్యం పొందాడు. మరల వర్ధమానపురం వెళ్లాడు సాయంసంధ్యావేళ అయింది. అలసిపోయాడు. కష్టంమీద నగరం చేరాడు— గుప్తధనుని యిల్లు (ఎక్కడ అని) అడుగుచూ, శ్రమపడి యిల్లును సమీపించాడు— సూర్యుడు అస్తమింపగా (ఇంట్లో) ప్రవేశించాడు. గుప్తధనుడు భార్యాపుత్రసమేతంగా ఇతనిని (లోనికిరాకుండా) బెదిరించాడు. అయినా ఇతడు హఠాత్తుగా చొరబడి కూర్చున్నాడు (మొండిగా). పిమ్మట భోజన వేళలో అతనికి (సోమిలకునికి) భక్తిరహితం అయిన (అమర్యాదగా) (ఏదో) కొంత ఆహారం ఇవ్వబడింది. (అతడు) అచ్చట భుజించి నిద్రించాడు. (కలలో) నడిరేయిని ఆ ఇరువురు పురుషులు (వెనుక అడివిలో స్వప్నంలో చూచినట్టివారు)మాట్లాడడం విన్నాడు. అందులో ఒకడు (కర్మాధిష్ఠానదేవత)

ఇలా అన్నాడు- 'ఓ కర్తా! మీరు ఈగుప్తధనునిచే (ప్రతిదినంకంటె) అధికవ్యయం చేయించారు. ఎట్లన ఇతడు సోమిలకునికి అన్నం పెట్టాడు- ఇది మీకు సముచితం అయిన పని గాదు. అతడు (కర్తృత్వాధిష్ఠానదేవత) ఇట్లా బదులు చెప్పాడు- 'ఓ కర్మా! ఇందు నా దోషంలేదు. నేను పురుషునికి (తగిన) లాభప్రాప్తి గల్గించాలి. దాని పరిణామం (ఆ లాభం నిలువడం-నిలువకపోవడం) నీ అధీనంలో ఉంది.'

మూ. అథాసౌ యావదుత్తిష్ఠతి తావద్గుప్తధనో విషూచికయా ఖిద్యమానో రుజాభిభూతః క్షణం తిష్ఠతి. తతో ద్వితీయేఽహ్ని తద్దోషేణ కృతోపవాసః సఞ్జాతః. సోమిలకోఽపి ప్రభాతే తద్గృహాన్నిష్క్రమ్యోపభుక్తధన గృహం గతః. తేనాపి చాభ్యుత్థానాదినా సత్కృతో విహితభోజనాచ్ఛాదనసమ్మానస్తస్యైవ గృహే భవ్యశయ్యామారుహ్య సుష్వాప. తతశ్చ నిశీథే ప్రాహ- 'భో కర్తః, అనేన సోమిలకస్యోపకారం కుర్వతా ప్రభూతో వ్యయః కృతః. తత్కథయ కథమస్యోద్ధారకవిధిర్భవిష్యతి? అనేన సర్వమేతద్వ్యవహారకగృహాత్ సమానీతమ్. స ఆహ- 'భోః కర్మన్, మమ కృత్యమేతత్. పరిణతిస్త్వదాయత్తా ఇతి. అథ ప్రభాతసమయే రాజపురుషో రాజప్రసాదజం విత్తమాదాయ సమాయాత ఉపభుక్తధనాయ సమర్పయామాస. తద్దృష్ట్వా సోమిలకశ్చిన్తయామాస- 'సఞ్చయరహితోఽపి వరమేష ఉపభుక్తధనః, నాసౌ కదర్యో గుప్తధనః. ఉక్తఞ్చ-

శ్లో. అగ్నిహోత్రఫలా వేదాః శీలవిత్తఫలం శ్రుతమ్
రతిపుత్రఫలా దారా దత్తభుక్తఫలం ధనమ్. 150

అ. అంతట అతడు (సోమిలకుడు) నిద్రలేచునరికి గుప్తధనుడు విషూచికచే (కలరా వంటిరోగంచే) బాధ పడుచున్నాడు. ఆరోగంవల్ల నిశ్చలంగా (కదలలేక) ఉన్నాడు. అందువల్ల రోగకారణంగా రెండవదినం ఉపవాసం చేశాడు (ఇలా సోమిలకునికి ఇచ్చిన అతిథ్యవ్యయాన్ని కర్మాధిష్ఠానదేవత పూర్తిచేసింది). సోమిలకుడును ప్రాతఃకాలముననే అతని ఇంటినుండి నిష్క్రమించాడు. ఉపభుక్తధనుని ఇల్లుచేరాడు. ఇతనిని చూడగనే ఉపభుక్తధనుడు లేచి ఎదురేగి స్వాగతం పల్కాడు. భోజన

కంచే సత్కరించాడు. సుందరమైన శయ్యను ఏర్పాటుచేసాడు. అందు సోమిలకుడు నిద్రించాడు. అప్పుడు నడుమరేయిని కర్మాధిష్ఠాన పురుషుడు అన్నాడు – 'ఓకర్తా! ఇతడు సోమిలకునికి ఉపకారం (సత్కారం) చేస్తూ చాలా ఖర్చుచేశాడు. ఇతనిని ఎలాఉద్ధరించాలో తెలుపుము. ఇతడు ఇదిఅంతా అంగడి (వానిఇంటి) నుండి తెప్పించాడు.' అతడు (కర్తృత్వాభిమానపురుషుడు) అన్నాడు–" ఇది నాపని. పరిణామం (ఖర్చును పూర్తిచేయడం-చేయకపోవడం) నీఅధీనంలో ఉంది.' పిమ్మట ప్రాతఃకాలమున రాజపురుషుని రాజు అనుగ్రహించి (ఇనాముగా) ఇచ్చిన ధనం తీసికొనివచ్చాడు. ఉపభుక్తధనునికి సమర్పించాడు. దానినిచూచి సోమిలకుడు తలంచాడు – 'ధనం నిల్వలేకపోయినా ఈఉపభుక్తధనుడే శ్రేష్ఠుడు. లోభియైన గుప్తధనుడు (శ్రేష్ఠుడు) గాదు. విజ్ఞులు అన్నారు—

వేదాధ్యయనానికి ఫలం అగ్నిహోత్రములు; శాస్త్రజ్ఞానానికి ఫలం సదాచారం, ధన సంపాదన; భార్యవలన ఫలం కామపురుషార్థం పుత్రసంతానం; ధనానికి ఫలం ఇతరులకు ఉపకారం చేయడం, తాను అనుభవించడ (150)

మూ. తద్విధాతా మాం దత్తభుక్తఫలం కరోతు. న కార్యం మే గుప్తధనేన. తతః సోమిలకో దత్తభుక్తధనః సఞ్జాతః. అతోఽహం బ్రవీమి అర్థస్యోపార్జనం కృత్వా' ఇతి (127 శ్లోకః). తద్భద్ర, హిరణ్యక, ఏవం జ్ఞాత్వా ధన విషయే సన్తాపో న కార్యః. అథ విద్యమానమపి ధనం భోజ్యబంధ్యతయా, (భవేత్) తదవిద్యమానం మంతవ్యమ్. ఉక్తఞ్చ–

శ్లో. గృహమధ్యనిఖాతేన ధనేన ధనినో యది
భవామః కిం న తేనైవ ధనేన ధనినో వయమ్. 151

అ. అందువల్ల విధాత (బ్రహ్మదేవుడు) నన్ను దత్తభుక్తఫలుణ్ణి (దానం చేయడం స్వయంగా అనుభవించడం ఈ రెండు విధాల ఉపయోగపడే ధనం గలవానిని) చేయుగాక', పిమ్మట సోమిలకుడు (కర్మాధిష్ఠానదేవతవరంవలన) దత్తభుక్తధనుడు అయ్యాడు. అందుచే నేను (మంథరకుడు అనే నేను) చెప్పుచున్నాను – 'అర్థస్యోపార్జనం కృత్వా' ఇత్యాది (127వ శ్లోకభావం చూడుడు). కనుక శుభమూర్తి! హిరణ్యకా?

దీనిని తెలిసికొని (పోయిన) ధనవిషయమై సంతాపపడవద్దు. మరియూ ఉన్న ధనం సైతం అనుభవించడానికి బంధకంగా ఉంటే అది లేనిదానితో సమానమే. విజ్ఞులు అన్నారు—

ఎవరైన ఇంటినడుమ పాతిపెట్టబడిన ధనంచే ధనవంతులైనచో (ధనం లేని) మేము ఆ ధనంచేతనే (ఉపయోగంలేని ఆ ధనంచే) ధనవంతులం ఎందుకు కాకూడదు? అనగా భోగం లేకపోవడం అనేది లోభివారికి, దరిద్రులకు సమానం అని భావం.(151)

మూ. తథా చ-

శ్లో. ఉపార్జితానామర్థానాం త్యాగ ఏవ హి రక్షణమ్
తటాకోదరసంస్థానాం పరీవాహ ఇవామ్భసామ్. 152

అ. అలాగే, సంపాదించిన ధనానికి దానమే రక్షణ. (ఎట్లన) చెరువులోని నీటికి కాలువద్వారా ప్రవహించడం, పంటపొలాలను పండించడం రక్షణ అగునుగదా! (లేనిచో నీరు క్రుళ్లి వికృతంగా తయారు అగును)

శ్లో. దాతవ్యం భోక్తవ్యం ధనవిషయే సఞ్చయో న కర్తవ్యః
పశ్యేహ మధుకరీణాం సఞ్చితమర్థం హరంత్యన్యే. 153

అ. దానం చేయాలి. అనుభవించాలి. ధనవిషయంలో కూడబెట్టడం చేయరాదు. చూడుము. ఈ ప్రపంచంలో తేనెటీగలు కూడబెట్టిన తేనెను ఇతరులు అపహరిస్తున్నారు.

మూ. అన్యచ్చ-

శ్లో. దానం భోగో నాశ స్తిస్రో గతయో భవంతి విత్తస్య
యో న దదాతి న భుఙ్క్తే తస్య తృతీయా గతిర్భవతి. 154

అ. దానం, భోగం, నాశం ఈ అవస్థలు మూడు ధనానికి సంభవిస్తాయి. ఎవడు దానంచేయడో అనుభవింపడో వాని ధనానికి నాశం అనే మూడవ అవస్థ సంభవిస్తుంది.

మూ. ఏవం జ్ఞాత్వా వివేకినా న స్థిత్యర్థం విత్తోపార్జనం కర్తవ్యమ్, యతో దుఃఖాయ తత్. ఉక్తఞ్చ-

శ్లో. ధనాదికేషు విద్యంతే యే తు మూర్ఖాః సుఖాశయాః
తత్ప్రగ్రీష్మేణ సేవంతే శైత్యార్థం తే హుతాశనమ్. 155

అ. ఇట్లు గ్రహించి వివేకియైనవాడు కూడబెట్టేందుకై ధనం సంపాదించరాదు. ఏలనన-అది దుఃఖకారణం. విజ్ఞులు అన్నారు—

ఎవరు మూర్ఖులై ధనాది భోగ్యవస్తువులందు (సంచయంద్వారా) సుఖాభిలాషలో ఉంటారో, అట్టివారు ఎండచే బాధపడినవారు చల్లదనానికై అగ్నిని సేవించే వారితో సమానం.

శ్లో. సర్పాః పిబంతి పవనం న చ దుర్బలాస్తే
శుష్కైస్తృణైర్వనగజా బలినో భవంతి.
కన్దైః ఫలైర్మునివరా గమయంతి కాలం
సంతోష ఏవ పురుషస్య పరం నిధానమ్. 156

అ. పాములు గాలినిపీల్చి జీవిస్తున్నాయి. అవి బలహీనంగా లేవు. ఎండు గడ్డిని తిని అడవి ఏనుగులు ఎంతో బలంగా ఉన్నాయి. మునీశ్వరులు దుంపలు పండ్లు తిని జీవితం గడుపుచున్నారు. మానవునకు సంతోషమే (సంతృప్తియే) శ్రేష్ఠమైన మూలధనం.

శ్లో. సన్తోషామృతతృప్తానాం యత్సుఖం శాంతచేతసామ్
కుతస్తద్ధనలుబ్ధనామితశ్చేతశ్చ ధావతామ్. 157

అ. సంతోషం అనే అమృతం పానంచేసి సంతృప్తులైన శాంత హృదయులకు ఉండేసుఖం, ధనాశచే ఇటునటు పఱుగెత్తేవారికి ఎక్కడిది?

శ్లో. పీయూషమివ సంతోషం పిబతాం నిర్వృతిః పరా
దుఃఖం నిరంతరం పుంసామసంతోషవతాం పునః. 158

అ. అమృతంవంటి సంతోషాన్ని పానంచేసేవారికి మహత్తరం అయిన ఆనందం గల్గుతుంది. సంతోషంలేని పురుషులకయితే ఎడతెగని దుఃఖం సంభవిస్తుంది.

శ్లో. నిరోధాచ్చేతసోఽక్షాణి నిరుద్ధాన్యఖిలాన్యపి
ఆచ్ఛాదితే రవౌ మేఘైరాచ్ఛన్నాః స్యుర్గభస్తయః. 159

అ. మనస్సును స్వాధీనం చేసికొన్నచో ఇంద్రియాలు అన్నీ స్వాధీనం అవుతాయి. (ఎట్లన) మేఘాలచే సూర్యుడు కప్పబడితే కిరణాలు అన్నీ కప్పబడుతాయి.

శ్లో॥ వాఞ్ఛా విచ్ఛేదనం ప్రాహుః స్వాస్థ్యం శాన్తా మహర్షయః
వాఞ్ఛా నివర్తతే నార్థైః పిపాసేవాగ్ని సేవనైః. 160

అ. శాంతులైన మహర్షులు కోరికలను ఛేదించడమే స్వస్థత (సుఖస్థితి) అందురు. అగ్నిపదార్థాలను (సారాయి మొదలైనవి) సేవించడంచే దాహంతీరనివిధంగా అభిమతపదార్థాలచే కోరికలు నివర్తిల్లవు. (క్రొత్తకోరికలు గల్గును అనిభావం)

శ్లో. అనిన్ద్యమపి నిన్దన్తి స్తువన్త్యస్తుత్యముచ్చకైః
స్వాపతేయకృతే మర్త్యాః కిం కిం నామ న కుర్వతే. 161

అ. ధనంకొఱకై మానవులు నిందింపదగనివానిని (గౌరవార్హుని) నిందిస్తారు. స్తుతింపదగనివానిని (నీచుని) ప్రశంసావాక్యాలతో స్తుతిస్తారు. ఇంకా ఏదేది చేయరు అనేది లేదు.

శ్లో. ధర్మార్థం యస్య విత్తేహా తస్యాపి న శుభావహా
ప్రక్షాలనాద్ధి పఙ్కస్య దూరాదస్పర్శనం వరమ్. 162

అ. ధర్మకార్యాలు చేసేందుకై ధనం కోరడంకూడ శుభదాయకం గాదు. బురదను త్రొక్కి కడుగుకొనడంకంటె దూరంనుండి బురదను తగలకుండా పోవడం ఉత్తమం.

శ్లో. దానేన తుల్యో నిధిరస్తి నాన్యో
లోభాచ్చ నాన్యోఽస్తి రిపుః పృథివ్యామ్.
విభూషణం శీలసమం న చాన్యత్
సన్తోషతుల్యం ధనమస్తి నాన్యత్. 163

అ. ఈ భూమిపై దానంతో సమానం అయిన ఇతరనిధి లేదు. లోభంతో సమానం అయిన శత్రువును లేదు. శీలంతో సమానం అయిన ఇతర భూషణం లేదు. సంతోషంతో సమానం అయిన వేఱే ధనం లేదు.

శ్లో. దారిద్ర్యస్య పరా మూర్తిర్యన్మానద్రవిణాల్పతా
జరద్గవధనః శర్వస్తథాఽపి పరమేశ్వరః. 164

అ. అభిమానం అనే ధనం లేకపోవడమే దారిద్ర్యానికి అంతిమరూపం. శివుడు ముసలిఎద్దే ధనంగా గలవాడు అయినా పరమేశ్వరునిగా కీర్తింపబడుచున్నాడు.

శ్లో. సకృత్కన్దుకపాతేన పతత్యార్యః పతన్నపి
తథా పతతి మూర్ఖస్తు మృత్పిణ్డపతనం యథా. 165

అ. సజ్జనుడు పడినా బంతివలె పడును. (మరల లేచును) మూర్ఖుడుమాత్రం మట్టిముద్దవలె పడును. (మరల లేవలేడు)

మూ. ఏవం జ్ఞాత్వా భద్ర, త్వయా సన్తోషః కార్య ఇతి. మన్థరకవచన మాకర్ణ్య వాయస ఆహ— 'భద్ర, మన్థరకో యదేవం వదతి, తత్త్వయా చిత్తే కర్తవ్యమ్. అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః
అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః. 166

అ. 'ఓ శుభమూర్తి! ఇలా గ్రహించి నీవు సంతోషం పొందాలి.' ఇలా మంథరకుడు చెప్పిన వాక్కును విని కాకి అన్నది- 'మిత్రమా! మంథరకుడు తెల్పిన దానిని మనస్సున నిల్పుకొనుము. ఈ విషయంలో పెద్దలు చక్కగా చెప్పారు—

ఓ రాజా! నిత్యం మధురంగా మాట్లాడేవారు (ముఖస్తుతులు చేసేవారు)సులభంగా లభిస్తారు. కాని మేలుగూర్చే అప్రియం బోధించే వక్తగానీ, వక్త ఉంటే శ్రోతగాని లభించడం కష్టం.(166)

శ్లో. అప్రియాణ్యపి పథ్యాని యే వదన్తి నృణామిహ
త ఏవ సుహృదః ప్రోక్తా అన్యేస్యుర్నామధారకాః. 167

అ. ఈ లోకంలో మానవులకు అప్రియంగా ఉన్నా మేలుగూర్చే వాక్కులు ఎవరు తెల్పుదురో వారే నిజమైన మిత్రులు. ఇతరులు మిత్రనామధారులు మాత్రమే.

మూ. అథైవం జల్పతాం తేషాం చిత్రాఙ్గో నామ హరిణో లుబ్ధకత్రాసితస్తస్మిన్నేవ సరసి ప్రవిష్టః. అథాఽయాంతం ససమ్భ్రమమవలోక్య లఘుపతనకో వృక్షమారూఢః. హిరణ్యకః సమీపవర్తినం శరవణకుఞ్జం ప్రవిష్టః. మన్థరకః సలిలాశయమాస్థితః. అథ లఘుపతనకో మృగం సమ్యక్ పరిజ్ఞాయ

మన్థరకము వాచ - 'ఏహ్యేహి, సఖే, మన్థరక! మృగోఽయం తృషార్తోఽత్ర సమాయాతః. సరసి ప్రవిష్టః. తస్య శబ్దోఽయం న మానుషసమ్భవః' ఇతి. తచ్ఛ్రుత్వా మన్థరకో దేశకాలోచితమాహ- 'భో లఘుపతనక, యథాఽయం మృగో దృశ్యతే ప్రభూతముచ్ఛ్వాసముద్వహన్నుద్భ్రాన్తదృష్ట్యా పృష్ఠతోఽవలోకయతి, తన్న తృషార్త ఏషః, నూనం లుబ్ధకత్రాసితః. తజ్జ్ఞాయతామస్య పృష్ఠే లుబ్ధకా ఆగచ్ఛన్తి న వా. ఇతి, ఉక్తఞ్చ-

శ్లో. భయత్రస్తో నరః శ్వాసం ప్రభూతం కురుతే ముహుః
దిశోఽవలోకయత్యేవ న స్వాస్థ్యం వ్రజతి క్వచిత్. 168

అ. వారు ఇలా సంభాషిస్తుండగా చిత్రాంగుడు అనే లేడి వేటకాండ్రచే బెదిరింపబడినదై ఆ సరస్సులో చొరబడింది. అతడు (చిత్రాంగుడు) (బెదరుచు) రావడం చూచి లఘుపతనకుడు తొట్రుపాటుతో వృక్షం ఎక్కాడు. హిరణ్యకుడు దగ్గరఉండే రెల్లుగడ్డి పొదలో దూరాడు. మన్థరకుడు చెఱువులో ప్రవేశించాడు. పిమ్మట లఘుపతనకుడు లేడిని చక్కగా గుర్తించి మంథరకునితో ఇలా అన్నాడు- 'మిత్రమా, మంథరకా! రమ్ము రమ్ము. ఈలేడి అధికంగా దాహంచెంది చెఱువులో చొరబడింది. ఈ శబ్దం దానిదే. మనుష్యులవల్ల సంభవింపలేదు. దానిని విని మంథరకుడు దేశకాలోచితంగా ఇలా అన్నాడు- 'ఓలఘుపతనకా' ఎక్కువగా నిట్టూర్పులు విడుస్తూంది. మిక్కిలి కంగారుతో వెనుకకు తిరిగిచూస్తూఉంది. అందుచే ఇది దప్పికచే బాధపడడంలేదు. వేటకాండ్రచే భయపెట్టబడింది. కనుక దీనివెనుక వేటకాండ్రువచ్చు చున్నదీ లేనిదీ తెలుసుకొనుము. పెద్దలు అన్నారు—

భయపీడితుడైన మానవుడు శ్వాసను మాటిమాటికి ఎక్కువగా విడుస్తాడు- దిక్కులు చూస్తాడు. ఎప్పటనూ శాంతినిపొందడు. (168)

మూ. తచ్ఛ్రుత్వా చిత్రాఙ్గ ఆహ- 'భో మన్థరక, జ్ఞాతం త్వయా సమ్యజ్మే త్రాసకారణమ్. అహం లుబ్ధకశరప్రహారాదుద్ధావితః కృచ్ఛ్రేణాత్ర సమాయాతః. మమ యూథం తైర్లుబ్ధకైర్వ్యాపాదితం భవిష్యతి. తచ్ఛరణాగతస్య మే దర్శయ కిఞ్చిదగమ్యం స్థానం లుబ్ధకానామ్. తదాకర్ణ్య మన్థరక ఆహ- 'భోశ్చిత్రాఙ్గ, శ్రూయతాం నీతిశాస్త్రమ్-

శ్లో. ద్వావుపాయావిహ ప్రోక్తౌ విముక్తౌ శత్రుదర్శనే
హస్తయోశ్చాలనాదేకో ద్వితీయః పాదవేగజః. 169

అ. దానిని విని చిత్రాంగుడు అన్నాడు_ 'ఓమంథరకా! నీవు నాభయానికి కారణం చక్కగా గ్రహించావు. నేను వేటకాని బాణందెబ్బకు పైకిగంతువేసి తప్పించుకొని కష్టంమీద ఇచ్చటికి వచ్చాను. శరణాగతుడైన నాకు వేటకాండ్రు పోరాని స్థానం ఏదేని చూపుము.? దానిని విని మంథరకుడు ఇలా అన్నాడు- 'ఓచిత్రాంగా! నీతిశాస్త్రం వినుము___

శత్రువును ఎదురించవలసి వచ్చినప్పుడు నీతిశాస్త్రంలో రెండు ఉపాయాలు చెప్పబడ్డాయి. ఒకటి-చేతులు కదలించడం అనగా భుజబలం ప్రదర్శించడం, రెండవది కాలివేగం చూపి పరుగెత్తడం. (169)

మూ. తద్గమ్యతాం శీఘ్రం సఘనం వనమ్ యావదద్యాపి నాగచ్ఛన్తి తే దురాత్మానో లుబ్ధకాః'. అత్రాన్తరే లఘుపతనకః సత్వరమభ్యుపేత్యోవాచ- భో మన్థరక, గతాస్తే లుబ్ధకాః' స్వగృహోన్ముఖాః ప్రచురమాంసధారిణః. తచ్చిత్రాఙ్గ! త్వం విశ్రబ్ధో జలాద్బహిర్భవ. తతస్తే చత్వారోఽపి మిత్రభావమాశ్రితాస్తస్మిన్ సరసి మధ్యాహ్నసమయే వృక్షచ్ఛాయాయా అథస్తాత్ సుభాషితగోష్ఠీసుఖమనుభవన్తః సుఖేన కాలం నయన్తి. అథవా యుక్తమేతదుచ్యతే-

శ్లో. సుభాషితరసాస్వాద బద్ధరోమాఞ్చకఞ్చుకాః
వినాఽపి సంగమం స్త్రీణాం సుధియః సుఖమాసతే. 170

అ. అందుచే ఆ దురాత్ములైన వేటకాండ్రు రాకముందే దట్టమైన అడవిలోనికి పొమ్ము. ఇంతలో లఘుపతనకుడు వేగంగా వచ్చి చెప్పాడు___ 'ఓమంథరక ఆవేటకాండ్రు మాంసాన్ని అధికంగా మూటబుకట్టుకొన్నవారై తమ ఇంటిదారి పట్టి పోయారు. కనుక ఓచిత్రాంగా, నీవు నిర్భయంగా నీటినుండి వెలువలికి రమ్ము. తర్వాత ఆ నల్గురు మధ్యాహ్నసమయంలో సరోవరతీరంలో చెట్టునీడన (చెట్టుక్రింద) కూర్చుండి సుభాషితగోష్ఠి సుఖం అనుభవిస్తూ సుఖంగా కాలం గడుపసాగారు. ఈవిషయంలో పెద్దలు సముచితంగా చెప్పారు___

ఏ విద్వాంసులు సుభాషిత రసం ఆస్వాదిస్తూ రోమాంచమనే కంచుకం ధరిస్తారో. వారు స్త్రీ సంయోగంలేకయే సుఖంగా ఉందురు (170)

శ్లో. సుభాషితమయద్రవ్యసఙ్గ్రహం న కరోతి యః
న తు ప్రస్తావయజ్ఞేషు కాం ప్రదాస్యతి దక్షిణామ్. 171

అ. ఏ మానవుడు సుభాషితములు అనే ధనాన్ని సేకరించడో, పరస్పర సంభాషణ రూపములైన యజ్ఞాలయందు ఏదక్షిణను ఇవ్వగలడు?

మూ. తథా చ—

శ్లో. సకృదుక్తం న గృహ్ణాతి స్వయం వా న కరోతి యః
యస్య సమ్పుటికా నాస్తి కుతస్తస్య సుభాషితమ్. 172

అ. అటులనే, ఎవడైతే ఒకసారి చెప్పినదానిని గ్రహింపలేడో, స్వయంగా సుభాషితి నిర్మాణంచేయలేడో, ఎవనివద్ద సుభాషిత సంపుటిలేదో, (ఎవనికి సుభాషితాలు జ్ఞాపకం ఉండవో) ఆ పురుషుడు సుభాషితాలు పలుకలేడు.

మూ. అథైకస్మిన్నహని గోష్ఠీసమయే చిత్రాఙ్గో నాయాతః. అథ తే వ్యాకులీభూతాః పరస్పరం జల్పితుమారబ్ధాః-అహో! కిమద్య సుహృన్న సమాయాతః. కిం సింహాదిభిః క్వాపి వ్యాపాదితః, ఉత లుబ్ధకైః? అథవా అనలే ప్రవతితో గర్తే విషమే వా నవతృణలౌల్యాత్, ఇతి. అథవా సాధ్విదముచ్యతే–

శ్లో. స్వగృహోద్యానగతేఽపి స్నిగ్ధైః పాపం విశఙ్క్యతే మోహాత్
కిము దృష్ట–బహ్వపాయ–ప్రతిభయ–కాన్తార–మధ్యస్థే. 173

అ. ఒకనాడు గోష్ఠీసమయానికి చిత్రాంగుడు రాలేదు. అందుకు తక్కిన ముగ్గురు కలతనందారు. తమలో తాము ఇలా తలంపసాగారు– 'అయ్యో, ఎందుకు నేడు మిత్రుడు (చిత్రాంగుడు) రాలేదు? సింహాదులచే గాని లేక వేటకాండ్రచే గాని ఎచ్చటనేని చంపబడినాడా ఏమి? లేతగడ్డి ఆశతో అగ్నిలో గాని లేక లోతైన గుంతలో గాని పడినాడా ఏమి? పెద్దలు ఈవిషయం చక్కగా చెప్పారు—

అప్తులైనవారు ప్రేమకారణంగా తన ఇంటి ఉద్యానవనంలో ఉన్న వాని విషయంలోగూడ అశుభం శంకిస్తారు. ఇక బహువిధాలైన అపాయాలు చూడబడినదీ, భయంకరం అయినదీ అయిన అడవిలో ఉండేవాని విషయంలో ఏమనాలి? (173)

మూ. అథ మన్థరకో వాయసమాహ– భో లఘుపతనక! అహం హిరణ్యకశ్చ తావద్ద్వావప్యశక్తౌ తస్యాన్వేషణం కర్తుం మన్దగతిత్వాత్. తద్గత్వా త్వమరణ్యం శోధయ, యది కుత్రచిత్తం జీవనం పశ్యసి ఇతి. తదాకర్ణ్య లఘుపతనకో నాతిదూరే యావద్గచ్ఛతి, తావత్పల్వలతీరే చిత్రాఙ్గః కూటపాశనియన్త్రిత స్తిష్ఠతి. తం దృష్ట్వా శోకవ్యాకులితమనా స్తమవోచత్– 'భద్ర, కిమిదమ్ ?' చిత్రాఙ్గోఽపి వాయసమవలోక్య విశేషేణ దుఃఖితమనా బభూవ. అథవా యుక్తమేతత్—

శ్లో. అపి మన్దత్వమాపన్నో నష్టో వాఽపీష్టదర్శనాత్
ప్రాయేణ ప్రాణినాం భూయో దుఃఖావేశోఽధికో భవేత్. 174

అ. అంత మంథరకుడు కాకితో ఇలా అన్నాడు– 'ఓ లఘుపతనకా! నేనూ హిరణ్యకుడూ ఇరువురం మందగమనం గలవారం అగుటచే అతనిని వెదుకజాలము. అందుచే నీవువెళ్ళి ఈ అరణ్యంలో ఎచ్చటనైనా బ్రతికియున్నట్లు చూతువేమో వెదుకుము. దానిని విని లఘుపతనకుడు కొంతదూరం వెళ్ళి చూడగా అచ్చట ఒక చిన్నగుంట (చిన్నచెఱువు) దగ్గర (వేటకాని) ఉచ్చులలో చిక్కుకొని చిత్రాంగుడు ఉన్నాడు. అతనిని (చిత్రాంగుని) చూచి దుఃఖంచే కలతనొందిన మనస్సుతో (లఘుపతనకుడు) ఇలా అన్నాడు—'మిత్రమా ఇదిఏమి?' చిత్రాంగుడును కాకినిచూచి మిక్కిలి దుఃఖం పొందాడు. ఇది సముచితమే!

ఎంతగా తగ్గినా—పూర్తిగా తొలగిపోయినా సామాన్యంగా ప్రాణులదుఃఖావేశం, ప్రియజనుల దర్శనంవల్ల మరల అధికం అగును. (174)

మూ. తతశ్చ బాష్పావసానే చిత్రాఙ్గో లఘుపతనకమాహ–'భో మిత్ర సఞ్జాతోఽయం తావన్మమ మృత్యుః. తద్యుక్తం యద్భవతా సహ మే దర్శనం సఞ్జాతమ్. ఉక్తఞ్చ—

శ్లో. ప్రాణాత్యయే సముత్పన్నే యది స్యాన్మిత్రదర్శనమ్.
తద్ద్వాభ్యాం సుఖదం పశ్చా జ్జీవతోఽపి మృతస్య చ. 175

అ. కన్నీరు గార్చిన తర్వాత (కన్నీరుఆపుకొని) చిత్రాంగుడు లఘుపతన కునితో ఇలా అన్నాడు—'ఓమిత్రమా! నాకు మరణం దాపురించింది. ఈస్థితిలో నీ దర్శనం గల్గడం చాలమంచిది. విజ్ఞులు అన్నారు—

మృత్యువు దాపురించినప్పుడు మిత్రదర్శనం లభిస్తే, అది రెండు విధాలుగా సుఖకరం అగును. తర్వాత జీవింపవచ్చు. లేదా మరణింపవచ్చు. (మిత్రసాహాయంచే బ్రతుకవచ్చు, లేక మరణిస్తే, మిత్రులు తన కోర్కెలు దీర్పవచ్చు) (175)

మూ. తత్క్షన్తవ్యం యన్మయా ప్రణయాత్ సుభాషితగోష్ఠిష్వభిహితమ్. తథా హిరణ్యకమన్థరకౌ మమ వాక్యాద్వాచ్యౌ—

శ్లో. అజ్ఞానాజ్జ్ఞానతో వాఽపి దురుక్తం యదుదాహృతమ్
తత్ క్షన్తవ్యం యువాభ్యాం మే కృత్వా ప్రీతికరం మనః. 176

అ. కనుక ప్రణయకారణంగా సుభాషితచర్చలలో ఏదేని (కష్టమైనవాక్కు) పల్కిఉంటే క్షమించుము. నాతరవున హిరణ్యకమంథరకులతోడను ఇలా చెప్పుము—

తెలిసిగాని తెలియకగాని నేను ఏదేని అప్రియం అయినమాట పల్కిఉంటే మీరు ఇరువురు ప్రేమపూర్ణమైన మనస్సుతో క్షమించండి. (176)

మూ. తచ్ఛ్రుత్వా లఘుపతనక ఆహ— న భేతవ్యమస్మద్విధైర్మిత్రైర్విద్యమానైః. యావదహం ద్రుతతరం హిరణ్యకం గృహీత్వాఽఽగచ్ఛామి. అపరం యే సత్పురుషా భవన్తి తే వ్యసనేన వ్యాకులత్వముపయాన్తి. ఉక్తఞ్చ—

అ. దానిని విని లఘువతనకుడు అన్నాడు—'శుభమూర్తీ! మావంటి మిత్రులు ఉండగా భయపడకుము. నేను మిక్కిలి వేగంగా హిరణ్యకుని తీసికొని వస్తాను. మరియూ సత్పురుషులు ఆపదలందు గాబరాపడరు. విజ్ఞులు అందురు—

శ్లో. సమ్పది యస్య న హర్షో విపది విషాదో రణే చ భీరుత్వమ్
తం భువనత్రయతిలకం జనయతి జననీ సుతం విరలమ్. 177

ఆ. ఎవనికి సంపద గల్గినచో సంతోషం, ఆపదవచ్చినచో దుఃఖం, యుద్ధంలో పిరికితనం ఉండవో—అట్టి త్రిలోకశ్రేష్ఠుడైన పుత్రుణ్ణి ఏ మాతయో (ఏ తల్లియో) చాలా అరుదుగా ప్రసవిస్తుంది. (177)

మూ. ఏవముక్త్వా లఘుపతనకశ్చిత్రాఙ్గమాశ్వాస్య యత్ర హిరణ్యక మన్థరకౌ తిష్ఠత స్తత్ర గత్వా సర్వం చిత్రాఙ్గపాశపతనం కథితవాన్. హిరణ్యకఞ్చ చిత్రాఙ్గపాశమోక్షణం ప్రతి కృతనిశ్చయం పృష్ఠమారోప్య భూయోఽపి సత్వరం చిత్రాఙ్గసమీపే గతః. సోఽపి మూషికమవలోక్య కిఞ్చిజ్జీవితాశయా సంశ్లిష్టమాహ—

శ్లో. ఆపన్నాశాయ విబుధైః కర్తవ్యాః సుహృదోఽమలాః
న తరత్యాపదం కశ్చిద్యోఽత్ర మిత్రవివర్జితః. 178

ఆ. ఇలా పల్కి లఘుపతనకుడు చిత్రాంగుని ఓదార్చాడు— హిరణ్యక మంథరకులు ఉండేచోటికి వెళ్ళాడు. చిత్రాంగుడు వలలో చిక్కుకొన్న విషయంఅంతా తెలిపాడు. దానిని వినగానే చిత్రాంగుని పాశముల ఛేదించడానికి హిరణ్యకుడు నిశ్చయించాడు. అతనిని (హిరణ్యకుని) వీపున ఎక్కించుకొని లఘుపతనకుడు వెంటనే మరల చిత్రాంగుని సమీపం చేరాడు. చిత్రాంగుడును హిరణ్యకుని చూడగానే కొంచెం జీవితాశను పొంది ఇలా అన్నాడు—

విద్వాంసులైనవారు (తమ) ఆపదలు తొలగించుకొనడానికి ఉత్తములైన మిత్రులను సంపాదింపవలయును. మిత్రులు లేనివాడు ఎవడూ ఆపదలను దాటలేడు. (178)

మూ. హిరణ్యక ఆహ— 'భద్ర, త్వం తావన్నీతిశాస్త్రజ్ఞో దక్షమతిః. తత్కథమత్ర కూటపాశే పతితః?' స ఆహ— 'భోః, న కాలోఽయం వివాదస్య తన్న యావత్ సపాపాత్మా లుబ్ధకః సమభ్యేతి తావద్ద్రుతతరం కర్తవ్యో (కృత్తి =ఛేదనే) యం మత్పాదపాశః. తదాకర్ణ్య విహస్యాఽహ హిరణ్యకః—కిం మయ్యపి సమాయాతే లుబ్ధకాద్బిభేషి? తతః శాస్త్రం ప్రతి మహతీ మే విరక్తిః సమ్పన్నా, యద్భవద్విధా అపి నీతిశాస్త్రవిద ఏనామవస్థాం ప్రాప్నువన్తి. తేన

త్వాం పృచ్ఛామి'. స ఆహ- భద్ర, కర్మణా బుద్ధిరపి హన్యతే. ఉక్తఞ్చ -

శ్లో. కృతాన్తపాశబద్ధానాం దైవోపహతచేతసామ్.
బుద్ధయః కుబ్జగామిన్యో భవన్తి మహతామపి. 179

అ. హిరణ్యకుడు ఇలా అన్నాడు — 'శుభమూర్తీ! నీవు నీతిశాస్త్రవేత్తవూ నిపుణబుద్ధివీ అయి ఉండి ఈవలలో ఎలా పడినావు? అతడు చెప్పాడు— 'మిత్రమా! చర్చకు ఇది సమయంగాదు. ఆ పాపాత్ముడైన వేటకాడు రాకముందే నాకాళ్ళ ఉచ్చులను కత్తిరింపుము (కొఱికివేయుము)'. దానిని విని హిరణ్యకుడు నవ్వి ఇలా అన్నాడు- 'ఏమి? నేను వచ్చిన తర్వాత గూడ వేటకానికి భయపడుచున్నావా?, నీవంటి నీతిశాస్త్రవేత్తలుగూడ ఇలాంటి దురవస్థను పొందడం గాంచి నాకు (నీతి) శాస్త్రంమీదనే గొప్ప విరక్తి గల్గి నిన్ను అడుగుచున్నాను.' అతడు (చిత్రాంగుడు) చెప్పాడు—'మిత్రమా ప్రారబ్ధ కర్మవశాన బుద్ధి నశిస్తుంది. విజ్ఞులు అన్నారు—

యమపాశంచే బద్ధులైనప్పుడు, దౌర్భాగ్యం మనస్సును ఆవరించినప్పుడు మహాత్ముల బుద్ధులుగూడ వక్రమార్గాన పయనిస్తాయి. (179)

శ్లో. విధాత్రా రచితా యా సా లలాటేఽక్షరమాలికా
న తాం మార్జయితుం శక్తాః స్వబుద్ధ్యాఽప్యతిపణ్డితాః. 180

అ. బ్రహ్మదేవుడు నొసట ఏ అక్షరమాలికను వ్రాశాడో, దానిని ఎంత గొప్ప పండితులు అయినా తమబుద్ధిచే తొలగింపలేరు.

మూ. ఏవం తయోః ప్రవదతోః సుహృద్వ్యసన-సన్తప్తహృదయో మన్థరకః శనైః శనైస్తం ప్రదేశ మాజగామ. తం దృష్ట్వా లఘుపతనకో హిరణ్యక మాహ- 'అహో, న శోభన మాపతితమ్. హిరణ్యక ఆహ-' కిం స లుబ్ధకః సమాయాతి'? స ఆహ- 'ఆస్తాం తావల్లుబ్ధకవార్తా. ఏష మన్థరకః సమాగచ్ఛతి. తదనీతిరనుష్ఠితాఽనేన, యతో వయమప్యస్య కారణా న్నూనం వ్యాపాదనం వ్యాస్యామో యది స పాపాత్మా లుబ్ధకః సమాగమిష్యతి. తదహం తావత్ ఖముత్పతిష్యామి. త్వం పునర్బిలం ప్రవిశ్యాత్మానం రక్షయిష్యసి.

చిత్రాఙ్గోఽపి వేగేన దిగన్తరం యాస్యతి. ఏష పునర్జలచరః స్థలే కథం భవిష్యతీతి వ్యాకులోఽస్మి'.

అ. ఇలా వారిరువురూ (హిరణ్యకుడు చిత్రాంగుడు) సంభాషిస్తూ ఉండగా మంథరకుడు మెల్లమెల్లగా అచ్చటికి వచ్చాడు. అతనిమనస్సు మిత్రుని ఆపదచే మిక్కిలి దహించుకపోతూఉంది. అతనిని చూచి లఘుపతనకుడు హిరణ్యకునితో ఇలా అన్నాడు. 'అయ్యో! శుభం జరగలేదు.' హిరణ్యకుడు అడిగాడు— 'ఏమి! ఆ వేటకాడు వచ్చాడా?' అతడు (లఘుపతనకుడు) చెప్పాడు— 'వేటకాని విషయం ఉండనిండు. ఈ మంథరకుడు వస్తూన్నాడు. ఇతని ప్రవర్తన నీతివిరుద్ధం. ఆ దురాత్ముడైన వేటకాడు వచ్చినచో ఇతని కారణంగా మనంకూడ నాశం పొందెదము. నేనైతే ఆకాశానికి ఎగరగలను నీవు తొఱ్ఱలోదూరి నిన్ను రక్షించుకోగలవు. చిత్రాంగుడును వేగంగా (ఏదో) మూలకు పాఱిపోతాడు. ఇతడైతే నీటిలో తిరిగేవాడు (జలచరుడు), నేలమీద ఏమగునో అని విచారపడు చున్నాను'.

మూ. అత్రాన్తరే ప్రాప్తోఽయం మన్థరకః. హిరణ్యక ఆహ—'భద్ర, న యుక్త మనుష్ఠితం భవతా యదత్ర సమాయాతః. తద్భూయోఽపి ద్రుతతరం గమ్యతామ్, యావదసౌ లుబ్ధకో న సమాయాతి'. మన్థరక ఆహ—'భద్ర,' కిం కరోమి? న శక్నోమి తత్రస్థో మిత్రవ్యసనాగ్నిదాహం సోఢుమ్. తేనాహమత్రాఽగతః. అథవా సాధ్విదముచ్యతే—

శ్లో. దయితజనవిప్రయోగో విత్తవియోగశ్చ కేన సహ్యౌ స్యుః
యది సుమహౌషధకల్పో వయస్యజనసఙ్గమో న స్యాత్ . 181

అ. ఇంతలో మంథరకుడు వచ్చిచేరాడు. (అతనినిచూచి) హిరణ్యకుడు ఇలా అన్నాడు—'మిత్రమా! నీవు ఇచ్చటికి రావడం మంచిపనిగాదు. ఆవేటకాడు రాకముందే మిక్కిలివేగంగా మరలిపొమ్ము.' మంథరకుడు ఇలా అన్నాడు— 'మిత్రమా! ఏమి చేయుదును? అచ్చటఉండి మిత్రవియోగదుఃఖం అనేఅగ్నిదాహం సహింపలేకపోయాను. అందుచే ఇచ్చటికి వచ్చాను. విజ్ఞులు ఈమాట చక్కగాచెప్పారు—

శ్రేష్ఠమైన ఔషధంతో సమానంఅయిన మిత్రులతో కలయిక లేనిచో ప్రియ బంధుజనవియోగం ధననష్టం (అనగా ఈ రెండిటివలనగల్గే దుఃఖం) ఎవడు సహింప గలడు? (181)

శ్లో. వరం ప్రాణపరిత్యాగో న వియోగో భవాదృశైః
ప్రాణా జన్మాన్తరే భూయో న భవన్తి భవద్విధాః. 182

అ. ప్రాణాలు పోయినా మంచిదే. తమవంటి (మిత్రుల) ఎడబాటుమాత్రం వద్దు. ప్రాణాలు మరుజన్మలో మరల లభిస్తాయి. తమవంటి మిత్రులుమాత్రం లభిం పరు.

మూ. ఏవం తస్య ప్రవదత ఆకర్ణపూరితశరాసనో లుబ్ధకోఽప్యుపాగతః. తం దృష్ట్వా మూషకేణ తస్య స్నాయుపాశస్తత్క్షణాదేవ ఖణ్డితః. అత్రాన్తరే చిత్రాఙ్గః సత్వరం వృక్షమవలోకయన్ ప్రధావితః. లఘుపతనకో వృక్షమారూఢః, హిరణ్యకశ్చ సమీపవర్తి బిలం ప్రవిష్టః.

అ. అతడు (మంథరకుడు) ఇలా అనుచుండగనే చెవులపర్యంతం విల్లును (అల్లెత్రాటిని) లాగి వేటకాడు వచ్చాడు. అతనిని చూచి ఎలుక లేడి-ఉచ్చును (పాశం) వెంటనే కొరికి ముక్కలుచేసింది. తోడనే చిత్రాంగుడు వెనుకకు చూస్తూ పరుగెత్తాడు. లఘుపతనకుడు చెట్టుమీదికి ఎక్కాడు. హిరణ్యకుడు దాపునఉండే బొరియలోదూరాడు.

మూ. అథాఽసౌ లుబ్ధకో మృగగమనాద్విషణ్ణవదనో వ్యర్థశ్రమస్తం మన్థరకం మన్దం మన్దం స్థలమధ్యే గచ్ఛన్తం దృష్టవాన్, అచిన్తయచ్చ-యద్యపి కురఙ్గో ధాత్రాఽపహృత స్తథాఽప్యయం కూర్మ ఆహారార్థం సమ్పాదితః. తదద్యాఽస్యాఽమిషేణ మే కుటుమ్బస్యాఽఽహారనిర్వృత్తి ర్భవిష్యతి. ఏవం విచిన్త్య తం దర్భైః సఞ్ఛాద్య ధనుషి సమారోప్య స్కన్ధే కృత్వా గృహం ప్రతి ప్రస్థితః. అత్రాన్తరే తం నీయమానమవలోక్య హిరణ్యకో దుఃఖాకులః పర్యదేవయత్- 'కష్టం భోః, కష్టమాపతితమ్.

శ్లో. ఏకస్య దుఃఖస్య న యావదన్తం గచ్ఛామ్యహం పారమివార్ణవస్య.
తావద్ద్వితీయం సముపస్థితం మే ఛిద్రేష్వనర్థా బహులీభవన్తి. 183

ఆ. అప్పుడు వేటకాడు లేడి పోవడంవల్ల తన శ్రమఅంతా వ్యర్థంగా తలం చాడు. ముఖం విషాదంతో నిండిపోయింది. (అటుచూడగా) మంథరకుడు నేలమీద మెల్ల మెల్లగాపోతూ కనబడ్డాడు. అతనిని చూచి ఇలా తలంచాడు—'బ్రహ్మదేవుడు లేడిని అపహరించాడు. అయినా ఈ తాబేలు ఆహారార్థం లభించింది. నేడు దీని మాంసంచే నా కుటుంబానికి ఆహారనివృత్తి సంభవిస్తుంది. ఇట్లు తలంచి దాన్ని దర్భలతో చుట్టి విల్లు నకు వ్రేలాడకట్టుకొన్నాడు—ఆవిల్లును భుజంపై ఉంచుకొని ఇంటిదారి పట్టాడు. ఇలా అతడు (మంథరకుడు) తీసికొని పోబడడం హిరణ్యకుడు చూచాడు. దుఃఖంచే కలత నొందినవాడై ఇట్లు విలపింపసాగాడు—'కష్టం, అయ్యో! కష్టం వచ్చిపడింది.

సముద్రాన్ని ఈది తీరంచేరడంవలె భయంకరమైన ఒక దుఃఖం పూర్తిగా తొలగిపోకముందే రెండవ దుఃఖం వచ్చిపడింది. ఆపద వచ్చినప్పుడే పెక్కుఆపదలు వస్తాయి (ఆపదలు ఒంటరిగారావు) (183)

శ్లో. తావదస్ఖలితం యావత్ సుఖం యాతి సమే పథి
స్ఖలితే చ సముత్పన్నే విషమే చ పదే పదే. 184

అ. మానవుడు సమభూమిపై ప్రయాణం చేయునంతకాలం సుఖంగా పయ నిస్తాడు. మిట్టపల్లాలలో (విషభూమిలో) ఒకసారి కాలిజారిపడితే అడుగడుగునాదెబ్బ తింటూ పడిపోతాడు.

శ్లో. యన్నమ్రం సరలం చాపి యచ్చాపత్సు న సీదతి
ధనుర్మిత్రం కలత్రం చ దుర్లభం శుద్ధవంశజమ్. 185

అ. విశుద్ధ వంశ సంజాతులు, నమ్రులు, ఆపదలందు శిథిలతనందనివారు—అయిన ధనుర్మిత్ర కలత్రములు లభించడం కష్టం.

(వంశ=వెదురు, కులము, నమ్ర=వంగుట, అణకువ)

శ్లో॥ న మాతరి న దారేషు న సోదర్యే న చాత్మజే
విశ్రమ్భస్తాదృశః పుంసాం యాదృఙ్మిత్రే నిరన్తరే. 186

అ పురుషులకు అభిన్నహృదయుడైన మిత్రునియందు ఎంతటి విశ్వాసం ఉండునో, అంతవిశ్వాసం తల్లియందు, భార్యయందు సోదరునియందు పుత్రునియందు ఉండదు.

మూ. యది తావత్ కృతాన్తేన మే ధననాశో విహితస్తన్మార్గశ్రాన్తస్య మే విశ్రామభూతం మిత్రం కస్మాదపహృతమ్. అపరమపి మిత్రం వరం మన్థరకసమం న స్యాత్. ఉక్తఞ్చ--

శ్లో. అసమ్పత్తౌ పరో లాభో గుహ్యస్య కథనం తథా
ఆపద్విమోక్షణం చైవ మిత్రస్యైతత్ఫలత్రయమ్. 187

అ. దైవం నా (సంచిత)ధనం హరించింది (అయినా అంత విచారంలేదు) కాని జీవితమార్గంలో అలసిన నాకు విశ్రాంతిరూపమైన మిత్రునిసైతం ఎందుకు (ఆదైవం) అపహరించాలి? మిత్రులు ఉండవచ్చు. మంథరకునివంటి మిత్రుడు ఎవరూ ఉండడు. విజ్ఞులు అన్నారు.

ధనహీనస్థితిలో (ప్రాప్తమైన) గొప్పలాభం, రహస్య విషయాలను తెల్పడం, ఆపదలను తొలగించడం—ఈ మూడు మిత్రసంబంధములైన ముఖ్యఫలములు (187)

మూ. తదస్య పశ్చాన్మాన్యాః సుహృన్మే. తత్కిం మమోపర్యనవరతం వ్యసనశరైర్వర్షతి హతవిధిః. యత ఆదౌ తావద్విత్తనాశః, తతః పరివారభ్రంశః, తతో దేశత్యాగః, తతో మిత్రవియోగ ఇతి. అథవా స్వరూపమేతత్సర్వేషామేవ జన్తూనాం జీవితధర్మస్య ఉక్తఞ్చ-

శ్లో. కాయః సన్నిహితాపాయః సమ్పదః క్షణభఙ్గురాః
సమాగమాః సాపగమాః సర్వేషామేవ దేహినామ్. 188

అ. ఇతని తర్వాత నాకు మఱియొకడు ఇంతటి మిత్రుడులేడు పాడుదైవం ఆపదలు అనే బాణాలను తెఱపిలేకుండా నాపై ఎందుకో వర్షిస్తూంది. మొదట సంచిత ధనం నశించింది. తర్వాత బాంధవాది పరివారంఅంతా దూరం అయింది. ఆమీద దేశత్యాగం, ఆపైన మిత్రుని ఎడబాటు అన్నిప్రాణులజీవితధర్మం ఇలాగే (దుఃఖపరిపూర్ణమై) ఉంటుంది. విజ్ఞులు అన్నారు—

దేహధారులందరకు శరీరం అపాయయుక్తం (శరీరం నశ్వరం) సంపదలు క్షణకాలికములు. ప్రియజన సంయోగాలు వియోగసహితాలు (188)

శ్లో. క్షతే ప్రహారా నిపతన్త్యభీక్ష్ణం ధనక్షయే దీవ్యతి జాఠరాగ్నిః
ఆపత్సు వైరాణి సముల్లసన్తి ఛిద్రేష్వనర్థా బహులీభవన్తి. 189

అ. గాయం కల్గినచోటనే దెబ్బలు ఎక్కువగా తగులుతాయి. ధననాశం గల్గినప్పుడే ఆకలి వృద్ధి అవుతుంది. ఆపదలందే విరోధాలు పెరుగుతాయి. కష్టాలయందే అనేక కష్టాలు వచ్చిపడుతాయి.

మూ. అథవా సాధూక్తం కేనాపి-

శ్లో. ప్రాప్తే భయే పరిత్రాణం ప్రీతివిశ్రమ్భభాజనమ్
కేన రత్నమిదం సృష్టం మిత్రమిత్యక్షరద్వయమ్. 190

అ. ఆహా! ఎవరో చక్కగా చెప్పారు—

భయం ప్రాప్తించినచో దానినుండి రక్షించడానికి, ప్రేమకు విశ్వాసానికి ఆశ్రయంగా ఉండేందుకు 'మిత్ర' అనే రెండక్షరాల రత్నాన్ని ఎవడు సృష్టించాడో. (190)

మూ. అత్రాన్తరే చాఽక్రన్దపరౌ చిత్రాఙ్గ-లఘుపతనకౌ తత్రైవ సమాయాతౌ. అథ హిరణ్యక ఆహ- 'అహో, కిం వృథా ప్రలపితేన? తద్యావదేష మన్థరకో దృష్టిగోచరాన్న నీయతే, తావదస్య మోక్షోపాయశ్చిన్త్యతామ్' ఇతి. ఉక్తఞ్చ-

శ్లో. వ్యసనం ప్రాప్య యో మోహాత్కేవలం పరిదేవయేత్
క్రన్దనం వర్ధయత్యేవ తస్యాన్తం నాధిగచ్ఛతి. 191

అ. ఇంతలో విలపిస్తూ చిత్రాంగుడు లఘుపతనకుడు అచ్చటికి వచ్చారు. అప్పుడు హిరణ్యకుడు అన్నాడు—'అయ్యో! వ్యర్థంగా విలపించడం వల్ల ఉపయోగం ఏముంది? ఈ మంథరకుడు మన దృష్టిపథం దాటకముందే విడిపించే ఉపాయం వెదకండి. విజ్ఞులు అన్నారు—

ఎవడేని మానవుడు ఆపదపొందినప్పుడు కేవలం అజ్ఞానంగా (మోహంతో) విలపించెనేని, ఆ విలాపం (రోదనం=ఏడ్పు) ఆ ఆపదను వృద్ధిచేస్తుందేకాని అతనికి ఆపదనుండి ముక్తిని లభింపచేయదు. (191)

శ్లో. కేవలం వ్యసనస్యోక్తం భేషజం నయపణ్డితైః
తస్యోచ్ఛేదసమారమ్భో విషాద పరివర్జనమ్. 192

అ. నీతిశాస్త్ర పండితులు ఈ విషయంలో ఇలా అన్నారు— 'ఆపదవచ్చినచో విషాదంవీడి (ధైర్యంగా) ఆ ఆపదను తొలగించుకొనడానికి తగిన ప్రయత్నం చేయాలి. ఇదియే ఆపదకు ఔషధం'.

మూ. అన్యచ్చ-

శ్లో. అతీతలాభస్య సురక్షణార్థం భవిష్యలాభస్య చ సఙ్గమార్థమ్
ఆపత్ప్రపన్నస్య చ మోక్షణార్థం యన్మన్త్ర్యతేఽసౌ పరమో హి మన్త్రః. 193

అ. మరియూ ప్రాప్తవస్తువును రక్షించుకొనడానికి, భవిష్య (రాబోవు)పలలాభం పొందడానికి, ఆపద నొందినవానికి ఆ ఆపదనుండి విముక్తి గల్గించడానికి— చేసే ఆలోచనయే (మంత్రమే) శ్రేష్ఠమైన ఆలోచన.

మూ. తచ్ఛ్రుత్వా వాయస ఆహ— 'భోః, యద్యేవం తత్క్రియతాం మద్వచః. ఏష చిత్రాఙ్గోఽన్య మార్గే గత్వా కిఞ్చిత్పల్వలమాసాద్య తస్య తీరే నిశ్చేతనో భూత్వా పతతు. అహమప్యస్య శిరసి సమారుహ్య మన్దైశ్చఞ్చుప్రహారైరుల్లేఖయిష్యామి, యేనాసౌ దుష్టలుబ్ధకోఽముం మృతం మత్వా మమ చఞ్చుప్రహరణప్రత్యయేన మన్థరకం భూమౌ నిక్షిప్య మృగార్థం పరిధావిష్యతి. అత్రాన్తరే త్వయా మంథరకస్య దర్భమయాని పాశాని ఖణ్డనీయాని యేనాసౌ మంథరకో ద్రుతతరం పల్వలం ప్రవిశతి. చిత్రాంగ ఆహ—'భోః, భద్రోఽయం త్వయా దృష్టో మంత్రః. నూనం మంథరకోఽయం ముక్తో మంతవ్యః' ఇతి, ఉక్తఞ్చ-

శ్లో. సిద్ధం వా యదివాఽసిద్ధం చిత్తోత్సాహో నివేదయేత్
ప్రథమం సర్వజన్తూనాం తత్ప్రాజ్ఞో వేత్తి నేతరః. 194

తదేవం క్రియతామ్— ఇతి.

అ. దానిని విని కాకి ఇలా అంది— 'ఓమిత్రులారా! ఇలా అయితే నామాట ప్రకారం చేయండి. ఏమన- ఈ చిత్రాంగుడు ఈ వేటకాడు పోయేదారిలో ఒక చిన్న చెరువును చేరాలి. దాని తీరాన తెలివిదప్పినట్లు (కదలక-ఊపిరాడించక) పడిఉండాలి. నేనునూ ఇతనితలపై కూర్చుండి మెల్లమెల్లగా ముక్కుతో పొడుస్తూంటాను. అందువల్ల

వేటకాడు ఇతనిని (చిత్రాంగుని) చచ్చినట్లు తలుస్తాడు. నేను ముక్కుతో పొడుస్తూండ తంవల్ల పూర్తిగా నమ్మకం చెందుతాడు. మంథరకుని భూమిపైఉంచి ఈ జింకకై పరుగెత్తగలడు. ఈలోపల నీవు (హిరణ్యకుడు) మంథరకుని దర్భపాశాలు ఖండించాలి. మంథరకుడు మిక్కిలి వేగంగా చెఱువులో (పల్వలంలో) ప్రవేశిస్తాడు.' (దానిని విని) చిత్రాంగుడు పల్కాడు— 'మిత్రమా! మీ యీ ఆలోచన శుభంగాఉంది. మన్థరకుడు విముక్తిని పొందినట్లే తప్పక తలంచండి. విజ్ఞులు అన్నారు—

మానసిక ప్రసన్నత ముందుగానే కార్యసిద్ధిని లేక అసిద్ధిని సూచనచేస్తూంది. ఇది సర్వప్రాణులకు సహజం. అయినా దానిని ప్రాజ్ఞుడు గ్రహించును. ఇతరుడు గ్రహించలేడు. (194)

కనుక ఇలాగే చేద్దాము.

మూ. తథాఽనుష్ఠితే స లుబ్ధక స్తథైవ మార్గాఽసన్నపల్వలతీరస్థం చిత్రాఙ్గం వాయససనాథమపశ్యత్. తం దృష్ట్వా హర్షితమనా వ్యచింతయత్— 'నూనం పాశబన్ధనవేదనయా వరాకోఽయం మృగః సావశేషజీవితః పాశం త్రోటయిత్వా కథమప్యేతద్వనాన్తరం యావత్ప్రవిష్టస్తావన్మృతః. తద్వశ్యోఽయం మే కచ్ఛపః సుయన్త్రితత్వాత్. తదేనమపి తావద్గృహ్ణామి' ఇత్యవధార్య కచ్ఛపం భూతలే ప్రక్షిప్య మృగముపాద్రవత్.

అ. అలాగే చేశారు. ఆ వేటకాడు దారికి దగ్గరలో ఉన్న చెఱువుఒడ్డున కాకితోగూడిన (పడియున్న) చిత్రాంగుని చూచాడు. సంతుష్టచిత్తుడై ఇలా తలంచాడు— ''ఈ దౌర్భాగ్యవులేడి ఆయువు మిగిలి ఉండడంతో అప్పుడు ఏదోవిధంగా ఉచ్చు (పాశం) త్రెంచుకొని ఈ అడవిచేరింది. అయినా ఉచ్చు బిగిసిన బాధతో ఇప్పుడు చచ్చింది. బాగుగా బంధింపబడడంతో ఈ తాబేలు ఎచ్చటికినీ పోలేదు. కనుక దీనిని (లేడిని) గూడ గ్రహిస్తాను. ఇలా నిశ్చయించి తాబేలును భూమిపై ఉంచి లేడిదగ్గరకు పరుగెత్తాడు.

మూ. ఏతస్మిన్నన్తరే హిరణ్యకేన వజ్రోపమదంష్ట్రాప్రహరణేన తద్దర్భవేష్టనం ఖణ్డశః కృతమ్. మంథరకోఽపి తృణమధ్యాన్నిష్క్రమ్య

సమీపవర్తినం పల్వలం ప్రవిష్టః. చిత్రాంగోఽప్యప్రాప్తస్యాపి తస్య భూతల ఉత్థాయ వాయసేన సహ పలాయితః. ఏతస్మిన్నంతరే విలక్షో విషాదపరో లుబ్ధకో నివృత్తో యావత్ పశ్యతి తావత్కచ్ఛపోఽపి గతః. తతశ్చ తత్రోపవిశ్య శ్లోకమిమమపఠత్ –

శ్లో. ప్రాప్తో బన్ధనమప్యయం గురుమృగస్తావత్త్వయా మే హృతః
సమ్ప్రాప్తః కమఠః స చాపి నియతం నష్టస్తవాఽఽదేశతః.
క్షుత్క్షామోఽత్ర వనే భ్రమామి శిశుకైస్త్యక్తః సమం భార్యయా
యచ్చాన్యన్న కృతం కృతాన్త! కురుతే తచ్చాపి సహ్యం మయా. 195

అ. ఇంతలో హిరణ్యకుడు వజ్రాలవంటి తనకోరలతో కొరికి ఆ దర్భవేష్ఠనాన్ని (దర్భబంధాన్ని) ముక్కలు చేశాడు. మంథరకుడు వెంటనే ఆ (దర్భ) గడ్డి మధ్యనుండి వెలుపలికివచ్చి సమీపంలో ఉండే మడుగులో దూరాడు. వేటకాడు తనను సమీపించుటకు ముందుగానే లేచి చిత్రాంగుడుకాకితో సహా పరుగెత్తాడు. అప్పుడు వేటకానికి సిగ్గూదుఃఖం గల్గాయి. వెనుకకుతిరిగిచూడగా తాబేలుసైతం కనబడలేదు. అప్పుడు అచ్చట కూర్చుండి ఈ శ్లోకం చదివాడు– 'ప్రాప్తో బంధన'—

శ్లోకభావం— 'ఓ దైవమా! (మొదట) ఉచ్చుద్వారా లభించిన పెద్దలేడిని నానుండి హరించావు. తాబేలు ప్రాప్తించింది. కాని అదియు నీ ఆజ్ఞచే అదృశ్యం అయింది. భార్యను పిల్లలను వదలి ఆకలిచే బాధపడుచు ఈ అడవిలో తిరుగుచున్నాను. ఇంకా నీవేది చేయలేదో దానిని చేయుము. అదీ నేను సహించాలి'.(195)

మూ. ఏవం బహువిధం విలప్య స్వగృహం గతః. అథ తస్మిన్ వ్యాధే దూరతరం గతే సర్వేఽపి తే కాకకూర్మమృగమూషకాః పరమానన్దభాజః పరస్పరమాలింగ్య పునర్జాతమివాఽఽత్మానం మన్యమానాస్తదేవ సరసం ప్రాప్య మహాసుఖేన సుభాషితకథాగోష్ఠీవినోదేన కాలం నయన్తి స్మ. ఏవం జ్ఞాత్వా వివేకినా మిత్రసంగ్రహః కార్యః. న చ మిత్రేణ సహ వ్యాజేన వర్తితవ్యమితి. ఉక్తఞ్చ. యతః–

శ్లో. యో మిత్రాణి కరోత్యత్ర న కౌటిల్యేన వర్తతే
తైః సమం న పరాభూతిం సమ్ప్రాప్నోతి కథఞ్చన. 196

అ. ఇలా పెక్కువిధముల విలపించి తనఇంటికి పోయాడు. ఆ వేటకాడు దూరంవెళ్లగానే కాకి తాబేలు లేడి ఎలుక అనే ఆ నల్గురు మిత్రులు పరమానందం పొందారు. ఒకరినొకరు కౌగిలించుకున్నారు. పునర్జన్మ పొందినట్లు తలస్తూ మరం అదే (వెనుకటి) చెఱువును చేరారు. అచ్చట మిక్కిలి సుఖంగా సుభాషితగోష్ఠివినోదంతో కాలం గడుపసాగారు. ఇది గ్రహించి వివేకియైన మానవుడు (మంచి) మిత్రులను సంపాదించుకోవలెను. మిత్రునిలో కపటంగా ప్రవర్తిల్లరాదు. పెద్దలు ఇలా అన్నారు—

ఎవడు మిత్రులను సంపాదించుకొని వారితో కపటంగా వర్తింపడో అతడు ఆ మిత్రులతోపాటు ఏ విధంగాను పరాభవం (ఓటమిని) పొందడు. (196)

మూ. ఇతి శ్రీ విష్ణుశర్మవిరచితే పఞ్చతన్త్రే మిత్రసంప్రాప్తిర్నామ ద్వితీయం తన్త్రంసమాప్తమ్.

అ. ఇట్లు శ్రీ విష్ణుశర్మ విరచితమైన పంచతంత్రమున మిత్రసంప్రాప్తి అనే రెండవ తంత్రం సమాప్తం.

శ్రీ జీరెడ్డి చెన్నారెడ్డి విరచితమైన ఆంధ్రానువాదమున మిత్రసంప్రాప్తి అనే పంచతంత్ర ద్వితీయతంత్రం సమాప్తం.

శుభం